పద్నాలుగో జన్మదిన ప్రత్యేక సంచిక

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 1 హైదరాబాద్ 174 జనవరి 2016 పేజీలు : 80 రు. 20

- సంఘ్ పరివార్ ఫాసిజం - సుమిత్ సర్కార్ ప్రత్యేక వ్యాసం
- ఫాసిజం చర్చ - అంతర్జాతీయ ప్రాధాన్యత
- చండీయాగం ఎవరికోసం?
- కార్పొరేట్ల సేవలో ఆంధ్రప్రదేశ్ పాలన
- కాల్‌మనీ విషాదంపై రెండు వ్యాసాలు
- విధ్వంసక అభివృద్ధి - చెన్నై వరదలు
- ఆచరణకు రాని పారిస్ ఒప్పందం

**పాఠకులకు, రచయితలకు, ప్రకటనకర్తలకు, శ్రేయోభిలాషులకు, న్యూస్ ఏజెంట్లకు**
**2016 నూతన సంవత్సర శుభాకాంక్షలు**

174

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జనవరి 2016
సంపుటి : 14
సంచిక : 1

ఎడిటోరియల్ కలెక్టివ్ : **బి.ఎస్. రాజు, ఎ. నర్సింహారెడ్డి, బి. రామకృష్ణ, ఎం. నర్సింహ, వై. భాస్కర్, కె. బాల్‌రెడ్డి, ఎ. రాజేంద్రబాబు, బైరెడ్డి సతీష్, పి. అరవింద, వై. రామచంద్రం, ఎన్. వేణుగోపాల్**

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | సహాయ సంపాదకులు: | కంపోజింగ్: | సర్క్యులేషన్ మేనేజర్: |
|---|---|---|---|---|
| **వి. హనుమంతరావు** | **ఎన్. వేణుగోపాల్** | **వై. రామచంద్రం** | **సి. రాజశేఖర్** | **ఎస్. వెంకటేష్** |



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 డిసెంబర్ నెలలో వచ్చిన విరాళాలు - సురవరం సుధాకర్‌రెడ్డి, హైదరాబాద్ - రు. 5,000; సత్యజిత్ తాళ్లూరి, గుర్గాం, రు. 5,000; వి. మధుసూధన్ రెడ్డి, వనపర్తి-వరంగల్ - రు. 1,000; అల్లం నారాయణ, హైదరాబాద్ - రు. 5,000 ; గిరిధర్ రెడ్డి - రు.250; రవికుమార్, వరంగల్ -రు. 500; ఎం. రాజేందర్ రెడ్డి, మెదక్ - రు. 500. మిత్రులందరికీ కృతజ్ఞతలు- సం.**

*వీక్షణంలో కొంత మంది అభిప్రాయాలనే వేస్తున్నారు. అలాగే క్రమం తప్పి అయినా మరికొంత మంది పాఠకుల అభిప్రాయాలు ప్రచురించగలరు. అలాగే పత్రికలో ఒకే విషయం పై రెండు మూడు వ్యాసాలు వేస్తున్నారు. దీనిపై పాఠకులకు అసహనం ఉంటున్నది. గమనించగలరని కోరుతున్నాను.*

*- బి. ఎ. సత్యనారాయణ*
*విశాఖపట్నం*

*ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లా రైతాంగ వీరులు ఉరికొయ్యను ముద్దాడిన అమరులు కిష్టాగౌడ్, భూమయ్యలకు లాల్‌సలాం. వరవరరావుగారి వ్యాసంతో అనేక విషయాలు జ్ఞాపకం వచ్చాయి. శివసాగర్ అనేకసార్లు ఈ అంశం నాతో మాట్లాడుతూ ఉరికంబం వణికింది కవిత వినిపించేవారు.*

*- తుంపాల శ్రీరామమూర్తి*
*విశాఖపట్నం*

# వీక్షణం రచయితలకు సూచనలు

పదమూడు సంవత్సరాలలో, నూట డైబ్భై మూడు సంచికలలో వీక్షణం దాదాపు మూడు వేలకు పైన వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతిలోనూ, సుబోధకతలోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (నాలుగు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పేజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణంకు సరిగ్గా సరిపోతుంది.
- చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్‌లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్‌లో గాని, పేజ్‌మేకర్‌లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి. 23

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - వి. శంకరయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)

# కుయుక్తులతో, కుట్రలతో నడుస్తున్న వ్యవస్థ!!

వీక్షణం

సంఘ్ పరివార్ వ్యవహార సరళిలో ప్రధానమైనది చర్చలను పక్కదారి పట్టించడం, ఒక విషయం గురించి మాట్లాడుతున్నప్పుడు, సంబంధం లేని మరొక విషయాన్ని లేవనెత్తడం, అసలు చర్చనీయాంశాన్ని పక్కనపెట్టి ఆ చర్చను లేవనెత్తిన వ్యక్తుల గురించి మాట్లాడడం. ఆ భావజాలాన్ని నిలువెల్లా నింపుకున్న నరేంద్ర మోడీ పాలన అత్యవసరమైన విషయాల మీద చర్చకు ప్రజలకు అవకాశం ఇవ్వకుండా అనవసరమైన విషయాల మీదికి మళ్లించడమే లక్ష్యంగా సాగుతున్నది. అవినీతిని అరికట్టడం, విదేశాలలో దాచుకున్న అక్రమ నిధులను వెనక్కి తేవడం, అభివృద్ధి పథకాలను విస్తరించి ఇతోధిక ఉపాధికి అవకాశం ఇవ్వడం వంటి ఎన్నికల వాగ్దానాలలో ప్రధానమైనవాటిని కూడ అమలులోకి తేకుండా పద్దెనిమిది నెలలు గడిచిపోయాయి. పాత ప్రభుత్వాలు అమలు చేసిన ప్రపంచీకరణ విధానాలు, కార్పొరేట్లకు అనుకూల పాలన, అవినీతి యథాతథంగా సాగిపోతున్నాయి. ప్రజలు ఈ సమస్యల వైపు చూసి ప్రశ్నలు లేవనెత్తకుండా ఉండాలంటే, ప్రజల ముందు ఇతర ప్రశ్నలు పెట్టడమే మార్గమని పాలకులు భావిస్తున్నారు. పాలకులు పెట్టే ప్రశ్నలలో కొన్ని ముఖ్యమైనవీ, అవసరమైనవీ కావచ్చు గాని అవి కూడ ఏ సందర్భంలో ఏ ప్రయోజనాల కోసం ముందుకు వస్తున్నాయో గుర్తించవలసి ఉంది.

సంఘ్ పరివార్ భావజాలాన్ని వ్యతిరేకించే, లోతైన ప్రశ్నలు వేసే హేతువాద, ప్రగతిశీల మేధావులు నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, ఎంఎం కల్బుర్గిల హత్యల తర్వాత, గోమాంసం తిన్నాడనే తప్పుడు ఆరోపణతో దాద్రీలో అఖ్లాక్‌ను హత్య చేసిన తర్వాత దేశవ్యాప్తంగా సంఘ్ పరివార్ భావజాలం మీద, అది ప్రచారం చేస్తున్న అసహన సంస్కృతి మీద పెద్దఎత్తున చర్చ మొదలైంది. రచయితలు, కళాకారులు, మేధావులు, చరిత్రకారులు ఎందరెందరో ఈ చర్చలో పాల్గొన్నారు. అధికారంలో ఉన్నవారు ఈ చర్చకు జవాబు చెప్పవలసిన సమయం వచ్చింది. మొరటుగా తమ పనులను సమర్థించుకునే అవకాశాలు తగ్గిపోతూ వచ్చాయి. పైగా ఒక కేంద్రమంత్రి ముస్లిం హతులను కారుకు అడ్డం వచ్చి కారు కిందపడి చనిపోయే, పట్టించుకోనక్కరలేని కుక్కలుగా వర్ణించడంతో సహా ఇటువంటి అసహన వ్యాఖ్యలను ఎందరో భాజపా నాయకులు ప్రకటించారు. సరిగ్గా అప్పుడే పార్లమెంటు శీతాకాల సమావేశాలు మొదలయ్యాయి గనుక ఈ సమావేశాలలో తప్పనిసరిగా హిందూ మతోన్మాద శక్తులు హంతకస్థాయిలో ప్రకటిస్తున్న అసహనం మీద చర్చ జరుగుతుందని అందరూ భావించారు. అలాగే, గూడ్స్ అండ్ సర్వీసెస్ టాక్స్ (జిఎస్‌టి) బిల్లుతో సహా కనీసం రెండు డజన్ల చట్టాలు, సవరణలు ఈ సమావేశాల్లోనే చర్చకు రావడానికి సిద్ధమయ్యాయి.

సరిగ్గా సమావేశాలు జరుగుతున్న సమయంలోనే ఢిల్లీ ముఖ్యమంత్రి ప్రధాన కార్యదర్శి కార్యాలయం మీద సిబిఐ దాడి జరిగింది. ఢిల్లీ అండ్ డిస్ట్రిక్ట్ క్రికెట్ అసోసియేషన్ (డిడిసిఎ) నిధుల వాడకంలో అక్రమాలు జరిగాయని, ఆ అక్రమాలపై జరుగుతున్న విచారణలో డిడిసిఎకు 1999 నుంచి 2013 వరకు అధిపతిగా ఉన్న ప్రస్తుత ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీకి సంబంధం ఉందని తేలిందని, సిబిఐ దాడి ఆ విచారణ ఫైళ్లను ఎత్తుకుపోవడానికే జరిగిందని ఢిల్లీ ముఖ్యమంత్రి అరవింద్ కేజ్రీవాల్ ఆరోపించారు. ఆ తర్వాత అటూ ఇటూ ఆరోపణల ప్రత్యారోపణల వెల్లువ సాగింది. మరొకవైపు అదే సమయంలో నేషనల్ హెరాల్డ్ కేసులో సోనియా గాంధీ అక్రమాల గురించి చర్చను భారతీయ జనతా పార్టీ ముందుకు తెచ్చింది. ఎన్నో సంవత్సరాలుగా నడుస్తున్న ఆ కేసులో హఠాత్తుగా వేడి రగిలి ఇరు పక్షాలూ నిందలూ దుర్భాషలూ కొనసాగించాయి. ఈ రణగొణధ్వనిలో ఎవరు చెప్పేదానిలో ఎంత వాస్తవం ఉన్నదనేది ఎట్లా ఉన్నా రెండు పక్షాలూ దొంగలేనని, ఈ దేశంలో పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నీ అక్రమాల, అబద్ధాల పుట్టలేనని స్పష్టంగా బైటపడింది. నిజానికి ప్రజలకూ పాలకవర్గాలకూ జరగవలసిన అంతిమ ఘర్షణ వాయిదా పడుతూ వచ్చి, ప్రస్తుతానికైతే పాలకవర్గ ముఠా తగాదాలే రాజకీయ రంగస్థలం మీద ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. ఇంత తీవ్రంగా కలహించుకుంటున్న ముఠాలే సామ్రాజ్యవాద శక్తులకు దాసోహం అనడంలో, ప్రజా వ్యతిరేక నిర్ణయాలు తీసుకోవడంలో ఎంతగా ఏకమవుతారో కూడ ఈ సమావేశాలు చూపాయి. ఒకవైపు ఘర్షణ వాతావరణం అతి తీవ్రంగా కనబడుతుండగానే, జి ఎస్ టి బిల్లు ఆమోదానికి సహకరిస్తామని కాంగ్రెస్ బేరసారాలు మొదలుపెట్టింది. రాజ్యసభలో తమకు తగినంత ఆధిక్యత లేకపోవడం వల్ల గతంలో ఆమోదింప జేసుకోలేకపోయిన జి ఎస్ టి బిల్లుకు ప్రతిపక్షాల మద్దతు పొందడానికి భారతీయ జనతా పార్టీ కాళ్ల బేరానికి దిగింది.

ఈ దేశంలో పాలన గురించి, ప్రజల స్థితి గురించి కళ్లకు కట్టినట్టు తెలిపే మరొక మూడు ఉదంతాలు సరిగ్గా ఈ బాతాఖానీ క్లబ్బు సమావేశాల సమయంలోనే జరగడం యాదృచ్ఛికం కాదు. మొదటిది, ఢిల్లీ నగరంలోనే మురికివాడలను కూల్చివేసి, రియల్ ఎస్టేట్ కు మార్గం సుగమం చేయడానికి జరిగిన ప్రయత్నంలో ఒక గుడిసెలో నిద్రపోతున్న ఏడునెలల పాప మీదుగా బుల్డోజర్ నడిపి ఆ పాపను చంపేశారు. పేదల ప్రాణాలకు ఏం విలువ? రెండవది, ఐక్యరాజ్యసమితి అభివృద్ధి పథకం (యునైటెడ్ నేషన్స్ డెవలప్ మెంట్ ప్రోగ్రాం) విడుదల చేసిన మానవాభివృద్ధి నివేదిక 2015 ప్రకారం ప్రపంచంలోని 188 దేశాలలో భారతదేశం 130వ స్థానంలో ఉంది. భారతదేశం కన్న చాల తక్కువ సహజ వనరులున్న దేశాలు పై స్థాయిన ఉండగా, భారతదేశం ఇలా ఉండడానికి కారణమైన పాలకవర్గాల, పాలనా విధానాల నిర్వాకాన్ని ప్రజలు చర్చించకుండా ఉండడానికే అనేకానేక ఆకర్షణలు, భ్రమలు, పక్కదారులు. మూడవది, వైద్య ఆరోగ్య పరిభాషలో తొంభై శాతం అంగవైకల్యంతో, మనిషి సాయం లేకుండా ఎటూ తిరగలేని, చక్రాల కుర్చీకి అంటిపెట్టుకోవలసిన డా. జి ఎన్ సాయిబాబా బెయిల్ రద్దు. ఈ ప్రభుత్వాన్ని, పాలకవర్గాలను కూల్చివేయడానికి కుట్ర చేశాడనే తప్పుడు కేసులో నిందితుడిగా విచారణ ఎదుర్కొంటున్న ఆయన బెయిల్ పై బైట ఉన్నా ప్రమాదమని హైకోర్టు జడ్జి అభిప్రాయపడ్డాడు. ఆరోగ్యకారణాలతో వచ్చిన బెయిల్ ను కూడ రద్దు చేసి ఆగమేఘాల మీద చెరసాలలో బంధించమన్నాడు. ఈ తప్పుడు కేసు నిరేతుకతను ప్రశ్నిస్తూ అరుంధతీ రాయ్ రాసిన వ్యాసం మీద క్రిమినల్ కేసు నడపమన్నాడు. ఇంత అస్తవ్యస్త వ్యవస్థను ఇంకా ఇలాగే కొనసాగనిద్దామా అని ప్రతి ఒక్కరూ ప్రశ్నించుకోవలసిన పరాకాష్ఠ స్థితికి చేరుకుంటున్నట్టున్నాం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ప్రజల ప్రశ్నల నుంచి శాంతి, ఆశ్రితులకు కళ్యాణం

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష తమ పోరాటాల వల్ల, వందలాది విద్యార్థి యువజనుల ప్రాణత్యాగాల వల్ల సిద్ధించిందని తెలంగాణవాదులు ఇంతకాలం అభిప్రాయపడుతూ ఉంటే వారు తమ అభిప్రాయం మార్చుకోవాలి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే అయుత మహా చండీ యాగం చేస్తాను అని ఒక వ్యక్తి మొక్కుకున్నందువల్ల, మహా చండీమాత కరుణించి తెలంగాణ రాష్ట్రం ఇచ్చింది. అందువల్ల ఆ మొక్కు మొక్కుకున్న వ్యక్తి ఆ యాగం చేస్తున్నాడు. తెలంగాణ త్యాగాల వల్ల కాదు, యాగాల వల్ల వచ్చింది. ఈ మాటలు రాయడానికే సిగ్గు వేస్తున్నది. కాని ఎందరో మేధావులు, ప్రజాపోరాటకారులు, తెలంగాణ ప్రేమికులు నిస్సిగ్గుగా ఈ యాగశాలలో తిరుగాడుతూ, అసహ్యకరంగా ప్రవర్తిస్తూ, ఆ ప్రవర్తనను సమర్థించు కుంటున్నారు. ఇంతకాలమూ తెలంగాణ వ్యతిరేక మీడియా అని పేరు తెచ్చుకున్న ప్రచార సాధనాలన్నీ ఆ సిగ్గుచేటు ప్రవర్తనను ప్రత్యక్ష ప్రసారం చేస్తూ పాలకులకు దగ్గరవుతున్నాయి. ఒక వ్యక్తికి సొంతంగా ఏ మత విశ్వాసాలైనా ఉండవచ్చు, తన విశ్వాసాల వల్లనే ప్రపంచం సాగుతున్నదనీ అనుకోవచ్చు. కాని ఆ వ్యక్తి ఒక రాజ్యాంగం మీద ప్రమాణం చేసి ఒక రాజ్యాంగ పదవిలోకి వచ్చినప్పుడు, ఆ రాజ్యాంగాన్ని పాటించడం కనీస షరతు. ఆధునిక భారత రాజ్యాంగం లౌకికమైనది. అది దేశ ప్రజలలో శాస్త్రీయ స్పృహను పెంపొందించడం తన ఆదర్శంగా చెప్పుకున్నది. కాని తెలంగాణ రాష్ట్రాధీశులు ఈ రాజ్యాంగ ఆదర్శాలను గౌరవించాలని అనుకుంటున్నట్టు లేరు. ఆ యాగం సొంత స్థలంలోనే, సొంత ఖర్చుతోనే జరిగింది గనుక అభ్యంతర పెట్టనక్కరలేదని సన్నాయి నొక్కులు వినబడుతున్నాయి. కాని యాగనిర్వహణలో ప్రభుత్వ యంత్రాంగం ఎంతగా దుర్వినియోగం జరిగిందో, ప్రజా నిధులు ఎంతగా ఖర్చయ్యాయో చూస్తే ఇది వ్యక్తిగత కార్యక్రమం అనడానికే వీలు లేదు. సంపూర్ణంగా ప్రభుత్వ కార్యక్రమంగా జరిగిందది. లోకాతీతశక్తుల వల్ల లోకంలో పనులు జరుగుతాయనే మూఢనమ్మకానికి ప్రచారం కలిగించడానికీ, స్థిర పరచడానికీ లౌకిక ప్రభుత్వ యంత్రాంగం సహకరించడం రాజ్యాంగానికి మాత్రమే కాక అతి సాధారణమైన హేతువాదానికి కూడ భంగకరం. లోకశాంతి కోసం అని చెప్పి జరిగే యాగ స్థలంలో శాంతిభద్రతలు పరిరక్షించడానికి ఐదువేల మంది సాయుధ పోలీసులు అవసరం అయ్యారు! లోక కళ్యాణం సాధించి పెట్టే మహా చండీ మాత తన యాగశాలలో జరిగిన అగ్నిప్రమాదాన్ని నివారించలేకపోయింది! ఇటువంటి సాధారణ ప్రశ్నలు కూడ రాని, మేల్కొనలేని అజ్ఞానాంధకారంలో జనాన్ని ముంచడమే నాయకుల ప్రయోజనం. తెలంగాణ ప్రభుత్వ విధానాలు తెలంగాణ ఉద్యమ ఆకాంక్షల సాఫల్యం దిశగా ముందుకు పోవడం లేదు గనుక, ప్రపంచీకరణ శక్తులకు దాసోహం అంటున్న అభివృద్ధి నమూనా నిజంగా ప్రజలకు అభివృద్ధి ఫలాలు అందించజాలదు గనుక, ప్రజలను ఏదో ఒక మత్తులో, మాయలో ముంచడం తప్ప పాలకులకు గత్యంతరం లేదు. ఈ మహా మాయా యాగం తెలంగాణ ప్రజలకు ఏమీ ఇవ్వలేకపోయినా, వారిని జోకొట్టి, నిద్రమత్తులో ముంచి, తెలంగాణ ప్రభువులకు మాత్రం స్థిరమైన, భద్రమైన, దోపిడీ పీడనాధికారాలను ఇస్తుంది. బహుశా పాలకుల విశ్వశాంతి, లోకకళ్యాణం మాటలకు అర్థాలు అవేనేమో. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# పేదల ప్రాణాలతో వడ్డీ వ్యాపారుల చెలగాటం

విజయవాడలో బైటపడిన కాల్ మనీ కుంభకోణం మన సమాజ దుస్థితికి, ప్రభుత్వాల ప్రజావ్యతిరేక నిర్లక్ష్య వైఖరికి ఒక ప్రబల నిదర్శనం. ఒకవైపు ప్రజల ఆర్థిక అవసరాలు పెరుగుతున్నాయి. అవసరాలకు, ఖర్చుకు తగిన ఆదాయాలు ఉండడం లేదు. కుటుంబ, మిత్ర, సామాజిక బృందాలు అంతకంతకూ విచ్ఛిన్నమైపోతూ కష్టం వచ్చినప్పుడు ఆదుకునేవారు లేరు. సంస్థాగత రుణ, పరపతి సౌకర్యాలు లేవు. అటువంటి స్థితిలో ఉన్నదేదో తాకట్టు పెట్టుకుని గాని, తాకట్టు లేకుండా గాని ఆ క్షణానికి అవసరమైన డబ్బు ఇచ్చే వడ్డీ వ్యాపారుల రాజ్యం సాగుతున్నది. ఆ వడ్డీ వ్యాపారులే రాజకీయ పార్టీల నాయకులుగా, ఆశ్రితులుగా, పోలీసుల కనుసన్నలలో ఉన్నప్పుడు రుణగ్రహీతల మీద ఒత్తిళ్లు, దౌర్జన్యాలు, ఆస్తి అక్రమ స్వాధీనాలు పెరిగిపోతాయి. అవి చివరికి రుణగ్రహీతల కుటుంబాల స్త్రీల మీద అత్యాచారాలుగా చివరి అంకానికి చేరినప్పుడు విజయవాడ భగ్గుమన్నది. ఈ గొలుసులో ప్రతి ఒక్క చోట ప్రభుత్వ జోక్యానికి, వడ్డీ వ్యాపారుల, వేధింపుదార్ల ఆట కట్టించడానికి అవకాశం ఇచ్చే చట్టాలు ఉన్నాయి. కాని ఏళ్ల తరబడి ఆ చట్టాలను పక్కనపెట్టి, ఈ వడ్డీవ్యాపార పాపంలో భాగం పంచుకున్న పాలకులు, హఠాత్తుగా మేలుకొన్నట్టు, తామొక్కరే పవిత్రులమన్నట్టు ఇతర పార్టీల మీద ఆరోపణలు సంధించారు. చివరికి చూస్తే భారత కమ్యూనిస్టు పార్టీ స్థానిక నాయకులతో సహా ఈ దుర్మార్గంతో సంబంధం లేని స్థానిక రాజకీయ పార్టీల నాయకులెవరూ లేరని తేలింది. అందువల్ల ఇది కేవలం ఆర్థిక, రాజకీయ సమస్య మాత్రమే కాదు, మన సామాజిక సమస్య. ఈ విశాలమైన సమస్యను పరిష్కరించాలనే కోరిక లేని పాలకులు ఇవాళ మనను పాలిస్తున్నారని, ఈ కుంభకోణం బైటపడిన తర్వాత జరిగిన శాసనసభ సమావేశాలు తెలియజేస్తున్నాయి. అక్కడ అతి ముఖ్యమైన ఈ సమస్య మీద చర్చ గాని, ఈ సమస్య మూలకారణాలు అన్వేషించి పరిష్కరిస్తామనే హామీ గాని లేకుండా ఇతరేతర చిల్లరమల్లర వ్యవహారాలతో కాలం గడిపారు. రాజధాని నిర్మాణాన్ని అవమానకర ఒప్పందాలతో విదేశీ కంపెనీలకు అప్పగించడం, మరొకరి మీద నెపం పెడుతూ బాక్సైట్ తవ్వకాలకు, వనరుల దోపిడీకి ఉవ్విళ్లూరడం, ప్రైవేటు విశ్వవిద్యాలయాల ఏర్పాటును చట్టబద్ధం చేసి విద్యా వ్యాపారీకరణను విస్తరించడం, రాయలసీమ ప్రజల ప్రయోజనాలను పణంగా పెడుతూ అన్యాయాల మీద అన్యాయాలు సాగించడం వంటి అనేక ప్రజావ్యతిరేక విధానాలు అసలు చర్చకు రాకుండానే అమలు లోకి తీసుకురావడానికి ఈ కాల్ మనీ కుంభకోణం రచ్చ పనికి వచ్చిందని పాలకులు సంతోషపడుతున్నారు. ఇంత అమానుష, ప్రజావ్యతిరేక పాలకులను చరిత్ర ఎప్పుడైనా చూసి ఉంటుందా? ఇంత దుర్మార్గం కళ్ల ముందర సాగిపోతుంటే మాట్లాడవలసినవాళ్లు, బుద్ధిజీవులు, ప్రగతిశీల మేధావులు, ప్రజాసంఘాలు, కార్యకర్తలు మౌనంగా, నిర్లిప్తంగా ఉండిపోయిన చరిత్ర ఎప్పుడైనా ఉండి ఉంటుందా? ఉజ్వలమైన చరిత్ర ఉన్న తెలుగు జాతికి ఏం జరుగుతున్నది? వీ

# నైరోబీ ఒప్పందం వర్ధమాన దేశాలకు శరాఘాతం

దోహా వాణిజ్య ప్రక్రియలో భాగంగా కెన్యా రాజధాని నైరోబీలో డిసెంబర్ 15 నుంచి 19 వరకు ఐదురోజుల పాటు జరిగిన ప్రపంచ వాణిజ్య సంస్థ మంత్రుల స్థాయి సమావేశంలో అగ్రదేశాలు తమ వాదననే నెగ్గించుకోగలిగాయి. 162 దేశాలకు సభ్యత్వం ఉన్న డబ్లుటిఓలో వ్యవసాయ సంబంధ అంశాల్లో తొలిసారి కీలకమైన ఒప్పందం కుదిరిందని సంస్థ చీఫ్ రాబర్టో అజ్వేడో ఘనంగా ప్రకటించాడు. నిజమే, వర్ధమాన దేశాల మెడలు వంచేందుకు సంపన్న దేశాలు పదిహేనేళ్లుగా చేస్తున్న ఒత్తిడి ఈ ఒప్పందంతో సాకారమయింది. దీంతో ప్రపంచ వాణిజ్య సంస్థ అంటే సంపన్న దేశాల ప్రయోజనాలు నెరవేర్చడానికి వర్ధమాన పేద దేశాల ప్రయోజనాలను బలిపెట్టే వేదిక అని, స్వేచ్ఛా వాణిజ్యమంటే సామ్రాజ్యవాద దేశాల దోపిడీ ప్రయోజనాలు యథేచ్ఛగా కొనసాగించడమన్న సత్యం మరోసారి రుజువైంది. దోహాలో చెప్పుకున్న సంకల్పాన్ని తుంగలో తొక్కి వర్ధమాన దేశాల్లో వ్యవసాయాన్ని, రైతాంగాన్ని, ఆహార భద్రత కార్యక్రమాన్ని గాలిలో దీపంలా మార్చేసి నట్లైంది. ప్రతి సంవత్సరం ప్రత్యక్షంగా, పరోక్షంగా రెండు వేలకోట్ల డాలర్లు (రు. 1,30,000 కోట్లు) తమరైతులకు అమెరికా కట్టబెడుతున్నది. దోహా వ్యవసాయ ఒడంబడిక ప్రకారం అమెరికా – ఇయు దేశాలు వ్యవసాయ సబ్సిడీలను క్రమంగా తగ్గిస్తూ అంతిమంగా రద్దుచేయవలసి ఉంది. కానీ వేరే రూపాల్లో దాన్ని విపరీతంగా పెంచుతున్నాయి. అంతర్జాతీయ మార్కెట్‌లో వెనకబడిన దేశాలు నిలబడలేని పరిస్థితిని సృష్టించి, ఆ దేశాల వ్యవసాయరంగాన్ని సంక్షోభంలోకి నెట్టి ఆహారధాన్యాలకు తమపై ఆధారపడే వ్యూహాన్ని అనుసరిస్తున్నాయి.

నైరోబీ సమావేశానికి ముందు పేదరైతులను పారిశ్రామిక దేశాల ఆహార ధాన్యాల దిగుమతుల నుంచి కాపాడుకోవడానికి ఉద్దేశించిన ప్రత్యేక రక్షణ వ్యవస్థలపై వాదనలను సిద్ధం చేసుకున్నామని, అలాగే దేశ ఆహార భద్రతకు ధోకా లేకుండా ఆహార ధాన్యాల నిల్వలకు సంబంధించిన వివాదాన్ని కూడ ప్రయోజనాత్మకంగా పరిష్కరించు కోవడానికి ప్రతిపాదనలున్నాయని ప్రధాని మోడీ ఉద్ఘాటించారు. అయితే, నైరోబీలో కీలకమైన అంశాలపై చర్చించేందుకు ఆఫ్రికా దేశాలు ఏర్పాటు చేసిన సమావేశంలో మన వాణిజ్య మంత్రి నిర్మలా సీతారామన్ పాల్గొనలేదు. ఇదే సమయంలో అమెరికా, ఈయూలు బ్రెజిల్ సహకారంతో దోహా ఎజెండాలోని కీలకమైన అంశాలను అటకెక్కిం చేశాయి. వర్ధమాన దేశాలు కోరుకుంటున్న ప్రత్యేక రక్షణ వ్యవస్థల ఒప్పందం కుదరకుండా సంపన్న దేశాలు మరో విజయం సాధించాయి. సంపన్న దేశాల నుండి దిగుమతులను తగ్గించడానికీ, దిగుమతి చేసుకుంటున్న వాటిపై సుంకాలు పెంచడానికీ వీలుకల్పించే రక్షణను కూడా వర్ధమాన దేశాలు సాధించలేకపోయాయి. నైరోబీలో దోహా చర్చలకు ముగింపు పలుకడం వల్ల వర్ధమాన దేశాలు శాశ్వతంగా బేరసారాలు సాగించే అవకాశాన్ని, శక్తిని కోల్పోయాయి. భారత్ సాధించే అంశాలను కూడ సాధించలేకపోయింది. కలిసివచ్చే దేశాలను కూడగట్టలేక పోవడం స్పష్టంగా కన్పించింది. పేద దేశాల రైతులు నష్టాల్లో కూరుకుపోవడం, ప్రజలు ఆకలితో పస్తులుండడమే సంపన్న దేశాలు కోరుకుంటున్నాయని నైరోబీ ఒప్పందంతో తేలిపోయింది. వీ






❖ **తెలంగాణ సామాజిక చరిత్ర – సంస్కృతి – ఉద్యమాలు** – బి.ఎస్. రాములు – ఇన్‌స్పైర్ పబ్లికేషన్స్ – 639 పేజీలు, 1/4 క్రౌన్, రు. 380, ప్రతులకు: బి.ఎస్. రాములు, సామాజిక తత్వవేత్త, 201, సులేఖ గోల్డెన్ టవర్స్, ఇ.నెం. 2-2-186/53/5, రామకృష్ణ నగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ – 500013; ఫోన్: 8331966987; email:bsramulu@gmail.com



❖ **పాలమూరు వలస బతుకు చిత్రాలు** – గీతాంజలి – వెన్నెల ప్రచురణలు – 253 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: గీతాంజలి, ఫ్లాట్ నం. 7-126, శ్రీశ్రీ ఎవెన్యూ, గుర్రంగూడ, సాగర్‌రోడ్ వయా రాగన్నగూడ (పోస్ట్), సరూర్‌నగర్ (మం), హైదరాబాద్, రంగారెడ్డి జిల్లా – 501 510; ఫోన్: 9849770409



❖ **సాధిత** – సాహిత్య వ్యాసాలు – అయ్యగారి సీతారత్నం – సిక్కోలు బుక్ ట్రస్ట్ – 190 పేజీలు, 1/8 డెమీ, రు. 195, ప్రతులకు: సిక్కోలు బుక్ ట్రస్ట్, ఎంఐజి 100, జిల్లా పరిషత్ ఎదురుగా, హౌసింగ్ బోర్డ్ కాలనీ, శ్రీకాకుళం – 532001; సెల్: 9989265444




❖ **మంత్రలిపి** – కవిత్వం – కొనకంచి లక్ష్మీ నరసింహారావు – తోపుదు బండి పబ్లికేషన్స్ – 224 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: తోపుదు బండి పబ్లికేషన్స్, 1-9-286/2, బస్‌స్టాప్ దగ్గర, రాంనగర్ గుండు, హైదరాబాద్ – 44; ఫోన్: 7386868267; నవచేతన; ప్రజాశక్తి; నవోదయ; ఇతర ప్రముఖ పుస్తక కేంద్రాలు




❖ **ప్రజాచైతన్య గీతాలు** – కవితలు, పద్యాలు, నినాదాలు – బి.ఎ. నారాయణరావు – సావిత్రిబాయి ఫూలే ఎడ్యుకేషనల్ & చారిటబుల్ ట్రస్ట్ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: బి.ఎ. నారాయణరావు, డోర్ నం. 2-14-18, ఫ్లాట్ నం. ఎంఐజి-1 ఎ/7, సెక్టర్-6, ఎంవిపి కాలనీ, విశాఖపట్నం – 17; సెల్: 8897466582, 9059544377




❖ **అభివ్యక్తి** – సాహితీ సమీక్షలు – డా. పులివర్తి కృష్ణమూర్తి – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: డా. పులివర్తి కృష్ణమూర్తి, ఇ.నం. 16-1-27/సి/19, జయానగర్ కాలనీ, సైదాబాద్, హైదరాబాద్ – 59; సెల్: 9949092761




❖ **కువైట్ కబుర్లు** – సయ్యద్ నశీర్ అహ్మద్ – అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్ – 126 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్, 22/373, మస్తాన్ వలి స్ట్రీట్, కడప-516 001; ఫోన్: 0862-245161; సెల్: 9885409930, 9440708070




❖ **ఇదీ నా గొడవ** – కాళోజీ ఆత్మకథ – కాళోజీ ఫౌండేషన్ – 256 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ బుక్ హౌస్




❖ **మరణం అంచున** – వర్దెల్లి వెంకటేశ్వర్లు – అడుగు జాడలు పబ్లికేషన్స్ – 109 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: అడుగుజాడలు పబ్లికేషన్స్, ఫ్లాట్ నం. 302, వైష్ణవి నెస్ట్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వెనుక, మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్-36; అన్ని పెద్ద పుస్తక షాపుల్లో




❖ **ది ఫైర్ వితిన్: రిమెంబరింగ్ రెహనా సుల్తానా** – సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ – 150 పేజీలు, 1/8 డెమీ, రు. 165, ప్రతులకు: సివిల్ లిబర్టీస్ మోనిటరింగ్ కమిటీ, మోరల్ బిల్డింగ్, ఖుద్రిబాగ్, అంబర్‌పేట్, హైదరాబాద్-500 013, సెల్: 9391051586



❖ **ఒక నజియా కోసం** – నగేష్ బీరెడ్డి – వాసిరెడ్డి పబ్లికేషన్స్ – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: వాసిరెడ్డి పబ్లికేషన్స్, బి-2, టెల్‌కమ్ క్వార్టర్స్, కొత్తపేట్, హైదరాబాద్-500 060, సెల్: 9000528717




❖ **ప్రజాకవి దాశరథి సాహిత్యం** – ఐదవ సంపుటం – డా. దాశరథి కృష్ణమాచార్య – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 245 పేజీలు, 1/8 డెమీ, రు. 175




❖ **సామాజిక జీవనంలో వైజ్ఞానిక స్పృహ** – డా. దేవరాజు మహారాజు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 103 పేజీలు, 1/8 డెమీ, రు. 70




❖ **శారద రచనలు** – మొదటి సంపుటం – నవలలు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 497 పేజీలు, 1/8 డెమీ, రు. 325




❖ **ప్రాచీనాంధ్ర నగరములు** – మొదటి భాగము – ఆదిరాజు వీరభద్రరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 90 పేజీలు, 1/8 డెమీ, రు. 70

పై నాలుగు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జిఎస్ఐ (పోస్ట్), హైదరాబాద్ – 68; ఫోన్: 24224454; email:navachethanaph@gmail.com




❖ **అక్షర తార** – కవిత్వం – భండారి అంకయ్య – సమైక్య సాహితి ప్రచురణ – 115 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: శ్రీమతి సుశీలాదేవి, ఫ్లాట్ నెం. 204, కమలశ్రీ అపార్ట్‌మెంట్స్, రాజీవ్‌కాలనీ, మంకమ్మతోట, కరీంనగర్ – 505001; సెల్: 90327 42937

# భారత వ్యవసాయ కుటుంబాల తీరుతెన్నులు

భారత వ్యవసాయానికీ, వ్యవసాయదారులకూ, వ్యవసాయం మీద ప్రత్యక్షంగా ఆధారపడిన అసంఖ్యాక గ్రామీణ ప్రజలకూ ఏమవుతున్నది అనే ప్రశ్న దశాబ్దాలుగా ఆలోచనాపరులను వేధిస్తున్నది. మరీ ముఖ్యంగా రెండు దశాబ్దాలకు పైగా రైతుల ఆత్మహత్యలు విపరీతంగా పెరిగిపోవడం ఒక పక్క, వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదనే ఫిర్యాదులూ వాస్తవాలూ మరొకపక్క ఆలోచనాపరులను కలిచివేస్తున్నాయి. ఈ సమస్యకు ఈ సువిశాల దేశంలో ఎక్కడికక్కడ ప్రత్యేకతలు, మినహాయింపులు ఉండవచ్చు గాని భారత వ్యవసాయం సంక్షోభంలో ఉన్నదనేది, అంటే భారత సమాజమే సంక్షోభంలో ఉన్నదనేది నిర్వివాదమైన అంశం. భారత వ్యవసాయ సంక్షోభానికి ఉన్న వ్యవస్థాగత కారణాలను అర్థం చేసుకోవాలంటే, అసలు భారత వ్యవసాయ వ్యవస్థ ఎట్లా నిర్మాణమైందో, దానిలో ఎక్కడెక్కడ ఏ బలహీనతలున్నాయో అర్థం చేసుకోవలసి ఉంది.

ఆ అవసరమైన సమాచారంలో కొంత భాగన్నయినా ఇవ్వగలిగే భారత ప్రభుత్వ నివేదిక ఒకటి ఈ డిసెంబర్ 4న వెలువడింది. భారత ప్రభుత్వపు గణాంక, కార్యక్రమ అమలు మంత్రిత్వ శాఖ (మినిస్ట్రీ ఆఫ్ స్టాటిస్టిక్స్ అండ్ ప్రోగ్రాం ఇంప్లిమెంటేషన్) కు చెందిన జాతీయ నమూనా సర్వే కార్యాలయం (నేషనల్ సాంపిల్ సర్వే ఆఫీస్ – ఎన్ఎస్ఎస్ఒ) గత ఆరు దశాబ్దాలుగా దేశంలోని అనేక విషయాల మీద పరిశోధనలు, సర్వేలు జరిపి నివేదికలు ప్రచురిస్తున్నది. దేశంలో మొత్తంగానే గణాంకాల నాణ్యత, విశ్వసనీయత సందేహాస్పదంగా ఉన్నప్పటికీ, ఉన్నంతవరకు దేశవ్యాప్త గణాంకాలు, కొన్ని మినహాయింపులతోనైనా అనివార్యంగా పరిగణనలోకి తీసుకోవలసిన గణాంకాలు అందజేస్తున్నది ఈ సంస్థే. ఈ సంస్థ విడుదల చేసిన 'భారతదేశంలో వ్యవసాయ కుటుంబాలకు సంబంధించిన కొన్ని ప్రత్యేకతలు' (సమ్ కారెక్టరిస్టిక్స్ ఆఫ్ అగ్రికల్చరల్ హౌజ్ హోల్డ్స్ ఇన్ ఇండియా) అనే 1446 పేజీల నివేదిక (52 పేజీల నివేదిక, 1287 పేజీల్లో విస్తరించిన 23 పట్టికలు, మిగిలిన పేజీల్లో సమాచార సేకరణకు సంబంధించిన సాంకేతిక అంశాల వివరణలు, ప్రశ్నపత్రాలు) చాల ఆసక్తికరమైన అంశాలతో ఉంది. 2013 జనవరి నుంచి డిసెంబర్ వరకు, డెబ్బయో విడత సర్వేలో సేకరించిన క్షేత్రస్థాయి సమాచారం ఆధారంగా ఈ నివేదిక తయారయింది. (నిజానికి భారత ప్రభుత్వ వ్యవసాయ శాఖ దేశంలోని రైతుల పరిస్థితిని తెలుసుకోవడానికి 2003లో ఒక సమగ్ర పరిశీలన నిర్వహించింది. దాన్ని ఎన్ఎస్ఎస్ యాబైతొమ్మిదో విడత సర్వే అంటారు). భారత సమాజ స్వభావం గురించి, గ్రామీణ, వ్యవసాయ సమాజం గురించి ఆలోచించదలచిన వారికి ఉపయోగకరమైన నివేదిక ఇది.

ఈ సమాచార సేకరణలో 'వ్యవసాయ కుటుంబం' అని ఈ సర్వే ఎవరిని గుర్తించిందో మొట్టమొదట చూడాలి. గతంలోని యాభైతొమ్మిదో విడతలోనే రైతు అంటే "సొంత భూమిపై గాని, కౌలుకు తీసుకున్న భూమిపై గాని, మరే రకంగా అధీనంలో ఉన్న భూమిపైగాని పనిచేస్తూ, వ్యవసాయ కార్యకలాపాలలో పాల్గొంటున్న వ్యక్తి" అని నిర్వచించారు. ఇక్కడ వ్యవసాయం అనే మాటను దాని విశాలార్థంలో, అంటే పంటసాగు, పూలతోటలు, ప్లాంటేషన్లు, పశుగణాభివృద్ధి, కోళ్ల పెంపకం, చేపల పెంపకం, పందుల పెంపకం, తేనెటీగల పెంపకం, పురుగుల పెంపకం, పట్టుపురుగుల పెంపకం వగైరా అన్నీ. ఈ కార్యకలాపాలు సర్వే జరిగేనాటికి ముందు 365 రోజుల్లో జరిగి ఉండాలి. ఆ పనిచేసే వ్యక్తి సభ్యుడుగా/సభ్యురాలిగా ఉన్న కుటుంబాన్ని వ్యవసాయ కుటుంబం అంటారు. 2003లో చేసిన ఈ నిర్వచనాన్ని సవరించవలసి ఉందని 2013 సర్వే సమయంలో గుర్తించి మార్పులు చేశారు. ఇప్పుడు తాజా నిర్వచనంలో సొంతభూమి అనే ప్రమాణం లేదు. అలాగే తక్కువస్థాయి వ్యవసాయోత్పత్తిని ఈ నిర్వచనం పరిధి నుంచి మినహాయించారు. మొత్తంగా వ్యవసాయ కూలీలను ఈ సర్వే నుంచి మినహాయించారు.

ఈ నివేదిక ప్రకారం గ్రామీణ భారతంలోని మొత్తం వ్యవసాయ కుటుంబాల సంఖ తొమ్మిది కోట్ల రెండు లక్షలు. ఈ కుటుంబాల మొత్తం జనాభా 46 కోట్ల రెండు లక్షలు. దేశంలోని మొత్తం గ్రామీణ కుటుంబాలలో వ్యవసాయ కుటుంబాల సంఖ్య 57.8 శాతం.

అయితే దేశంలోని మొత్తం గ్రామీణ కుటుంబాల సంఖ్య 15 కోట్ల 61 లక్షలు (74 కోట్ల 24 లక్షల జనాభా) అని ఎన్ ఎస్ ఎస్ ఒ ఈ డెబ్బయవ విడతలోనే జరిపిన మరొక సర్వేలో తేలింది గనుక, నిర్వచనపు మినహాయింపులు తీసేస్తే తొమ్మిది కోట్ల రెండు లక్షల అంకె వచ్చిందన్నమాట. దీన్ని మరొక రకంగా చెప్పాలంటే కనీసం ఆరున్నర కోట్ల కుటుంబాలు, ముప్పైకోట్ల జనాభా, వ్యవసాయ కుటుంబాలు కాకుండానే గ్రామీణ ప్రాంతాలలో ఉంటున్నాయి. వ్యవసాయ కుటుంబాల నిర్వచనం ప్రకారం వీరిలో వ్యవసాయ కూలీలను (2011 జనగణన ప్రకారం 14 కోట్ల 43 లక్షలు), అనుత్పాదకమైన, తక్కువ ఉత్పాదకమైన వ్యవసాయం చేస్తున్నవాళ్లను (ఈ గణాంకాలు లేవు గాని బహుశా పది కోట్ల లోపు ఉండవచ్చు) తీసేస్తే, గ్రామీణ రంగంలో వ్యవసాయేతర వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు చేసుకుంటున్నవారు ఆరేడు కోట్ల మంది ఉండవచ్చు. వారిలో స్థిరమైన ఉపాధి ఉన్నవారు చాల తక్కువ అని చెప్పనక్కరలేదు. వ్యవసాయదారుల కుటుంబాలలో కూడ మనుగడ దుర్భరంగా మారుతున్నవారిని అలా ఉంచి, ఈ మూడు గ్రామీణ వర్గాలకు, అంటే దాదాపు ముప్పై కోట్ల మందికి అర్థవంతమైన ఉపాధి కల్పించడం భారత ఆర్థిక వ్యవస్థ ముందున్న పెద్ద సవాలు.

ఈ అంకెలను ఇంకా విడదీసి చూస్తే దేశం మొత్తం మీద వ్యవసాయ కుటుంబాల సంఖ్య 57.8 శాతంగా ఉండగా, ఆ సంఖ్య తెలంగాణలో 51.5 శాతంగా, ఆంధ్రప్రదేశ్‌లో 41. 5 శాతంగా ఉంది. అంటే పై మూడు వర్గాల సంఖ్య తెలంగాణలో, ఆంధ్రప్రదేశ్‌లో దేశ నిష్పత్తితో పోలిస్తే ఎక్కువగా ఉన్నదన్న మాట.

కమతాలలో అసమానతలను, కుల వ్యవస్థలోని సామాజిక అసమానతలను కలిపి చూస్తే, దేశంలోని మొత్తం వ్యవసాయ కుటుంబాలలో 45.4 శాతం వెనుకబడిన కులాలకు, 24.9 శాతం 'ఇతర' కులాలకు, 16.3 శాతం షెడ్యూల్డ్ కులాలకు చెందినవని నివేదిక

సగటు కుటుంబ నెలసరి ఆదాయం - ఖర్చు

| | (జనవరి - జూన్ 2013) | | (జూలై - డిసెంబర్ 2013) | | సంవత్సరం మొత్తానికి | |
|---|---|---|---|---|---|---|
| | ఆదాయం | ఖర్చు | ఆదాయం | ఖర్చు | ఆదాయం | ఖర్చు |
| 0.01 హె. కన్న తక్కువ | 4695 | 5463 | 4561 | 5108 | 9256 | 10571 |
| 0.01 - 0.40 హె. | 4376 | 5559 | 4152 | 5401 | 8528 | 10960 |
| 0.41 - 1 హె. | 5380 | 6071 | 5247 | 6020 | 10627 | 12091 |
| 1.01 - 2 హె. | 6897 | 6710 | 7348 | 6457 | 14245 | 13167 |
| 2.01 - 4 హె. | 10180 | 8065 | 10730 | 7786 | 20910 | 15851 |
| 4.01 - 10 హె. | 15947 | 10325 | 19637 | 10104 | 35584 | 20429 |
| 10 హె. పైన | 33017 | 12812 | 41388 | 14447 | 74405 | 27259 |
| సగటు | 6249 | 6371 | 6426 | 6223 | 12675 | 12594 |

నిర్ధారించింది. ఈ అంకెలను కాస్త నిశితంగా చూడాలి. ఈ సగటు అంకెలతోపాటు ఆయా వర్గాల కమతాల సంఖ్యను, సగటు కమతం విస్తీర్ణాన్ని చూసినప్పుడు ఈ దేశంలో ప్రధాన ఉత్పత్తి సాధనమైన భూమి యాజమాన్యానికీ కులానికీ ఎటువంటి సంబంధం ఉందో అర్థమవుతుంది. దళితులు 0.01 హెక్టార్ కన్న తక్కువ భూమి ఉన్న వర్గంలో 28 శాతం ఉండగా, 0.01 - 0.04 హెక్టార్ల వర్గంలో 22.4 శాతం ఉన్నారు. ఈ రెండు వర్గాల కమతాలు కూడ ఎకరం కన్న తక్కువ కమతాలు. అంటే దళితులలో భూమి ఉన్నవారిలో సగం మంది ఎకరం కన్న తక్కువ భూమి కలిగి ఉన్నారు. ఇక 0.41 - 1 హె. వర్గంలో 15.9 శాతం, 1.00- 2.00 హె. వర్గంలో 10.9 శాతం, 2.01 - 4 హె. వర్గంలో 7.7 శాతం, 4.01 - 10 హె. వర్గంలో 6.2 శాతం మంది, 10 హె. కన్న ఎక్కువ ఉన్నవారు 2.9 శాతం మంది ఉన్నారు. మరొకవైపు 'ఇతరులు' అనే పేరుతో సూచిస్తున్న అగ్రవర్ణాలలో ఎకరం కన్న తక్కువ భూమి ఉన్నవారు33 శాతం కాగా, పది ఎకరాల కన్న ఎక్కువ ఉన్నవారు 41.4 శాతం, ఇరవై ఐదు ఎకరాల కన్న ఎక్కువ ఉన్నవారు 41.1 శాతం.

ఇక వ్యవసాయ కుటుంబాల ఆదాయాల విషయానికి వస్తే, వ్యవసాయమే ప్రధాన ఆదాయ వనరుగా ఉన్న కుటుంబాలు 68.3 శాతం మాత్రమే. మిగిలిన వారిలో కొద్దిమంది (3.7 శాతం) పశుగణంతోనూ, ఇతర వ్యవసాయ కార్యకలాపాలతోనూ (1.1 శాతం) పొట్టపోసుకుంటుండగా, దాదాపు నాలుగో వంతు మంది (22 శాతం), భూమి ఉండి, వ్యవసాయదారులుగా గుర్తింపు పొంది కూడ రోజుకూలికి వెళ్లక తప్పడం లేదు. వ్యవసాయ కుటుంబాలలో కూడ 4.7 శాతం మంది వ్యవసాయేతర వ్యాపారాలే ప్రధాన ఆదాయ వనరుగా ఉన్నవారున్నారు. వ్యవసాయ కుటుంబాలలో 44 శాతం మంది గ్రామీణ జాతీయ ఉపాధి పథకం జాబ్‌కార్డు తీసుకుని, కూలిపనికి వెళ్తున్నారు. వ్యవసాయ కుటుంబాల నెలవారీ ఆదాయంలో 60 శాతం కూడ వ్యవసాయం నుంచి రావడం లేదు. దాదాపు 32 శాతం ఆదాయం కూలి, వేతనం తదితర వనరుల నుంచే వస్తున్నది.

ఈ సందర్భంలోనే ఈ నివేదిక ప్రకటించిన వ్యవసాయ కుటుంబాల నెలసరి ఆదాయ వ్యయాల గణాంకాలు చాల ఆశ్చర్యకరమైన, ఆసక్తికరమైన నిర్ధారణలకు అవకాశం ఇస్తాయి. వ్యవసాయ సంవత్సరంలో దేశవ్యాప్తంగా ఖరీఫ్, రబీ అనే కాలమానాలు ఉండగా, 2003 సర్వే వరకూ ఆ కాలమానాన్నే పాటించిన ఎన్ఎస్ఎస్ఒ ఈసారి ఆ కాలమానాన్ని వదిలేసి, దాని స్థానంలో కాలెండర్ సంవత్సరాన్ని రెండు అర్థభాగాలుగా చేసి వివరాలు సేకరించింది. అందువల్ల ఆదాయ వ్యయాలకు సంబంధించి జనవరి నుంచి జూన్ వరకు ఒక అంకె, జూలై నుంచి డిసెంబర్ వరకు ఒక అంకె ప్రకటించారు. అవి కూడ మళ్లీ భూకమతాన్ని బట్టి వ్యవసాయదారుల కుటుంబాలను కొన్ని వర్గాలుగా విభజించి, ఆయావర్గాల ఆదాయ వ్యయాలు విడివిడిగా ప్రకటించారు. ఈ విడివిడి అంకెలను ఒక్క దగ్గరికి తెచ్చి చూస్తే ఈ పట్టిక తయారవుతుంది.

ఈ పట్టిక ప్రకారం సగటున ఒక వ్యవసాయ కుటుంబపు సంవత్సరాదాయం రు. 12675 ఉండగా, ఖర్చు రు. 12594 ఉందనీ అందువల్ల ఖర్చు కన్న ఆదాయం స్వల్పంగానైనా ఎక్కువే ఉందనీ అనిపిస్తుంది. ఈ సంవత్సరాదాయాన్ని రెండు అర్ధవార్షిక అంచనాలుగా చూసినా మొదటి ఆరు నెలల్లో రు. 6249 ఆదాయానికి రు. 6371 ఖర్చుతో స్వల్పమైన లోటు ఉందనీ, కాని రెండో ఆరు నెలల్లో రు. 6426 ఆదాయం కన్న రు. 6223 ఖర్చు తక్కువ ఉందనీ అనిపిస్తుంది. కాని కమతాల యాజమాన్యంతో వర్గాలుగా చూసినప్పుడు ఒక హెక్టారు (రెండున్నర ఎకరాలు) కన్న తక్కువ ఉన్న మూడు వర్గాలూ ఏ రకంగా చూసినా లోటుతోనూ, 1.01 - 2 హెక్టార్ల వర్గం బొటాబొటిగానూ జీవితం గడుపుతుండగా, రెండు హెక్టార్ల కన్న ఎక్కువ భూమి ఉన్న వర్గాలకు ఖర్చు కన్న ఆదాయం ఎక్కువగా ఉన్నట్టు, అది పైకి పోయినకొద్దీ పెరుగుతున్నట్టు స్పష్టమవుతుంది.

అంటే రైతాంగ సంక్షోభం, వ్యవసాయ సంక్షోభం, గ్రామీణ సంక్షోభం అనే మాటలు స్థూలంగా వాడవలసినవి కావు. అవి గ్రామీణ, వ్యవసాయ రంగంలో ఉన్న, ఎక్కువ భూమి ఉన్న, అగ్రవర్ణాల సంక్షోభాలు కావు. ఆ వర్గాలలో ఇప్పటికీ వ్యవసాయ మిగులు గణనీయంగానే ఉంటున్నది. వారిలో అత్యధికులు ఇతర ఆదాయాలు సమకూర్చుకోగలిగిన వృత్తులలో, ఉద్యోగాలలో, వ్యాపారాలలో, రాజకీయాధికారంలో కూడ ఉన్నారనేది అదనపు వాస్తవం. మరొకవైపు తక్కువ భూమి ఉన్న, దళిత, బహుజన వర్గాలకు చెందిన, వ్యవసాయాభివృద్ధి అవకాశాలూ, వనరులూ లేని వర్గాలకు ఖర్చుకు సరిపడిన ఆదాయం లేదు. వ్యవసాయ జీవనం సంక్షోభమయంగా ఉన్నది. బతుకు ఆత్మహత్యలవైపు పయనిస్తున్నది. అదీ భారత వ్యవసాయ కుటుంబాలలో అత్యధికుల పరిస్థితి. వీ

# సంఘ్ పరివార్ ఫాసిజం

*రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో జర్మనీ, ఇటలీలలో తలెత్తిన ఫాసిజం అనే మాట భారత సమాజంలో సంఘ పరివార్ ఆలోచనలకూ, చర్యలకూ ఎలా సరిపోతుందో వివరిస్తున్నారు* **సుమిత్ సర్కార్**

(**బా**బ్రీ మసీదు విధ్వంసం, ఆ తర్వాత దేశవ్యాప్తంగా జరిగిన మతకల్లోలాల నేపథ్యంలో 1993 జనవరిలో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో వెలువడి, ఇప్పటివరకూ తెలుగులోకి రాని ఈ వ్యాసాన్ని చారిత్రక ప్రాధాన్యత దృష్ట్యా, వ్యాసంలో చర్చించిన అంశాల ప్రాధాన్యత దృష్ట్యా ప్రచురిస్తున్నాం.)

సమకాలీన భారతదేశంలో ఫాసిజం యూరపియన్ చారిత్రక నేపథ్యం కన్న భిన్నమైనది గనుక నిన్నటి వరకూ ఆ మాట కేవలం తిట్టుగా, విచక్షణారహితమైన వాడకం వల్ల అరిగిపోయినదిగా కనబడేది. నిరంకుశ అణచివేత, అభివృద్ధి నిరోధక హింసల బహిరంగ చర్యలకు సూచనగా మాత్రమే ఉండేది. డిసెంబర్ 6 ఘటనలతో, ఆ తర్వాతి ఘటనలతో, ఫాసిజపు విశ్వరూపపు భయానకత్వం మన వీథుల్లో భయోత్పాతం కలిగిస్తూ తిరుగుతున్నది. అత్యున్నత అధికార పీఠాల కుమ్మక్కుతో, సమర్థనతో ఊరేగుతున్నది. మన బంధువులతో, సహోద్యోగులతో, మిత్రులతో జరుగుతున్న సంభాషణల్లో తలెత్తుతున్నది. సరిగ్గా సరిపోయే పోలికలు ఉంటాయని కాదు. భారత దేశంలో అత్యధిక భాగంలో 1992-93 ఘటనలకూ, 60 సంవత్సరాల కిందటి జర్మనీకీ తేడాలున్నాయి. కాని ఘటనల క్రమంలో సామ్యాలనూ భేధాలనూ నిశితంగా చూస్తే కొన్ని కీలకాంశాలు వెలికితీయడానికి వీలవుతుంది. వాటిలో ప్రధానమైనది, దేశ విభజన సందర్భంగా జరిగిన మతవిద్వేష హింస కన్నా విస్తృతమైన, భయానకమైన, బహిరంగమైన హింస జరుగుతున్న ప్రస్తుత పరిస్థితికి దారి తీసిన సంఘ పరివార్ పద్ధతుల గురించి అర్థం చేసుకోవడం. హిందూ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి జరుగుతున్న ప్రయత్నం మన గణతంత్రపు లౌకిక, ప్రజాస్వామిక పునాదులను మొత్తంగా ప్రమాదంలో పడేస్తున్నది. ఎప్పుడో నెహ్రూ చేసిన హెచ్చరిక ఇప్పుడు చాల ప్రాసంగికంగా కనబడుతున్నది. ముస్లిం మతోన్మాదం కూడ స్వభావరీత్యా హిందూ మతోన్మాదంతో సమానమైన దుర్మార్గమైనదే. బహుశా అధిక సంఖ్యాక మతస్తులలో కన్న అది ముస్లింలలోనే బలంగా కూడ ఉండవచ్చు. "కాని ముస్లిం మతోన్మాదం భారత సమాజంలో ఆధిపత్య స్థానానికి వచ్చి ఫాసిజాన్ని అమలు చేయజాలదు. ఆ పని చేయగలిగేది హిందూ మతోన్మాదం మాత్రమే" అని నెహ్రూ అన్నాడు. పాత ఫాసిస్టు ఉదాహరణను పరిశోధించడం ఇవాళ మనను ముంచెత్తనున్న ప్రమాదాన్ని మరింత ఎక్కువగా అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుంది. అది బహుశా ఇవాళ మనకు అత్యవసరమైన, అతి తక్కువగా లభిస్తున్న భవిష్యత్తుపై ఆశ అనే మరొక దినుసును కూడ అందించవచ్చు.

ఇటలీలో, జర్మనీలో ఫాసిజం అధికారానికి వచ్చే క్రమం వీథుల్లో హింస; పోలీసులలోకి, అధికార యంత్రాంగంలోకి, సైన్యాలలోకి చొరబాటు; 'మధ్యేవాద' రాజకీయ నాయకుల మిలాఖత్తు అనే మూడు కారణాల కలయికతో సాధ్యమయింది. ఇందులో వీథుల్లో హింసను చాల జాగ్రత్తగా రూపొందించారు. దానికి పెద్ద ఎత్తున ప్రజల మద్దతు దొరికిందనేది కూడ నిస్సందేహమే. చట్టాలనూ రాజ్యాంగ నియమాలనూ మొరటుగా ఉల్లంఘించడం, ఆ తర్వాత చట్టాన్ని గౌరవించాలంటూ ఇల్లెక్కి ప్రబోధించడం ఫాసిస్టుల, నాజీల ప్రవర్తనలో ఒకదాని తర్వాత ఒకటిగా సాగాయి. రీచ్ స్టాగ్ లో అత్యధిక స్థానాలు గెలుచుకున్న పార్టీ నాయకుడిగా హిట్లర్ ను చాన్సలర్ పదవి చేపట్టమని 1933 జనవరి 30న అధ్యక్షుడు హిండెన్ బర్గ్ ఆహ్వానించడం సంపూర్ణంగా రాజ్యాంగబద్ధ పద్ధతిలోనే జరిగిందని మనం చాలసార్లు మరచిపోతుంటాం. ఆ తర్వాత నెలంతా హిట్లర్ తమ పార్టీ చట్టబద్ధపాలనను ఎంత గౌరవిస్తుందో పదే పదే చెపుతూ వచ్చాడు. కాని మరోవైపు ఆ ప్రభుత్వపు పోలీసు మంత్రి గోరింగ్, బెర్లిన్ పోలీసు వ్యవస్థను నాజీ భావాలతో నింపుతూ వచ్చాడు. వీథుల్లో ఘర్షణలు సృష్టించి, 50 మందికి పైగా ఫాసిస్టు వ్యతిరేకులను హత్య చేయించాడు. కుట్రపూరితమైన రీచ్ స్టాగ్ దహనకాండకు పథకం రచించాడు. ఆ దహనకాండ తర్వాత మొదట కమ్యూనిస్టులను, ఆ తర్వాత అన్ని ప్రతిపక్ష రాజకీయ పార్టీలను, ట్రేడ్ యూనియన్లను పద్ధతి ప్రకారం ధ్వంసం చేశాడు.

దురదృష్టకరంగా కచ్చితమైన పోలిక ఇక్కడే ఉంది. సుప్రీంకోర్టు ఉత్తర్వులనూ, ప్రధాన ప్రతిపక్ష పార్టీ, దాని మిత్రులూ పదేపదే ఇచ్చిన హామీలనూ ఉల్లంఘిస్తూ ఐదు గంటలపాటు ఒక మసీదును పద్ధతిప్రకారం నేలమట్టం చేయడం జరిగింది. కేంద్ర ప్రభుత్వం తన చిటికెనవేలు కూడ అడ్డుపెట్టలేదు. దాని తర్వాత దేశవ్యాప్తంగా కల్లోలాలు జరిగాయి. వాటిలో పోలీసుల పక్షపాతం సుస్పష్టంగా బైటపడింది. చట్ట సంరక్షకులు స్వయంగా తామే అల్లరిమూకలుగా మారిన సందర్భాలు తక్కువేమీ కావు. ఆ తర్వాత ఆశ్చర్యకరమైన రాజకీయ, న్యాయపరమైన పన్నాగాలు మొదలయ్యాయి. అవి అంతిమంగా విధ్వంసకులైన కబ్జాదారులకు ఆ స్థలంలో ఒక తాత్కాలిక 'ఆలయాన్ని' నిర్మించుకుని, దర్శనం, పూజ ఏర్పాటు చేయడానికి అనుమతించాయి. అక్కడ హిందువులు యథేచ్ఛగా తిరగడానికి అనుమతి లభించగా, ముస్లింలకు మాత్రం కర్ఫ్యూ అమలయింది. ఆ స్థలంలో ఇంతకాలమూ ఉండిన 462 సంవత్సరాల పాత మసీదు 'వివాదాస్పద స్థలం' హఠాత్తుగా లేకుండా పోయి, పరిరక్షించడానికి యోగ్యమైన కొత్త నిర్మాణం వచ్చింది. ఈలోగా భారతీయ జనతా పార్టీ అప్పుడప్పుడు క్షమాపణలు చెపుతూ, అంతకన్న ఎక్కువగా దుందుడుకు సమర్థనలు వినిపిస్తుండగా, విశ్వ హిందూ పరిషత్

నాయకులు తమ జాబితాకు ఢిల్లీ జుమ్మా మసీదునూ, వారణాసి, మథురలలోని మసీదులనూ కలుపుతూ, భారత రాజ్యాంగం హిందూ వ్యతిరేకమైనదని బహిరంగంగా ఖండిస్తూ వచ్చారు.

### లక్ష్యాల విస్తరణ

స్పష్టంగా తెలిసిన, ఎప్పటినుంచో మతవిద్వేషపు లక్ష్యంగా ఉన్న ముస్లింల నుంచి క్రమంగా లక్ష్యాన్ని విస్తరించడం, అంతకంతకూ ఎక్కువ వలయాల ప్రత్యర్థులను లక్ష్యంగా చేసుకోవడం అనే విశాల కోణం గురించి కాస్త అదనంగా చెప్పుకోవాలి. ఇక్కడే హిట్లర్ ఉదాహరణ మళ్లీ ఒకసారి సరిపోతుంది. మొదట యూదులు, కమ్యూనిస్టులు లక్ష్యంగా ఉన్నదల్లా అంతకంతకూ విస్తరించి అందులోకి సోషల్ డెమొక్రాట్లు, ఉదారవాదులు, కాథలిక్కులు, స్వతంత్రంగా ఆలోచించగల ప్రతి ఒక్కరూ చేరారు. చివరికి 1934 జూన్ లో 'నైట్ ఆఫ్ ది లాంగ్ నైవ్స్' గా ప్రఖ్యాతమైన ఊచకోతలో చాల మంది నాజీలు కూడ లక్ష్యంగా మారిపోయారు. భారతీయ జనతా పార్టీ బహిరంగ హింసాకాండ మధ్యప్రదేశ్ లో రెండు ఘటనలతో ప్రారంభమయింది. అసాధారణమైన చొరవతో, మౌలికతతో ఎదిగివచ్చిన కార్మిక నాయకుడు శంకర్ గుహ నియోగి ని 1991 శిశిరంలో హత్య చేయడం, ఇటీవలనే సుప్రసిద్ధ ప్రగతిశీల విశ్రాంత ప్రభుత్వాధికారి బి డి శర్మను బహిరంగంగా అవమానించడం అనే ఆ రెండు ఘటనలకు రామజన్మభూమి ఆందోళనతో సంబంధం లేదు. అంతకుముందే మహారాష్ట్రకు చెందిన శివసేన 1970లలో బొంబాయిలో బలవత్తరంగా ఉండిన ఎర్రజెండా యూనియన్లను ధ్వంసంచేసే వీధి హింసతో ఈ దారి చూపి ఉంది. డిసెంబర్ 6 న జర్నలిస్టులను చితకబాదడం అరుదుగా జరిగిన పొరపాటు చర్య ఏమీ కాదు, అది రూపొందుతున్న విశాల ప్రణాళికలో భాగమే. హిందూత్వ శక్తులు చాల జాగ్రత్తగా ప్రచార సాధనాలను తమకు చేరువ చేసుకున్నాయి, ఇటీవలి వరకూ విజయం సాధించాయి కూడ. కాని ఫాసిస్టులు ఎప్పుడైనా ఒకవైపు బుజ్జగింపులు ఉపయోగిస్తూనే, మరొకవైపు పెద్ద కర్రలతో బాదడానికి కూడ సిద్ధంగా ఉంటారు.

ఢిల్లీలో జరిగిన పరిణామాల వార్తలకు ఇక్కడ ప్రాధాన్యత ఉంది. అవి వీధుల్లో హింసకు అధికార వర్గాల కుమ్మక్కు ఎలా ఉందో సూచనలు ఇస్తాయి. డిసెంబర్ 6 తర్వాత 213 చోట్ల కర్ఫ్యూ విధించారు. తొమ్మిది కోట్ల డెబ్బై లక్షల మంది ప్రజలు ఈ హింస వల్ల బాధితులయ్యారు. కాన్పూర్, భోపాల్, సూరత్, బొంబాయి, తదితర పట్టణాలతో పోలిస్తే ఢిల్లీలో తక్కువ హింసనే జరిగింది. కాని డిసెంబర్ కల్లోలాలు తక్కువగా జరిగిన ఈ నగరంలోనే, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్, విశ్వహిందూ పరిషత్, బజరంగదళ్ లను నిషేధించానని చెప్పుకుంటున్న కేంద్ర ప్రభుత్వం నీడలోనే మతోన్మాద వ్యతిరేక బృందాలను అరెస్టు చేయడం, వేధించడం జరిగాయి. పి ఎన్ హక్సర్, హబీబ్ తన్వీర్ వంటి సుప్రసిద్ధుల నాయకత్వంలో జరిగిన శాంతి యాత్రను పోలీసులు అడ్డుకున్నారు. ఒక మతోన్మాద వ్యతిరేక బృందంలో పాల్గొన్న ఢిల్లీ విశ్వవిద్యాలయ విద్యార్థిని అరెస్టు చేసిన పోలీసులు ఆ విద్యార్థి పేరు తెలుసుకుని, రాం అని పేరు పెట్టుకుని ఇటువంటి పనులు చేస్తావా అని చెంపలు వాయించారు. బాబ్రీ మసీదు విధ్వంసాన్ని విమర్శించే వాళ్లెవరయినా పాకిస్తాన్ కు వెళ్లిపోవలసిందేనని బజరంగ దళ్ గూండాలు బహిరంగం గానే ప్రకటించారు. తూర్పు ఢిల్లీలో సీలంపురా ప్రాంతంలో ప్రత్యేకంగా ముస్లింలు నివసించే ప్రాంతాలలో కర్ఫ్యూ విధించారు. కొన్నిచోట్ల ముస్లిం పురుషులందరినీ నిర్బంధించారు. వాళ్లతో జైశ్రీరాం అనిపించారు. అననివాళ్లను చితకబాదారు. ఒక ముస్లిం పెద్దమనిషి గడ్డం పట్టుకు లాగారు.

### పుక్కిటిపురాణాలే లోకజ్ఞానంగా

ఇదంతా జరగడానికి అవకాశం ఇస్తున్నది స్పష్టంగా రూపొందుతున్న మతోన్మాద సమ్మతే. ఇది సర్వవ్యాపితం కాకపోవచ్చు గాని విస్తృతంగానే ఉంది. మత కల్లోలాలు జరిగినప్పుడు అత్యధిక సంఖ్యాకులు దూరంగా ఉండవచ్చు. బహుశా నిజాయితీతోనే వాటిని ఖండించవచ్చు. ఐనా వారు ఒక రకమైన మతోన్మాద సమ్మతిలో భాగస్వాములు కావచ్చు. ఆ మతోన్మాద సమ్మతి ఇవాళ ఎన్నో అపోహలతో, ముందస్తు అభిప్రాయాలతో, పుక్కిటి పురాణాలతో తయారై లోకజ్ఞానంగా మారిపోయింది. హిందూత్వ సంఘటిత శక్తులు మోసపూరితంగా ప్రచారం చేస్తున్నట్టుగా, అది ఒక వాస్తవికమైన, "గాయపడిన హిందూ భావోద్వేగాన్ని" వ్యక్తీకరిస్తున్న సామాజిక సంకల్పపు తక్షణ, 'సహజ' ప్రతిచర్య కాదు. ఈ సమ్మతిని ఉత్పత్తి చేయడం జరిగింది. అతి జాగ్రత్తగా పెంచి పోషించడం జరిగింది. అరవై సంవత్సరాలకు పైగా ఓపికగా, కష్టభరితమైన ప్రయత్నంతో తయారు చేసిన ఉత్పత్తి అది. ఎప్పుడో 1925లో స్థాపించబడిన రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్, 1950ల నుంచీ తన సభ్యుల నాయకత్వంలో అనేక కీలక స్థాయిల్లో ఎన్నెన్నో అనుబంధ సంస్థలను పుట్టించింది. ఆ సంస్థలలో జనసంఘ్ లేదా భారతీయ జనతా పార్టీ, విశ్వ హిందూ పరిషత్ ప్రధానమైనవి. ఆర్ఎస్ఎస్ చాల సంవత్సరాల పాటు బహిరంగంగా కనబడని, నెమ్మదైన, 'సాంస్కృతిక' ఆచరణ మీదనే కేంద్రీకరించింది. శాఖల పేరుతో కౌమార, నవయవ్వన దశలో ఉన్న విద్యార్థి యువజనులను చేరదీసి వారికి శారీరక శిక్షణ ఇచ్చింది. బౌద్ధిక సమావేశాల పేరుతో వారి మెదళ్లలో తమ భావాలు నింపింది. దేశవ్యాప్తంగా పాఠశాలల గొలుసు తయారుచేసింది. మనిషి మనిషినీ వ్యక్తిగతంగా కలిసి సంభాషణల ద్వారా తన భావాలు ప్రచారం చేసింది. చివరికి ఒక జనరంజకమైన హిందూ పిల్లల బొమ్మల పుస్తకాల ప్రచురణ కూడ సాగించింది. హిందూ పౌరాణిక, చారిత్రక వ్యక్తుల గురించి ఉద్బోధించే ఈ ప్రచురణను అమర్ చిత్ర కథ అంటారు. అణువణువులోకీ చొచ్చుకుపోవడం ద్వారా సమస్త ఆధిపత్యాన్నీ నిర్మించడం అని గ్రామ్సీ చెప్పిన క్రమం లాంటి సుదీర్ఘ క్రమం ఇది. ఆ తర్వాత 1980ల మొదట్లో, మధ్యలో 'హిందూ కార్డ్' వాడడానికి ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీల ప్రయత్నాలు కూడ మొదలయ్యాయి. 1984లో సిక్కుల ఊచకోత ద్వారా రాజ్యాంగ యంత్రాన్ని కనీవినీ ఎరగని రీతిలో మతోన్మాద భావాలతో నింపడం, ఆ తర్వాత నేరస్తులను రక్షించడానికి ప్రయత్నించడం, విచ్చలవిడి అవినీతితో చట్టబద్ధ పాలనను విచ్చిన్నం చేయడం జరిగాయి. సంఘ పరివార్ ప్రారంభించిన, ప్రస్తుతం విశ్వహిందూ పరిషత్ నాయకత్వం వహిస్తున్న రామజన్మభూమి మెరుపు యుద్ధానికి ఈ చర్యలన్నీ భూమికను సిద్ధంచేసి పెట్టాయి. రామాయణాన్ని ఒక కుహనా జాతీయవాద టెలివిజన్ సీరియల్ గా మార్చినదీ, బాబ్రీ మసీదులో 1949 డిసెంబర్ లో అధికారయంత్రాంగపు కుమ్మక్కుతో దొంగతనంగా విగ్రహాలను పెట్టిన సమయంలో ఉండినదీ, ఆ విగ్రహాలను పూజించడానికి 1986లో అనుమతి ఇచ్చినదీ కాంగ్రెస్ ప్రభుత్వమేనని మరచిపోగూడదు. సంఘ పరివార్ ఇంతకాలమూ చేసిన స్థావర యుద్ధం ఇప్పుడు బ్రహ్మాండమైన స్థాయి చలన యుద్ధంగా మారింది. అది ఇప్పుడు

ప్రచారంలో, దృశ్య – శ్రవణ సాంకేతిక పరిజ్ఞానాలలో అత్యాధునిక సాధనాలను వాడుకుంటూ, ఈ ఉపఖండంలో అంతకు ముందెన్నడూ తెలియని వనరులతో, స్థాయిలో జరిగింది. నిజం చెప్పాలంటే ఈ వ్యవహారాలలో హిట్లరే మార్గదర్శి. మౌఖిక ప్రచారానికి అప్పుడప్పుడే వెలుగులోకి వస్తున్న కొత్త లౌడ్ స్పీకర్ సాంకేతిక పరిజ్ఞానాన్నీ రేడియోనూ వాడుకోవడం ఎంత ముఖ్యమో హిట్లర్ గుర్తించాడు.

అయితే, ఒక రాజకీయ ఉద్యమంగా పుట్టిన దశాబ్దం లోపే ఇటలీలోనూ జర్మనీ లోనూ అధికారానికి వచ్చిన ఫాసిజానికి భిన్నంగా, హిందూత్వకు సుదీర్ఘకాలం అవసరమైంది. ఇలా సుదీర్ఘకాలం పట్టడం వల్ల దానికి శక్తీ స్థిరత్వమూ వచ్చాయనడంలో, లోకజ్ఞానంగా ప్రతి ఒక్కరిలో సంలీనం అయిందనడంలో సందేహం లేదు. కాని ఇక్కడే ఒక ఆశాసూచిక కూడ ఉంది. అది ఏమంటే దశాబ్దాల పాటు బ్రహ్మాండమైన ప్రయత్నం చేసినప్పటికీ ఈ దేశ ప్రజలందరి హృదయాలనూ మేధలనూ గెలుచుకునే ఆ ప్రయత్నం సఫలం కాలేదు. చివరికి 1991లో కూడ దేశంలో ప్రతి ఐదుగురిలో నలుగురు భారతీయ జనతా పార్టీకి వ్యతిరేకంగానే వోటు వేశారని గుర్తుంచుకోవడం అవసరం. దేశవ్యాప్తంగా దానికి వచ్చిన వోట్లు 21.9 శాతం. ఆ వోట్లన్నీ రాముడికి పడిన వోట్లే అనుకున్నా, ఉత్తరప్రదేశ్ విజయం ఒకరకంగా రామాలయ నిర్మాణానికి అనుకూలమైన తీర్పు అనుకున్నా, అది మసీదు విధ్వంసానికి అనుకూలమైన వోటు కాజాలదు. సంఘ్ పరివార్ నిజమైన పునాది ప్రధానంగా హిందీ భాషా ప్రాంతాలలోని నగరాలలో, చిన్నపట్నాలలో అగ్రవర్ణ వ్యాపార వృత్తిపర పెటీ బూర్జువావర్గం మాత్రమే. వారికి బహుశా గ్రామీణ ప్రాంతాలలో పైకి ఎగబాకుతున్న భూస్వామ్య బృందాలతో సంబంధాలు పెరుగుతూ ఉండవచ్చు. ఇంతకు మించి విస్తరణలు ఇప్పటికైతే అస్థిరంగానే ఉన్నాయనడానికి మండల్ ఆందోళన, బిహార్ ఉదాహరణలే సూచికలు. ఇవాళ్టి మితిమీరిన వాపుతో ఉన్న హిందుత్వ నిర్మాణం మనుగడ సాగాలంటే నిరంతర ఉద్దీపనల ఉత్సాహం అందాలి. ఉచ్ఛస్వరపు ఉన్మాదం చెలరేగాలి. అది మతోన్మాద హింసను ప్రేరేపించాలి. బహుశా అందుకే భారతీయ జనతా పార్టీ తన మంత్రివర్గాలను త్యాగం చేసే జూదానికి దిగింది. అవి కొనసాగి ఉంటే అవి కాంగ్రెస్ పాలనల కన్న భిన్నమైనవేమీ కావని అప్రతిష్ట పాలై ఉండేవే.

ఫాసిజం గురించి తొలిరోజుల్లోనే నిశిత విశ్లేషణ జరిపిన డానియెల్ గెరిన్ దాన్ని "బడా వ్యాపారపు సేవలో సాధనం మాత్రమే కాదు. అదే సమయంలో అది పెటీ బూర్జువా వర్గపు మాంత్రిక ఉత్థానం కూడ" అని నిర్వచించాడు. అటువంటి మాంత్రిక ఉత్థానం రాముడి పేరు మీద జరిగిందనేది నిస్సందేహం. అలాగే ఆ ప్రయత్నమంతా ఎంత ఆడంబరంగా జరిగిందో చూస్తే అపారమైన నిధులు ఖర్చయ్యాయని కూడ తేటతెల్లమవుతుంది. కాని ఫాసిజానికీ, పెట్టుబడిదారీ ప్రయోజనాలకూ మధ్య నిర్దిష్ట సంబంధాల గురించిన చర్చ యూరప్ లో కూడ వివాదాస్పదంగానే ఉండింది. ఆయాదేశాలలో అనేక రకాల పెట్టుబడులు ఉన్నాయనీ, వాటి మధ్య తేడా చూడడం అవసరమనీ చాల మంది చరిత్రకారులు భావించారు. ఉదాహరణకు సాపేక్షికంగా తక్కువ అభివృద్ధి చెందిన ఇటలీ, అతి ఎక్కువ పారిశ్రామికీకరణ జరిగిన జర్మనీ కన్న మౌలికంగా భిన్నమైనది. పై నిర్వచనంలో "సాధనం" అనే మాట సూచిస్తున్నట్టుగా పెట్టుబడిదారీ ప్రయోజనాలకు ఫాసిజంతో సానుకూల ఉద్దేశపూర్వక సంబంధాలున్నాయా, లేక పరిస్థితుల ప్రోద్బలం వల్ల దానితో సర్దుబాటు చేసుకోవలసి వచ్చిందా వివాదాలున్నాయి. భారతదేశపు పరిస్థితి గణనీయంగా భిన్నమైనది. అన్నిటికన్న ముఖ్యంగా ఆస్తిపరవర్గాలకు సంఘటిత కార్మికవర్గం వైపు నుంచి ప్రధానమైన సవాలు గానీ, తక్షణమే రానున్న సోషలిస్టు విప్లవ ప్రమాదం గానీ లేదు. ఆర్థిక సంక్షోభపు అప్పటి స్థాయీ, స్వభావమూ కూడ ప్రస్తుత సంక్షోభంతో పోల్చదగినవి కావు. ఆర్థిక సంక్షోభానంతర జర్మనీలో చాల వ్యాపార వర్గాలకు నాజీజం "పెట్టుబడిదారీ విధానాన్ని పరిరక్షించుకునేందుకు అందివచ్చిన చిట్టచివరి సాధనం"గా కనబడి ఉంటుందని వాదించవచ్చు. కాగా, ఇటలీలో ఫాసిజానికి, ప్రజా వ్యతిరేకమైనదైనప్పటికీ, అభివృద్ధి లక్షణం, 'నిర్దిష్ట విప్లవ' లక్షణం ఉన్నాయని ఫాసిస్టు జైలులో నిర్బంధంలో ఉండి గ్రామ్షీ వాస్తవికంగానే గుర్తించాడు. ఈ రెండు ధోరణులలో ఏ ఒక్కటీ ప్రస్తుతానికైతే భారతదేశంలో కనబడడం లేదు. ఇప్పుడు ఇక్కడ నరసింహారావు ప్రభుత్వం అయోధ్య వ్యవహారాలలో ప్రవర్తించినదానికన్న భిన్నంగా, కృతనిశ్చయంతో, నైపుణ్యంతో ఆర్థిక విధానంలో విస్తారమైన మార్పులు తీసుకొస్తున్నది. స్వయం సమృద్ధి, ప్రణాళికా విధానం అనే నెహ్రూ వారసత్వాన్ని కూలదోసి, ఇటువంటి మార్పులు తేవలసి ఉందని జన సంఘ్, భారతీయ జనతా పార్టీ కూడ ఎన్నో సంవత్సరాలుగా కోరుతున్నాయి. అయితే, హిందూత్వ శక్తుల ప్రచారంలో, కార్యాచరణలో ఇంతవరకూ ఆర్థిక అంశాలు అతి తక్కువ స్థానాన్ని మాత్రమే ఆక్రమించాయి గనుక జరుగుతున్న మార్పులు తమ వల్లనేనని వారు అనడానికి అవకాశం లేదు. మన్మోహన్ సింగ్ తెస్తున్న నూతన ఆర్థిక విధానాలను సమర్థిస్తున్న భారత వ్యాపార బృందాలు (మొత్తం వర్గం కాకపోవచ్చు) పార్లమెంటులో వామపక్షాల వోట్ల మీద స్వల్పంగా కూడ ఆధారపడని హిందూ మితవాద పక్షం నాయకత్వంలో మరింత కఠినమైన కార్మిక వ్యతిరేక విధానాలను కోరుకోవచ్చు. కాని అందుకు భిన్నంగా, హిందుత్వ కింద ఫాసిస్టు ధోరణులది పైచేయి అయి, తీవ్రమైన ప్రతిఘటన ఎదురైతే, దానికన్న సాంప్రదాయిక మధ్యేవాద పాలనే ఎక్కువ విశ్వసనీయమైనదని, ఆకర్షణీయమైనదని బూర్జువా వర్గాలు అనుకోవచ్చు. అంటే స్పష్టంగా పెట్టుబడిదారీ మనుగడ, లాభాల ప్రయోజనాలకు ఫాసిజం యుద్ధాల మధ్య కాలంలోని ఇటలీ, జర్మనీ లలో లాగ 'అవసరం' లేదు.

**ఆత్మహత్యా సదృశమైన ఊగిసలాట**

ఈ నేపథ్యంలోనే డిసెంబర్ 6 కు ముందూ తర్వాతా కాంగ్రెస్, ప్రత్యేకంగా ప్రధానమంత్రి ప్రదర్శించిన ఊగిసలాట వైఖరి (అంతకన్న ఘోరం) చివరికి సంకుచితమైన పార్టీ రాజకీయ ప్రయోజనాల దృష్ట్యా చూసినా చాల విధ్వంసకరమైనదని, నిజం చెప్పాలంటే ఆత్మహత్యా సదృశమైనదని అనిపిస్తుంది. ఆ వైఖరి నుంచి బైటపడడానికి నిజంగా డిసెంబర్ 6 తర్వాత అవకాశం వచ్చింది. ఇప్పటికే చాలమంది ఉటంకించిన వాజపేయి ఇంటర్వ్యూ చూస్తే, కొన్ని రోజుల పాటు భారతీయ జనతా పార్టీ దెబ్బకాచుకునే స్థితిలో ఉండిందని స్పష్టమవుతుంది. కాని ఒక జర్నలిస్టు మాటల్లో చెప్పాలంటే నరసింహారావు, "విజయం చేతుల్లోనుంచి అపజయాన్ని లాక్కోవడానికి" సిద్ధమయ్యారు. హింసను అణచివేయడానికి కాంగ్రెస్ అక్కడా ఇక్కడా చేపట్టిన చర్యలు, చాల వరకు అమలులోకి రాలేదు, అరకొరగా అమలయ్యాయి. వాటిని బలోపేతం చేయడానికి రాజకీయ ప్రచారం ఏమీ జరగలేదు. అవన్నీ కూడ ముగిసిపోయి, 'హిందూ కార్డ్' విషయంలో భారతీయ జనతా పార్టీతో పోటీ పడడానికి కాంగ్రెస్ ప్రయత్నాలు

ప్రారంభమైనట్టు కనబడుతున్నది. సిద్ధాంతాలను పక్కనపెట్టి, కనీస ప్రాథమిక రాజకీయ ప్రయోజనాల దృష్ట్యా చూసినా, కృతనిశ్చయంతో ఉన్నవారూ, క్రమబద్ధంగా ఉన్నవారూ మాత్రమే ఆ క్రీడలో గెలుస్తారు. ఢిల్లీ నుంచి వెలువడే ప్రధాన దినపత్రికల వైఖరిలో వచ్చిన మార్పు చూస్తే డిసెంబర్ 6 జరిగిన వెంటనే సంపూర్ణంగా ఖండించిన పత్రికలు, ఆ తర్వాత ఇటీవల చాల అస్పష్టమైన తటస్థ వైఖరి తీసుకుంటున్నాయి. ఒక ప్రమాదకరమైన గాలివాటు తత్వానికి ఇది ఉదాహరణ.

తమ ప్రధాన రాజకీయ ప్రత్యర్థి అయిన భారతీయ జనతా పార్టీ నుంచి తమను తాము వేరు చేసి చూపుకునే నాయకులు, ఇంతగా అవకాశవాద వైఖరిలోకి దిగజారడం ప్రస్తుత విషాదానికి కేంద్ర స్థానంలో ఉన్న అంశం. ఈ అంశం విస్తరణ గురించి నేను మాట్లాడదలచాను. అది సుదీర్ఘకాల కృషితో తయారు చేసిన మతోన్మాద పూరిత లోకజ్ఞానం. ఈ లోకజ్ఞానంలోని వేరు వేరు అంశాలను విశ్లేషించడం, విమర్శించడం దాన్ని అర్థవంతంగా ప్రతిఘటించడానికి చాల అవసరం. ఆ లోకజ్ఞానాన్నే, ఎన్నో మినహాయింపులతో అయినప్పటికీ, భారతీయ తరహా ఫాసిజం అని పిలవవచ్చు.

యూరప్‌లో ఫాసిస్టు భావజాలం అప్పటికే విస్తృతంగా ప్రచారంలో ఉన్న మొరటైన జాతీయవాద, వర్ణవివక్షావాద, జర్మనీలోనైతే యూదు వ్యతిరేక, దురభిప్రాయాలను, మరింత ఆధునికమైన తత్వశాస్త్రాల శకలాలతో కలిపి ముద్ద చేసి ప్రచారం చేసింది. యూరపియన్ జ్ఞానోదయ కాలంలో పుట్టిన హేతువాదానికి సంకుచితత్వం, మొరటుదనం ఉన్నాయనీ, వాటికి ప్రతి గానే, ఆ శతాబ్ది ప్రారంభంలో ప్రారంభమైన కొత్త ఆలోచనల్లో ఈ ఫాసిజం భాగమనీ ఒక వాదన ఉంది. ఆ వాదనకు ఇవాళ ప్రాసంగికత లేకపోలేదు. ఎందుకంటే, ప్రస్తుతం కూడ పాశ్చాత్యదేశాలలో ఆ వాదనలే చలామణీలో ఉన్నాయి. అందువల్ల, వాటి కొనసాగింపుగా భారత విద్యావంతులలో కూడ వాటి ప్రభావం ఉంది. పోస్ట్ మాడర్నిజం వాదనలకు ఉన్న అనేక అవకాశాల గురించి ఒక గిరిలాల్ జైన్ లేదా ఒక స్వపన్ దాస్ గుప్తా వంటి సంఘ్ పరివార్ సిద్ధాంతకర్తలకు స్వయంగా పెద్దగా తెలిసి ఉండకపోవచ్చు. కాని ప్రస్తుతం చలామణీ అవుతున్న మేధో సంప్రదాయాలలో కొన్ని ఎటువంటివంటే, అవి హిందుత్వ భావాలకు మేధావుల ప్రతిఘటనను తగ్గించగలవని స్పష్టంగానే కనబడుతున్నది. ఎడ్వర్డ్ సయీద్ రాసిన ఓరియెంటలిజం ప్రభావంతో "వలసవాద ఆలోచనాధోరణి మీద విమర్శ" అనేది స్థానికతావాదపు వేరువేరు రూపాలకు ప్రేరణ ఇచ్చింది. ఆ రూపాలకూ ప్రామాణిక సంఘ్ పరివార్ వాదనలకూ పెద్దగా తేడా చూడలేం. విశిష్టమైన స్థానిక మూలాలు ఉన్నందువల్ల ఇస్లాం కన్న, క్రైస్తవం కన్న (ఆ పరిధిని విస్తరించి విజ్ఞానశాస్త్రం, ప్రజాస్వామ్యం, మార్క్సిజం వంటి ఆధునిక పాశ్చాత్య ఉత్పత్తులను కూడ అందులో చేర్చవచ్చు) హిందుత్వ సమున్నతమైనదని సావర్కర్ చేసిన వాదనకు ఈ వాదనలు దగ్గరవుతాయి. "జనబాహుళ్యానికి నచ్చే", "సబాల్టర్న్" అనే మాటలపట్ల నిర్విమర్శగా మోజుపడితే, ప్రత్యేకించి జ్ఞానోదయ హేతుబద్ధత నిస్సందేహంగా అన్ని సందర్భాలలోనూ వలసవాద ఆధిపత్య–జ్ఞానంతో ముడిపడి ఉన్నదని అనుమానిస్తూ దాన్ని నిరాకరించే దృక్పథాన్ని మిళితం చేస్తే, చివరికి విప్లవ చరిత్రకారులు కూడ విచిత్రమైన కొత్త దారులు తొక్కవలసి వస్తుంది. అందువల్లనే గౌతమ్ భద్రా వంటి చరిత్రకారుడు కూడ 1991 మొదట్లో ఒక బెంగాలీ పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో, మొదటి కర్ సేవా ఉద్యమంలోనూ, చివరికి సాధ్వి రితంబర ఉపన్యాసాలలోనూ ప్రశంసనీయమైన సబాల్టర్న్ అస్తిత్వ వాదనలున్నాయని భావించాడు. సబాల్టర్న్ స్టడీస్ సంపాదక బృందానికే చెందిన మరొక సభ్యుడు దీపేష్ చక్రవర్తి, జ్ఞానోదయానంతర పాశ్చాత్య ప్రపంచపు "యజమాని గళం" ఖండించిన ప్రతి అంశాన్నీ తీసుకుని, దానిలో సృజనాత్మక కోణాలను వెతకడానికి మనం ప్రయత్నించాలని అన్నాడు. ఈ "యజమాని గళం" అనే మాటలో ఆయన దృష్టిలో స్పష్టంగానే ఎంతగా మెకాలే ఉన్నాడో అంతగా మార్క్స్ కూడ ఉన్నాడు. ఈ సందర్భంలో ఫాసిజాన్ని "పాజిటివిజం మీద తిరుగుబాటు" అని జియోవాన్ని జెంటిల్ నిర్వచించాడని గుర్తు తెచ్చుకోవడం చాల ముఖ్యం. అలాగే 1933లో ముస్సోలినీ "పద్దెనిమిదో శతాబ్దపు దార్శనికుల, జ్ఞానసర్వస్వ సంకలనకర్తల ఉద్యమాలనూ", ప్రగతిశీల "సాంకేతిక పరిజ్ఞాన" భావనలనూ ఖండించాడని గుర్తు తెచ్చుకోవడం ముఖ్యం. దురదృష్టకరంగా ఇంకా ప్రాసంగికమైనది 1934 జూలైలో ఇటాలియన్ నియంత ఇచ్చిన మరొక ప్రసంగం. అందులో ఆయన "జాతికి ప్రమాదంగా మారిన మేధో విశ్లేషణల, ఆ పనికిమాలిన మేధావులకూ అంతు చూడండి" అని పిలుపు ఇచ్చాడు. ఆ తర్వాత సంవత్సరం న్యూరెంబర్గ్ లో జరిగిన నాజీ కాంగ్రెస్ లో హిట్లర్ కూడ అదేవిధంగా "కోడిగుడ్డుకు వెంట్రుకలు పీకే మేధావిత్వాన్ని" వదిలిపెట్టి, "హృదయాన్ని", "విశ్వాసాన్ని", "అంతరాత్మ ప్రబోధాన్ని" వినమని జర్మన్ ప్రజలకు ఉద్బోధించాడు.

**'శత్రువు' దిష్టిబొమ్మ**

అయితే ఇదంతా అనుబంధ అంశం మాత్రమే. చాల కీలకమైన అంశం, ఒక ప్రజాబాహుళ్య దృగ్గోచరాంశంగా హిందుత్వకు (ఆ మాటకొస్తే ఫాసిజంకు కూడ) ఉండేదేమంటే ఒక శత్రువు దిష్టిబొమ్మను తయారుచేయడం. గత కాలపు దురభిప్రాయాలలోంచి అక్కడొకటీ ఇక్కడొకటీ ఏరి, వాటికి కొత్త దురభిప్రాయాలను కలిపి అన్నిటినీ ప్రాచీన అంశాలుగా ముస్తాబు చేసి, ఆ మిశ్రమాన్ని అత్యాధునిక ప్రచారసాధనాల పద్ధతులతో ఒక శక్తిమంతమైన, విస్తరించగలిగిన శత్రువు దిష్టిబొమ్మగా ప్రసారం చేస్తారు. గత ఫాసిజం అలా యూదు దిష్టి బొమ్మను తయారు చేసింది, సమకాలీన శ్వేతజాతి వర్ణవివక్షావాదం నల్లవారి (సాధారణంగా చెప్పాలంటే ఏదో ఒక కారణంతో తమ కంటె తక్కువవారుగా చూడబడే కాందిశీకులందరి) దిష్టిబొమ్మను తయారు చేసింది. వాటికి దాదాపు సమానమైన ముస్లిం దిష్టిబొమ్మ ఇక్కడ తయారయింది. యూదులకు ఎక్కువ అవకాశాలు దొరికాయని నాజీలు ప్రచారం చేసినట్టుగానే భారతదేశంలో కూడ ముస్లింలకు రావలసినదానికన్న ఎక్కువ దక్కిందని ప్రచారం జరుగుతున్నది. నిజానికి జర్మనీ విషయంలో కన్న ఎక్కువగా ఈ ఆరోపణ ఇక్కడ హాస్యాస్పదమైనది. జర్మనీలో యూదులకు నిజంగానే మేధోరంగంలో, వృత్తులలో, వ్యాపార వర్గాలలో ప్రాముఖ్యత ఉండేది. అందుకు భిన్నంగా, స్వాతంత్ర్యానంతర భారతదేశంలో, ఏ రకంగా చూసినా ఉన్నత స్థాయిలలో ముస్లింలు వారి జనాభాకు తగిన నిష్పత్తి కన్న చాల తక్కువగా ఉన్నారు. ఆ తర్వాత, ముస్లింలకు అందుతున్నాయని ఆరోపిస్తున్న సౌకర్యాలు 'కుహనా లౌకికవాదులు' ముస్లింల పట్ల అనుసరిస్తున్న 'బుజ్జగింపు' విధానాల వల్లనే తయారవుతున్నాయని హిందుత్వ వాదులు అంటారు. ఈ మాట అనడంతోనే, మతోన్మాదులు గురి చూస్తున్నవారి పరిధి విశాలం అయిపోతుంది. ఆ విశాలమైన పరిధిలో చేరే అసంఖ్యాకులకు ఒక ఉదాహరణ ఇవ్వాలంటే ములాయం సింగ్ యాదవ్ కు 'ముల్లా' అనే బిరుదు చేరుతుంది. ఈ బుజ్జగింపు

విధానాలకు నిలువ ఉదాహరణలు కొన్ని చూపుతుంటారు. ఆ ఉదాహరణల్లో ఇటీవల బాగా వినబడుతున్నది కశ్మీర్ లో ఆలయాల విధ్వంసం జరిగిందనీ, దాన్ని 'కుహనా లౌకికవాదులు' ఎప్పుడూ ఖండించలేదనీ ఆరోపణ. అలాగే ముస్లిం పర్సనల్ లా బహుభార్యాత్వాన్ని అనుమతిస్తుందని మరొక ఆరోపణ.

పవిత్ర స్థలాల విధ్వంసం ముస్లింలు చేసినా, హిందువులు చేసినా ఖండించవలసిందే. కాని డిసెంబర్ 6 న ఉద్దేశపూర్వకంగా జరిగిన పవిత్రస్థల విధ్వంసాన్ని సమర్థించడానికీ, ఆమోదించడానికీ ఈ వాదన రావడమే విచిత్రం. అదే సమయంలో డిసెంబర్ 6 తర్వాత జరిగిన మత కల్లోలాలలో భాగల్ పూర్ వంటి అనేక చోట్ల ముస్లిం మత ప్రార్థనా స్థలాలను కూల్చివేయడం గురించి ప్రస్తావననైనా రాదు. బాబ్రీ మసీదు విధ్వంసం తర్వాత కశ్మీర్ ఆలయాల విధ్వంసం ప్రస్తావన చాల సంభాషణల్లో ప్రముఖంగా వినబడుతున్నది. గుసగుసల రూపంలో ప్రచారం అవుతున్నదనడానికి ఇది సూచన. బహుశా అపరాధ భావనను అణచివేసుకోవడానికి ఇది ఒక వ్యక్తీకరణ కావచ్చు. ముస్లింలు గతకాలంలో గాని, ప్రస్తుతం గాని తాము చేసిన దురాక్రమణలకు పశ్చాత్తాపాన్ని, పరిహారాన్ని ప్రకటించాలని పదే పదే వినబడుతున్న వాదన, బొంబాయిలోని తాజా పరిణామాల నేపథ్యంలో ప్రత్యేక కోణాన్ని సంతరించుకుంది. ధ్వంసమైన దేవాలయాలను పునర్నిర్మిస్తామని ముందుకు వచ్చిన ముస్లింల సూచనను శివసేన తిరస్కరించింది. ధారవిలో వాస్తవంగా అలా పునర్నిర్మాణం చేస్తున్న ముస్లింల బృందంపై శివసేన కార్యకర్తలు దాడిచేసి కత్తులతో పొడిచారని పయనీర్ పత్రిక జనవరి 9న రాసింది.

ఇక ముస్లిం పర్సనల్‌లా విషయంలో, రాజీవ్ గాంధీ చేసిన అక్రమాలను సంఘ పరివార్ సంపూర్ణంగా వాడుకుంటున్నది. అయోధ్య తాళాలు తీసిన చర్యకు సరిసమానమైన మరొక చర్యగా రాజీవ్ గాంధీ ముస్లిం స్త్రీల చట్టం తీసుకువచ్చాడు. అలా బుజ్జగింపులు పొందినది ముస్లిం మత ఛాందస శక్తులే. వారి గురించి ప్రస్తావిస్తారు గాని అదే సమయంలో హిందూ మతోన్మాదం పొందుతున్న బుజ్జగింపుల గురించి మాట మాత్రం ఎత్తరు. నిజానికి ముస్లిం మత ఛాందసత్వం పొందుతున్న బుజ్జగింపుల వల్ల నిజంగా, ప్రత్యక్షంగా బాధితులుగా మారుతున్నది ముస్లిం స్త్రీలు. అయితే ఈ మొత్తం వ్యవహారంలో ప్రధానంగా గుర్తించవలసినదేమంటే, హిందుత్వ భావజాలంలో ఉన్న, వర్ణవివక్షా వాదంతో పోల్చదగిన ముందస్తు దురభిప్రాయాలు. ముస్లింలలో బహుభార్యాత్వానికి ఉన్న చట్టబద్ధమైన హక్కును సాధారణంగా ఒక దురభిప్రాయంతో జత చేస్తారు. అదేమంటే, ఆ కారణం వల్ల ముస్లింలు త్వరితగతిన ఎక్కువమందికి జన్మనిస్తారని. ఢిల్లీ విశ్వహిందూపరిషత్ నాయకుడు, ప్రస్తుత భారతీయ జనతా పార్టీ శాసనసభ్యుడు బి ఎల్ శర్మ 1991 ఏప్రిల్ లో మాకు ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో ఈ అభిప్రాయాన్ని "హమ్ పాంచ్ హమారే పచ్చీస్" అనే మాటలో వ్యక్తీకరించాడు. కాని, భారత ప్రభుత్వం 1975లో ప్రకటించిన 'భారతదేశంలో స్త్రీల ప్రతిపత్తి నివేదిక' బహుభార్యాత్వం వాస్తవంగా ముస్లింలకన్న హిందువులలోనే ఎక్కువ అని నిర్ధారించింది. ఆ నివేదిక ప్రకారం ముస్లింలలో బహుభార్యాత్వం 4.31 శాతం ఉండగా, హిందువులలో బహుభార్యాత్వం 5.06 శాతం ఉంది. హిందుత్వ వాదుల ప్రకారం ముస్లింలు పునరుత్పత్తి, మరణం వంటి మౌలిక జీవశాస్త్రపరమైన ప్రక్రియలలో కూడ ప్రమాదకరమైన వాళ్లు. ఢిల్లీలో నిజాముద్దీన్ ప్రాంతంలో మత కల్లోలాల సందర్భంలో 1991లో మేం నిజ నిర్ధారణ చేస్తున్నప్పుడు ఈ ఆరోపణ విన్నాం. దహనం ద్వారా తనను తాను రద్దు చేసుకునే హిందువుల లాగ కాక, ప్రతి ఒక్క ముస్లిమూ చనిపోయినప్పుడు ఖననం వల్ల కొంత భూమిని ఆక్రమిస్తాడట. ఇటువంటి వర్ణవివక్షావాద వైఖరులు ఎంత సొగసుగా ముస్తాబై వస్తాయో చూడాలంటే ఇటీవల చలామణీలోకి వచ్చిన 'బాబర్ కీ ఔలాదీ' అనే మాటను చూడాలి. నిందించడానికి బాబర్ కు వంశ పారంపర్య వారసుడు అనే ఆరోపణ చాలు, ఆ వ్యక్తి నిర్దిష్టంగా ఏదైనా తప్పు పని చేయవలసిన అవసరమేమీ లేదు. జీసస్ క్రీస్తును శిలువ వేసినప్పుడు యూదుల ప్రవర్తనకు వారి వంశ పారంపర్య వారసులందరూ ఖండించదగినవారే అని ఒకప్పుడు మతోన్మాద క్రైస్తవ బృందాలు భావించేవి. ఇది సరిగ్గా అలాగే ఉంది.

ఇది అత్యంత మొరటు రూపపు హిందూత్వ భావజాలం. మతోన్మాద హింసను ప్రత్యక్షంగా సమర్థించే భావజాలం ఇది. కాని కాస్త 'మృదువు'గా, లేదా మరింత మోసపూరిత స్థాయిలో ఉన్న వైఖరులను కూడ పరిశీలనలోకి తీసుకోవాలి. ఎందుకంటే అవి కూడ హిందూ రాష్ట్ర అనే భావన వెనుక ఉన్న ఫాసిస్టు ఆంతర్యాలను అంతే స్పష్టంగా సూచిస్తాయి. ఫాసిజం చాల తరచుగా, తాను ఏ సమాజాన్ని జయించదలచుకున్నదో ఆ సమాజం ప్రశంసనీయమైనవిగా, ప్రగతిశీలమైనవిగా భావించే ఆదర్శాల నుంచి అంశాలను, లేదా కనీసం పదాలను తన సొంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. అందువల్లనే వర్సైయిల్స్ సంధి అనంతర జర్మనీలో నాజీలు తమను తాము జాతీయవాదులుగా మాత్రమే కాదు, వెయిమార్ రిపబ్లిక్ లో బలమైన కార్మికవర్గ రాజకీయ ఉద్యమం ఉన్నందువల్ల, తమను తాము 'సోషలిస్టు' అనీ, 'కార్మికుల' ప్రతినిధులమనీ కూడ చెప్పుకున్నారు. సంఘ్ పరివార్ కూడ అదే విధంగా, తనను తాను నిజమైన, ఏకైక 'జాతీయ' శక్తిగా చెప్పుకుంటుంది. అందుకు ఒక 'ప్రజాస్వామిక' వాదనను కూడ తెస్తుంది. దేశజనాభాలో జనగణన ప్రకారం 85 శాతం హిందువులే గనుక, అత్యధిక సంఖ్యాకులు గనుక భారతదేశంలో ఎప్పుడైనా హిందూ ప్రయోజనాలదే పైచేయి కావాలనీ, ఏదో ఒక సమయంలో ఈ దేశాన్ని హిందూ రాష్ట్రంగా కూడ ప్రకటించక తప్పదనీ వాదిస్తుంది. కాని ప్రజాస్వామ్యం అంటే తార్కికంగా అధిక సంఖ్యాకుల పాలన అనే అర్థం మాత్రమే కాక మరొక రెండు లక్షణాలు ఉండాలి. అల్పసంఖ్యాక ప్రజల జీవన విధానాల, అభిప్రాయాల హక్కులకు రక్షణ ఉండాలి. దానితోపాటు, అంతకన్న ముఖ్యంగా, ఇవాళ రాజకీయంగా అల్పసంఖ్యాకులుగా ఉన్నవారు భవిష్యత్తులో ఎన్నికలలో అత్యధిక స్థానాలను గెలుచుకునే, శాంతి యుతంగా ప్రభుత్వాన్ని మార్చే చట్టబద్ధ అవకాశం ఉండాలి. అలా కాకపోతే హిట్లర్, ముస్సోలినీ (లేదా స్టాలిన్) ల కాలపు ఏక పార్టీ పాలనలకు ప్రజాస్వామ్యం అనే ప్రతిపత్తి ఇవ్వగూడదనడం కష్టమవుతుంది. ఎందుకంటే ఆ అన్ని పాలనలూ కూడ ఎప్పుడో ఒకసారి జనాభిప్రాయ సేకరణ వంటి ఏకైక అంశం మీద ఎన్నికలు జరిపించాయి. ఎన్నికల అక్రమాలకు పాల్పడకుండానే ఆధిక్యతను సాధించాయి. మరోమాటల్లో చెప్పాలంటే, ప్రజాస్వామిక సిద్ధాంతం ఎవరో ఒకరికి శాశ్వత ఆధిక్యత ఉంటుందనే అభిప్రాయంతో సంపూర్ణంగా విభేదిస్తుంది. కాని సంఘ్ పరివార్ నిర్వచనం ప్రకారం ప్రజాస్వామ్యం అంటే హిందువులందరి పక్షాన గళం ఎత్తే ఏకైక పార్టీకి అటువంటి ప్రతిపత్తి ఉండాలనేదే. ఈ వాదనలోనే అంతర్గర్భితంగా ఉన్న మరొక అంశం, ఫాసిజంతో సరిగ్గా సరిపోలుతుంది. అదేమంటే, ఆర్ఎస్ఎస్ – భాజపా

– విఎచ్‌పి కూటమి నాయకత్వాన్ని అంగీకరించేవారు మాత్రమే నిజమైన హిందువులు అని వారు నిర్వచిస్తారు. ఇందుకు భిన్నమైన అభిప్రాయాన్ని ఎవరు ప్రకటించినా వారు కుహనా లౌకికవాదులూ, బుజ్జగింపువాదులూ అని ముద్రవేయించుకోవలసి వస్తుంది. సరిగ్గా హిట్లర్, నాజీలు కూడ "శుద్ధమైన" జర్మన్లందరి తరఫున మాట్లాడే హక్కు కేవలం తమ ఒక్కరికే ఉందని అనుకున్నారు, అన్నారు. జాతిపరంగా శుద్ధమైన జర్మన్లు ఎవరో నిర్ణయించే అధికారం కూడ తమకు మాత్రమే ఉందనుకున్నారు.

అది 'కఠినమైన'దైనా, 'మెత్తని'దైనా హిందుత్వ విజయం అంటే అర్థం ఏమిటో ముస్లింలకు, ఇతర మైనారిటీ మతస్తులకు ఇప్పటికే తగినంతగా తెలిసిపోయింది. ఎక్కువలో ఎక్కువ అది రెండో స్థాయి పౌరసత్వం. దాదాపు జాతి హననకాండతో సమానమైన కల్లోలాల గురించి నిరంతర భయంలో ఉంచడం, తద్వారా ఆ సమూహాలలో అత్యంత అభివృద్ధి నిరోధకమైన, ఛాందసవాదపు బృందాలు బలపడడానికి అవకాశం కలిగించడం ఆ విజయం. బాబ్రీ మసీదు విధ్వంసం, ప్రొఫెసర్ ముషీరుల్ హసన్ మీద పాశవికమైన దాడి ఒకేసారి జరగడం యాదృచ్ఛికమని అనిపించదు. ఈ రెండు సందర్భాలలోనూ పోలీసులు కనబడకుండా పోవడమో, క్రియాశూన్యంగా ఉండడమో ఆసక్తికరం. డిసెంబర్ 6 పరిణామాలు పాకిస్తాన్, బంగ్లాదేశ్ లలో ముస్లిం మత ఛాందస శక్తులు బలపడడానికి దారితీశాయి. భారత దేశంలో ముస్లిం జనాభా తక్కువేమీ కాదని గుర్తుంచుకోవాలి. ప్రపంచంలో ఇండోనేషియా తర్వాత అతి ఎక్కువ మంది ముస్లింలు, పన్నెండు కోట్ల మంది, భారతదేశంలోనే ఉన్నారు. ప్రపంచంలో ఏ ఇతర ప్రాంతం కన్న ఎక్కువగా ఇక్కడ లౌకికవాదం, ప్రజాస్వామ్యం, జాతీయ ఐక్యతను పరిరక్షించవలసిన అవసరం ఎంత పరస్పర ఆధారితాలో భారత ప్రజల సంఖ్యా, వైవిధ్యమూ చూపుతాయి. ఈ దేశంలో కొందరిని శాశ్వతంగా, సంపూర్ణంగా పరాయీకరించాలని భారతీయ జనతాపార్టీ చేస్తున్న ప్రయత్నాలు చివరికి ఈ దేశాన్ని ఒక లెబనాన్ లాగ, ఒక యుగోస్లావియా లాగ మారుస్తాయి. కాకపోతే ఇక్కడ హింసా విద్వేషాలు అక్కడికన్న ఎన్నో రెట్లు ఎక్కువగా జరిగే అవకాశం ఉంది. మిగిలినవారందరి కన్న తానే ఎక్కువ 'జాతీయ'మైనదాన్నని సంఘ్ పరివార్ చెప్పుకునే గొప్పలు భయానక పర్యవసానాలకు దారితీస్తాయి.

**ఉమ్మడి ప్రతిస్పందనకు అవకాశాలు**

ఇవాళ్టి హిందూత్వకూ యూరపియన్ ఫాసిజానికీ, ప్రత్యేకించి నాజీ ఫాసిజానికీ, ప్రధానమైన తేడా ఇప్పటికే సువ్యవస్థితమై ఉన్న మత సంప్రదాయాలతో వాటికి ఉన్న భిన్నమైన సంబంధంలో ఉంది. నాజీలు అస్తిత్వం అనేదాన్ని నరజాతి పునాది మీద నిర్మించదలిచారు, మతం పునాది మీద కాదు. ఒక కొత్త నాగరికతను నిర్మించమని యువతకు పిలుపు ఇచ్చారు. అది కొన్ని సందర్భాలలో బహిరంగంగా క్రైస్తవ వ్యతిరేకమైనదని కూడ అనిపిస్తుంది. ఇందుకు భిన్నంగా, సంఘ్ పరివార్ స్వాభావికంగానే హిందూ సంప్రదాయాలకు సంపూర్ణంగా కట్టుబడి ఉండడాన్నీ, గౌరవించడాన్నీ బోధిస్తుంది. అదే సమయంలో ఆ సంప్రదాయాలను ప్రాథమికంగానే మార్చి ప్రదర్శిస్తుంది. దానికదే అపారమైన బలానికి వనరు అని కొత్తగా చెప్పనక్కరలేదు. అయితే, బలమైన ప్రతివ్యూహాలు ఉంటే దాన్నే బలహీనతగా మార్చే అవకాశం కూడ ఉంది. ఏమంటే హిందూత్వ వాస్తవికంగా హిందూ విశ్వాసాలనూ ఆచారాలనూ కనీవినీ ఎరగని రీతిలో పెద్దఎత్తున మార్చివేసి, ఏకీకృతం చేస్తున్నది. బాబ్రీ మసీదు సమీపంలో ఉన్న ముస్లింల ఇళ్లన్నిటినీ కూడ కూల్చివేయమని ఒక విశ్వ హిందూ పరిషత్ నాయకుడు ఇచ్చిన ప్రకటన ఈ పరిణామానికి సూచిక. ఆ ప్రాంతాన్ని వాటికన్ లాగ మార్చడానికి అలా ముస్లింల ఇళ్లు కూల్చివేయడం అవసరమని ఆయన అన్నాడు. కాని విశ్వ హిందూ పరిషత్ రాముడికీ అయోధ్యకూ ఇస్తున్న ఏకైక సమున్నత భగవంతుడు, ఏకైక యాత్రా స్థలం అనే అంశాలు సువిశాలమైన, అత్యంత వైవిధ్య భరితమైన హిందూ ప్రపంచంలో ఎప్పుడూ లేవు. పైగా విశ్వ హిందూ పరిషత్ ఇస్తున్న పిలుపులో అనేక మతాల, శాఖల, కులాల, లింగాల, వర్గాల ఆచారాలను కలిపి ముద్ద చేయాలనే ప్రయత్నం ఉంది. అంతకన్న మౌలికంగా, కోట్లాది మంది హిందువులు ఇంతకాలమూ నిజాయితీగా నమ్ముతున్న దాన్ని మార్చివేయాలనే ప్రయత్నం ఉంది. తమ మతం అత్యున్నత స్థాయిలో సహనశీలమైనదనీ, అది అన్ని భావాలనూ ఆదరిస్తుందనీ హిందువులు ఇంతకాలంగా నమ్ముతున్నారు. ఆ నమ్మకంలో చారిత్రక సత్యం ఎంత ఉందనేదాన్ని ప్రస్తుతానికి పక్కకు పెడదాం. కాని ఆ నమ్మకాన్ని మార్చి, ఆ మతాన్ని విధ్వంసానికీ, హత్యలకూ, రాజకీయాధికార దురాక్రమణకూ ఉపయోగపడే భయోత్పాత సాధనంగా మారుస్తున్నారు.

నిజానికి మన దేశంలో సమాదరణ సంప్రదాయాలు చాల లోతైనవి. వాటికవిగానే అత్యంత వైవిధ్యపూరితమైనవి. అవి ఎంత విశాలమైన ఆవరణలోని అన్ని వాదాలనూ కలుపుకున్నవంటే, వాటిలో చాల విప్లవకరంగా విగ్రహారాధనను నిరసించిన భక్తి – సూఫీ సంత్ ల దగ్గర, పీర్ ల దగ్గర ప్రారంభించి, మితవాది అయినప్పటికీ చాల ఔదార్యంతో ఇతర భావాలను సమాదరించిన రామకృష్ణ దాకా ఎన్నెన్నో ప్రవంతులున్నాయి. భక్తి–సూఫీ సంప్రదాయంలో ఒక బౌల్ గీతంలోని మాటల్లో చెప్పాలంటే తమ మార్గానికి ఆటంకాలు మందిరం, మసీదు, పురోహితుడు, ముల్లా అని చెప్పారు. ఇక రామకృష్ణ దృష్టిలో హిందువుకూ, ముస్లింకూ, క్రైస్తవుడికీ మధ్య తేడా జలం, పానీ, నీరు ల మధ్య ఉన్నంత స్వల్పమైనదే. ఇది చెపుతున్నప్పుడు మన ఆలోచనలు అనివార్యంగా ఒక గతంలోకి, నలభై ఐదు సంవత్సరాలం కింద ఇటువంటి జనవరిలోకే వెళ్లక తప్పదు. అప్పుడొక వ్యక్తి చనిపోయాడు. ఆయన హిందూ నిష్ఠాపరుడు. సంఘ పరివార్ సంస్కృతిలో పెరిగిన ఒక యువకుడు ఆయనను హత్య చేసున్నప్పుడు ఆయన పలికిన చివరి మాట రామ్ అని. ఆ మహాత్మా గాంధీ పూజించిన రాముడు అదే సమయంలో ఈశ్వరుడు కూడ, అల్లా కూడ. ఆ రాముడికీ, ఇవాళ ఏ రాముడి పేరు మీద బాబ్రీ మసీదు కూల్చబడిందో ఆ రాముడికీ మధ్య పూడ్చరాని అగాథం ఉంది.

**లౌకికవాదపు భిన్న అర్థాలు**

లౌకికవాదం అనే మాటకు ఎన్నో అర్థాలు ఉన్నాయనీ, ఉండే అవకాశం ఉందనీ గుర్తించడం, అత్యంత నిష్ఠాపరుడైన మతానుయాయి నుంచి నాస్తికుడైన స్వేచ్ఛావాది వరకూ విస్తరించే విశాలమైన, వైవిధ్యభరితమైన ఆ అర్థాలను కలిపి, మత విద్వేషాన్నీ, మత రాజ్యాన్నీ సంపూర్ణంగా తిరస్కరించే ఒక కనీస ఉమ్మడి వేదిక తయారు చేయవచ్చుననీ గుర్తించడం ఇవాళ అత్యవసరం. దీని అర్థం మతేతర లౌకికవాదులు తాము 'ప్రధానస్రవంతి' నుంచి 'వేరయిపోయామని' అనుకోవడమో, తామే విశ్వ హిందూ పరిషత్ కన్న, ముస్లిం ఛాందసవాదుల కన్న 'నిజమైన' హిందువులుగా, ముస్లింలుగా

మారిపోయామనో గుండెలు బాదుకోవడం కాదు. (హిందుత్వ పేరుతో ముస్లిం స్త్రీల మీద సామూహిక అత్యాచారాలు చేస్తూ, ఆ దురాగతాలను వీడియోలో చిత్రించిన సూరత్ యువకుల కన్న ఈ లౌకిక వాదులు భారతీయ సంస్కృతి నుంచీ, మౌలిక మానవ విలువల నుంచీ తక్కువగా దూరమయ్యారనే అనాలి. ఆ వీడియో చిత్రాలను బొంబాయిలోని సంపన్న గృహాలలో సాయంవేళ విందులలో భాగంగా ఆసక్తిగా చూశారని కూడ నేను విన్నాను). అందుకు భిన్నంగా, ఎంత లోతైన భిన్నాభిప్రాయాలున్నప్పటికీ మౌలిక మానవ విలువల పరిరక్షణలో ఉమ్మడి కార్యాచరణకు దిగడానికి అవి అడ్డం కావని అవగాహన పెంపొందించుకోవాలి. ఫాసిజానికి వ్యతిరేకంగా ఐక్య సంఘటనకు పిలుపునిస్తూ ట్రాట్స్కీ అన్నట్టు, “వేరువేరుగా కవాతు చేసినా, కలిసి దెబ్బతీయడం” సాధ్యమే అనే అవగాహన కావాలి.

ఇటువంటి ఐక్యత ఏర్పడుతుందేమోననే భయం హిందూత్వ శక్తులకు ఎంతగా ఉందో చూపడానికి సూచనే వారు నిరంతరాయంగా లౌకిక వాదాన్ని, ఆ మాటకొస్తే అన్ని రకాల మతోన్మాద వ్యతిరేక వైఖరులనూ హిందూ వ్యతిరేకమైనవిగా చిత్రిస్తూ ఉండడం. అదే సమయంలో వారు లౌకికవాదాన్ని కేవలం నెహ్రూ తరహా రాజ్యపు విధానాలలో భాగంగా చూపి, తద్వారా రాజ్యం అనేకసార్లు పాల్పడిన అవకాశవాదాల, అక్రమాల, పెత్తందారీతనపు కేంద్రీకరణల, అణచివేతల విధానాలన్నిటి అపరాధాల బరువునూ మనమీద మోపుతారు. ఇక్కడ ప్రస్తుతం చలామణీలో ఉన్న మేధోధోరణులు ఇటువంటి విమర్శలకు గౌరవనీయత కల్పించాయి. ఏమంటే, లౌకికవాదమనేది చాల విమర్శకు గురైన జ్ఞానోదయ హేతుబద్ధత, సంశయవాదాల సృష్టి అన్నట్టు, దాన్ని వలసవాద కొనసాగింపుగా భారతదేశంలోకి తెచ్చినట్టు, భారతదేశంలో పాశ్చాత్య పద్ధతిలో తయారైన నిర్బంధ జాతిరాజ్యంలో అది భాగమైనట్టు ఈ మేధో ధోరణి వాదిస్తున్నది. వాస్తవంగా చెప్పాలంటే, చివరికి యూరప్ లో కూడ లౌకికవాదపు మూలాలు పునరుద్ధరణ కాలం రెచ్చగొట్టిన మత యుద్ధాల కాలం నుంచి (మనకు తెలిసిన పద్ధతిలో ‘మత కల్లోలాలు’ అనవచ్చు) కనీసం రెండు వందల ఏళ్ల నుంచి ఉన్నాయి. చర్చ్ నూ రాజ్యాన్నీ వేరు చేసే ప్రాతిపదికపై మత సహనం పాటించాలని మొట్టమొదట వాదించినవాళ్లు హేతువాదులూ, స్వేచ్ఛాచింతకులూ కారు. తమదైన క్రైస్తవాన్ని తీవ్రమైన అభినివేశంతో ఆచరించిన అనాబాప్టిస్టులు. వాళ్లు బలవంతం గాని, వేధింపు గాని, ఎటువంటి నిర్బంధపూరితమైన రాజ్య మతం గాని మౌలిక విశ్వాసానికి భిన్నమైనవని భావించారు.

అనేక మత సంప్రదాయాలున్న ఇతర దేశాలలాగనే భారతదేశంలో కూడ సహజీవన అవసరం, అందువల్ల సహజీవన పునాది అన్ని మతాల మహాపురుషులలో అత్యధికులు ప్రవచించిన ఆదర్శాల కన్న విశాలంగా, లోతుగా ఉండవలసి ఉంటుంది. ఆయాకాలాలలో అనేక మంది రాజులు అనుసరించిన విధానాల కన్న విశాలంగా ఉండవలసి ఉంటుంది. అటువంటి రాజులలో తప్పనిసరిగా గుర్తుంచుకోవలసిన ఉత్తమరాజు అక్బర్. వారు తమ నిత్యజీవిత మనుగడ అవసరాలనుంచి ఆ ఆదర్శాలు తయారు చేశారు. అవి కూడ కొన్ని సందర్భాలలో ఘర్షణకు దారితీసి ఉండవచ్చు. కాని పరస్పరాధారితమైన మనుగడను అవి పునరుద్ధరిస్తాయి. కాకపోతే ఆ మనుగడను సంఘటిత మతశక్తులు అనుమతించవలసి ఉంటుంది. ఇటీవల ఆ అనుమతి నానాటికీ తగ్గిపోతున్నది. (డిసెంబర్ 6 కల్లోలాల తర్వాత కూడ సాధారణ ప్రజలు ఆ సహజీవన సంప్రదాయాన్ని, భిన్నమతాల పరస్పర ఆధార సంస్కృతిని కాపాడడానికి ఏ ప్రయత్నాలు చేశారో ఫ్రంట్ లైన్ పత్రిక 1993 జనవరి 15 సంచిక ఎన్నో కదిలించే ఉదాహరణలు రాసింది). మతోన్మాదం నిత్యజీవిత మనుగడను ధ్వంసం చేయడం మాత్రమే కాదు, అదే సమయంలో దోపిడీనీ, కొరతనూ తొలగించి మనుగడను సౌకర్యవంతం చేసే ప్రయత్నాలను కూడ అడ్డుకుంటుంది, పక్కదారి పట్టిస్తుంది. ఆ పనిని అది రెండు ప్రాథమిక మార్గాలలో చేస్తుంది. మొదటిది, అది శ్రమజీవుల, అన్ని అణగారిన వర్గాల ఐక్యతను, పోరాటాన్ని దెబ్బతీస్తుంది. రెండవది, అది తానే లేవనెత్తిన సమూహాల విభజనరేఖల మధ్యనే నిర్దాక్షిణ్యమైన ఏకీకరణ ధోరణులను పెంచి పోషిస్తుంది. ఆ ఏకీకరణ తప్పనిసరిగా అధికారంలో ఉన్న బృందాల, ప్రయోజనాల సేవ చేస్తుంది. హిందూ మతోన్మాదపు నేపథ్యంలో అధికారంలో ఉన్న శక్తులు అంటే తప్పనిసరిగా అగ్రవర్ణాల ఉన్నత వర్గాలే. మండల్ సిఫారసులలో వాగ్దానం చేసిన సామాజిక న్యాయం దిశగా అతి పరిమితమైన చర్యలు చేపట్టడాన్ని కూడ అడుగడుగునా వ్యతిరేకిస్తున్న హిందుత్వ దాడి లోని ప్రతి చర్యనూ గుర్తించడం అవసరం. హిందుత్వ సామాజిక ఆర్థిక కార్యక్రమాలూ చర్యలూ నిర్దిష్టంగా ఏమిటో ఇప్పటికి గుర్తించగదిన మౌనమే కొనసాగుతున్నది. రామ్ కు సమానమైన రోటీ అనే పదం ఎలా ఉంటుందో ఇంతవరకూ వారు పెదవి విప్పి చెప్పలేదు. అసలు ఆ రోటీ నినాదమే మరుగున పడ్డట్టున్నది. వారు మౌనం వహిస్తున్న ఈ స్థలంలోకి లౌకిక వాదులు అర్థవంతంగా ప్రవేశించవచ్చు. అయితే, భారత వామపక్ష సంప్రదాయాలలో పాతుకుపోయిన ‘ఆర్థిక’ ‘రాజకీయ’, ‘సాంస్కృతిక’, ‘భావజాల’ అనే విభజనలను చాల జాగ్రత్తగా వదులుకోవలసి ఉంటుంది. మతోన్మాద వ్యతిరేక ప్రచారాలు కేవలం సదస్సులకు, మధ్యతరగతి సాంస్కృతిక ప్రదర్శనలకు మాత్రమే పరిమితమైతే ప్రయోజనం లేదు. ఆ పనులు చాల ముఖ్యమైనవే కాని దైనందిన ఆర్థిక పోరాటాలలో కూడ మతం, మతోన్మాదం, భావజాలం వంటి సమస్యలను పక్కన పెట్టడానికి వీలులేదు. భౌతిక సమస్యలు, ‘వాస్తవిక’ వర్గ అసిత్వాలు వాటంతటవే తమ స్థానాన్ని పదిలం చేసుకుంటాయని అమాయంగా ఆశించడానికి వీలు లేదు.

జాతీయోన్మాద శక్తులు దాదాపు ప్రతి చోటా తమ కోరలు చాస్తున్న ప్రస్తుత కాలంలో యూరప్ లోని ఫాసిస్టు యుగం గురించి తలపోత నిరాశాజనకంగా, విచారకరంగా అనిపించవచ్చు. కాని 1930ల, 40ల తొలిరోజుల జ్ఞాపకాలంటే కేవలం నాజీ మూకల, యూదు హననకాండల, నిర్బంధ శిబిరాల జ్ఞాపకాలు మాత్రమే కాదు. లేదా వాటి పర్యవసానంగా ప్రపంచ ప్రథమ సోషలిస్టు ప్రయోగం ధ్వంసమైపోవడానికి దారితీసిన పెడధోరణుల జ్ఞాపకాలు మాత్రమే కాదు. అదే సమయంలో ప్రజల ఐక్యత సాధించిన, కొన్ని సందర్భాలలో విజయం సాధించిన ఫాసిస్టు వ్యతిరేక పోరాట జ్ఞాపకాలున్నాయి. విశాల ప్రజా ఐక్య సంఘటనలున్నాయి. గత సంవత్సరం టీవీ మీద కనబడినదానికన్న చాల భిన్నమైన బార్సెలోనా ఉంది. స్టాలినిస్టు బీభత్సం మాత్రమే కాదు, స్టాలిన్ గ్రాడ్ చూపిన వీరోచిత ప్రతిఘటన ఉంది. ఆశకు పునరుజ్జీవనం ఇవ్వడానికి, రిపబ్లికన్ స్పెయిన్ పరిరక్షకులు ఇచ్చిన నినాదాన్ని మళ్లీ ఒకసారి గుర్తు తెచ్చుకోవలసి ఉంది. ‘ఫాసిజం ఎన్నటికీ విజయం సాధించదు’ అనేదే ఆ నినాదం.

*(బాబ్రీ మసీదు విధ్వంసం - 1992 డిసెంబర్ 6 - తర్వాత రాసిన ఈ వ్యాసం మొదట ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ 1993 జనవరి 30 సంచికలో ప్రచురితమైంది. రచయిత సుప్రసిద్ధ చరిత్రకారుడు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా రిటైరయ్యారు.)* వీ

# ఫాసిజం - అంతర్జాతీయ ప్రాధాన్యత

***అబద్ధ ప్రచారాల పునాది మీద సాగుతున్న ఆధునిక ఫాసిజం, సరిగ్గా పాత ఫాసిజం లాగనే ఎటువంటి దుర్మార్గాలు సాగిస్తున్నదో వివరిస్తున్నారు జాన్ పిల్జర్***

ఇటీవల జరిగిన ఆష్విజ్ శిబిరం విముక్తి 70 ఏళ్ల వార్షికోత్సవం మన చేతనలో శాశ్వత ముద్రగా మిగిలిపోయిన ఫాసిస్టు నాజీ దారుణ దురంతాలను గుర్తుకు తెచ్చింది. ఫాసిజం–నల్లని దుస్తులలో నాజీ సైనికుల కవాతు దృశ్యాలతో–చరిత్రలో గుర్తుండిపోతుంది. దాని ఘోర నేరాలు స్పష్టంగా కనపడుతుంటాయి. అయితే ఉదారవాద సమాజాల యుద్ధ–కాంక్ష కులీన వర్గం 'ఫాసిజాన్ని మరిచిపోవద్దు' అని అంటూనే, వేగంగా కమ్ముకుంటున్న ఆధునిక ఫాసిజాన్ని–అది వాళ్ల ఫాసిజం కాబట్టి – దాచిపెట్టేస్తుంటుంది.

1946లో న్యూరెంబర్గ్ ట్రిబ్యునల్ న్యాయమూర్తులు, 'ఇతర దేశాలపై దాడికి యుద్ధం మొదలుపెట్టటం చాలా తీవ్రమైన అంతర్జాతీయ నేరం. ఇతర యుద్ధ నేరాలకు దీనికి తేడా ఏమిటంటే దానిలో సమస్త దుష్టత్వం పేరుకుపోయి ఉంటుంది' అని అన్నారు.

యూరప్ మీదకి నాజీలు దండెత్తి ఉండకపోతే ఆష్విజ్, అణుబాంబుల దాడి ఉండేవి కావు. అమెరికా, దాని ఉపగ్రహ దేశాలు 2003లో ఇరాక్‌పై యుద్ధానికి దిగకుండా ఉంటే ఈనాటికి పది లక్షల మంది సజీవులుగా ఉండేవాళ్లు; ఇస్లామిక్ రాజ్యం లేదా ఐఎస్ఐఎస్ తన హింసతో ప్రపంచాన్ని భయకంపితులను చేసేది కాదు. వీళ్లు ఆధునిక ఫాసిజం సంతతి; వార్తలు అనే బాంబులు, రక్తపాతం, అబద్ధాలతోకూడిన అధివాస్తవిక రంగం వీళ్లను పోషిస్తోంది.

సర్వవ్యాపితమైన మీడియా తనకు కావలసిన వాటిని మళ్లీ, మళ్లీ ప్రసారం చేస్తుంటుంది. వద్దనుకున్నవాటిని నిషేధిస్తుంది, విస్మరిస్తుంది. దీని పుణ్యమా అని 1930లు, 1940ల నాటి ఫాసిజం మాదిరి ఘోర అబద్ధాలు నిరంతరం ప్రచారమవుతున్నాయి. లిబియాలో దురంతాన్నే తీసుకోండి.

2011లో లిబియాపై నాటో 9700 'వైమానిక దాడులు' చేసింది, వీటిల్లో మూడవ వంతుకు పైగా పౌరప్రాంతాలను లక్ష్యంగా చేసుకున్నవే. ఇందులో యురేనియం ఉన్న బాంబులను ఉపయోగించారు. మిసురాటా, సిర్టే అన్న నగరాలు చదును అయ్యేలా బాంబులు వేశారు. పెద్ద సంఖ్యలో శవాలను పూడ్చిపెట్టిన ప్రాంతాలను రెడ్ క్రాస్ గుర్తించింది. 'చనిపోయిన పిల్లల్లో అధిక శాతం పది సంవత్సరాల లోపు వాళ్లే' అని యునిసెఫ్ నివేదిక ఇచ్చింది.

'తిరుగుబాటుదారుడు' తన బాయ్‌నెట్‌తో లిబియా అధ్యక్షుడు మువమ్మర్ గద్దాఫీని బహిరంగంగా ముడ్డిలో పొడిచినప్పుడు అమెరికా గృహశాఖ మంత్రి అయిన హిలరీ క్లింటన్ దానిని 'మేం వచ్చాం, మేం చూశాం, అతడు చనిపోయాడు' అంటూ స్వాగతించారు. అతడి దేశాన్ని విధ్వంసం చెయ్యటం వెనక ఉన్నట్టే అతడి హత్య వెనక కూడా ఒక పెద్ద అబద్ధం ఉంది; అతడు తన ప్రజలపై 'మారణకాండ'కు ప్రణాళిక రచించాడట. 'మరొక్క రోజు ఆగి ఉంటే చార్లొట్ అంత పెద్ద నగరమైన బెంగాజిలో పెద్ద ఎత్తున హత్యలు జరిగి ఉండేవి. దీని ప్రకంపనలు ఆ ప్రాంతమంతా విస్తరించటమే కాకుండా ప్రపంచ అంతరాత్మపై చెరగని మచ్చ ఏర్పడి ఉండేది' అన్నాడు అధ్యక్షుడు ఒబామా.

లిబియా ప్రభుత్వ దళాల చేతిలో ఓటమి పాలవుతున్న ఇస్లామిక్ సైనికులు కల్పించిన కట్టుకథ ఇది. 'రువాండా మాదిరి మారణకాండ, రక్తపాతం' జరగనున్నాయని వాళ్లు రాయిటర్‌కి చెప్పారు. ఈ వార్త 2011 మార్చి 14న వెలువడింది. ఈ అబద్ధం ఆధారంగా నాటో దాడులకు పూనుకుంది. వీటిని డేవిడ్ కమెరాన్ 'మానవీయ జోక్యం'గా పేర్కొన్నాడు.

'తిరుగుబాటుదారుల'కు బ్రిటన్‌కి చెందిన ఎస్ఎఎస్ శిక్షణ ఇచ్చి, ఆయుధాలు సమకూర్చింది. వీళ్లలో చాలామంది ఆ తరువాత ఐఎస్ఐఎస్ లో చేరారు. సిర్టే నగరంలో 21 క్రైస్తవ బందీల శిరచ్ఛేదనను చిత్రించిన వీడియోను ఐఎస్ఐఎస్ ఇటీవల విడుదల చేసింది. ఈ ఉగ్రవాదుల రక్షణ కోసమనే ఈ నగరంపై నాటో ఆనాడు బాంబులు వేసింది.

ఒబామా, డేవిడ్ కమెరాన్, ఫ్రెంచి అధ్యక్షుడు నికొలస్ సర్కోజి దృష్టిలో గద్దాఫీ అసలు నేరం లిబియా ఆర్థిక స్వాతంత్రం, ఆఫ్రికాలోనే అత్యధిక పెట్రో నిల్వలను అమెరికా డాలర్లలో అమ్మనని ప్రకటించటం. అమెరికా సామ్రాజ్యవాద శక్తిలో పెట్రో డాలర్ ఒక మూలస్తంభం లాంటిది. గద్దాఫీ ఒక బృహత్ ప్రణాళిక రూపొందించుకున్నాడు: దీంట్లో భాగంగా ఉమ్మడి ఆఫ్రికా కరెన్సీ రూపొందించి దానికి మద్దతుగా బంగారాన్ని పెట్టదలిచాడు. అఖిల ఆఫ్రికా బ్యాంకును నెలకొల్పి పేద దేశాల మధ్య ఆర్థిక సంఘీభావానికి నిధులు కేటాయించాడు. ఇదంతా జరిగేదో, లేదో తెలియదు కానీ ఆ ఆలోచననే అమెరికా భరించలేక పోయింది. మిలటరీ 'భాగస్వామ్యాలతో' ఆఫ్రికా ప్రభుత్వాలకు ఎరవేసి ఆ ఖండంలోకి అడుగు పెట్టడానికి అది సిద్ధమయింది.

భద్రతా మండలి తీర్మానం ముసుగులో నాటో దాడుల తరువాత గరికై చెంగు ఇలా రాశాడు, 'ఆఫ్రికా సెంట్రల్ బ్యాంక్ కోసం, బంగారం మద్దతుతో ఆఫ్రికా దినార్ కరెన్సీ కోసం గద్దాఫీ కేటాయించిన 3000 కోట్ల డాలర్లను లిబియా సెంట్రల్ బ్యాంక్ నుంచి ఒబామా జప్తు చేశాడు.'

పాశ్చాత్య ఉదారవాద హృదయాలకు, ప్రత్యేకించి మీడియాకి దగ్గరగా ఉన్న నమూనా ఆధారంగానే లిబియాపై 'మానవీయ యుద్ధాన్ని' చేపట్టారు. సెర్బియాలో సెర్బ్‌ల వేర్పాటు ఉద్యమం జరుగుతున్న కొసావొలో మూలనివాసులైన అల్బేనియన్లపై మారణకాండ జరుపుతున్నారని 1999లో బిల్ క్లింటన్, టోనీ బ్లెయిర్‌లు అబద్ధమాడి నాటో ద్వారా బాంబులు వేయించారు. యుద్ధ నేరాలకు అమెరికా రాయబారి అయిన డేవిడ్ షెఫర్ '14–59 మధ్య వయసున్న అల్బేనియన్ పురుషులు 2,25,000 దాకా హత్యకు గురై ఉంటారు' అని పేర్కొన్నాడు. ఇది యూదుల హత్యాకాండను తలపింపచేస్తోందంటూ క్లింటన్, బ్లెయిర్‌లు 'రెండవ ప్రపంచ యుద్ధ స్ఫూర్తిని' చేబూనాలని అన్నారు. కొసావొ విముక్తి సైన్యం (కెఎల్ఎ) నేరచరిత్రని పక్కన పెట్టి వాళ్లని ఈ యుద్ధంలో భాగస్వాములుగా చేసుకున్నారు. తన మొబైల్ ఫోన్‌పై ఎప్పుడయినా

మాట్లాడవచ్చని బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి రాబిన్ కుక్ పేర్కొన్నాడు.

నాటో బాంబుదాడులు పూర్తయి జాతీయ టివి కేంద్రం, ప్రార్థనా స్థలాలు, ఆసుపత్రులు, బదులతో సహా సెర్బియా మౌలిక సదుపాయాలన్నీ శిథిలమైన తరువాత 'మారణకాండ'కు రుజువులు వెలికితీయటానికి అంతర్జాతీయ ఫోరెన్సిక్ నిపుణులు కొసావొలో వాలారు. ఒక్క సామూహిక సమాధిని కూడా కనుగొనకుండానే ఎఫ్.బి.ఐ. వెనక్కి తిరిగివెళ్లింది. స్పానిష్ ఫోరెన్సిక్ దళానిది కూడా అదే పరిస్థితి. దాని నాయకుడు 'యుద్ధ ప్రచార యంత్రాంగం అల్లిన కట్టుకథ' అంటూ తన కోపాన్ని వెల్లడించాడు. ఒక సంవత్సరం తరువాత యుగొస్లేవియాపై అమెరికా ట్రిబ్యునల్ కొసావొలో మృతుల సంఖ్య 2,788 అని తేల్చింది. ఇందులో ఇరువైపులా చనిపోయిన సైనికులు, కె.ఎల్.ఏ. చేతుల్లో చనిపోయిన సెర్బులు, రోమాలు కూడా ఉన్నారు. ఎటువంటి 'మారణకాండ' జరగలేదు. అదంతా పచ్చి అబద్ధం. నాటో దాడి కుట్రపూరితమైనది.

ఈ అబద్ధం వెనక పెద్ద స్వార్థపూరిత ప్రయోజనముంది. అనేక జాతుల సమాఖ్యగా, స్వతంత్ర దేశంగా యుగొస్లేవియా ప్రచ్ఛన్నయుద్ధ కాలంలో రాజకీయ, ఆర్థిక వారధిగా నిలబడింది. అక్కడి సేవా, ప్రధాన ఉత్పత్తి రంగాలు ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్నాయి. విస్తరిస్తున్న యూరోపియన్ సమాజానికి, ప్రత్యేకించి కొత్తగా ఏకమైన జర్మనీకి ఇది నచ్చలేదు. జర్మనీకి తూర్పున ఉన్న యుగొస్లేవియాలోని క్రోషియా, స్లొవేనియా ప్రాంతాలను జర్మనీ తన 'సహజ మార్కెట్టు'గా భావించి, ఆవైపు విస్తరించసాగింది. యూరోజోన్ ప్రణాళిక కోసం 1991లో మాస్ట్రిచ్‌లో ఐరోపావాసులు సమావేశమయ్యేనాటికే ఒక రహస్య ఒప్పందం జరిగిపోయింది: క్రొయేషియాని జర్మనీ గుర్తిస్తుంది. యుగొస్లేవియా వినాశనానికి తెర లేచింది.

చిక్కుల్లో ఉన్న యుగొస్లేవియా ఆర్థిక విధానానికి వాషింగ్టన్‌లో ప్రపంచ బ్యాంకునుండి అప్పు దొరక్కుండా అమెరికా అడ్డుకుంది. ప్రచ్ఛన్న యుద్ధానికి అవశిష్టంగా మిగిలి ఉన్న నాటోని సామ్రాజ్యవాద అమలుదారుగా పునరావిష్కరించారు. ఫ్రాన్స్‌లోని రాంబొలెట్‌లో 1999లో జరిగిన కొసావొ 'శాంతి' సమావేశంలో మోసపూరిత వ్యూహానికి సెర్బులు బలయ్యారు. రాంబొలెట్ ఒప్పందంలో రహస్య అనుబంధం బి ఉండింది, దానిని అమెరికా ప్రతినిధి బృందం చివరిరోజున చొప్పించింది. నాజీ ఆక్రమణ చేదు జ్ఞాపకాలు ఇంకా మరిచిపోని ఆ దేశం ఈ అనుబంధం ప్రకారం సైనిక ఆక్రమణకు లోనుకావాలి. అంతేకాకుండా ప్రభుత్వ ఆస్తులన్నింటిని ప్రైవేటుపరం చెయ్యాలి, 'స్వేచ్ఛా వాణిజ్య ఆర్థిక విధానాన్ని' అమలు చెయ్యాలి. ఏ సర్వసత్తాక దేశమూ ఇటువంటి ఒప్పందంపై సంతకం పెట్టలేదు. దానికి శిక్ష వెంటనే అమలు అయింది. ఆత్మరక్షణ చేసుకోలేని దేశంపై నాటో బాంబుల వర్షం కురిపించింది. తరువాత ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లలోనూ, సిరియా, లిబియాలలోనూ జరగబోయేదానికి ఇదొక సూచిక అయ్యింది.

1945నుంచి ఐక్యరాజ్య సమితిలోని మూడింట ఒకటి కంటే ఎక్కువ సభ్య దేశాలు–69 దేశాలు–అమెరికా ఆధునిక ఫాసిజం చేతిలో ఇక్కడ పేర్కొన్న వాటిల్లో కొన్నింటికి లేదా అన్నింటికి గురయ్యాయి: దేశంపై దాడులు, ప్రభుత్వాన్ని పడవేయటం, ప్రజా ఉద్యమాలను అణిచివెయ్యటం, ఎన్నికలను తారుమారు చెయ్యటం, ప్రజలపై బాంబులు వెయ్యటం, ఆర్థిక విధానాన్ని ఎటువంటి రక్షణ లేకుండా చెయ్యటం, సమాజ మూల్యాలు హరించే 'పరిమితులు' అనే షరతులు విధించటం. ఈ చర్యల ఫలితంగా లక్షలాది మంది చనిపోయి ఉంటారని బ్రిటిష్ చరిత్రకారుడు మార్క్ కర్టిస్ అంచనా వేశాడు. ప్రతి సందర్భంలోనూ ఒక పెద్ద అబద్ధాన్ని ఉపయోగించుకున్నారు.

'9/11 తరువాత అఫ్ఘనిస్తాన్‌లో మన సైనిక చర్య తొలిసారి ముగిసింది' అన్న మాటలతో 2015లో దేశాన్ని ఉద్దేశించి చేసిన ప్రసంగాన్ని ఒబామా ప్రారంభించాడు. వాస్తవానికి 10,000 సైనికులు, 20,000 కిరాయి సైనికులు కాలపరిధి లేకుండా ఈనాటికీ అఫ్ఘనిస్తాన్‌లో కొనసాగుతున్నారు. 'అమెరికా చరిత్రలో సుదీర్ఘ యుద్ధం ఒక బాధ్యతాయుత ముగింపుకి వస్తోంది' అని ఆ ప్రసంగంలో ఒబామా పేర్కొన్నాడు. అయితే ఐక్యరాజ్య సమితి లెక్కలు నమోదు చెయ్యటం మొదలుపెట్టినప్పటినుంచి ఏ సంవత్సరంలోనూ చనిపోనంత మంది 2014లోనే చనిపోయారు. ఒబామా అధ్యక్షుడుగా ఉన్న కాలంలోనే అత్యధిక మంది–పౌరులుకానీ, సైనికులు కానీ–చనిపోయారు.

ఇండోచైనాలోని దారుణ నేరాన్ని అఫ్ఘనిస్తాన్ విషాదం మించిపోయింది. అఫ్ఘనిస్తాన్ నుంచి నేటివరకు అమెరికా విధానాల రూపకర్త అయిన్ జిబిగ్నీవ్ బ్రెజెజిన్స్కీ 'The Grand Chessboard: American Primacy and Its Geostrategic Imperatives' అన్న పుస్తకం రాశాడు. ఇది పలు ప్రశంసలు పొందింది, పలుమార్లు ఉటంకింపబడింది. యూరేషియాను నియంత్రించి, ప్రపంచంపై ఆధిపత్యం చలాయించాలంటే ప్రజాభిమానముండే ప్రజాస్వామ్యాన్ని అమెరికా కొనసాగించలేదని అతడు రాశాడు. ఎందుకంటే, 'అధికారం కోసం పరుగులు పెట్టటం ప్రజల అభిమతాన్ని చూరగొనదు... సామ్రాజ్యవాద సమీకరణకు ప్రజాస్వామ్యం బద్ధ వ్యతిరేకం.' అతడు చెప్పింది అక్షరాలా నిజం. వికీలీక్స్, ఎడ్వర్డ్ స్నోడెన్ వెల్లడిచేసినట్టు నిఘా, పోలీసు రాజ్యం ప్రజాస్వామ్యాన్ని హరించివేస్తోంది. 1976లో అధ్యక్షుడు కార్టర్‌కి జాతీయ భద్రతా సలహాదారుగా ఉన్న బ్రెజెజిన్స్కీ అఫ్ఘనిస్తాన్‌లోని తొలి, ఏకైక ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని చావుదెబ్బ కొట్టడం ద్వారా తన వాదనను ఆచరణలో చూపించాడు. ఈ కీలక చరిత్ర ఎవరికి తెలుసు?

1960లలో ప్రపంచంలోకెల్లా అత్యంత పేద దేశాల్లో ఒకటైన అఫ్ఘనిస్తాన్‌లో విప్లవం పెల్లుబికింది. ఇది అంతిమంగా 1978లో రాచరిక పాలన అవశిష్టాలను కుప్పకూల్చింది. అఫ్ఘనిస్తాన్ ప్రజల ప్రజాస్వామిక పార్టీ (పిడిపిఎ) ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. ఫ్యూడలిజం నిర్మూలన, అన్ని మతాలకు స్వేచ్ఛ, మహిళలకు సమాన హక్కులు, అల్ప సంఖ్యాక మూలవాసులకు సామాజిక న్యాయం వంటివాటితో కూడిన సంస్కరణల కార్యక్రమాన్ని చేపట్టింది. 13,000కి పైగా రాజకీయ ఖైదీలను విడుదల చేసింది, పోలీసు దస్త్రాలను బహిరంగంగా తగలబెట్టింది.

కొత్త ప్రభుత్వం అత్యంత పేదలకు ఉచిత వైద్య సదుపాయాన్ని ప్రవేశ పెట్టింది; అప్పుకి బదులుగా వెట్టి చాకిరిని నిర్మూలించింది, అక్షరాస్యతా కార్యక్రమాన్ని పెద్ద ఎత్తున చేపట్టింది. ఇంతటి ప్రయోజనాలను మహిళలు అంతకు ముందు పొంది ఉండలేదు. 1980ల చివర నాటికి విశ్వవిద్యాలయాల్లో సగం విద్యార్థులు మహిళలే, అఫ్ఘనిస్తాన్‌లో డాక్టర్లలో దాదాపు సగం, పౌరయంత్రాంగ అధికారులలో మూడవ వంతు, టీచర్లలో అధిక శాతం మహిళలే. మహిళా సర్జన్ అయిన సైరా నూరానీ ఇలా అంటున్నారు, 'ప్రతి ఆడపిల్ల ఉన్నత పాఠశాలకి, విశ్వవిద్యాలయానికి వెళ్లగలిగేది. మా ఇష్టం వచ్చిన చోటుకి వెళ్లేవాళ్లం, మాకు నచ్చిన బట్టలు వేసుకునేవాళ్లం. కేఫేలకు, సినిమాలకు వెళ్లేవాళ్లం. శుక్రవారం నాడు కొత్తగా విడుదలయిన భారతీయ సినిమా చూసేవాళ్లం, కొత్తగా వచ్చిన సంగీతం వినేవాళ్లం. ముజాహెద్దీన్‌ల పట్టు పెరుగుతుండటంతో ఇదంతా మారిపోయింది. వాళ్లు టీచర్లను చంపి, పాఠశాలలను తగలబెట్టసాగారు. మేం భయభ్రాంతులమయ్యాం. అమెరికా వీళ్లకి మద్దతు ఇచ్చిందంటే తమాషాగానూ, విషాదంగానూ ఉంటుంది.'

పిడిపిఎ ప్రభుత్వానికి సోవియట్ యునియన్ మద్దతు లభించింది. అయితే, '(విప్లవంలో) సోవియట్ జోక్యం ఉన్నట్టు ఆధారాలు ఏవీ లేవు' అని విదేశాంగ శాఖ మాజీ మంత్రి సైరస్ వాన్స్ ఒప్పుకున్నాడు. ప్రపంచమంతటా విముక్తి ఉద్యమాలలో ఆత్మవిశ్వాసం పెరగటం చూసిన బ్రెజెజిన్స్కీ పి.డి.పి.ఏ. కింద ఆఫ్ఘనిస్తాన్ విజయం సాధిస్తే, దాని స్వతంత్రత, ప్రగతి ఇతరులకు 'ఆశావహ ఉదాహరణగా పరిణమించే ముప్పు' ఉందని భావించాడు.

ముజాహిద్దీన్‌గా పేరుగాంచిన గిరిజన 'మతతత్వ' బృందాలకు మద్దతునిచ్చే కార్యక్రమానికి 1979 జులై 3న శ్వేత సౌధం రహస్యంగా ఆమోదాన్నిచ్చింది. ఆయుధాలు, ఇతర సహాయం రూపంలో ఈ కార్యక్రమం ప్రతి సంవత్సరం 50 కోట్ల అమెరికన్ డాలర్లకు పెరిగింది. దీని ఉద్దేశం ఆఫ్ఘనిస్తాన్ తొలి సంస్కరణవాద, లౌకిక ప్రభుత్వాన్ని పడదోయటం. 1979 ఆగస్టులో కాబుల్‌లోని అమెరికా దౌత్య కార్యాలయం, 'భవిష్యత్తులో ఆఫ్ఘనిస్తాన్‌లో సామాజిక, ఆర్థిక సంస్కరణలకు ఎంతటి సమస్యలు ఎదురైనప్పటికీ పిడిపిఎ ప్రభుత్వం కుప్పకూలటంతోనే అమెరికా విస్తృత ప్రయోజనాలు నెరవేరతాయి.'

అల్-ఖైదా, ఇస్లామిక్ రాజ్యాల పూర్వ రూపమే ముజాహిదీన్. సిఐఏ నుంచి నగదులో లక్షల డాలర్లు పొందిన గుల్‌బుద్దీన్ హెక్మాత్యార్ వంటివాళ్లు ఉన్నారు. నల్లమందు అక్రమ రవాణాలోనూ, ముసుగు వేసుకోటానికి నిరాకరించే మహిళల ముఖాలపై యాసిడ్ పొయ్యటం లోనూ హెక్మాత్యార్ కుఖ్యాతి గాంచాడు. అతడికి లండన్‌కి ఆహ్వానం లభించింది, ప్రధాన మంత్రి థాచర్ అతడిని 'స్వాతంత్ర్య యోధుడు' అని పొగిడింది.

మధ్య ఆసియాలో ఇస్లామిక్ మతతత్వాన్ని ప్రోత్సహించి లౌకిక, రాజకీయ విముక్తిని దెబ్బకొట్టటానికీ, సోవియట్ యూనియన్‌ని 'అస్థిర పరచటానికి' బ్రెజెజిన్స్కీ అంతర్జాతీయ ఉద్యమాన్ని మొదలుపెట్టి ఉండకపోతే ఇటువంటి ఉన్మాదులు తమ గిరిజన ప్రపంచంలోనే ఉండిపోయే వాళ్లు. ఈ క్రమంలో 'కొంతమంది ఉద్రేకపూరిత ముస్లిము లను' తయారుచేశానని అతడు తన ఆత్మకథలో పేర్కొన్నాడు. అతడి ప్రణాళికకి ఆ ప్రాంతంలో ఆధిపత్యం సాధించాలన్న పాకిస్తాన్ నియంత జియా ఉల్ హక్ కాంక్ష జత కుదిరింది. ఆఫ్ఘన్ జిహాద్‌లో చేరటానికి 1986లో సిఐఏ, పాకిస్తాన్ ఇంటెలిజెన్స్ సంస్థ ఐఎస్ఐ ప్రపంచమంతటి నుంచి రిక్రూట్ చేయసాగాయి. అలా చేరినవాళ్లల్లో సౌదీ కోటీశ్వరుడు ఒసామా బిన్ లాడెన్ ఒకడు. ఆఫ్ఘన్ జిహాద్‌లో పనిచేయటానికి న్యూ యార్క్, బ్రూక్లిన్‌లోని ఇస్లామిక్ కళాశాలనుంచి ఎంపికచేయబడి, పారామిలటరీ శిక్షణ పొందినవాళ్లు అంతిమంగా తాలిబాన్‌లోనూ, అల్-ఖైదాలోనూ చేరారు. దీనికి 'ఆపరేషన్ సైక్లోన్' అని పేరుపెట్టారు. ఐక్యరాజ్య సమితి సాధారణ అసెంబ్లీ ముందు సహాయం అర్థించిన ఆఫ్ఘనిస్తాన్ పిడిపిఎ ఆఖరి అధ్యక్షుడైన ముహమ్మద్ నజీబుల్లాని 1996లో తాలిబాన్లు వీధి దీపానికి ఉరితీసినప్పుడు 'ఆపరేషన్ సైక్లోన్' విజయవంతమైనదని సంబరాలు జరుపుకున్నారు.

ఆపరేషన్ సైక్లోన్, దాని 'కొంతమంది ఉద్రేకపూరిత ముస్లిముల' ఎదురుదెబ్బ 2001 సెప్టెంబర్ 11న తగిలింది. ఆపరేషన్ సైక్లోన్ కాస్తా 'ఉగ్రవాదంపై యుద్ధం'గా మారింది. దాని ఫలితంగా ఆఫ్ఘనిస్తాన్ నుంచి ఇరాక్, యెమెన్, సోమాలియా, సిరియా వరకు ముస్లిం ప్రపంచంలో అసంఖ్యాక స్త్రీ, పురుషులు, పిల్లలు ప్రాణాలు బలిదానమయ్యాయి. అమలుదారుల సందేశం గతంలోనూ, ఇప్పుడూ కూడా ఒకటే: 'ఉంటే మా పక్షాన లేకపోతే విపక్షాన ఉంటారు.'

గతంలోనూ, ప్రస్తుతంలోనూ ఫాసిజంలో ఉన్న ఏక సూత్రం సామూహిక హత్యాకాండ. వియత్నాంపై అమెరికా దాడుల్లో 'స్వేచ్ఛా కాల్పుల ప్రాంతాలు', 'శవాల లెక్కింపు', 'అనివార్య నష్టం' ఉన్నాయి. క్వాంగ్ న్‌గాయ్ ప్రాంతంలో నేను విలేఖరిగా పనిచేశాను, అక్కడ వేలాది పౌరులను (వాళ్లని అమెరికన్లు 'గూక్స్' అనేవాళ్లు) అమెరికా హత్యచేసింది. కానీ, మై లాయ్‌లో జరిగిన ఒకేఒక హత్యకాండని పేర్కొంటూ ఉంటారు. లావోస్, కాంబోడియాలలో చరిత్రలో కనీ, వినీ ఎరగని రీతిలో వైమానిక దాడులు జరిగాయి. బాంబుల గోతులు ఒకదానితో ఒకటి కలిసిపోయి ఆకాశంనుంచి చూస్తే రాక్షస ముత్యాలదండను తలపింపచేస్తూ భయంగొలుపుతూ ఉంటుంది. ఈ బాంబుల దాడుల వల్ల కాంబోడియా లో పోల్ పాట్ నాయకత్వంలో దాని స్వంత ఐఎస్ఐఎస్ ఏర్పడింది.

ఈరోజు, ఉగ్రవాదంపై ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ఉద్యమం ఫలితంగా కుటుంబాలకు కుటుంబాలు, పెళ్లికి హాజరైన అతిథులు, అంత్యక్రియల శోకంలో ఉన్నవాళ్లు హత్యకు గురౌతున్నారు. వీళ్లంతా ఒబామాకి బలి అవుతున్నారు. న్యూయార్క్ టైమ్స్ ప్రకారం శ్వేత సౌధంలో పరిస్థితి అంచనా గదిలో ప్రతి మంగళవారం ఒబామాకి ఎంపిక చెయ్యటానికి సిఐఏ 'చంపవలసినవాళ్ల జాబితా' ఇస్తుంటుంది. చట్టపరమైన న్యాయంతో సంబంధం లేకుండా అతడు ఎవరు బతికి ఉండాలో, ఎవరు చనిపోవాలో నిర్ణయిస్తుంటాడు. డ్రోన్ అనే పైలెట్ లేని విమానం తీసుకువెళ్లే 'హెల్‌ఫైర్' క్షిపణి అతడి హత్యాయుధం. ఈ ఆయుధం శరీరాలను ఛిద్రంచేసి, కాల్చి ఆ ప్రాంతమంతా వెదజల్లుతుంది. ఎక్కడో ఉన్న కంప్యూటర్ నిఘా తెరపై ప్రతి ఒక్క 'దాడి' 'పురుగుని చంపిన మచ్చ'గా నమోదౌతుంది.

'గుడ్డిగా నాయకులను అనుసరించే సాయుధసైనికులకు బదులుగా గుట్టుచప్పుడు కాకుండా మొత్తం సంస్కృతి సైనికీకరణకు లోనౌతోంది. ఉద్రేకపూరిత ఉపన్యాసాలు ఇచ్చే నాయకుని స్థానంలో మనకు విఫల సంస్కర్త కనపడతాడు, చిరునవ్వు నవ్వుతూనే హత్యలకు ప్రణాళికలు తయారు చేసి, అమలు చేస్తూ ఉంటాడు' అంటాడు చరిత్రకారుడు నార్మన్ పొలాక్.

ఆధిపత్యాన్ని ఆరాధించే సంస్కృతి పాత, కొత్త ఫాసిజాలను ఏకం చేస్తుంది. 1930ల నాటి జాతి ఆరాధన ప్రకటనలను గుర్తు చేస్తూ, 'అమెరికా స్వతహాగా ఇతర దేశాలకంటే భిన్నమైనది, ఉన్నతమైనదని నరనరాన నమ్ముతున్నాను' అన్నాడు ఒబామా. హిట్లర్ ఆరాధకుడైన కార్ల్ ష్మిట్ 'ప్రత్యేక హక్కులను నిర్ణయించేవాడే సార్వభౌముడు' అని అనటాన్ని చరిత్రకారుడు ఆల్ఫ్రెడ్ డబ్ల్యు. మాక్‌కాయ్ ప్రస్తావించాడు. ప్రపంచలో ఆధిపత్యంలో ఉన్న భావజాలమైన అమెరికావాదాన్ని ఇది ఒక్క ముక్కలో తేల్చేస్తుంది. ఇది అన్నింటినీ మింగివేసే భావజాలమని గుర్తింపబడకపోవటానికి కారణం ఎవరూ గుర్తించని మెదడు ప్రక్షాళన కార్యక్రమం. ఎటువంటి ప్రకటనలు లేకుండా, ఎవరికీ తెలియకుండా జ్ఞానోదయం అన్న ముసుగులో పాశ్చాత్య సంస్కృతి గొప్పతనాన్ని అది చాటుతుంటుంది. సినిమాలు చాటే అమెరికా కీర్తిని ఆరాధిస్తూ నేను పెద్దవాడినయ్యాను. అయితే, అవన్నీ వక్రీకరణలే. నాజీ యుద్ధ యంత్రాంగంలో అధిక భాగాన్ని ఎర్ర సైన్యం 1.3 కోట్ల సైనికుల ప్రాణాలను పణంగా పెట్టి నిర్మూలించిందని నాకు తెలియదు. ఇందుకు విరుద్ధంగా పసిఫిక్ ప్రాంతంతో సహా అమెరికా సైనికులు 4 లక్షల మందే చనిపోయారు. హాలీవుడ్ దీనినంతటిని తారుమారు చేసి చూపించింది.

ఇప్పుడు తేడా అల్లా ఏమిటంటే తమ అధ్యక్షుడు చంపుతున్నట్టే అమెరికా మానసిక రోగులు దూరప్రాంతాలలోని ప్రజలను చంపాల్సి వచ్చిన 'విషాదం' పట్ల అసంతృప్తిని వ్యక్తం చెయ్యటానికి సినిమా

ప్రేక్షకులను ఆహ్వానిస్తున్నారు. ఈ సంవత్సరం 'అమెరికన్ స్నైపర్' అన్న సినిమాకి హాలీవుడ్ హింసకి ప్రతిరూపమైన నటుడు, దర్శకుడు క్లింట్ ఈస్ట్‌వుడ్‌ని ఆస్కార్ బహుమానానికి ప్రతిపాదించారు. హత్యలు చెయ్యటానికి సర్వాధికారాలు ఉన్న పిచ్చివాడి గురించిన సినిమా ఇది. ఈ సినిమాని 'ప్రారంభ రోజుల వసూళ్లలో అన్ని రికార్డులను బద్దలుకొట్టిన దేశభక్తి, కుటుంబ సినిమా' గా న్యూయార్క్ టైమ్స్ పేర్కొంది.

అమెరికా ఫాసిజాన్ని అవలంబించటంపై ఎటువంటి సాహసిక సినిమాలు లేవు. నాజీవాదానికి వ్యతిరేకంగా, గ్రీకు ఫాసిజానికి వ్యతిరేకంగా ధైర్య సాహసాలతో యుద్ధం చేస్తున్న గ్రీకులపై రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అమెరికా (బ్రిటన్) యుద్ధానికి దిగాయి. బ్రెజిల్ లోనూ, లాటిన్ అమెరికాలోని అధిక దేశాలలోనూ చేసినట్టు 1967లో ఏథెన్స్‌లో ఫాసిస్టు మిలటరీ ప్రభుత్వం అధికారంలోకి రావటానికి సిఐఏ సహకరించింది. నాజీ దాడులలోనూ, మానవాళికి వ్యతిరేకంగా నేరాల లోనూ సహకరించిన అనేకమంది జర్మన్లకు, తూర్పు ఐరోపావాసులకు అమెరికాలో ఆశ్రయం ఇచ్చారు; చాలామందిని పువ్వుల్లో పెట్టి చూసుకున్నారు, వారి ప్రతిభలకు తగిన ప్రతిఫలం ముట్టచెప్పారు. భయోత్పాతం సృష్టించే నాజీ వి-2 బాంబుకీ, అమెరికా అంతరిక్ష కార్యక్రమానికీ వెర్న్‌హర్ వాన్ బ్రాన్‌యే 'పితామహుడు'.

1990ల నాటికి ఒకప్పటి సోవియట్ రిపబ్లిక్కులు, తూర్పు యూరప్, బాల్కన్స్ వంటివి నాటో సైనిక కేంద్రాలుగా మారటంతో ఉక్రెయిన్‌లో నాజీ వారసులు పుంజుకోటానికి అవకాశమిచ్చారు. సోవియట్ యునియన్‌పై నాజీలు దండెత్తినప్పుడు వేలాది యూదులు, పోలిష్ ప్రజలు, రష్యన్ల మరణానికి కారణమైన ఉక్రెయినయన్ ఫాసిజం తిరిగి బలపడేలా చేసి, దాని 'కొత్తతరాన్ని' అమలుదార్లు 'జాతీయవాదులు'గా కొనియాడారు.

ఎన్నికైన ఉక్రెయిన్ ప్రభుత్వంపై తిరుగుబాటుకి ఒబామా ప్రభుత్వం 2014లో 500 కోట్ల డాలర్లు వెదజల్లడంతో ఇది శిఖర స్థాయికి చేరుకుంది. నయా నాజీలైన దాడి దళాలను రైట్ సెక్టార్ అని, స్వొబొడా అని వ్యవహరిస్తారు. 'మాస్కో-యూదు మాఫియా'ని, స్వలింగ సంపర్కులు, స్త్రీవాదులు, రాజకీయంగా వామపక్షవాదులతో కూడుకున్న 'ఇతర చెత్త'ను నిర్మూలించాలని పిలుపునిచ్చిన ఒలెహ్ ట్యానీబాక్ వంటి వాళ్లు దానికి నాయకత్వం వహిస్తున్నారు.

ఈ ఫాసిస్టులు ఇప్పుడు తిరుగుబాటు ద్వారా అధికారంలోకి వచ్చిన ప్రభుత్వంలో అంతర్భాగమయ్యారు. ఉక్రెయినియన్ పార్లమెంటు మొదటి ఉప సభాపతి అయిన, పాలక పార్టీకి చెందిన ఆంద్రీ పారుబియ్ స్వొబొడా సహ వ్యవస్థాపకుడు. ఫిబ్రవరి 14న వాషింగ్టన్ వెళుతూ పారుబియ్, 'లక్ష్యాన్ని కచ్చితంగా ఛేదించే ఆధునిక ఆయుధాలను ఇమ్మని అమెరికాని అడుగుతాను' అన్నాడు. అందులో అతడు విజయవంతమైతే అది యుద్ధ చర్య అని రష్యా భావిస్తుంది.

యూరప్ నడిగడ్డలో ఫాసిజం తిరిగి బలపడటం గురించి ఒక్క పాశ్చాత్య నాయకుడు కూడా మాట్లాడలేదు. దీనికి వ్లాడిమిర్ పుతిన్ ఒక్కడే మినహాయింపు. సరిహద్దు ప్రాంతమైన ఉక్రెయిన్ నుంచి నాజీలు దాడిచేసినప్పుడు 2.2 కోట్ల రష్యన్లు చనిపోయారు. ఇటీవల మ్యూనిక్‌లో జరిగిన భద్రతా సమావేశంలో ఐరోపా, యూరేషియా వ్యవహారాలకు ఒబామా ప్రభుత్వంలో సహాయ కార్యదర్శి అయిన విక్టోరియా న్యూలాండ్ కీవ్ ప్రభుత్వానికి అమెరికా ఆయుధాలను సమకూర్చటాన్ని ఐరోపా నాయకులు విమర్శించటంపై దుమ్మెత్తిపోసింది. జర్మన్ రక్షణశాఖ మంత్రిని ఆమె 'ఓటమివాద మంత్రి'గా పేర్కొంది. కీవ్‌లో సైనిక తిరుగుబాటు వెనక కీలక వ్యూహకర్త న్యూలాండే. 'నయా మితవాద' ప్రముఖులలో ఒకడు, అతి మితవాద పంథాని అనుసరించే కొత్త అమెరికా శతాబ్దికి పథకానికి సహ వ్యవస్థాపకుడు అయిన రాబర్ట్ డి. కగాన్ భార్య ఈమె. డిక్ చెనీకి విదేశాంగ విధాన సలహాదారుగా పనిచేసింది.

న్యూలాండ్ ఆశించిన తిరుగుబాటు జరగలేదు. రష్యాకి చారిత్రిక, చట్టబద్ధ హక్కు అయిన క్రిమియాలోని ఉష్ణజల నావికాదళ కేంద్రాన్ని నాటో చేతులలో పడకుండా నివారించగలిగారు. రష్యా ప్రజలు అత్యధిక శాతంగా ఉన్న క్రిమియాని 1954లో నికితా కృశ్చేవ్ అనైతికంగా ఉక్రెయిన్‌లో విలీనం చేశాడు. 1990లలో మాదిరి ఇప్పుడు కూడా క్రిమియాని తిరిగి రష్యాలో విలీనం చెయ్యాలని అత్యధిక శాతం ప్రజలు కోరుకున్నారు. ఈ రెఫరెండం ప్రజల కోరికపై స్వచ్ఛందంగా జరిగింది, ప్రపంచమంతా దీనిపై దృష్టి సారించింది. ఎటువంటి దురాక్రమణ జరగలేదు.

అదే సమయంలో కీవ్ ప్రభుత్వం దేశ తూర్పు పాంతంలోని రష్యా మూలాలు ఉన్న ప్రజలను సమూలంగా నిర్మూలించాలన్న ఉన్మత్తతతో దాడులకు పాల్పడసాగింది. వాఫెన్-ఎస్.ఎస్. తరహాలో నయా నాజీ సాయుధమూకలను నియమించి పట్టణాలు, నగరాలను దిగ్బంధం చేశారు. నగరాలకు విద్యుత్తు సరఫరా నిలిపివేశారు, బ్యాంకు ఖాతాలు స్తంభింపచేశారు, సామాజిక భద్రత, పెన్షన్ చెల్లింపులు ఆపివేశారు. ప్రజలను ఆకలికి గురిచేసి, దానిని ఆయుధంగా వాడుకున్నారు. పది లక్షలకు పైగా ప్రజలు సరిహద్దులు దాటి రష్యాలోకి పారిపోయి శరణార్థు లయ్యారు. పాశ్చాత్య మీడియా దృష్టిలో వాళ్లు 'రష్యా దాడుల' వల్ల ఉత్పన్నమైన 'హింస' నుంచి తప్పించుకుంటున్నవాళ్లు అయ్యారు. నాటో కమాండర్ అయిన జనరల్ బ్రీడ్‌లొవ్ పేరు, చర్యలు స్టాన్లీ కుబ్రిక్ పాత్ర డా. స్ట్రేంజ్‌లవ్ నుంచి ప్రేరణ పొందినట్లు ఉంటాయి. 40,000 రష్యన్‌సైనికులు దండెత్తి వస్తున్నారని ప్రకటించాడు. ఉపగ్రహాల ఆధారాలు పొందుపరిచే ఈ రోజుల్లో అతడు అటువంటివి ఏవీ చూపించలేదు.

ఉక్రెయిన్‌లో రష్యన్ భాష, రెండు భాషలు మాట్లాడేవాళ్లు మూడవ వంతు దాకా ఉంటారు. దేశంలోని జాతుల వైవిధ్యతను చాటే సమాఖ్యను, అదే సమయంలో మాస్కో నుంచి స్వతంత్రత, స్వయంప్రతిపత్తి కలిగిన వ్యవస్థను వీళ్లు కోరుకున్నారు. వాళ్లల్లో అధిక శాతం 'వేర్పాటువాదులు' కాదు, తమ స్వస్థలంలో భద్రంగా ఉండాలని కోరుకుంటున్నవాళ్లు. కీవ్ లోని నిరంకుశ ధోరణులను వీళ్లు వ్యతిరేకించారు. తమపై జరిపిన దాడుల కారణంగానే వాళ్లు తిరుగుబాటుచేసి, స్వయంప్రతిపత్తి గల 'దేశాలు'గా ఏర్పడ్డారు. పాశ్చాత్య ప్రేక్షకులకు ఇదంతా ఎవరూ వివరించలేదు.

2014 మే 2న ఒడెస్సాలోని కార్మిక సంఘ ప్రధాన కార్యాలయంలో పోలీసులు ప్రేక్షకుల మాదిరి చూస్తూ ఉండగా రష్యా మూలవాసులైన 41 మందిని సజీవంగా కాల్చి చంపారు. మితవాద వర్గ నాయకుడు డిమిత్రొ యారొష్ దీనిని 'మన జాతీయ చరిత్రలో మరొక ప్రకాశవంతమైన రోజు'గా పేర్కొన్నాడు. అమెరికా, బ్రిటిష్ మీడియాలలో ఈ ఘటనను 'జాతీయతావాదులు' (నియో నాజీలు), 'వేర్పాటువాదుల' (ఉక్రెయిన్ సమాఖ్యగా ఏర్పడటానికి రెఫరెండం చేపట్టాలని సంతకాలు సేకరిస్తున్నవాళ్లు) మధ్య 'కొట్లాటల' ఫలితంగా సంభవించిన 'దురదృష్టకర విషాదం'గా పేర్కొన్నారు.

వాషింగ్టన్ కొత్త మిత్రుల యూదు వ్యతిరేక, ఫాసిస్టు విధానాల గురించి చేసిన హెచ్చరికలను రష్యా ప్రచారంగా కొట్టిపారేస్తూ న్యూయార్క్ టైమ్స్ ఈ కథనాన్ని ప్రచురించనే లేదు. వాల్ స్ట్రీట్ జర్నల్ మృతులనే తప్పు పడుతూ, 'ఉక్రెయిన్‌లో భయంకర అగ్ని ప్రమాదం తిరుగుబాటుదారుల కారణంగా చెలరేగి ఉండవచ్చని ప్రభుత్వం పేర్కొంది' అంటూ ప్రచురించింది. 'సహనంతో వ్యవహరించినందుకు' సైనిక ప్రభుత్వాన్ని ఒబామా అభినందించాడు.

వాళ్ల సహాయం కోసం చర్యలు తీసుకునేలా పుతిన్‌ని రెచ్చగొట్టగలిగితే ఉక్రెయిన్‌పై రష్యా దండెత్తుతోందన్న అబద్ధానికీ, ముందుగానే నిర్ధారించిన పుతిన్ పాత్రకీ ఊతం లభించినట్లవుతుంది. 'రష్యా సైనిక దళాలతో ఉక్రెయినియన్ సైన్యం తలపడటం లేదు' అని ఒక విలేఖరుల సమావేశంలో ఉక్రెయిన్ సైనికదళాల ఉన్నతాధికారి అయిన జనరల్ విక్టర్ ముఝెంకొ చెప్పాడు. రష్యాపై అమెరికా, ఈ.యు. విధించిన ఆంక్షలకు ఆధారమే లేదని వెల్లడిచేశాడు. 'చట్టవిరుద్ధ సాయుధ బృందాల'లో సభ్యులైన 'వ్యక్తిగత పౌరులు' ఉన్నారు కానీ రష్యా దండెత్తి రాలేదని అతడు పేర్కొన్నాడు. పాశ్చాత్య దేశాలకు ఇది వార్త కాకుండా పోయింది. అణ్వాయుధ రష్యాతో 'పూర్తి స్థాయి యుద్ధానికి' కీవ్ విదేశాంగ శాఖ ఉపమంత్రి పిలుపునిచ్చాడు.

ఒక్లాహోమా నుంచి రిపబ్లికన్ సెనేటర్ అయిన జేమ్స్ ఇన్‌హోఫ్ ఫిబ్రవరి 21న కీవ్ ప్రభుత్వానికి అమెరికా ఆయుధాలు సరఫరాని అధీకృతం చేసే బిల్లుని ప్రవేశపెట్టాడు. తన సెనేట్ ప్రసంగంలో ఉక్రెయిన్‌లోకి ప్రవేశిస్తున్న రష్యా దళాలంటూ కొన్ని ఫొటోలు చూపించాడు. అవి నకిలీ ఫొటోలని ఎప్పుడో నిరూపితమయింది. నికరాగ్వాలో సోవియట్ ఇన్‌స్టాలేషన్లు అంటూ రొనాల్డ్ రీగన్ చూపించిన నకిలీ ఫొటోలను, ఇరాక్‌లో విధ్వంసక ఆయుధాలు అంటూ ఐక్యరాజ్య సమితి ముందు కాలిన్ పావెల్ చూపించిన తప్పుడు సాక్ష్యాలను ఇది గుర్తుకు తెచ్చింది.

రష్యాకి వ్యతిరేకంగా జరుగుతున్న దుష్ప్రచారం, దాని అధ్యక్షుడిని దుష్టుడిగా చూపుతున్న విధానం విలేఖరిగా నేను గతంలో ఎన్నడూ చూడని స్థాయిలో జరుగుతోంది. అమెరికాలో పరిశోధనాత్మక పత్రకారులుగా ప్రఖ్యాతిగాంచినవాళ్లల్లో రాబర్ట్ పారీ ఒకడు. ఇరాన్-కాంట్రా అవినీతిని బయటపెట్టింది ఇతడే. ఇతడు ఇటీవల, 'అడాల్ఫ్ హిట్లర్ జర్మనీ తరువాత దేశ ప్రజలపై యుద్ధానికి సైనికులను ఏ ఐరోపా ప్రభుత్వమూ పంపించలేదు. తెలిసి, తెలిసీ కీవ్ ప్రభుత్వం ఆ పని చేసింది. అయితే పాశ్చాత్య దేశాలలో అన్ని రకాల ప్రసార సాధనాలు, రాజకీయ పార్టీలు నిర్ధారింపబడిన వాస్తవాలను సైతం విస్మరిస్తూ, వాటిని కప్పిపెట్టానికి తీవ్రంగా ప్రయత్నించాయి... ఒక శతాబ్దం క్రితం ప్రపంచ యుద్ధంలోకి నెట్టబడినట్టు మూడవ ప్రపంచ యుద్ధంలోకి ఎలా నెట్టబడతామని ఎవరన్నా ఆశ్చర్యపడుతుంటే వాస్తవాలను, కారణాలను పట్టించుకోకుండా ఉక్రెయిన్‌పై చెలరేగుతున్న ఉన్మాదాన్ని చూస్తే సరిపోతుంది.'

న్యురెంబెర్గ్ ట్రిబ్యునల్ ప్రాసిక్యూటర్ జర్మనీ ప్రసార సాధనాల గురించి ఇలా అన్నాడు: 'మానసిక యుద్ధతంత్రాన్ని నాజీ కుట్రదారులు వినియోగించుకున్న తీరు అందరికీ తెలిసిందే. ప్రధాన దాడికి దిగబొయ్యే ప్రతిసారీ, తక్కువ వ్యవధిలో చేపట్టాల్సిన కొన్ని సందర్భాలలో తప్పించి, దాడికి గురయ్యేవాళ్లని బలహీనపరిచి, జర్మన్ ప్రజలను మానసికంగా దాడికి సిద్ధం చెయ్యటానికి ఒక ప్రచార ఉద్యమాన్ని చేపట్టేవాళ్లు. . హిట్లర్ రాజ్యంలోని ప్రచార వ్యవస్థలో దిన పత్రిక, రేడియో ప్రధాన ఆయుధాలు.' ఫిబ్రవరి 2న గార్డియన్‌లో గార్టన్-యాష్ ప్రపంచ యుద్ధానికి పిలుపునిచ్చినంత పనిచేశాడు. 'పుతిన్‌ని నిలువరించాలి' అని పతాక శీర్షిక పేర్కొంది. 'కొన్ని సందర్భాలలో తుపాకులే తుపాకులను బాగా ఆపగలుగుతాయి' అని అతడన్నాడు. యుద్ధముప్పు 'దిగ్బంధానికి గురవుతామన్న రష్యా ఆందోళనను పోషించవచ్చు' అని అతడు గుర్తిస్తూనే, అయినా ఏం ఫర్వాలేదు అన్నాడు. ఏ, ఏ ఆయుధాలు కావాలో జాబితా పేర్కొంటూ 'అమెరికా వద్ద అత్యుత్తమ సామగ్రి ఉంది' అన్న భరోసాని పాఠకులకు ఇచ్చాడు.

2003లో ఆక్స్‌ఫర్డ్ ప్రొఫెసర్ అయిన గార్టన్-యాష్ ఇరాక్‌లో మారణకాండకు దారితీసిన ప్రచారాన్ని మళ్లీ పేర్కొన్నాడు. సద్దాం హుస్సేన్ 'కాలిన్ పావెల్ పేర్కొన్నట్టు దారుణ రసాయనిక, జైవిక ఆయుధాలను పెద్దఎత్తున సమీకరించాడు. వాటిల్లో మిగిలి ఉన్నవాటిని దాచి ఉంచాడు. అణ్వాయుధాల కోసం ఇంకా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు' అని అతడు రాశాడు. బ్లేర్‌ని 'గ్లాడ్‌స్టోనియన్, క్రైస్తవ ఉదారవాద సహాయకుడు' అంటూ కొనియాడాడు. 'ఇరాక్ తరువాత పాశ్చాత్య దేశాలు ఎదుర్కొంటున్న అతి పెద్ద పరీక్ష ఇరాన్' అంటూ 2006లో అతడు రాశాడు.

ఫాస్టియన్ ఒప్పందం కుదుర్చుకున్న అట్లాంటికాంతర ఉదారవాద కులీన వర్గంలాగా గార్టన్-యాష్ ప్రేలాపనలు ఉంటాయి, అతడి మాటల్లో అవి 'బాధతో కూడుకున్న ఉదారవాద సందిగ్ధాలు.' యుద్ధ నేరస్తుడయిన బ్లేర్ వాళ్లు కోల్పోయిన నాయకుడు. గార్టన్-యాష్ వ్యాసం ప్రచురితమైన గార్డియన్ పత్రికలో అమెరికా స్టెల్త్ బాంబర్ గురించి ఒక పూర్తి పేజీ ప్రకటన వెలువడింది. భయంగొలిపే లాక్‌హీడ్ మార్టిన్ బొమ్మ మీద 'ఎఫ్-35. బ్రిటన్‌కి ఎంతో ఉపయోగం' అని ఉంది. ఈ అమెరికా యుద్ధ 'సామగ్రి' బ్రిటన్ పన్ను చెల్లింపుదారులకు 1300 కోట్ల పౌండ్లు భారం విధిస్తుంది. దీనికి ముందు వచ్చిన నమూనాలు ప్రపంచమంతటా మృత్యువును కురిపించాయి. ప్రకటనదారునికి అనుగుణంగా గార్డియన్ సంపాదకీయం సైనిక బడ్జెటుని పెంచాలని కోరింది.

దీనంతటి వెనక కూడా ఒక పెద్ద దురుద్దేశం ఉంది. ప్రపంచ పాలకులకు ఉక్రెయిన్‌ని ఒక ఆయుధ స్థావరంగానే కాదు, దాని ఆర్థిక వ్యవస్థకోసం కూడా చేజిక్కించుకోవాలి. కీవ్ కొత్త ఆర్థికశాఖ మంత్రి నాటాలివె జరెస్కో గతంలో అమెరికా ప్రభుత్వంలో దాని విదేశ 'పెట్టుబడుల'కు బాధ్యత వహించిన అధికారి. ఆమెకి హడావిడిగా ఉక్రెయినియన్ పౌరసత్వం ఇచ్చారు. దండిగా ఉన్న సహజవాయు నిల్వల కోసం వాళ్లకి ఉక్రెయిన్ కావాలి. ఉపాధ్యక్షుడు జో బిడెన్ కొడుకు ఉక్రెయిన్ అతిపెద్ద చమురు, సహజవాయువు, ఫ్రాకింగ్ కంపెనీ బోర్డులో ఉన్నాడు. జిఎం విత్తన ఉత్పత్తిదారులైన కుఖ్యాత మాన్‌సాంటో వంటి కంపెనీలకు ఉక్రెయిన్ సారవంతమైన వ్యవసాయ నేలలు కావాలి.

అన్నిటికిమించి వాళ్లకి ఉక్రెయిన్ పొరుగుదేశమైన శక్తిమంత రష్యా కావాలి. రష్యాని కూడా ముక్కలు చేసి భూమిమీద సహజవాయువు అత్యధిక నిల్వలను చేజిక్కించుకోవాలి. ఆర్కిటిక్ మంచు కరుగుతున్న కొద్దీ ఆర్కిటిక్ సముద్రాన్ని, దండిగా ఉన్న దాని ఇంధన వనరులను, రష్యాకి ఉన్న సుదీర్ఘ ఆర్కిటిక్ తీరాన్ని నియంత్రించాలని వాళ్లకి ఉంది. మాస్కోలో బోరిస్ ఎల్ట్సిన్ వాళ్ల మనిషి, తాగుబోతు అయిన అతడు పాశ్చాత్య దేశాలకు ఆ దేశ ఆర్థిక వ్యవస్థని అప్పగించాడు. అతని తరువాత అధికారానికి వచ్చిన పుతిన్ రష్యాని తిరిగి సర్వసత్తాక దేశంగా నిలిపాడు; అదీ అతడి నేరం.

మిగిలిన మనందరి బాధ్యత ఏమిటో స్పష్టంగా ఉంది. యుద్ధపిపాసుల బాధ్యతారహిత అబద్ధాలను గుర్తించి, బహిర్గతం చెయ్యాలి; వాళ్లతో ఎన్నటికీ చేతులు కలపకూడదు. క్షీణస్థితిలో ఉన్న ఒక నాగరికతను ఆధునికి శక్తిమంతమైన దేశాలుగా మార్చిన మహోన్నత ప్రజా ఉద్యమాలను తిరిగి రగిలించాలి. అన్నిటికిమించి మనల్ని, మన మెదడులను, మన మానవత్వాన్ని, మన ఆత్మ గౌరవాన్ని కోల్పోకుండా కాపాడుకోవాలి. మనం మౌనంగా ఉంటే మనమీద గెలుపొందటం ఖాయం, ఆ తరువాత దారుణ మారణకాండలు ఎంతో దూరంలో లేవు.

(జాన్ రిచర్డ్ పిల్జెర్ ఆస్ట్రేలియాకి చెందిన విలేఖరి, డాక్యుమెంటరీ సినిమాల రూపకర్త. లండన్‌లో ఉంటాడు. బ్రిటన్‌లో 'జర్నలిస్ట్ ఆఫ్ ది ఇయర్' అవార్డుని రెండుసార్లు పొందాడు. అతడి డాక్యుమెంటరీ సినిమాలకు అమెరికాలోనూ, బ్రిటన్‌లోనూ అకాడెమీ అవార్డులు లభించాయి.)

*(అనువాదం: కె. సురేష్)*

వీ

# చండీయాగం ఎవరి కోసం?

***ప్రజలు తమ మౌలిక సమస్యలకోసం పాలకులను ప్రశ్నించకుండా, ప్రజల్లో ఉన్న విశ్వాసాలను, నమ్మకాలను పెంచి నిత్యం మత్తులో ఉంచే ప్రయత్నంలో భాగమే యాగం అంటున్నారు టి. రమేష్***

డిసెంబర్ 25 భారతదేశంలోని శూద్రులకు చారిత్రాత్మక దినం. ఎన్నో వందల తరాలుగా శూద్రులను అణగదొక్కుతున్న మనుధర్మశాస్త్రాన్ని 1927లో అంబేడ్కర్ దహనం చేసిన రోజు.

బృహత్ యజ్ఞం
ఎర్రవల్లి.. భక్తరవళి
ఆధ్యాత్మిక పరిమళాల మల్లి
వందలాది మంది రుత్విక్‌లు
రోజుకో రంగు బట్టలతో రుత్విక్‌లు
యతీశ్వరులకు ప్రత్యేక ఆశ్రమాలలో విడిది
రుత్విక్‌లకు ప్రత్యేక భోజనాలు - బాదుషా, నెయ్యి, గడ్డపెరుగు, మధురాన్నం
చండీవాద్యం కర్ణపేయం
టన్నుల కొద్ది మోదుగు సమిధల దహనం
టన్నుల కొద్ది నెయ్యి దహనం

ఎర్రవెల్లి చుట్టుపక్కల సోమయాజులు చేసిన గాయత్రీ యజ్ఞాలు, యాగాలు చేసిన తీరు వంటి శీర్షికలతో, ఉప శీర్షికలతో పత్రికలు చండీయాగం గురించిన విషయాలను కథలు, కథలుగా రోజూ వండి వడ్డిస్తుంటే, వాటి గురించి మాట్లాడుకోకుండా ఇప్పుడు ఈ మనుధర్మ దహనం గురించి చర్చ ఎందుకో? అనే ధర్మ సందేహం రావచ్చు.

రాజ్యాంగాన్ని రచించిన అంబేడ్కర్ మనుధర్మశాస్త్రాన్ని ఎందుకు తగలబెట్టినట్లు అని డిసెంబర్ 25న ఖచ్చితంగా చర్చించుకోవాలి. ముఖ్యంగా ముఖ్యమంత్రే స్వయంగా ఆయుత చండీ యాగం పేరుతో మనుధర్మాన్ని నెత్తికెత్తుకున్నప్పుడు ఈ ప్రశ్న తప్పక చర్చకు రావాలి. అంబేడ్కర్ ఏమన్నాడు "పై మూడు వర్ణాల వారు శూద్రుల పట్ల అనుసరించిన విధానం ఇది అని చెప్పడానికి మనుధర్మశాస్త్రం ప్రబల సాక్ష్యం. సాంఘిక హక్కుల విషయంలో మనుధర్మ శాసనాలను మించిన అఘాయిత్యపు దుష్ట శాసనాలు ప్రపంచంలో మరెక్కడా లేవు." మనుస్మృతి దహనం చేసిన వేదికపైన ఉన్న బ్యానర్లలో మనుధర్మ దహన ప్రదేశం, అంటరానితనాన్ని నాశనం చేయాలి, బ్రాహ్మణిజాన్ని దహనం చేయాలి అని రాయబడింది. అయినా మనుధర్మం ఇంకా బుసలు కొడుతున్నది. సమానత్వాన్ని, లౌకికత్వాన్ని చాటుతున్న రాజ్యాంగాన్ని వెక్కిరిస్తున్నది.

**రాజ్యాంగం-మతాచరణ హక్కు:** కొంత మంది మేధావులు సాంకేతికంగా రాజ్యాంగాన్ని ఉటంకిస్తూ ముఖ్యమంత్రికి వ్యక్తిగత విశ్వాసాలు ఉండకూడదా? అవి రాజ్యాంగం ఇచ్చిన హక్కులు కదా! అని చాటింపు వేస్తున్నారు. రాజ్యాంగం దేశంలోని పౌరులందరికీ హక్కులను ఇచ్చింది. ఆర్టికల్ 25 తనకు ఇష్టమైన మతమును స్వేచ్ఛగా అవలంబించుటకు, ఆచరించుటకు, దానిని ప్రచారం చేయుటకు ప్రజలందరికీ సమాన హక్కులు ఇచ్చింది. దేశ పౌరునిగా ముఖ్యమంత్రికి కూడా ఈ హక్కు ఉంటుంది. ఇది ఎవరూ కాదనలేని సత్యం.

అయితే ముఖ్యమంత్రి, ప్రధాన మంత్రులు రాష్ట్రంలోని, దేశంలోని ప్రజలందరినీ నడిపించాల్సిన వ్యక్తులు, కేవలం ఈ రాజ్యాంగ నిబంధనను సాంకేతికంగా ఉటంకించి యజ్ఞాలు, యాగాలు జరిపించడం వ్యక్తిగత విషయం కాదు. 3500 మంది పోలీసులను వినియోగించి, 5కి.మీ. పొడవునా సి.సి. కెమెరాలతో బందోబస్తు నిర్వహించడం వ్యక్తిగత విషయమా? దేశ రాష్ట్రపతి పాల్గొనే క్రతువు వ్యక్తిగతమా? రాష్ట్ర గవర్నర్, ప్రధాన కార్యదర్శి, డిజిపి వంటి అధికారులు సాంప్రదాయ దుస్తులు ధరించి యాగ క్రతువుల్లో పాల్గొనడం వ్యక్తిగతమా? దేవాదాయ శాఖా మంత్రి స్వయంగా యాగం పనులు పర్యవేక్షించడం వ్యక్తిగతం అవుతుందా? ముఖ్యమంత్రి ఏ స్ఫూర్తిని ప్రజలకు ఇస్తున్నారనేది చర్చనీయాంశమే కదా!

హక్కుల గురించి మాట్లాడే ముందు అదే రాజ్యాంగం చెప్పిన కర్తవ్యాల గురించి మరచి వ్యవహరించరాదు కదా! రాజ్యాంగం ఆర్టికల్ 51ఎ(ఎచ్) శాస్త్రీయ దృక్పథాన్ని, మానవత్వాన్ని, జిజ్ఞాసను, సంస్కరణతత్వాన్ని పెంపొందించుకొనడం పౌరుల ప్రాథమిక బాధ్యతగా చెప్పింది. రాజ్యాంగ స్ఫూర్తిని కాపాడుతామని ప్రమాణం చేసి గద్దెనెక్కిన వారు ఈ ప్రాథమిక కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేస్తే అది రాజ్యాంగ స్ఫూర్తిని కాపాడినట్లవుతుందా? మన అవసరం కోసం హక్కులు గుర్తుంటే సరిపోతుందా? కర్తవ్యాలు గుర్తుండాల్సిన అవసరం లేదా?

**వనరుల దుర్వినియోగం:** ప్రథమ భారత ప్రధాని నెహ్రూ 'నిరక్షరాస్యత, పేదరికం, పౌష్టికాహారలోపం, మూఢనమ్మకాలు, సాంప్రదాయాల పేరిట పేద దేశంలో వనరులు దుర్వినియోగం కావడం వంటి సమస్యలను సైన్స్ మాత్రమే పరిష్కరించగలదు' అని చెప్పాడు. ఎర్రవెల్లిలో జరిగే యాగంలో 4 టన్నుల ( 4వేల కిలోల) ఆవు నెయ్యి, 12 టన్నుల(12వేల కిలోల) పాయసాన్ని పోస్తారట! 108 హోమ కుండాలు కదా! ఈ విధంగా ఆహార పదార్థాలను దుర్వినియోగం చేసే ముందు ఒక్కసారి తెలంగాణలో పోషకాహార లోపంతో మరణిస్తున్న, రోగాలపాలవుతున్న పిల్లలు ముఖ్యంగా ఏజెన్సీలోని గిరిజనులు ముఖ్యమంత్రి గారికి గుర్తుకు వస్తే ఎంత బాగుందు. యూనిసెఫ్ అంచనా ప్రకారం తెలంగాణలో 3 ఏండ్లలోపు పిల్లలు 80 శాతం మంది రక్తహీనతతో బాధపడుతున్నారు. పౌష్టికాహారం, జీవన ప్రమాణాల స్థాయిని పెంచడం, ప్రజారోగ్యాన్ని మెరుగుపరచడం ప్రభుత్వ కర్తవ్యం

అన్న రాజ్యాంగంలోని ఆర్టికల్ 47 కూడా గుర్తుకు రావాలి కదా! ఇదే ఆర్టికల్ ముఖ్యంగా ప్రభుత్వం ఆరోగ్యానికి భంగం కలిగించే మత్తుపానీయాలు, ఇతర మాదకద్రవ్యాలను, వైద్య ప్రయోజనాలకు మించి వేరే విధంగా ప్రజలు సేవించకుండా చూడవలెనని చెప్పింది.

**ప్రజలను మత్తులో ముంచుతున్న ప్రభుత్వం:** ఏడాదికి 10 వేల కోట్ల ఆదాయం ప్రత్యక్షంగా, 15 వేల కోట్ల ఆదాయం పరోక్షంగా మద్యం ద్వారా ఆర్జిస్తున్న ప్రభుత్వం ఇంకా ఎక్కువ మద్యాన్ని అమ్మి ఆదాయం పెంచుకోవాలని చూస్తున్నది. మరి ఈ మద్యం ఆదాయం సందర్భంలో రాజ్యాంగం గుర్తుకు రావాలి కదా! ఇక్కడ మనం గమనించాల్సింది, ప్రభుత్వం రెండు రకాల మత్తుల్లో ప్రజలను ముంచి వారిని ఆలోచించలేని విధంగా చేస్తున్నది. చైతన్యరహితం చేస్తుంది. ఒకటి మద్యం మత్తు, రెండవది మూఢనమ్మకాల మత్తు. ఎందుకంటే తెలంగాణాలోని యువత ఎంతో చైతన్యయుతమైన యువత. తెలంగాణ సాధన కోసం జరిగిన ఉద్యమాన్ని పక్కదారి పట్టకుండా అన్ని సందర్భాల్లో కాపాడుకున్న యువత. దాస్య బంధనాల విముక్తి కోసం సాయుధ పోరాటాన్ని జరిపి చరిత్ర సృష్టించిన మట్టి మనుషుల వారసులు. ఉద్యోగాల కోసం, మెరుగైన జీవన ప్రమాణాల కోసం, అందరికీ నాణ్యమైన విద్య, ఆరోగ్యం కోసం అనేక ఆకాంక్షలతో తెలంగాణ సాధన ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ యువత ఇదే చైతన్యంతో ఉంటే కోటి ఆకాంక్షలతో ఏర్పడిన తెలంగాణలో తమకు న్యాయం జరగడం లేదని తెలుసుకున్న మరుక్షణం యువత తిరుగుబాటు బాట పడితే ఇక అంతే సంగతి. అందుకే ఈ చైతన్యాన్ని మత్తులో ముంచాలి. పాలకుల ఈ ధోరణి కొత్తదేమీ కాదు. ఈ నాటిదేమీ కాదు. మనుధర్మాన్ని బాగా వంటపట్టిచ్చుకున్న కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో ఏనాడో స్పష్టంగా చెప్పాడు. "రాజుకు నమ్మకాలు, కట్టుబాట్లు ఉండరాదు. అయితే ప్రజలకు గల మతనమ్మకాలను తనకు ప్రయోజనకరంగా మార్చుకోవాలి. వాటిని పెంచి పోషించి వారిని తన నియంత్రణలో ఉంచుకోవాలని." ఈ సూత్రాన్ని బాగా వంటబట్టించుకున్న పాలకులు రాజులు పోయినా, రాజ్యాలు పోయినా భూస్వామ్య పద్ధతులను మాత్రం కొనసాగిస్తున్నారు. అందులో భాగమే ఈ యాగాలు, రాజధాని భూమి పూజలు, పుష్కరాలు, జాతర్లు, యాదాద్రికి వందల కోట్ల కేటాయింపు. తెలంగాణ ఏర్పడిన ఈ రెండేళ్లలో ఏనాడైనా అందరికీ ఆరోగ్యం ఎలా అందించాలి? పిల్లల్లో, మహిళల్లో పోషకాహార లోపాన్ని ఎలా అధిగమించాలి? మలేరియాతో గిరిజనులు ఇంకా ఎందుకు చనిపోతున్నారు? వారి ప్రాణాలను ఎలా కాపాడాలి? ఘనంగా చెప్పుకున్న కెజి టూ పిజి, కామన్ స్కూల్ ప్రణాళిక ఎలా ఉంటుంది? అక్షరాస్యతలో వెనుకబడిన రాష్ట్రాన్ని ఎలా ముందుకు తీసుకు వస్తారు? వంటి అంశాల గురించి ఉద్దేశ్యపూర్వక నిర్లిప్తత చూపిస్తున్న ప్రభుత్వం, ముఖ్యమంత్రి మూఢనమ్మకాలను మాత్రం పెంచి పోషిస్తున్నారు?

ఏమన్నా అంటే భారతీయ సంస్కృతి అంటున్నారు. అసలు సంస్కృతి అంటే ఒక పండుగలు, పబ్బాలేనా? యజ్ఞాలు, యాగాలేనా? ఒక బ్రాహ్మణీయ ఆచార వ్యవహారాలేనా?

బహుజనుల ఆహారపు అలవాట్లు, జీవన విధానాలు, ఆట పాటలు, కాయకష్టపు పనులు ఇవన్నీ భారతీయ సంస్కృతిలో భాగం కాదా? శూద్రుల సంస్కృతి భారతీయ సంస్కృతి కాదా?

సూటిగా ఒక ప్రశ్న అయుత చండీయాగం చేయడానికి 2 వేల మంది రుత్విక్కులు దేశంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చారు కదా! వంట చేయడానికి కరీంనగర్ జిల్లా మంథని నుండి 3 వందల మంది వచ్చారు కదా! చండీయాగం మధ్యలో కుంకుమార్చన నిర్వహించడానికి ఇంకో వెయ్యి మంది పూజారులు వచ్చారు కదా! వీరిలో ఒక్కరైనా బ్రాహ్మణేతరులు ఉన్నారా? ఒక్క మహిళైనా ఉందా?

అక్కడ యాగశాలను శుభ్రం చేయడం, వంట పాత్రలను శుభ్రం చేయడం, యాగశాల పరిసరాలను శుభ్రం చేయడం, అసలు యాగశాలలను కట్టింది ఎవరు? ఈ యాగంలో వారి పాత్ర ఏమిటి? చాకిరీ చేయడమేనా? యాగశాల కడుతున్న వారికి కూడా ఇలా రోజుకో రకం బట్టలు ఇచ్చారా? మధురాన్న భోజనాలు పెట్టారా? ఇది దేనిని సూచిస్తున్నది. ఏ సంస్కృతికి ప్రతిరూపం?

యాగాల గురించి మను ధర్మం ఏమి చెపుతున్నది?

నా శ్రోత్రియతతే యజ్ఞే గ్రామయాజికృతే తథా?
స్త్రియా క్లీబేన చ హలుతే భుంజీత బ్రాహ్మణ: క్వచిత్?

శ్రోత్రియుడు చేయని యాగంలోను, సామూహిక యాగాలలోను, గ్రామ పురోహితునిచే చేయించబడు యాగాలలోను, స్త్రీలు, నపుంసకులు హోమసహితంగా చేసే యాగాలలోను సత్ బ్రాహ్మణుడు భుజించరాదు.

అంతేకాదు యాగాల్లో బ్రాహ్మణులకు సంభావనలు ఏమివ్వాలో? వాటిని వాళ్లు ఎలా పంచుకోవాలో కూడా స్పష్టంగా రాసుకున్నారు. మనుస్మృతిలోని 8వ ఆధ్యాయంలోని 79 నుండి 83 వరకు గల శ్లోకాలు యజ్ఞాలో దక్షిణ సమర్పణ గురించే చెప్తాయి.

సర్వేషామర్ధినో ముఖ్యా స్తదర్ధే నార్ధినో పరే ।
తృతీయిన స్తృతీయాంశా శ్చతుర్ధాంశాశ్చ పాదిన: ॥

కొన్ని యాగాల్లో నూరు గోవుల దక్షిణ లేదా సుమారు నూరు సువర్ణాల దక్షిణ అని ఉండవచ్చు. సాధారణంగా యాగాలకు వచ్చే రుత్విక్కులలో హోత, అధ్వర్యువు, బ్రహ్మ, ఉద్గాత అనే నలుగురూ మొత్తం దక్షిణలో 48 సంఖ్యకు హక్కుదార్లు. ఇది మొత్తంలో దాదాపు సగం. మిగిలినది 52 సంఖ్య. తదుపరి నలుగురు మైత్రావరుణాదులు. తదుపరి నలుగురు మూడోవంతుకు (అనగా 48లో మూడవ వంతు 16) అర్హులు. చివరి నలుగురు మిగిలినది 12 సంఖ్య తీసుకోవాలి.

ఇలా యాగాల్లో శూద్రులను నిషేధించిన ఈ మనుధర్మమే కదా పై మూడు జాతుల వారికి ఆయా విధి విహిత కర్మలలో గుణదోషాలెంచక శుశ్రూష చేయడమే శూద్రులకు విధించిన ధర్మం అని చెప్పింది.

ఏక మేవ తు శూద్రస్య ప్రభు: కర్మ సమాదిశత్ ।
ఏతేషా మేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా ॥

అందుకే కదా జ్యోతిబా ఫూలే శతాబ్దకాలం ముందే నా సోదరులను బ్రాహ్మణుల దాష్టీకం గురించి హెచ్చరించేందుకే ఇది రాస్తున్నాను అన్నది. "నిమ్నజాతుల వాళ్లనీ, అణగదొక్కబడ్డ జాతుల వాళ్లనీ బ్రాహ్మలు అజ్ఞానంలో ఉంచారు కాబట్టి, యుక్తితోటి పన్నిన బ్రాహ్మల వలలో పడిపోయి, మోసపోయి 'ఇవన్నీ మీ బాగుకోసమే' అని బిగ్గరగా చెప్పుతుంటే ఈ కపట మతగ్రంథాలను నమ్మవలసిన వాళ్లయ్యారు. ఇప్పటికీ, ఈ బ్రాహ్మలు అవివేకులైన జనాన్ని మోసగిస్తూనే ఉన్నారు." సిసలైన లోకజ్ఞానం ఏమని చెప్తుందంటే: "శూద్రులంతా ఏకమై, నెత్తిన బ్రాహ్మలు రుద్దిన వంశానుగతమైన ఈ బానిసత్వాన్ని అతి త్వరగా వదుల్చుకుని విముక్తం కావాలని."

వేల రుత్విక్‌లలో ఒక్కరైనా స్త్రీ ఉన్నారా? లేరు ఎందుకంటే మను ధర్మం స్త్రీలను నీచంగా చూస్తుంది.

తథా చ శ్రుతయో ఒహ్వ్యో నిగీతా నిగమేష్వపి ।
స్వాక్షణ్య పరీక్షార్థం తాసాం శృనుత నిష్కృతీ: ॥

స్త్రీలకు వ్యభిచార శీలత స్వాభావికం. ఈ విషయమై వేద వాక్యాలే ప్రమాణాలు. ఆ విధంగా చాలా వేద వాక్యాలు స్త్రీ వ్యభిచార శీలతను ప్రకటిస్తున్నాయి. (16 - 9)

అస్వతంత్రా: స్త్రియ: కార్యా:పురుషై స్వైర్దివానిశం ।
విషయే షు చ సజ్జం త్యస్సంస్థా ప్యా ఆత్మనోవశే ॥

భర్త మొదలగు పురుషులు స్త్రీలను తమ ఆధీనంలో ఉంచుకోవాలి. వారు తరచుగా నిషిద్ధ రూప-రస-గంధాది విషయాలలో ప్రవర్తించగలరు. (అనగా... వద్దన్నవి చేయడం) వారినట్లు పోనివ్వక పురుషులు తమ చెప్పు చేతల్లో ఉంచుకోవాలి. (22-9).

మనుధర్మం ఇంత స్పష్టంగా శూద్రులను, స్త్రీలను నీచంగా అవమానిస్తుందనే బుద్ధుడు, జ్యోతిబా పూలే, అంబేద్కర్ వంటి వాళ్లు ఆ ధర్మం కుట్రలను ఎండగట్టి వాస్తవాలను ప్రజలకు చెప్పారు. వేల మంది బ్రాహ్మణులతో యాగాలు చేసి మనుధర్మాన్ని తిరిగి నెలకొల్పడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నట్లు?

రాజులు పోయినా, రాజ్యాలు పోయినా, ప్రజాస్వామ్య రాజ్యంలో, ముఖ్యంగా అంబేద్కర్ రచించిన రాజ్యాంగం అందరికీ సమాన హక్కులు ఇచ్చిన తర్వాత మనుధర్మం ప్రభావం తగ్గుతుందేమోనని ఆశించిన బహుజనులను, స్త్రీలను చైతన్యరహితులుగా చేసే యాగాలను, క్రతువులను ఎందుకు చేస్తున్నట్లు? ముఖ్యమంత్రులే స్వయంగా ఎందుకు చేస్తున్నట్లు? ముఖ్యమంత్రి కనపడ్డ బ్రాహ్మణ పెద్ద కాళ్ల మీదపడి దండాలు పెట్టడం ఏ సంస్కృతికి ప్రతిబింబం? నిచ్చెనమెట్ల కులవ్యవస్థలో తనకింది వాళ్లందరికి ఈ చర్యతో అందించే స్ఫూర్తి ఏమిటీ?

**మహా యాగాన్ని ఎందుకు చేస్తున్నట్లు? :** యజ్ఞ, యాగ క్రతువులను అత్యంత బలీయంగా బౌద్ధం ఖండించింది. ఆ బౌద్ధం ప్రభావం వల్లనే రాజసూయ యాగాలు, అశ్వమేధ యాగాలు తగ్గాయి. ఎక్కడన్నా జరిగినా తమ పరిధిలో చిన్న చిన్న యాగాలు జరిగాయి.

ఎర్రవెల్లిలో జరుగుతున్న ఆయుత చండీ యాగాన్ని పర్యవేక్షించడానికి వచ్చిన కంచి పీఠం మేనేజర్ ధర్మరాజు రాజసూయ యాగం తర్వాత ఒక పాలకుడు చేస్తున్న యాగంగా దీన్ని అభివర్ణించాడు. వంద సంవత్సరాలుగా రాజులు కూడా ఇలాంటి యాగాలను చేయలేదని చెప్పాడు. స్వతంత్ర భారతంలో ఏ ముఖ్యమంత్రి, ప్రధానమంత్రి ఎవరూ చేయలేదని చెప్పాడు. మరి ఎవరూ చేయని యాగాన్ని ఇంత ఆకస్మాత్తుగా మన ముఖ్యమంత్రి ఎందుకు ఎత్తుకున్నట్లు? రాజరిక పాలన, కుటుంబ పాలన, వారసత్వ పాలన సాగాలని కోరుకుంటున్నాడా? రాజులు యాగాలు చేశారంటే వారి రాజరిక ప్రయోజనాలు వారికి ఉన్నాయి. మరి ప్రజాస్వామ్య పాలనలో ఇలాంటి యాగాల ద్వారా ఏ స్ఫూర్తి ప్రజలకు ఇవ్వదలిచారు. ఆరున్నర దశాబ్దాల స్వతంత్ర భారతంలో ఇంకా కులవివక్ష వేయి పడగలతో విజృంభిస్తుంటే శూద్రులు, బహుజనులు దాని బంధనాల నుండి కోలుకోలేక పోతుంటే ఇంకా ఆ వివక్షను పెంపొందించే ఇలాంటి చర్యలను ఎందుకు చేస్తున్నట్లు?

తెలంగాణ కోసం పోరాడిన యువకుల ఆకాంక్షలను నెరవేర్చలేమని స్పష్టంగా తెలుసు. నిరుద్యోగులందరికీ ఉద్యోగాల కల్పన సాధ్యం కాదు. అందరికీ విద్య ఎప్పుడు అందుతుందో తెలియదు. ఆరోగ్యం అసలు ఊహకైనా అందదు. పోనీ ఇప్పటిదాకా ఆంధ్ర పెట్టుబడిదారులు అని ఎవరినైతే విమర్శించారో ఆ పెద్ద మనుషులే యాగాలకు ప్రత్యేక అతిథులుగా వస్తుంటే, ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిని ఇంటికి వెళ్లి విందు భోజనాలు ఆరగించి ఆహ్వానిస్తుంటే మరి ఎవరి మీద ఇప్పటిదాకా పోరాడామో? ఎందుకు పోరాడామో? వ్యూహాత్మక మిత్రబంధాలు కొత్తగా ఎందుకు ఏర్పడ్డాయో? మరి అసలు శత్రువు ఎవరు? లంకలో పుట్టిన వాళ్లంతా రాక్షసులే అన్నది ఆంధ్ర ప్రజలనా? ప్రజలకు ప్రజలే శత్రువులా? పెద్దలంతా ఒక్కటేనా?అనే అయోమయంలో ఉన్న విద్యార్థుల, యువజనులను పక్కదారీ పట్టించి వారిని నిష్క్రియాపరులను చేయడానికి చేసే ఇలాంటి అనేక ప్రక్రియలను భవిష్యత్ తెలంగాణ చూడబోతున్నది.

వాస్తవంగా తెలంగాణలో ఇప్పటికే బాణామతి, చేతబడి వంటి మూఢనమ్మకాలతో వందలాది గ్రామాలు ఉద్రిక్తంగా ఉన్నాయి. వేలాది మంది ప్రజలు బాధితులుగా ఉన్నారు. కోట్లాది రూపాయలు నష్టపోతున్నారు. పండ్లు పీకడాలు, నాలుకలు కత్తిరించడాలు, సజీవ దహనాలు చేయడంవంటి అకృత్యాలకు దళితులు, గిరిజనులు, బహుజనులు మరీ ముఖ్యంగా మహిళలు బలౌతున్నారు. వారిని పట్టించుకునేవారే లేరు.

ఇంకోవైపు నారాయణ, శ్రీచైతన్యలో 60 శాతం మంది ఇంటర్ విద్యార్థులు చదువుతున్నారు. వారికి కనీస ప్రాక్టికల్స్ లేవు. సైన్స్ బట్టీపట్టి నేర్చుకుంటున్న వీరంతా రేపటి నుండి యాగాల చుట్టు, మంత్ర, యంత్రాల చుట్టు తిరుగుతారేమో! గుళ్లకు, పండుగ పబ్బాలకు వంద కోట్లు కేటాయిస్తున్న ముఖ్యమంత్రి ప్రపంచంలో సైన్స్‌లో వస్తున్న ఆధునిక పరిశోధనలు, టెక్నాజీ నైపుణ్యాలను తెలంగాణలో చదువుకుంటున్న విద్యార్థులు అర్థం చేసుకోవడానికి కనీసం ఒక 100 కోట్లతో హైదరాబాద్ లో సైన్స్ సిటీ కట్టాలని ఆలోచిస్తారా? ప్రతీ జిల్లా కేంద్రంలో పిల్లలు ప్రాజెక్ట్‌లు చేసుకోవడానికి వీలుగా, సైన్స్ ప్రయోగాలు చేసుకోవడానికి సైన్స్ కేంద్రాలను నిర్మిస్తారేమోనని కలలు కనడం పగటి కలౌతుందా?

లేకపోతే ఇప్పటికే కస్తుర్బా గాంధీ విద్యాలయాల్లో, హస్టళ్లలో చదువుకుంటున్న విద్యార్థినులు, విద్యార్థులు రాత్రిపూట దయ్యాలని భయపడుతున్నారు. వారికి శాస్త్రీయ దృక్పథాన్ని అందిద్దామా? లేక చండీయాగం స్ఫూర్తితో దయ్యాలను తరమడానికి భూత, ప్రేత, పిశాచ మాంత్రికులతో దయ్యాల పూజలు నిర్వహిద్దామా? బాణామతి, చేతబడి వంటి వాటితో బాధ పడుతున్న వారికి ఆధునిక వైద్యం, మానసిక వ్యాధులకు వైద్యం అందిద్దామా? లేక ఆయుత చండీ యాగం స్ఫూర్తితో క్షుద్ర మాంత్రికులతో తాంత్రిక పూజలు చేయిద్దామా?

తెలంగాణను వైజ్ఞానిక తెలంగాణగా మారుద్దామా? లేక మూఢనమ్మకాల తెలంగాణగా చేద్దామా?

*ఆత్మగౌరవంతో, కఠినదీక్షతో*
*జ్ఞానసంపదలు నేర్చుకో*
*కులవ్యవస్థ సంకెళ్లను తెంచి విద్యనందుకో*
*బ్రాహ్మణీయ శాసనాల ధిక్కరించు వెంటనే*

– సావిత్రిభాయి పూలే

*(రచయిత ప్రధానకార్యదర్శి, జనవిజ్ఞాన వేదిక, తెలంగాణ)*

# 'అయుత చండీయాగం'

***ప్రజల సమస్యలకు పరిష్కారాలను చూపకుండా, ప్రజల్ని కర్మ సిద్ధాంతానికి వదిలేసి తమ అధికారాన్ని పటిష్టం చేసుకోవడంలో భాగంగానే అయుత చండీయాగం నిర్వహిస్తున్నారని అంటున్నారు* యాదాద్రి రామయ్య**

తెలంగాణ రాజ్యాన్ని జయించిన రాజా శ్రీ చంద్రశేఖరేంద్రుల వారు విజయోత్సాహంతో జరుపుతున్న అయుత చండీయాగ మహోన్నత వైదిక వైభవాన్ని మనసారా వీక్షించి తరించడానికి భారత దేశ ప్రజలు ఉవ్విళ్లూరు తున్నారా? బహుశా, ఈ యాగఫలం శక్తి రూపంలో తమ తమ మనోద్వారాల గుండా ప్రవేశించి మోక్ష ప్రాప్తిని కల్గిస్తుందని కూడా ఆశిస్తున్నారా? ఈ యాగ మహిమ తమను సమస్త ఈతి బాధల నుండి విముక్తి చేసి, సుభిక్షతను చేకూరుస్తుందని నమ్ముతున్నారా?

దేశ ప్రజల మాట ఏమో గాని, ఈ యాగాన్ని చేసే రాజా వారు మట్టుకు తెలంగాణ ప్రజలకే గాక యావత్ భారతదేశ ప్రజలకు సుఖ శాంతులు, సుభిక్షత, ఆయురారోగ్యాలు ఈ యాగ ఫలితంగా సమకూరుతాయనే తమ ప్రఘాడ నమ్మికను పదే పదే ప్రకటిస్తున్నారు, వక్కాణిస్తున్నారు. హిందూ మత పీఠాధిపతుల్లో ఒకరైన శృంగేరీ పెదసాములోరు కూడా, రాజా వారిని మనసార దీవించి, ఈ యాగ నిర్వహణ బాధ్యతలను తమ ప్రథమ శిష్యగణానికి అప్పగించారు. మరి ఇటువంటి యాగ సంకల్పం ద్వారా దైవ కటాక్షాన్ని పొంది, ప్రజలను తమ ఈతి బాధలనుండి విముక్తి గావించే రాజా వారి ప్రఘాడ నమ్మికకు జోహార్లు చెప్పాల్సిందే ! జీ హుజూర్ కొట్టాల్సిందే !

అలనాటి రాజ మహారాజ చక్రవర్తుల యుద్ధ విజయాలను వైభవోపేతంగా ప్రజల ముందు ప్రకటించుకోవడానికి, ఋషులు, బ్రాహ్మణ్య గురువుల చేత మహా-హోమాలు, యజ్ఞ-యాగాలు చేయించే వారని ఈ దేశపు పురాణేతిహాసాలు చెబుతున్నాయి. వాటి వర్ణనలు చదవడమేగాని, వాటిని చూసే భాగ్యం ఇప్పటి ఆధునిక 'ఏప్' (APP/APE) భారతంలో, కలికాలంలో బతుకుతున్న ప్రజలకు లేదు. బుల్లి తెర పైనో, లేక సినిమా వెండితెర మీదో పౌరాణిక, జానపద సినిమాల, సీరియళ్లలో సీన్లు సీన్లుగానో చూడడమేగాని, లైవ్ గా, ప్రత్యక్షంగా వర్తమానంలో చూసే భాగ్యం లేదు. తెలంగాణ రాజా వారు అటువంటి లోటును తీరుస్తున్నందుకు, అటువంటి మహాభాగ్యాన్ని యావత్ భారత వాసులకు కలుగచేస్తున్నందుకు అందరు సంతోషంతో ఎగిరి గంతులు వేయ్యాల్సిన తరుణ మిది. అటువంటి సత్సంకల్పాన్ని మనసారా, తనవితీరా ఆస్వాదించాల్సిన మహదవకాశమిది.

డిసెంబర్ 23 రానే వచ్చింది. రాజా వారి ఎర్రవల్లి 'తోటాస్థానం' యోగకళను సంతరించుకుంది. 'చతుర్వేద, స్వాహాకర, పురస్సర, మహారుద్ర, పురచరణ సహిత, అయుత చండీ మహాహోమాన్ని తెలంగాణ రాజా, శ్రీ చంద్రశేఖరేంద్రుల వారు డిసెంబర్ 27 వరకు అత్యంత నిష్టా గరిష్టతతో నిర్వహిస్తారు. 25 ఎకరాల్లో యాగస్థలి, వాహనాల నిలుపదలకై మరో 15 ఎకరాల స్థలం, వెరసి 40 ఎకరాల్లో ఈ కార్యక్రమం కొనసాగుతుంది. 1100 మంది రిత్విక్కులు, వీరికి 500 మంది సహాయకులు, సకల హిందూ మత సంప్రదాయాలతో ఈ యాగాన్ని నిర్వహిస్తారు. 300 మంది వంట బ్రాహ్మణులు వీరికి భోజన పలహారాలు, అన్నపానాదులు వండి వడ్డిస్తారు. ఉద్దండులైన ఆరుగురు శృంగేరీ యాగ పండితులు ఈ యాగాన్ని పర్యవేక్షిస్తారు. మహా చండీ యాగంతో పాటు 'రాజశ్యామల యాగం', 'మహారుద్ర యాగం' మూడు స్థలాల్లో జరుపుతారు. శృంగేరీ మఠాధి పతులైన భారతీ తీర్థుల వారు, విదుశేఖర తీర్థుల వారి సలహా మేరకు 'రాజ శ్యామల యాగం' కూడా జరపాలని నిర్ణయించారు. రాజ్యము, రాజ్యాధిపతి సుఖ సంతోషాలకై, సకల సంపదలతో వర్ధిల్లుటకై పద్మాలు, అనగా తామర పూలతో చేసే యాగమట ఇది. మొత్తం 106 యాగ గుండాలు, అందులో 100 గుండాలు చండీ యాగానికి, 4 గుండాలు వేదాలకీ, ఒక గుండం రుద్రా యాగానికీ, మరొక గుండం రాజశ్యామల యాగానికి కేటాయించారు. ప్రతి రోజు ఉదయం 7 గంటల నుండి మధ్యాహ్నం 10.30 గంటల వరకు, తిరిగి మధ్యాహ్నం 3.45 గంటల నుండి సాయంకాలం 7 గంటల వరకు యాగ ప్రక్రియ జరుగుతుంది. ప్రతి హోమ గుండం ముందు 11 మంది ఋత్విక్ పారంగతులు కూర్చుని మంత్రోఛ్ఛాటన చేస్తారు. 4 టన్నుల ఆవు నేయి, 16 టన్నుల చెక్క పేళ్లు, 12 టన్నుల బెల్లపు పాయసము, యాగ ప్రక్రియకు నైవేద్య మౌతాయి.

ఈ పాయసాన్ని శృంగేరీ పీఠం నుండి వచ్చిన ప్రత్యేక పాక నిపుణులు తయారు చేస్తారు. 400 మంది బ్రాహ్మణులు యాగపారాయనులకు సహాయకులుగా ఉంటారు. 180 మంది వంట బ్రాహ్మణులు వీరికి వంటకాలు తయారు చేసి వడ్డిస్తారు. ఇంతేగాక ప్రతి రోజూ మరో 2000ల మంది బ్రాహ్మణులు యాగ కార్యక్రమానికి హాజరౌతారు. పరమ ఉత్కృష్ట ప్రముఖులకై సకల సౌకర్యాలతో కూడిన ఆధునిక కుటీరాలు, హెలీకాప్టర్లు వాలడానికి 5 హెలీపేడ్లు, 50,000 మంది కూర్చుని విందారగించడానికి బృహత్ భోజనశాల నిర్మించారు. ఒక వేల వర్షం పడ్డా యాగం నిర్విఘ్నంగా కొనసాగడానికి యాగస్థలిని నీరు దిగని ప్లాస్టిక్ షీట్‌తో కప్పారు. ఈ తంతును దూరం నుండి సాధారణ ప్రజలు కూడా వీక్షించడానికి పెద్ద పెద్ద టి.వి తెరలను అమర్చారు. పై వివరాలన్నీ 'హిందు' ఆంగ్ల దిన పత్రికలో ఆర్.అవధాని గారు రాస్తే చదివి ఆ వివరాలనే ఇక్కడ ఇచ్చాను. ఎలా చూసినా అయుత చండీ యాగమొక మహాద్భుత కార్యమని మీడియా, ప్రజ వేనోళ్ల పొగుడుతున్నాయి.

అయితే, ఈ చండీయాగ మహా సంకల్పం వెనుక అశాస్త్రీయత; రాచరిక-బ్రాహ్మణ్య-వైదిక-రాజ్యాధికార ఆకాంక్ష-వ్యాపార వర్గ కలయిక, పొందిక ఉన్నదని, ఇది భారత లౌకిక రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమనే కాకి గోల, హేతువాద మూర్ఖ మూకల ఊళ ఉండనే ఉంటుంది. ఒక

# కాల్‌మనీ - కొన్ని వాస్తవాలు

***నిరుపేద, మధ్యతరగతి ప్రజానీకంపై కాల్‌మనీ వ్యాపారులు చేస్తున్న దుర్మార్గ, వికృత చర్యలను వివరిస్తూ, ఈ అక్రమ వ్యాపారానికి ప్రభుత్వ అధికారులు, రాజకీయ నాయకులు కొమ్ముకాస్తూ పెంచి పోషిస్తున్నారని అంటున్నారు చిమ్మె జాన్ బర్నబాస్***

ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని విజయవాడలో ఇటీవల బయట పడిన కాల్‌మనీ వ్యవహారం దాదాపు 30 - 40 సంవత్సరాల క్రితం నుంచీ జరుగుతున్నదే. దీనికి అందరూ ఒప్పుకోవలసిందే. ఇది ఒక్క విజయవాడలోనే కాదు, దాదాపు అన్ని జిల్లాల్లోని పెద్ద పట్టణాలలో (జనాభా 50-60 వేలు దాటిన పట్టణాలలో) జరుగుతున్నదే. అయితే విజయవాడలో చాలా ఆర్గనైజ్డ్‌గా, మందీ మార్బలంతో, బెదిరింపులతో జరుగుతూ ఉన్నది. దీనిని తోపుడు బండ్ల వ్యాపారాలు చేసుకునే వారూ, చిన్న చిన్న కూడళ్లలో సిగరెట్లు అమ్మేవారూ, పాన్ బంక్‌ల వాళ్లూ, పండ్ల వ్యాపారులూ అందరూ రోజువారీ వడ్డీలు తీసుకుని, సాయంత్రానికి తిరిగి అసలు కానీ, వడ్డీ కానీ చెల్లించవలసి ఉంటుంది. ఉదాహరణకు ఉదయం 9 గంటలకు 1000 రూపాయలలో 100 తగ్గించుకుని 900 వందలు ఇస్తారు మొదట. సాయంత్రం 6 గంటలకు ఆ వేయి రూపాయలైనా తిరిగి ఇవ్వాలి లేదా 100 అయినా వడ్డీ ఇవ్వాలి. ఇది రోజువారీ వడ్డీ రూపంలో జరుగుతూ ఉంటుంది. దీనిని వసూలు చేయడానికి 20 - 25 సంవత్సరాల యువకులను ఉపయోగిస్తారు. వారికి నెలవారి జీతాలు చెల్లిస్తారు.

ఈ విధంగా ప్రారంభమయ్యే వ్యాపారం ఇల్లు తాకట్టు పెట్టుకుని పెద్ద మొత్తంతో అనగా లక్ష నుంచీ మనకు అవసరం ఉన్నంత వరకూ ఇస్తారు. ఆ తర్వాత నరకం చూపిస్తారు. ఇల్లు లేని వారి నుంచి స్థలమో, పొలమో, బంగారమో తీసుకుని డబ్బిస్తారు. ఆ తర్వాత ప్రామిసరీ నోటు రాయించుకుంటారు. లేదా చెక్కులపై సంతకాలు చేయించుకుంటారు. ఒకవైపు చెక్కులను లేదా ప్రామిసరీ నోట్లను కోర్టులలో దాఖలు చేస్తారు. ఈ విధంగా రుణం తీసుకున్న కుటుంబాలను మానసికంగా వేదిస్తారు. డబ్బులు చెల్లించలేని వారు, వారికి బలి కావలసిందే. ఇచ్చిన మూల ధనం కేవలం మూడు నెలలలోపే రెండింతలయ్యే విధంగా ఈ వ్యాపారం కొనసాగుతూ ఉంటుంది. ఈ వ్యాపారం చేసే వ్యక్తులకు దాదాపు అన్ని రాజకీయ పార్టీలతో సత్సంబంధాలుంటాయి. ముఖ్యంగా పోలీసులతో ఎక్కువగా ఉంటాయి. కొంతమంది పోలీసు అధికారులు ఈ వడ్డీ వ్యాపారంలో తమ పెట్టుబడి పెట్టి కూడా వాటిని ప్రోత్సహిస్తుంటారు.

ముఖ్యంగా ఈ కాల్‌మనీ వ్యాపారంలో మహిళలను లైంగికంగా వేధించడమనేది, వారితో వ్యభిచారం చేయించడమనేది బాధాకరం, అభ్యంతరకరం. దాదాపు ఏ రకమైన అండలేనివారు, మధ్యతరగతి, పేద వర్గాల వారు, కులంతో నిమిత్తం లేకుండా దీని బారిన పడుతున్నారు. వివిధ కారణాల రీత్యా పల్లెలను విడిచిపెట్టి పట్టణాలకు బతుకుదెరువు కోసం వచ్చేవారు, జీవితంలో స్థిరమైన వ్యాపారం చేయలేనివారు, నిరుద్యోగులు వీరి బారిన పడుతున్నారు. తమ అవసరాల నిమిత్తం అధిక వడ్డీలకు సొమ్ము తీసుకుని దానిని సకాలంలో చెల్లించలేక ఇటీవల విస్సన్నపేట దగ్గర గౌరంపాలెంలో షేక్ సర్దార్ అనే 20 సంవత్సరాల యువకుడు ఆత్మహత్యకు పాల్పడ్డాడు. కేవలం 3 వేల రూపాయల అసలుకు దాదాపు 5 వేల వరకూ వడ్డీ చెల్లించినా, ఇంకా 4 వేల రూపాయలు చెల్లించాలని ఆటోను అడ్డగించి, దాడి చేసి కొట్టారు. 4 రోజులు గడువు కోరగా, 4 వేలు చెల్లించి ఆటోను తీసుకుని వెళ్లాలని,

---

సత్సంకల్పం పై రాళ్లు రువ్వడానికి, బురద జల్లడానికి, ప్రజల్లో అలజడి, అశాంతులను రెచ్చగొట్టడానికి ఈ మూకలు ఎప్పుడూ కాచుకుని ఉంటాయ్! కావ్ కావ్ మంటూ గగ్గోలు పెడుతూనే ఉంటాయి! ఇది కొత్తేమీ కాదు. అలనాటి నుండి ఈ నాటివరకు ఇది కొనసాగుతున్న కథే!

అలనాడు ఋషులు, దేవతలు, చక్రవర్తులు, మహా రాజులు జరిపిన యజ్ఞ యాగాదులను విచ్ఛిన్నం చేసే రాక్షస మూకల కథనాలు మన పురాణేతిహాసాల నిండా నిండి, పొంగి పొర్లడం లేదా? మరందుకే కదా అలనాటి అస్త్ర శస్త్రాలు, శాస్త్రాలు, సైన్యాలు, మను ధర్మాలు, చాణక్య నీతులు! అందుకే కదా, ఈనాటి ఆధునిక సూక్ష్మ కన్నుల కెమేరాలు, మానవ రహిత విమానాలు, డ్రోన్లు, దడ దడ లాడించే మర తుపాకులు, సుశిక్షిత రాజ్య రక్షక పతాలాలు, సైనిక బలగాలు వగైరా వగైరా అన్నీనూ.

ఈ మహా సంకల్పంపై కొంత మంది సన్నాసులు గుసగుసలు పెట్టినా, చెవులు కొరుక్కున్నా, చెడు రాతలు రాసుకున్నా, అది వారి అజ్ఞానమే తప్ప వేరేమీ కాదు. భారతీయ వేద విజ్ఞాన హోమ యజ్ఞ సంపదను తిరిగి ఇప్పటి సమాజానికి కళ్లకు కట్టించడంలోని ఉత్కృష్టత ఈ మంద బుద్ధులకు తెలియని, అంతుబట్టని, అర్థంకాని మహోన్నత కార్యమిది.

అయినా నా మంద బుద్ధికి ఇంకా కొన్ని సందేహాలు దిగడి పోయాయ్! అవి ప్రశ్నలై నన్ను సతాయిస్తున్నాయ్!

ఈ భారత రాజ్యాంగ విరుద్ధ బృహత్ మంటల కార్యానికి దుడ్లేడ నుండొచ్చాయ్?

ధనిక ప్రముఖుల సొంత సొమ్ము దీనికి దార పోసేరని అన్నా కూడా, మరి ఆ ధనిక ప్రముఖుల కిన్నేసి దుడ్లు ఎక్కడ నుండి ప్రవాహంగా, మేటలుగా వచ్చి పడ్డాయ్ ?

రాజుల విజయాల వెనుక సైనికుల మరణాలు, హాహాకారాలే ఎల్లప్పుడూ ఉంటాఎందుకని? ఎల్లప్పుడూ సైనికులకే చావులు, రాజులకు కిరీటాలు వచ్చి చేరుతాయ్ ఎందుకని?

ఇప్పుడీ యాగ ఫలం ఎవరికి దక్కేను? సుభిక్ష మెవరికి? ధుర్భిక్ష మెవరికి ?

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

ఆటోను స్వాధీనం చేసుకోగా, మనస్తాపానికి గురై, పురుగుల మందు సేవించి, ఆత్మహత్య చేసుకున్నాడు. ఇలాంటి సంఘటనలు బయటకు రానివి ఎన్నో. వీటినన్నింటినీ పరిశోధించే తీరిక ఈ పోలీసు వ్యవస్థకు లేదు. ఎందుకంటే వీరంతా ఏదో ఒక రూపంలో అందరూ భాగస్వాములే కాబట్టి. డబ్బు - అక్రమ సంపాదనే పరమావదిగా పోలీసులు పనిచేస్తున్నారు. కాబట్టి సామాన్యునికి 'న్యాయం' అన్నది నేతి బీర కాయలో నెయ్యితో సమానం.

విజయవాడలోని 'బెంజ్ సర్కిల్' (పటమట ప్రాంతం) నుంచి మొదలు పెట్టి పోరంకి వరకూ దాదాపుగా 20 కిలోమీటర్ల పొడవునా ప్రతి స్థంభానికీ ఈ కాల్‌మనీ వ్యాపారుల ఫ్లెక్సీలే కనిపిస్తాయి.

పటమట, ఆటోనగర్, తాడిగడప, గోశాల, కానూరు, పోరంకి తదితర ప్రాంతాలన్నీ (ఉయ్యూరు - మచిలీపట్నం రోడ్డు) ఈ కాల్‌మనీ వ్యాపారస్థులైన యలమంచిలి శ్రీరామమూర్తి, చెన్నుపాటి శ్రీను, భవానీ శంకర్, వెనిగళ్ల శ్రీకాంత్, పెండ్యాల శ్రీకాంత్, దూడల రాజేష్‌ల ఫొటోలతో పైన తెలిపిన ప్రాంతాలలో అధికార పార్టీ ఎంఎల్ఏ, బోడే ప్రసాద్ (పెనమలూరు-ఎస్‌సి రిజర్వ్ సీట్) ఫొటోలతో ఫెక్సీలు దర్శనమిస్తాయి.

వాటిలో అక్కడక్కడా, మధ్యలో చంద్రబాబునాయుడు, లోకేశ్, మంత్రి దేవినేని ఉమామహేశ్వర రావు ఫొటోలు కూడా దర్శనమిస్తాయి. ఇదంతా నేను ప్రత్యక్షంగా చూసిన అనుభవంతో రాస్తున్నాను. (డిసెంబర్ 12-13 నాడు నేను ఆ ప్రాంతం లోనే ఉన్నాను).

అసలు ఇదంతా జరుగుతుండగా వామపక్ష రాజకీయ పార్టీలు (అనగా వారి ప్రజా సంఘాలు) ఏమి చేస్తున్నాయనేది విచారించాల్సిన విషయం. దాదాపుగా ఎక్కువ మంది ప్రభుత్వ ఉద్యోగులు కూడా ఈ కాల్‌మనీ వ్యాపారంలో పెట్టుబడులు పెట్టారు.

'పౌర సమాజం' అనగా వివిధ రంగాలలో పనిచేస్తున్న పౌర ప్రజా సంఘాల కార్యకర్తలు సామాన్య పౌరులకు కలగాల్సిన, జరగాల్సిన న్యాయం గురించి ఏ విధంగా స్పందిస్తారో (వేచి చూసే ధోరణి కూడా ఉంది) అనే దానిని బట్టి పోలీసు - ప్రభుత్వ యంత్రాంగం ఉన్నది. ట్రాన్స్‌కో డిఇఇ, సత్యానందం ఈ వ్యవహారంలో బయటికి వచ్చిన ప్రభుత్వ ఉద్యోగి మాత్రమే. కానీ ఇంకా చాలా మంది ఉన్నట్లు వార్తలు వస్తున్నాయి.

ఇంత జరుగుతున్నా అసలు అక్కడ చట్టం ఏమి చేస్తున్నట్లు? అంతా పోలీసు-రాజకీయ నాయకుల సత్సంబంధాలతోనే ఇంత దారుణాలకు ఈ వడ్డీ వ్యాపారులు బరితెగించారనడానికి ఎన్నో ఉదంతాలు మనకు కనబడుతున్నాయి. దాదాపు రెండు నెలల కిందటే విజయవాడ నగరంలోని అజిత్‌సింగ్ నగర్‌కు చెందిన అన్సారి శ్రీనివాస్, చిన్నారి దంపతులు ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేసినప్పటికీ తమకు ఇంతవరకూ న్యాయం జరగలేదని అంటున్నారంటే వీరి ఆగడాలు ఎంత మితిమీరి పోయాయో అర్థం చేసుకోవచ్చు.

పోలీసు అధికారులతో కింది స్థాయిలో అంతా ఈ కాల్‌మనీ వ్యాపారులతో ఏదో ఒక మేరకు అనుబంధం ఉండబట్టే, కేసులు వీరిపై నమోదు కావడం లేదు. లక్షన్నర రూపాయల అప్పుకు 9 లక్షలు కట్టించుకుని, తనఖా ఉంచుకున్న 25 - 30 లక్షల విలువ చేసే ఇంటిని, (దానికి సంబంధించిన కాగితాలను) ఇవ్వలేదంటే అక్కడ పోలీసు వ్యవస్థ పనిచేస్తున్నట్లా లేదా? అనేది అర్థం చేసుకోవచ్చు. ప్రస్తుత కాల్‌మనీ వ్యాపారంలో ఉన్న నిందితులంతా ఏదో ఒక పార్టీలో ఉంటూ తమ అవసరాలు తీర్చుకుంటూ ఉంటారు. వీరికి అన్నిరంగాల ప్రభుత్వ అధికారుల మద్దతు ఉంటుంది. ఉదాహరణకు రెవెన్యూ, పోలీసు, రిజిస్ట్రేషన్, విద్యుత్ తదితర శాఖల అధికారులకు మామూళ్లు ఇస్తూ సామాన్యుల భూములపై, ఇళ్లపై వీరి ప్రతాపం చూపిస్తూ ఉంటారు. ఇది ఒక్క విజయవాడలో మాత్రమే ఉందనుకోవడం పొరపాటు. దాదాపుగా ప్రతి నగరంలోనూ ఇదే పరిస్థితి ఉంది.

కాల్‌మనీని నడుపుతున్నదే తన పార్టీ వారైతే, ముఖ్యమంత్రి మాత్రం వారిపై ఉక్కుపాదం మోపుతామని చెపుతున్నాడు. మళ్లీ వారికి డబ్బు తిరిగి చెల్లించనవసరం లేదని చెపుతున్నాడు. అది కూడా 2015 డిసెంబర్ 14న జరిగిన జిల్లా కలెక్టర్ల సమీక్షా సమావేశంలో అధికారికంగా ప్రకటించాడు. మహిళలను వేధించిన వారిపై నిర్భయ చట్టం కింద కేసు నమోదు చేయాలని ఆదేశాలు జారీ చేశారు.

మహిళలపై అత్యాచారాలు జరిగితే ఎవరైనా ఒక కాల్ నంబర్ (టోల్‌ఫ్రీ) కు ఫోన్ చేస్తే పోలీసులు వెంటనే స్పందించి వారి సమస్యను వారి వద్దకు వచ్చే పరిష్కరిస్తారు. మహిళలపై అత్యాచారాలు చేసేవారిని వెంటనే రెండు నిమిషాల్లో అరెస్ట్ చేస్తామంటూ ఎన్నికలలో హామీలు ఇచ్చిన ముఖ్యమంత్రి - దీనికి ఏమని సమాధానం చెపుతాడు?

ఇదంతా ఏదో ఒక రోజో, ఒక గంటలోనో జరిగిన వ్యవహారం కాదు. మొత్తం కొన్ని సంవత్సరాల నుంచీ జరుగుతున్న తంతు. దీనిని నిరోధించాలంటే చిత్త శుద్ధితో కూడిన పోలీసు వ్యవస్థ అవసరం. రాష్ట్ర ప్రభుత్వానికి సత్సంకల్పబుద్ధి అవసరం. దీని వెనుక ఉన్న, పెట్టుబడి పెట్టిన ఎంఎల్ఏలను, ఎంఎల్సిలనూ వెంటనే అరెస్ట్ చేయాలి. ప్రజల నుంచి తనఖా చేసుకున్న ఆస్తులన్నింటినీ విడిపించాలి. వారి ఆస్తులు వారికి స్వాధీనం చేయాలి.

తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత ఇసుక మాఫియా, మద్యం మాఫియా, కల్తీ నెయ్యి, ఇప్పుడు కాల్‌మనీ వ్యాపారం - వీటన్నింటికీ ముఖ్యమంత్రి బాధ్యత వహించాలి. ప్రభుత్వ జవాబుదారీ తనాన్ని నిరూపించుకోవాలి.

ఇంత బరితెగించి వడ్డీ వ్యాపారం నిర్వహిస్తున్నారంటే, పోలీసు నిఘా వ్యవస్థలు ఏమి చేస్తున్నట్లు? ఈ అక్రమార్కులకు వారు వంత పాడుతున్నట్లే కదా! మొత్తం వ్యవహారంపై హైకోర్టు సిట్టింగ్ జడ్జి చేత విచారణ జరిపించాలని డిమాండ్ చేస్తున్నాం. బ్యాంక్‌ల ద్వారా ప్రభుత్వమే డైరెక్ట్‌గా ప్రజలకు అందుబాటులో రుణ సౌకర్యం కల్పించినట్లయితే ఇలాంటి వ్యక్తుల ఆగడాలు కొద్దిగయినా తగ్గుతాయి.

గతంలో మైక్రో ఫైనాన్స్, అక్షయ గోల్డ్, అగ్రి గోల్డ్ లాంటి సంస్థలు ప్రజలను ఏ విధంగా వేధించాయో అందరికీ తెలిసిందే. రాష్ట్ర అత్యున్నత న్యాయస్థానం (హైకోర్టు) కూడా సంస్థల వ్యవహారాలను తప్పుబట్టాయి. తమ కనీస అవసరాల కోసమే సామాన్య, మధ్యతరగతి ప్రజలు ఈ 'కాల్‌మనీ' వ్యక్తులను ఆశ్రయిస్తున్నారు. వారి దాష్టీకాలకు బలవుతున్నారు. వారి దాష్టీకాలకు వ్యతిరేకంగా, అన్ని ప్రజా సంఘాలు సంఘటితపడి ఎదుర్కోవాలి. రాజకీయాలకతీతంగా నిందితులందరినీ కఠినంగా శిక్షించాలి. 'అధిక వడ్డీ' వసూలు చేసే వ్యక్తులపై కఠిన చర్యలు తీసుకోవాలి. ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి, కఠినంగా వ్యవహరించేలా కృషి చేయాలి. లేనిచో బయటపడని అనేక విషయాలపై కూడా భవిష్యత్తులో మరిన్ని దారుణాలను ఎదుర్కోవలసి రావచ్చు. పోరాటంతోనే దేనినైనా ఎదుర్కోవాలి - సాధించాలి.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# సామాజిక విషరుగ్మతే కాల్‌మనీ

***కాల్‌మనీ పేరుతో వ్యాపారాలు చేస్తూ, సహజ వనరులను బహుళజాతి సంస్థలకు అప్పగిస్తున్న పాలక విధానాలకు ప్రత్యామ్నాయంగా ప్రజల మౌలిక సమస్యల పరిష్కారం కోసం పోరాడాలని అంటున్నారు షేక్ కరిముల్లా***

'ఒక మనిషిని వేరొక మనిషి
ఒక జాతిని వేరొక జాతి దోచుకునే
అవకాశం లేని సమ సమాజం కోసం మేము
క్రాంతిని ఆహ్వానిస్తున్నాం' – షహీద్ భగత్‌సింగ్

భగత్‌సింగ్ ఆశయం దిశగా నేడు యువత ప్రయాణించాల్సిన తరుణం ఆసన్నమైంది. స్వాతంత్ర్యం కల కల్లగా మారి భారత సమాజం నేడు అనేక సామాజిక రుగ్మతలతో కొట్టుమిట్టాడుతోంది. దేశంలో నేడు వరుసగా రైతులు, చేనేత కార్మికులు, ఇతర చేతి వృత్తుల వాళ్లు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వీరికి తోడు నిన్న సూక్ష్మ రుణ సంస్థల నుండి 'స్వల్ప రుణాలు' పొందిన వాళ్లు కూడా ఆత్మహత్యలు చేసుకున్నారు. గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతానికి చెందిన కొద్ది మంది ప్రజలు ఆర్థిక ఇబ్బందులు తాళలేక కిడ్నీలు అమ్ముకోవడమే కాక, బహుళజాతి మందుల కంపెనీల ఔషధ ప్రయోగాలకు ఆహుతి అయ్యారు. నేడు నవ్యాంధ్ర రాజధాని విజయవాడ మహానగరంలో ఐదుగురి నిండు ప్రాణాలను బలితీసుకున్న కల్తీ మద్యం వ్యవహారంపై ప్రజలు విస్మయం వ్యక్తం చేస్తున్న వేళ, ఆ బాధితుల కన్నీటి తడి ఆరకముందే అదే నగరంలో బ్రిటిష్ పాలన కాలంలో అండమాన్ కాలాపానీ జైలులో జరిగిన అకృత్యాలను మించిన దారుణాలు బయట పడ్డాయి. అది జైలు. ఇది నాగరిక సమాజం అని చెప్పుకునే సభ్య సమాజం మధ్య జరుగుతున్న దారుణాలు. ఔరా! సమాజం ఎంత దిగజారిపోయింది! బెజవాడ కాల్‌మనీ రాక్షసుల దురాగతాలు, మహిళలపై లైంగిక దాడుల దారుణాలను చెప్పలేకున్నామని సాక్షాత్తు బెజవాడ పోలీస్ కమిషనరే అన్నారంటే ఈ చీకటి వాస్తవాలు ఎంత ఘోరంగా ఉన్నాయో ఊహించడానికే భయమేస్కోంది.

కాల్‌మనీ రాక్షసత్వం మాటలకందనిది. సాధారణంగా జరిగే వడ్డీ వ్యాపారంలో ఆర్థిక అవసరాలుండే సామాన్యులు, ఆ అవసరాలను సొమ్ము చేసుకోవాలనుకునే వ్యాపారులు ఉంటారు. చట్ట విరుద్ధంగా జరిగే ఆ వ్యాపారంలో వ్యాపారులు అధిక వడ్డీలు గుంజుతారు. కానీ 'కాల్‌మనీ' ఇంతకు మించిన ఘోరాతి ఘోరం. ఈ వ్యాపారం డబ్బుల స్వాహాకు, ఆస్తుల కబ్జాకు మాత్రమే పరిమితమైనది కాదు. ఆ వంకన బలహీనులైన మహిళల్ని చెరబట్టే నీచాతి నీచమైన వ్యూహం. వారిని నిర్దాక్షిణ్యంగా వ్యభిచార రొంపిలోకి బలవంతంగా తోసేసే భయంకరమైన అమానవీయ చర్య. ఇదంతా ఎలాంటి విలువలూ లేని మానవ మృగాలు సాగించే అరాచకం. ఈ ఊబిలో చిక్కుకుంటున్న వారంతా మధ్య తరగతి, సామాన్య చేతి వృత్తుల వారు. బడుగు బలహీనవర్గాల ప్రజలే. చిన్నా చితక పనులు, వృత్తులు, ఆటో వాలాలు, తోపుడు బండ్ల మీద కూరగాయలు, పండ్లు అమ్ముకునే సామాన్యులు. మరో దారిలేక డబ్బు కోసం ఈ రాక్షసుల్ని ఆశ్రయించి ఉండవచ్చు. అయినా వారు ఆపదలో చిక్కుకున్నప్పుడు, అనారోగ్య సమయాల్లో ప్రాణం నిలపడం కోసం, పెళ్లిళ్లు, చదువులకు అవసరమైన డబ్బు అవసరానికి పుట్టక వచ్చిన వారు.

ఎలాంటి వారైనా ఈ దుర్మార్గులకు ఒకటే. పులి గుహలోకి వెళ్లి క్షేమంగా బయటకు రావడం సాధ్యం కానట్లే వీరి వలలో చిక్కుకున్న వారు ఇక వెలుపలకు రాలేరు. వారికి ఏ హక్కులూ మిగలవు. డబ్బు, బంగారం, స్థిరాస్తులు దోచిపెట్టినా ఆ మృగాలు శాంతించవు. ఆ ఇంటి మహిళలు, ఆడపిల్లలు వీరి చేతుల్లో ఆట బొమ్మలై సమిధలు కావల్సిందే.

ఈ దురాగతం కొన్ని సంవత్సరాలుగా పెద్ద మనుషుల కనుసన్నల్లో చాపకింద నీరులా కొనసాగుతోంది. విజయవాడ మొగల్రాజపురం ప్రాంతానికి చెందిన ఓ మహిళ 'కాల్‌మనీ' ఆగడాలపై పోలీసులకు ఫిర్యాదు చేసిన దరిమిలా తీగ లాగితే డొంక కదిలింది.

ఈ మహిళ టైలరింగ్ వస్తువుల వ్యాపారం చేస్తుండేది. తన అవసరాల కోసం పటమట ఎన్‌టిఆర్ సర్కిల్ వద్ద పంట కాలువ రోడ్డులో ఉన్న కాల్‌మనీ వ్యాపారులను ఆశ్రయించింది. వారు రోజువారీ వడ్డీకి ఆమెకు అప్పు ఇచ్చి లొంగదీసుకున్నారు. ఆఫీసులోని వ్యక్తులు ఆమె జీవితాన్ని నాశనం చేశారు. వ్యాపారం మందగించింది. ఆదాయం పెద్దగా లేదు. వడ్డీ సక్రమంగా చెల్లించలేకపోయింది. దీంతో కాల్‌మనీ ముఠా దృష్టి బీటెక్ చదువుతున్న బాధితురాలి కుమార్తెపై పడింది. ఆ అమ్మాయిని తమ వద్దకు పంపించాల్సిందేనని ముఠా సభ్యులు పట్టుబట్టారు. తన జీవితం ఇప్పటికే పాడైందని, కుమార్తె జీవితాన్ని కూడా పాడు చేయొద్దని బాధితురాలు ప్రాధేయపడింది. అమ్మాయి చదువు కోసమే అప్పు చేశానని, మీరు చెప్పినట్లు చేసి ఎలాగైనా అప్పు తీరుస్తానని చెప్పింది. అయినా వారు వినలేదు. చివరకు ఆమె కుమార్తెను లోబరుచుకున్నారు. ఆ అమ్మాయి చుదువుకుంటున్న కాలేజీలోని విద్యార్థినులపై కూడా కాల్‌మనీ రాక్షసుల కన్ను పడింది. నీ కుమార్తెతో కలిసి చదువుకునే యువతులను మా వద్దకు పంపించు అంటూ బాధిత మహిళపై వత్తిడి పెంచారు. దీంతో భయాందోళనకు గురైన ఆమె పటమట పోలీసులను ఆశ్రయించింది. వారు కేసు నమోదు చేసుకోలేదు. దీనితో ఆమె నేరుగా పోలీస్ కమిషనర్ వద్దకు వెళ్లి పరిస్థితి వివరించి కన్నీటి పర్యంతమైనది. దీంతో కేసు నమోదు చేయాల్సిందిగా కమిషనర్ టాస్క్‌ఫోర్స్ పోలీసులను ఆదేశించారు. ఈ మేరకు వారు కేసు నమోదు చేశారు.

ఇలా కాల్‌మనీ వ్యవహారం వెల్లడైంది. దీంట్లో అధికార మదంతో కైపెక్కిన ఎంఎల్‌ఏలు, ఎంఎల్‌సిలు, ఇతర నాయకులు, ప్రజా ప్రతినిధులే కాక పోలీసు అధికారులు సైతం ఈ వ్యాపారంలో ఆరితేరుతున్నారు. అడ్డు, అదుపు లేకుండా సాగిస్తున్న అధిక వడ్డీ వ్యాపారం గుట్టు రట్టు కావడంతో కుడితిలో పడ్డ ఎలుకలా తయారైంది రాష్ట్ర సర్కారు పరిస్థితి. అనేక అనుభవాలు చవి చూసిన ప్రజలకు 'నేతి బీరలో నెయ్యి ఉంటుందా' అనే సామెత చందాన సర్కారు ఏదో చేస్తుందన్న భ్రమలు ఏమీ లేవు.

నేటి ప్రపంచీకరణ విధానం పల్లెలను కూడా మింగిన నేపథ్యంలో పట్టణాల్లో ఎక్కువగా కనిపించే కాల్‌మనీ వ్యాపారం ఇటీవల పల్లెలకు సైతం వ్యాపించింది. గ్రామాల్లోని అమాయక రైతులు, రైతు కూలీలను

వలలో వేసుకుంటూ కాల్‌మనీ వ్యాపారులు యథేచ్ఛగా తమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. జిల్లాలు వేరైనా రాష్ట్ర వ్యాప్తంగా వడ్డీ వ్యాపారులది ఒకటే తరహా ఆలోచనా ధోరణి. బారు వడ్డీ, చక్రవడ్డీ, మీటర్ వడ్డీ, తండల్ సిడీ, ఎమర్జెన్సీ లోన్ పేరేదైనా నిలువు దోపిడీ షరామామూలే. విశాఖపట్నంలో వడ్డీ వ్యాపారం విజయవాడ చరిత్రతో సమాంతర చరిత్ర కలిగి ఉంది.

సుమారు 500 మంది విశాఖలో ఫైనాన్స్ వ్యాపారులు ఉన్నారు, నగరంలోని ఫుట్‌పాత్ వ్యాపారులు, చిరు వ్యాపారులు, దినసరి కూలీల అవసరమే వీరికి పెట్టుబడి. లక్షలలో వడ్డీలు వసూలు చేస్తుంటారు. అప్పు తీసుకునే అవసరాన్ని బట్టి రు. 10 నుంచి రు. 20 వరకు వడ్డీ వసూలు చేస్తుంటారు. కొందరు వ్యాపారులు అందంగా ఉన్న మహిళలు వస్తే వారు తిరిగి తీర్చలేరని తెలిసిన అప్పు ఇచ్చి తర్వాత వారిని బలవంతంగా లొంగదీసుకుని వ్యభిచార ఊబిలోకి దించుతున్నారు.

గుంటూరునైతే ఏకంగా వడ్డీ వ్యాపారానికి పుట్టినిల్లుగా అభివర్ణిస్తుంటారు. గత మైక్రో ఫైనాన్స్ సంస్థల స్ఫూర్తితోనే జిల్లాలో మీటర్ వడ్డీలు, ఆపై బారు వడ్డీలు, చక్ర వడ్డీల వ్యవహారం నడుస్తోంది. ఈ అమానవీయ దందాతో జిల్లాలో కొందరు కోట్లకు పడగలెత్తుతున్నారు. గుంటూరు నగర పాలక సంస్థ పరిధిలో పనిచేసే దాదాపు మూడు వేల మంది పారిశుధ్య కార్మికుల జీత భత్యాలన్నీ వడ్డీ వ్యాపారుల చేతుల్లోనే ఉంటున్నాయి. వీరి ఎటిఎం కార్డులు, బ్యాంకు పాస్ పుస్తకాలు వడ్డీ వ్యాపారుల వద్దే ఉంటున్నాయి. నెల రోజులు కష్టించి పనిచేసే కార్మికులు వడ్డీలు, అప్పులు పోగా కార్మికులు సగటున రు. 2000 మాత్రమే తీసుకు వెళ్లే దుస్థితి ఉంది. ఆర్‌టిసి, మిర్చియార్డు, స్పిన్నింగ్, జిన్నింగ్ మిల్లుల ప్రాంతాల్లో రోజు వారీగా పనిచేసే కూలీ సంపాదించే వారే లక్ష్యంగా మీటర్ వడ్డీల దందా యథేచ్ఛగా కొనసాగుతుంది.

ప్రకాశం జిల్లాలో కాబూలీ వడ్డీ దందా జోరుగా సాగుతుంది. పేరేదైనా జరిగేది దోపిడీయే. పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లాలో రు. 1000 అడిగితే రు. 900 ఇచ్చి సాయంత్రానికి రు. 1000 వసూలు చేస్తారు. దీనికి స్థానికంగా పెట్టుకున్న పేరు తండల్. లక్ష, రెండు లక్షలు అప్పు కావాలంటే ఇల్లు, స్థలం, పొలం ఏదైనా రిజిస్ట్రేషన్ చేయాల్సిందే. ఒక్కరోజు ఆలస్యమైనా ఆస్తి స్వాధీనం చేసుకుంటారు.

ఈ రకంగా రాష్ట్ర వ్యాప్తంగా చట్ట విరుద్ధంగా జరుగుతున్న ఈ దోపిడీ నేడు కోరలు చాచి, మహిళల రక్తమాంసాల సహితం వ్యాపారంగా మార్చింది. ఇది ఖచ్చితంగా నవీనకట్టు బానిసత్వమే అవుతుంది. అప్పులిచ్చి ఇలా అందినకాడికి దోచుకోవడంతో అసలే బతుకు భారమై, నేడు సామాన్యుల బతుకులు ఛిద్రమవుతున్నాయి.

ప్రస్తుత సమాజంలో రకరకాల ఆర్థిక నేరాలు విజృంభిస్తున్నాయి. సామాన్యుల జీవితాలతో రాక్షస క్రీడలాడుతున్నాయి. ఇవేకాక, మద్యం మాఫియా, ఇసుక మాఫియా, ధరలను అమాంతంగా పెంచి, కృత్రిమ కొరతను సృష్టించే దళారీ వ్యవస్థలు. ప్రజలకు చెంద వలసిన ప్రకృతి వనరులు వారికి చెందకుండా బహుళజాతి సంస్థల పాలు చేయడం, ఉదాహరణకు కృష్ణా బేసిన్‌లో రిలయన్స్ సంస్థ గ్యాస్ దోపిడీ, గిరిజనులను నిరాశ్రయులను చేసి పర్యావరణానికి హానిచేసే విశాఖ మన్యంలోని బాక్సైట్ తవ్వకాల జిఒలు, ఇవన్నీ సామాన్య ప్రజల బతుకులు దుర్భరం చేసే అమానుష చర్యలు.

ఇదికాక రియల్ ఎస్టేట్ మాఫియా ప్రస్తుతం రాష్ట్రంపై పడగ విప్పింది. ప్రజల జీవించే హక్కును హరిస్తూ, రాజధాని పేర సంవత్సరానికి మూడు పంటలు పండే వేల ఎకరాలు భూసేకరణ చేసి, దేశ, విదేశీ సంస్థలకు అప్పనంగా బంగారం పండే భూమిని అప్పజెప్పే చర్యలు జరుగుతున్నాయి. ఇవన్నీ ప్రజల జీవితాలను అతలా కుతలం చేస్తున్నాయి. ప్రపంచీకరణ విష సంస్కృతి నేడు ఈజీమనీ సంస్కృతిని సృష్టించింది. సమాజంలో సులువుగా డబ్బులు దండుకునే సంస్కృతి నేడు పెచ్చరిల్లి పోతుంది. 'తొండ ముదిరి ఊసరవెల్లి' అయినట్లు, దీనికి గౌరవాన్ని ఆపాదించి అంటే పరిస్థితి ఎక్కడిదాకా వెళ్లిందో పౌర సమాజం గుర్తించాలి. ఇలా సంపాదించిన ఈజీమనీని పోరంబోకు గాళ్లు ఎన్నికలలో పెట్టుబడులుగా పెట్టి ఓట్లు కొనుగోలు చేసి గెలిచి రాజకీయ నాయకుల అవతారం ఎత్తుతున్నారు. చట్ట విరుద్ధంగా అక్రమ సంపాదనల నీచ మార్గాలను అనుసరిస్తున్నారు. వీరికి తోడుగా అధికారులు కూడా దానిలో వాటా దారులుగా చేరుతున్నారు. ఈ అక్రమ సంపాదనలో రెట్టింపు ఆదాయాన్ని సంపాదిస్తున్నారు. ఇక వీరే రాజకీయాలు ఏలుతున్నారు కాబట్టి, పార్టీలు ఏవైనా విధానాలలో మార్పు లేదు. కాబట్టి ప్రజలకు ఒరిగేది ఏమీలేదు. కన్నీళ్లు కడగళ్లు తప్ప. ఇంతటి అమానవీయ పరిస్థితులు ఉన్నాయంటే అది రోగ పీడిత సమాజానికి ప్రతీకగా భావించాలి.

ఈ రుగ్మతలకు కారణం ప్రపంచీకరణ. 1991 నుంచి మన దేశంలో ప్రారంభమైన ఈ విధ్వంసక ప్రపంచీకరణ పుణ్యాన ప్రస్తుత కాలంలో ప్రతి వస్తువు, సేవ, విషయం ఏదైనా ఖరీదైపోయింది. సామాన్యుడికి అందనంతగా పెరిగిపోయింది. విపరీతంగా పెరిగిపోతున్న ధరలు, ఇక విద్య, వైద్యం సంగతి చెప్పనక్కర లేదు. ఇవన్నీ కార్పొరేట్ సంస్థల చేతుల్లోకి వెళ్లిపోయాయి. దీనికితోడు అతివృష్టి, అనావృష్టితో పంటలు లేకపోవడం, పండినా గిట్టుబాటు ధరలు లేకపోవడం, విదేశీ వస్తువుల స్వైర విహారం, వాటిపై పెంచుకున్న వస్తు వ్యామోహం, అనవసరపు వినియోగ వ్యయం. ఇలాంటి విష చక్రంలో ఈ సామ్రాజ్యవాద విష సంస్కృతి ప్రజలను అప్పులపాలు చేస్తూ, కష్టాలను మిగులుస్తోంది.

ప్రపంచీకరణ విధానం వలన అందరికి ఉపాధి కల్పించే అనేక చిన్న, మధ్యతరగతి పరిశ్రమలు ముఖ్యంగా కుటీర పరిశ్రమలు మూత పడ్డాయి. దేశానికి వెన్నెముకైన వ్యవసాయ రంగం నిర్వీర్యమై, రైతులకు పెను భారంగా మారి, ఆత్మహత్యలకు దారి తీసింది. మిగిలిన వారు పట్టణ ప్రాంతాలకు పొట్టచేత పట్టుకుని వలసలు పోయి భిక్షగాళ్లుగా మారాల్సిన పరిస్థితులను కల్పించింది. ఉపాధి కల్పనలో ఘోరంగా విఫలమైంది. ఉత్పాదకతతో కూడిన ఉపాధి కల్పన లేక ప్రజల కొనుగోలు శక్తి తగ్గిపోయింది. అనేక ఇబ్బందులకు ప్రజలు గురై ఈ కాల్‌మనీ లాంటి విషకోరల్లో చిక్కుకుని విలవిలలాడి పోవలసిన పరిస్థితి దాపురించింది. ప్రపంచీకరణ ప్రభావం భారత సామాజిక, ఆర్థిక పునాదులను కదిలించింది. ఇక్కడున్న ప్రతీది (ప్రకృతి వనరులు) మనది కాకుండా పోయింది. మన జీవితంతో ముడిపడ్డ ప్రతీ అంశం ప్రపంచీకరణ ప్రభావానికి గురైంది.

చివరకు మన సంస్కృతి, మన విలువలు మనవి కాకుండా పోయాయి. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా ప్రపంచ బ్యాంకు పాలసీని అమలు చేయడంలో పోటీలు పడి మరీ పనిచేస్తున్నాయి. దీని ఫలితమే ఈ నేటి సామాజిక రుగ్మతలు. కాబట్టి ప్రజల ముందు నేడు ఒకటే పరిష్కార మార్గం ఉంది. ప్రస్తుతమున్న నేటి ఎన్నికల పార్టీలను ఛీకొట్టి, భగత్‌సింగ్ కలలు కన్న సమ సమాజ స్థాపనకు పీడితులు, తాడితులు సమైక్యంగా, సంఘటితంగా పోరాటం చేయడం తప్ప వేరే మార్గం లేదని అర్థం చేసుకుని ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగాలి. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# వైఫల్యం దిశగా తెలంగాణ పాలన

***ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడినా పాలనా విధానాల్లో మార్పు లేదని, కనీస ప్రజాస్వామిక హక్కులను కూడా అనుమతించడం లేదని అంటున్నారు* అరణ్య**

ప్రజలు ఎన్నో ఆశలతో గెలిపించుకున్న ప్రభుత్వాలు ప్రజల ఆశలను వమ్ము చేస్తూ పరిపాలన సాగించినప్పుడు అట్లాంటి ప్రభుత్వాలను ఆ ప్రజలే మట్టికరిపించిన ఉదాహరణలెన్నో చరిత్రలో ఉన్నాయి. అధికారంలో ఉన్నంత వరకూ కన్నూ మిన్నూ కానని స్థితిలో వాటి తప్పులు వాటికి కనిపించవు సరికదా, అన్నీ సవ్యంగానే అగుపిస్తాయి. ఇప్పుడు తెలంగాణ రాష్ట్రాన్ని పరిపాలిస్తున్న తొలి ప్రభుత్వానికి కూడా సరిగ్గా తన అపసవ్య పాలనే సవ్యంగా కనపడుతున్నది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ సమయంలో సమైక్య ప్రభుత్వాలు తెలంగాణను తీవ్రంగా వంచించాయని, దోపిడీకి పాల్పడ్డాయని ఆరోపిస్తూ తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) పార్టీ ఎప్పటికప్పుడు ఆ మోసాలను, కుట్రలను విమర్శిస్తూ వచ్చింది. కానీ అదే పార్టీ ఇప్పుడు అధికారంలోకి వచ్చాక సమైక్య ప్రభుత్వాల హయాంలో వలెనే తన పాలనను కొనసాగిస్తూ వస్తున్నది. స్వపరిపాలన అనే మాటను ఉద్యమ సమయంలో పదేపదే వల్లించిన ఆ పార్టీ ఇప్పుడు ఆ మాటను మరిచిపోయింది. ఇష్టానుసారంగా పరిపాలిస్తూ ప్రజల అవసరాలను గాలికి వదిలేసి, ప్రజా వ్యతిరేకమైన పనులను సమైక్య ప్రభుత్వాల వలెనే చేస్తూ వస్తున్నది. అందుకే ఏడాదిన్నర టిఆర్ఎస్ ప్రభుత్వ పనితీరు ప్రజా ప్రయోజనాలను విస్మరిస్తూ ప్రజా వ్యతిరేక విధానాలను నడుపుతున్న దిశగా కొనసాగుతున్నదని అర్థం చేసుకోవచ్చు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కంటే దారుణంగా తెలంగాణలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వాళ్ల ఆత్మహత్యలతో తమ ప్రభుత్వ పాలనకు సంబంధం లేదని, రైతులు సొంత కారణాలతోనే ఆత్మహత్యలు చేసుకుంటున్నారని ప్రభుత్వ పెద్దలు నిస్సిగ్గుగా చెపుతున్నారు. నిజానికి కొత్తగా ఏర్పడ్డ రాష్ట్ర ప్రభుత్వం రైతులకు సమస్యల విషయంలో ఎలాంటి భరోసానివ్వలేదు. వ్యవసాయం దండుగ అని సెలవిచ్చిన చంద్రబాబు, అట్లా అనడానికి వ్యవసాయ భూములను బహుళజాతి సంస్థలకు కట్టబెట్టాలని, అందుకు రైతులు వ్యవసాయాన్ని వదులుకోవాలనేది ఒకానొక కారణం కాగా, ఇప్పుడు వ్యవసాయం దండుగని బయటకు అనడం లేదు గానీ కెసిఆర్ ఆయన సుపుత్రుడు కెటిఆర్‌లు భూములు కట్టబెట్టే పనిని మాత్రం చాలా వేగంగా చేస్తూనే ఉన్నారు. బలవంతపు భూసేకరణలు తెలంగాణలో ఎక్కువైపోయాయి. వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేసి తద్వారా రైతులు వ్యవసాయాన్ని భారంగా భావించి వదిలేస్తే ఆ భూములను బహుళజాతి సంస్థలకు అప్పగించాలనే ఆలోచనొకటి గత ప్రభుత్వాల లాగే టిఆర్ఎస్ ప్రభుత్వం చేస్తుండడం రైతు ఆత్మహత్యలకు ప్రధాన కారణమవుతున్నది.

విద్యారంగ అభివృద్ధి గురించి తమకొక గొప్ప విజన్ ఉన్నదని ఉద్యమ సమయం నుంచీ కెసిఆర్ ఊరిస్తూ వచ్చాడు. ఆ ఊరింపు ఫలితంగా బైటకు వచ్చిందే కెజి నుంచి పిజి వరకు ఉచిత విద్య. ఈ విషయమై ఏడాదిన్నరగా చెప్పిందే చెపుతూ వచ్చిన కెసిఆర్ గానీ, ప్రభుత్వంలోని వాళ్లు గానీ ఇది ఎట్లా సాధ్యమో, ఎట్లా ఆచరణ రూపానికి తెస్తారో చెప్పలేదు. అసలు కెజి టు పిజి అంటే ఏమిటో స్పష్టంగా చెప్పలేదు. కెజి నుంచి పిజి వరకు ఇప్పటికే అనేక ప్రభుత్వ సంస్థలు, ప్రైవేట్ సంస్థలు విద్యా రంగంలో పనిచేస్తున్నాయి. వాటన్నింటినీ ఎట్లా సమన్వయపరుస్తారో, ఎట్లా ఉచిత విద్య అందిస్తారో ప్రభుత్వానికి ఒక ఆలోచన లేదు. ఇప్పుడున్న సంస్థల ద్వారానే ఉచిత విద్య అందిస్తారా? ప్రత్యేక సంస్థలు నెలకొల్పుతారా? అనే స్పష్టతా లేదు. ఇప్పుడున్న సంస్థల ద్వారా నెలకొల్పదలిస్తే ప్రభుత్వ సంస్థలనైతే ఇప్పటికే శక్తివంతం చేయాల్సిన అవసరముండేది. ప్రైవేట్ సంస్థలనైతే రద్దు పరచడమో, ప్రభుత్వ సంస్థలలో విలీనం చేయడమో జరగాల్సి ఉండేది. అయితే ఇవేమీ జరగలేదు. ఒకవేళ ఇప్పుడున్న సంస్థల ద్వారా కాకుండా ప్రత్యేక సంస్థలను ఏర్పాటు చేసే ఆలోచనేదైనా ప్రభుత్వానికుంటే మరి ఇప్పటికే విస్తృతంగా ఉన్న ప్రభుత్వ విద్యాలయాలు, కళాశాలలు, కెజిబివి, మోడల్ స్కూళ్ల వంటి వాటి పరిస్థితి ఏమిటి? ప్రైవేట్ విద్యా సంస్థలను అట్లాగే కొనసాగిస్తూ వాటిని ఢీకొని కెజి నుంచి పిజి ఉచిత విద్య ఆశయాన్ని సాధించుకోగలరా? ఇన్ని అనుమానాల మధ్య ప్రభుత్వంలోని వాళ్లు ఒక్కరూ ఈ విషయాలపై పెదవి విప్పరు. అందరిదీ ఒకేమాట 'త్వరలో కెజి టు పిజి ప్రారంభమవుతుంది' అని. ఏం ప్రారంభమవుతుంది? ఎట్లా ప్రారంభమవుతుందో వాళ్లకే తెలియాలి.

మలిదశ తెలంగాణ ఉద్యమాన్ని ముందుకు నడిపించిన విద్యార్థులను, నిరుద్యోగులను తెలంగాణ ప్రభుత్వం మోసం చేసింది. టిఎస్‌పిఎస్‌సిని ఏర్పాటు చేయడంలో తీవ్ర జాప్యం చేసింది. ఉద్యోగాల ఖాళీలను నిర్ణయించడంలో ఆ సంస్థకు ప్రభుత్వం సహకరించలేదు. కొద్దిపాటి ఖాళీలకు నోటిఫికేషన్స్ ఇచ్చి అదేదో గొప్పపని అన్నట్లుగా ప్రభుత్వం సంబరపడుతున్నది. పది జిల్లాలలోని వివిధ శాఖలలో ఎన్ని ఖాళీలున్నాయో బయటకు చెప్పడం లేదు. అధికారంలోకి రాగానే లక్ష ఉద్యోగాలు నింపుతామని బీరాలు పలికిన వాళ్లు ఏడాదిన్నరైనా అందులో పదోవంతు ఉద్యోగాలనైనా నింపలేదు. ఈ విషయమై నిలదీసినందుకు విశ్వ విద్యాలయ విద్యార్థుల మీదికి ప్రభుత్వ పెద్దలు, టిఎస్‌పిఎస్‌సి వాళ్లు కోపానికి వస్తున్నారు. విశ్వ విద్యాలయాలకు నిన్న మొన్నటిదాకా వీసీలు లేరు. విద్యార్థులకు ప్రభుత్వం మెస్ బిల్లులు సరిగ్గా చెల్లించడం

లేదు. గ్రంథాలయాలకు కొత్త నిధులు మంజూరు చేయడం లేదు. వందలు, వేల కోట్ల రూపాయల పెట్టుబడులు వస్తున్నాయంటూ, వస్తాయంటూ రోజుకోసారి ఊదరగొట్టే తండ్రీ కొడుకులు ఆ పనులలో నిరుద్యోగ యువతకు ఉద్యోగాలు ఇప్పిస్తామనే భరోసా మాత్రం ఇవ్వడం లేదు. ప్రభుత్వ శాఖల్లో ఉద్యోగాలను పూర్తిగా తగ్గించి వేసి, ప్రైవేట్ సంస్థలలో ఉద్యోగావకాశాలను పెంచుతామని బాహాటంగానే అనధికారికంగా చెపుతూ వస్తున్నప్పుడు ఇక నిరుద్యోగులకు ఈ ప్రభుత్వం చేసిన మంచి ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

ఇక చిరుద్యోగుల విషయానికి వస్తే అంగన్‌వాడీ వర్కర్లు సిఐటియు వంటి సంఘాల ఆధ్వర్యంలో వాళ్ల సమస్యల కోసం పోరాటాలు చేస్తుంటే వాళ్లను భయపెట్టి టిఆర్ఎస్ అనుబంధ సంఘంలోకి మార్చించారు. అంగన్‌వాడీలను శక్తివంతం చేయాల్సింది పోయి వాటిని పాఠశాలల్లో విలీనం చేస్తామంటున్నారు. మునిసిపల్ కార్మికులు తమకు కనీస అవసరాలు తీర్చే ఏర్పాటు చేయాలని ఉద్యమిస్తే వాళ్లను బెదిరించారు. ఆశా వర్కర్లు వంద రోజుల పైబడి సమ్మె చేస్తుంటే మహిళలని కూడా చూడకుండా కొట్టి, హింసించి అరెస్టు చేశారు. పైగా 'మర్యాదగా అడిగితే డిమాండ్లు తీరుస్తాం గానీ, బజారుకెక్కితే తీరుస్తామా?' అని స్వయాన మంత్రులే మాట్లాడుతున్నారు. బజారుకెక్కి ఉద్యమాలు చేసి రాష్ట్రాన్ని సాధించుకున్న తెలంగాణలో ఉద్యమ పార్టీ అని గొప్పలు చెప్పుకునే పార్టీలోని వాళ్ల మాటల తీరు ఇది. కాంట్రాక్ట్ ఉద్యోగులందరినీ పర్మనెంట్ అయ్యేలా రెగ్యులర్ చేస్తామని గద్దెనెక్కే ముందు చెప్పిన కెసిఆర్ ఆ మాటను మర్చిపోయారు. గుర్తుచేసి మరీ అడిగినప్పుడు కాంట్రాక్ట్‌కు కాలపరిమితి విధిస్తున్నారు. ఏడాదిన్నరగా ఎవ్వరినీ రెగ్యులర్ చేసింది లేదు. ప్రభుత్వ శాఖలలో పనిచేస్తున్న అనేక మంది ఉద్యోగులకు కనీస వేతన చట్టం ప్రకారం రోజు కూలీకి సరిపడా వేతనం కూడా అందడం లేదు. అలాంటి వాళ్ల సమస్యలు ఈ ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఇలాంటి పరిస్థితులలో ఏ సెక్షన్ ఉద్యోగులు ఉద్యమబాట పడదామని ఆలోచించిననూ వాళ్లను నయానో భయానో నిలువరిస్తూ, ఉద్యమం ప్రారంభించిన తక్షణమే పోలీసులతో అరెస్టులు చేయించి ఉద్యమాలపై ఉక్కుపాదం మోపుతున్నారు.

ప్రజల మౌలికావసరాలు తీర్చే పనులు అనేకం ఉండగా, అప్రాధాన్య అంశాల మీద కెసిఆర్ హామీలు గుప్పిస్తున్నాడు. యాదగిరిగుట్ట, వేములవాడల అభివృద్ధి ఏరోజైనా తెలంగాణ ఉద్యమ డిమాండులుగా ఉన్నాయా? నల్లగొండ ఫ్లోరోసిస్ సమస్య కంటే, పాలమూరు వలసల సమస్య కంటే, కరీంనగర్ మైనింగ్ సమస్య కంటే గుడుల అభివృద్ధి ప్రధానమైన విషయమా? హెలికాప్టర్‌లో చిన్నజియర్‌ను ఎక్కించుకుని చక్కర్లు కొట్టి మరీ చూసేంత ఆసక్తి దేవాలయాల విషయంలో ఉందిగానీ ఏనాడైనా ప్రజల అత్యవసర సమస్యల మీద సీరియస్‌గా కలెక్టర్లతోనో, శాఖాధికారులతోనో సమావేశాలు పెట్టిన దాఖలా ఈ ఏడాదిన్నరలో ఒక్కటంటే ఒక్కటైనా లేదు. ఆ సమస్యల పరిష్కారంలో కనీసం చొరవ చూపించిన దాఖలా కూడా ఒక్కటీ లేదు. చండీయాగాల పనులను పర్యవేక్షించే వీలుంటుంది గానీ, అట్టడుగు వర్గాల ప్రజల ఇళ్లలోకి వెళ్లి వాళ్ల సమస్యలు తెలుసుకునే తీరిక ముఖ్యమంత్రికి ఉండదు. హోమాలకు ఆహ్వానించేందుకు కర్ణాటకకు వెళ్లి మరీ స్వాములను కలిసే వీలుంటుంది గానీ, ప్రజల సమస్యలను తీర్చే విషయమై కనీసం ఆలోచించే ఆసక్తి కూడా ఉండదు. ఇదీ తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి గారి తీరు.

ఈ ఏడాదిన్నరగా టిఆర్ఎస్ కార్యకర్తలు ఒక బలమైన మాఫియాగా ఏర్పడిపోయారు. రియల్ ఎస్టేట్ దందాలు చేస్తూ, బెదిరింపులతో లాండ్ సెటిల్‌మెంట్స్ చేస్తున్నారు. గత ప్రభుత్వాల పార్టీల కార్యకర్తల కంటే విచ్చలవిడిగా స్వేచ్ఛగా ఇసుక అక్రమ రవాణా చేస్తున్నారు. కలప స్మగ్లింగ్ చేస్తున్నారు. ప్రైవేట్ విద్యా సంస్థలలో ఇబ్బడి ముబ్బడిగా పెట్టుబడులు పెడుతున్నారు. స్థానిక ప్రజా ప్రతినిధుల సహాయంతో దొంగచాటుగా కల్తీ మద్యం, గుడుంబాలు తయారు చేసేపనిలో భాగస్వాములవుతున్నారు. పత్రికలలో గుడుంబాపై పోరాటం అని ప్రకటనలు గుప్పిస్తున్న ప్రభుత్వ ప్రముఖుల సాయంతోనే, కార్యకర్తలు గుడుంబా తయారీదార్లకు అండగా నిలుస్తున్నారు. ఈ ఏడాదిన్నరలో కార్యకర్తల మాఫియా ప్రమాదకరమైన శక్తితో సుస్థిరతను సంపాదించుకుంది. ఈ మాఫియా పల్లెలు మొదలు పట్నాల దాకా విస్తరించి అక్రమమైన, ప్రజా వ్యతిరేకమైన పనులను నిర్వహిస్తూ డబ్బు సంపాదనే ధ్యేయంగా పనిచేస్తూ పోతున్నది. గతంలో వలెనే ఇప్పుడూ ప్రజా ప్రతినిధులు ఈ మాఫియాను పెంచి పోషిస్తూ వస్తున్నారు. ఒకానొక సంతృప్త స్థాయి దాటితే ఈ మాఫియా ప్రజల ఆంతరంగిక జీవితంలోకి చొరబడే ప్రమాదం లేకపోలేదు.

ఈ ఏడాదిన్నరలో టిఆర్ఎస్ ప్రభుత్వం చేసిన అతి దుర్మార్గమైన పని శృతి, సాగర్‌రెడ్డిల బూటకపు ఎన్‌కౌంటర్. మావోయిస్టు ఎజెండానే మా ఎజెండా అని నిత్యం వల్లిస్తూ ఆ ముసుగులో వాళ్లిద్దరినీ చంపి వేయించింది. కిరాతకంగా అతి భయంకరంగా ఈ ప్రభుత్వం వాళ్లను చంపించింది. తెలంగాణ ఉద్యమ సమయం నుంచీ మావోయిస్టు అవగాహనను, ఎజెండాను సమర్థిస్తూ వచ్చిన కెసిఆర్ అధికారంలోకి రాగానే తన ఆలోచనను మార్చుకున్నాడు. పల్లెల్లో వందలాది, వేలాది మంది పోలీసులను మోహరించాడు. ఆ పోలీసులు పాత నక్సల్స్‌ను వేధించడం మొదలుపెట్టారు. తరచూ స్టేషన్‌లకు పిలుస్తూ వాళ్లకు అటెండెన్స్‌లు ఏర్పాటు చేశారు. నిరంతర కూంబింగ్‌లతో అడవులను జల్లెడ పడుతున్నారు. తెలంగాణలోకి మావోయిస్టులు ప్రవేశించ బోతున్నారనే సాకును చూపించి పల్లెల్లోని ప్రజలను హింసిస్తూ వాళ్ల హక్కులను కాలరాస్తూ వచ్చారు. పోలీసులే వాల్ పోస్టర్లు వేయించి, అవి మావోయిస్టులు వేశారని, వారికి సహకరించినందుకంటూ అమాయకులను అరెస్టు చేసి కేసులు పెడతామని బెదిరించి డబ్బులు గుంజుతూ వచ్చారు. అడవులన్నింటినీ గాలిస్తూ వచ్చారు.

నిజంగా మావోయిస్టు ఎజెండా గురించి మాట్లాడే వాళ్లెవరైనా ఇలా చేస్తారా? ఏం తప్పు చేశారని మర్మావయవాల మీద కొట్టి మరీ శృతిని, సాగర్‌ను చంపేశారు? వాళ్లను హత్య చేశాకనైనా ముఖ్యమంత్రి ఆ విషయంపై ఒక్కటంటే ఒక్కటి పశ్చాత్తాప ప్రకటనైనా చేయలేదు. 'అట్లా జరగక పోనుండే' అని సానుభూతి మాటలు మాట్లాడిన కెసిఆర్ పుత్రికారత్నం 'అట్లా ఎందుకు జరిగింది?' అని తండ్రిని మాత్రం ప్రశ్నించలేదు.

తెలంగాణ రాష్ట్రం సాధించుకుని ఇట్లాంటి పోలీస్ హత్యలను, ప్రభుత్వ హత్యలను రూపుమాపుకోవాలని అనుకున్నాం కదా ప్రజలమంతా! కానీ ఉమ్మడి ప్రభుత్వంలో లాంటివే కసాయి హత్యలను ఎన్‌కౌంటర్ల పేరిట

# కార్పొరేట్ల సేవలో ఆంధ్రప్రదేశ్ పాలన

***ప్రజల జీవించే హక్కులను కాలరాస్తూ, ప్రకృతి వనరులను పెట్టుబడిదారుల గుత్తాధిపత్యం చేస్తూ, నూతన రాజధాని నిర్మాణం పేరుతో దేశీ, విదేశీ కార్పొరేట్ సంస్థల సేవలో ఆంధ్రప్రదేశ్ పాలన సాగుతోందని అంటున్నారు* పి.వి.రమణ**

**చం**ద్రబాబు గతంలో ఎటువంటి హైటెక్ ప్రచారంతో ప్రజల్ని మోసం చేశాడో, నేడు అదే ధోరణి వంద రెట్ల వేగంతో కొనసాగుతోంది. మళ్లీ అధికారంలోనికి వచ్చి, గడిచిన 18 నెలల్లో ఆయన చేసిన దుందుడుకు చర్యలెన్నో ఇందుకు రుజువుగా మనముందు సాక్షాత్కరిస్తున్నాయి. దీంతో ఆంధ్రప్రదేశ్ ప్రజల జీవితాలు మరింత ఛిద్రమవుతున్నాయి. ప్రజల సమస్యలను ఏమాత్రం పట్టించుకోవడంలేదు, పరిష్కరించడంలేదు సరికదా కార్పొరేట్ అనుకూల విధానాలతో లక్షలాది మంది రైతుల, దళితుల, ఆదివాసుల, మత్స్యకారుల, నిరుపేదలను నిర్వాసితులను చేసి వారి జీవితాలను నాశనం చేసే విధానాలనే అమలు చేస్తున్నాడు. ప్రమాదకరమైన థర్మల్, అణువిద్యుత్తు ప్రాజెక్టులు, బాక్సైట్ తవ్వకాలు, ప్రకృతి వనరుల విధ్వంసం, చమురు సీమా, కోస్తా తోరణం పేరుతో తీర ప్రాంతంలో విధ్వంసం, పారిశ్రామిక కారిడార్లు, నూతన రాజధాని పేరిట పెద్దఎత్తున విధ్వంసం సృష్టిస్తూ, వ్యవసాయరంగాన్నీ, రైతులనూ దెబ్బతీసే విధానాలనే కొనసాగిస్తూ రాష్ట్రాన్ని డిజిటల్ ఆంధ్రప్రదేశ్‌గా మారుస్తాననీ, స్మార్ట్ సిటీలు, స్మార్ట్ వార్డులు, స్మార్ట్ గ్రామాల రూపకల్పనే ప్రధాన ధ్యేయమనీ, వైఫైతోనే అభివృద్ధి సాధిస్తామని ప్రకటనలు గుప్పిస్తున్నాడు. ఒక వైపు నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి. అన్నపూర్ణ అని చెప్పే ఆంధ్రప్రదేశ్‌లో ఆహార ఉత్పత్తులను వేల టన్నుల దిగుమతి చేసుకునే పరిస్థితి దాపురించింది చంద్రబాబునాయుడు అమలు చేస్తున్న అభివృద్ధి నమూనా వల్ల. ఇదే విధానంలో మిగిలిన కాలం పాలన సాగితే ఆకలితో చనిపోయే వారి సంఖ్య గణనీయంగా పెరిగే ప్రమాదం మనముందు కనిపిస్తోంది.

అమెరికాకు చెందిన చికాగో యూనివర్సిటీ చంద్రబాబునాయుడికి గౌరవ డాక్టరేట్ ఇస్తున్నట్లుగా ప్రకటించడం చంద్రబాబు కొనసాగిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాలకు గుర్తింపు కిందే భావించవచ్చు. అమెరికాలో యూనివర్సిటీ అధ్యక్షుడు డాక్టర్ వాట్సన్ 'సామాజిక, ఆర్థిక సంస్కరణలతో రైతుల, మహిళల ఆర్థిక స్వావలంబనకు చంద్రబాబు విశేష కృషి చేస్తున్నారు. ఉదూద్ వంటి విపత్తులను సమర్థవంతంగా ఎదుర్కొన్నారు. 2029 నాటికి దేశంలో మూడు అగ్రగామి రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్‌ను నిలబెట్టడం, 2050 నాటికి ప్రపంచంలోనే అద్భుతమైన రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌ను తీర్చిదిద్దడం అనే లక్ష్యాలతో ఒక ప్రణాళికతో ముందుకు వెళ్తున్నారు. ఈ కృషికి గుర్తింపుగా ఆయనకు గౌరవ డాక్టరేట్‌ను ఇస్తున్నాం' అని పేర్కొన్నారు. చంద్రబాబు చేస్తున్న మోసపూరిత ప్రకటనలు గ్లోబల్ లెవెల్లో వాస్తవాలుగా నమ్మించే ప్రయత్నం చేస్తుంటే, మేధావులకు ఇవ్వవలసిన గౌరవ డాక్టరేట్లు అబద్ధాలు ఆడడంలో సిద్ధహస్తుడైన చంద్రబాబుకు కూడా లభిస్తోందని దీనిని బట్టే రుజువవుతుంది.

మోడీ ప్రధాని కాగానే ప్రపంచబ్యాంకు భారత అధిపతి ఒన్నోరూహ్లీ భారత దేశంలో వ్యాపారం పెరగాలంటే మౌలిక సదుపాయాలు కల్పించాలని, పెట్టుబడి, మార్కెట్లు పెంచాలని, ఎన్నో రంగాలలో మార్పులు తీసుకురావాలని, వ్యాపార అవకాశాలు సరళీకరించాలని, నైపుణ్యాలు పెంచాలని ఆదేశించారు. ఈ పనులు కేంద్రస్థాయిలో చేస్తే సరిపోదని, రాష్ట్రాల స్థాయిలో కూడా జరగాలని ఆదేశించారు. దాంతో కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు 98 సూచనలతో ఒక కార్యాచరణ పథకాన్ని ఇచ్చారు. దాని ప్రకారం వ్యాపార సంస్థలను నెలకొల్పడం, భూమి కేటాయింపు, నిర్మాణ అనుమతులు సంపాదించడం, పర్యావరణ నిబంధనలు, కార్మిక నిబంధనలతో వ్యవహరించడం, విద్యుత్ వంటి

---

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కూడా చేస్తూ పోతుంటే తెలంగాణ ప్రజలు ఏం చేయాలి? ఎవరితో చెప్పుకోవాలి?

ఇట్లా చెప్పుకుంటూ పోతే చాలా రంగాలలో వైఫల్యాలే కనపడతాయి. ఇవన్నీ గమనించి అర్థం చేసుకోవాల్సింది ఏమిటంటే తెలంగాణలో ఈ ఏడాదిన్నర పాలన వైఫల్యం దిశగా కొనసాగింది. పరిపాలన అంటే అవగాహన లేని, విధాన నిర్ణయాలపైన స్పష్టత లేని ఒక తెలివితక్కువ ప్రభుత్వం తెలంగాణలో పాలనను సాగిస్తున్నది. చంద్రబాబు నాయుడు వలే, రాజశేఖర్‌రెడ్డి వలే, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర పాలకుల వలే కెసిఆర్ తెలంగాణ రాష్ట్రంలోనూ దుర్మార్గంగా పోలీసుల మీదే ఆధారపడుతూ ప్రభుత్వాన్ని నడిపిస్తున్నాడు. పౌర హక్కులను కాలరాసి, ఉద్యమిస్తే అరెస్టులు చేయిస్తూ, ప్రశ్నిస్తే హింసిస్తూ, పోరాటాలు చేస్తే ఎన్‌కౌంటర్‌లు చేయిస్తూ ప్రజాకంటక పాలనను సాగిస్తున్నాడు.

ఏడాదిన్నరలో చేసిన ఈ పాలనను సమీక్షించుకుని, విధానాలను మార్చుకుని, ప్రజావసరాలను తీర్చే విధంగా, పౌర హక్కులను సంరక్షించే విధంగా, పోరాటాలను ప్రజాస్వామ్య బద్ధంగా అంగీకరించే విధంగా, పోరాటాల, ఉద్యమాల డిమాండ్ల పరిష్కారం వైపుగా ఆలోచించే విధంగా పరిపాలనను మార్చుకోకపోతే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఎంత హీనంగా పరిపాలించిందో చరిత్ర రికార్డు చేస్తుంది. ముమ్ముందు తరాలు టిఆర్ఎస్ ప్రభుత్వం గురించి హీనాతి హీనంగా మాట్లాడుకునే అవకాశం ఏర్పడుతుంది. అట్లా జరగకూడదంటే తక్షణమే మారడం తప్ప మరో అవకాశం ఈ తెలంగాణ ప్రభుత్వానికి లేదు. నిజాయితీతో, నిబద్ధతతో ఆ మార్పును మిగిలిన ఈ మూడున్నరేళ్లూ కొనసాగిస్తూ పోతే తప్ప ఈ ప్రభుత్వానికి మంచి పేరు వచ్చే అవకాశమూ లేదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

మౌలిక సౌకర్యాలు కల్పించడం, పన్నుల వ్యవస్థను నమోదు చేయడం, పాటించడం, తనిఖీలు నిర్వహించడంతో పాటు ఒప్పందాలకు కట్టుబడి ఉండడంలాంటి రంగాలలో మార్పులు తేవాలని సూచించారు. జూన్ 2015లో రాష్ట్రాల ఆచరణ మీద సమీక్ష జరిపితే 71.14 శాతంతో గుజరాత్ ప్రథమ స్థానంలోనూ, 70.12 శాతంతో ఆంధ్రప్రదేశ్ 2వ స్థానంలోనూ ఉన్నట్లు తేలింది. దీన్ని బట్టి సామ్రాజ్యవాద అనుకూల విధానాలను ఆచరించడంలో చంద్రబాబు ప్రతిభ అర్థమవుతుంది.

ఆస్ట్రేలియా ఇంధన, పౌరసత్వ, బహుళ సాంస్కృతిక వ్యవహారాల మంత్రి మైక్ నహాన్ ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబును కలిసి గనుల, మత్స్య, పాడి పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన సహకారం అందించడానికి సిద్ధంగా ఉన్నామని ప్రకటించారు. బంగారం, వజ్రాలు, బాక్సైట్, బీచ్‌శాండ్ లాంటి ఖనిజాలను ఉత్పత్తులుగా మార్చి ప్రపంచ దేశాలకు ఎగుమతి చేస్తున్నామని వివరించారు. టైటానియం ఎగుమతిలో ప్రపంచంలోనే అగ్ర స్థానంలో ఉన్నామని చెప్పారు. దానికి చంద్రబాబు నాయుడు 'ఆంధ్రప్రదేశ్‌లో విరివిగా లభించే ఇనుప ఖనిజం, బాక్సైట్, బీచ్‌శాండ్, సున్నపురాయి లాంటి ఖనిజాలను ప్రాసెసింగ్ చేసి అంతిమ ఉత్పత్తులను ఎగుమతి చేయాలన్న తమ లక్ష్యానికి సహకరించాలని' కోరడం భవిష్యత్తులో జరగబోయే భారీ వనరుల విధ్వంసానికి గుర్తుగా అర్థం చేసుకోవచ్చు.

నిధుల అన్వేషణ బాధ్యతను కలెక్టర్లకే అప్పగిస్తూ చంద్రబాబు 2015 డిసెంబర్ 14న కలెక్టర్ల సమావేశంలో నిర్ణయం తీసుకున్నారు. పరిపాలనలో సమూలంగా మార్పు చేస్తూ, అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమైన నిధుల కొరతను అధిగమించే బాధ్యతను కలెక్టర్లు చేపట్టాలని, ప్రతీ ఆరు నెలలకు జిల్లాలో ఉన్న అవసరాలు, ఆదాయ మార్గాలను అన్వేషించాలని ఆదేశించారు. మలేషియాలో కొనసాగుతున్న 'పెమాండు' పద్ధతిలో అధికారులు పనిచేయాలని చెప్పారు. ఇక నుండి జిల్లాలో ఉన్న ఆర్థిక పరిస్థితిపై అంచనా వేయడంతో పాటు ఉన్న వనరులపైన నివేదికను సమర్పించాల్సి ఉంటుంది. వాటిని వినియోగించే బాధ్యత కూడా కలెక్టర్లకే అప్పగించారు. సహజ వనరులను పూర్తిగా వినియోగం లోకి తీసుకురావడం ద్వారా జిల్లాల్లో ఉన్న ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచడంతో పాటు రాష్ట్రానికి ఆదాయాన్ని సమకూర్చే విధంగా ప్లాన్ చేయాలని ఆదేశించారు. మలేషియాలో పెమాండు (ఫెర్‌ఫార్మెన్స్ మేనేజ్‌మెంట్ అండ్ డెలివరీ యూనిట్) పద్ధతి ఇదే తరహాలో కొనసాగు తుందని వివరించారు. దీని వలన ప్రజల సంక్షేమాన్ని చూడాల్సిన బాధ్యతను పూర్తిగా విస్మరించి కేవలం ఏమి అమ్మితే డబ్బు వస్తుందో దాని మీదే కలెక్టర్లు దృష్టి పెట్టవలసిన ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడింది.

సహజమైన నదీ ఇసుకకు ప్రత్యామ్నాయంగా కొండు, శిలు ద్వారా రోబో శాండ్ తయారు చేయాలని చంద్రబాబు ప్రభుత్వం నిర్ణయించింది. రాష్ట్రంలో ప్రతీ సంవత్సరం స్థానిక అవసరాలకు 200 నుండి 250 లక్షల క్యూబిక్ మీటర్ల ఇసుక డిమాండ్ ఉంటుంది. కానీ క్షేత్ర స్థాయిలో 102 లక్షల క్యూబిక్ మీటర్ల ఇసుక మాత్రమే లభ్యమవుతుంది. మరో వైపు విశాఖపట్నం, గుంటూరు, విజయవాడ, నెల్లూరు, కర్నూలు ప్రధాన నగర ప్రాంతాలుగా విస్తరించబోతున్నాయి. భవిష్యత్తులో ఆయా నగరాలలో ఇసుక డిమాండు భారీగా పెరగనుంది.

ఒక వైపు అక్రమ ఇసుక తవ్వకాలు భారీగా సాగిస్తూనే, మరో వైపు నదీ తీర ఇసుకను తవ్వుకుంటూ పోతే పర్యావరణానికి నష్టం కలుగుతుందని ఆందోళన చెందుతున్నట్లు నటిస్తూ, విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలో ఇసుక తయారీ యూనిట్లను నెలకొల్పాలని ఆలోచిస్తున్నారు. అక్కడ చెర్నోకైట్, కొండాలేట్ రాతి కొండలు ఎక్కువగా ఉన్నాయి. చిత్తూరు, కడప, అనంతపురం జిల్లాల్లో పలుగురాయి, స్ఫటికశి, పెగ్మాటిటస్, గ్రానైట్ రాతి కొండలున్నాయి. ఈ కొండలన్నింటినీ ఇసుక తయారీకి ఉపయోగించాలని పథకాలు రచిస్తున్నారు. దీంతో విధ్వంసమవుతున్న అడవుల, పంట భూముల జాబితాలో కొండలు కూడా చేరిపోయాయి.

### విచ్చవిడిగా పెరిగిపోయిన అవినీతి

అధికారంలోనికి రాగానే చంద్రబాబు అవినీతిని అంతం చేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. కానీ నేడు గతం కన్నా అత్యధిక స్థాయిలో ఏ రంగంలో చూసినా అవినీతి విచ్చలవిడిగా పెరిగిపోయింది. రాష్ట్ర ప్రభుత్వ అవినీతి నిరోధకశాఖ నిర్వహించిన ఒక అధ్యయనం ప్రకారం రవాణా శాఖలో డ్రైవింగ్ లైసెన్స్ మంజూరుకు రు. 500 నుండి 2000 వరకు లంచం చెల్లిస్తున్నారు. పట్టాదారు పాసుపుస్తకాలకు 50 వేల నుండి లక్ష రూపాయల వరకూ వసూలు చేస్తున్నారు. పోలీసు స్టేషన్లలో బెయిల్ కోసం నిందితుల దగ్గర విపరీతంగా డబ్బు గుంజుతున్నారు. సాంఘిక సంక్షేమ శాఖ వసతి గృహాల్లో విద్యార్థుల సంఖ్యను భారీగా పెంచి రేషన్‌ను కాజేస్తున్నారు. రిజిస్ట్రేషన్ శాఖలో ఆస్తుల నమోదులో ప్రైవేటు వ్యక్తుల ద్వారా భారీ వసూళ్లు చేస్తున్నారు. వాణిజ్య పన్ను శాఖ అధికారులు వ్యాపార వర్గాల నుండి భారీ మొత్తంలో లంచాలు తీసుకుంటున్నారు. విద్య, వైద్య, ఆరోగ్య, ఔషద నియంత్రణ, పరిశ్రమలు, కార్మిక, ఆహార కల్తీ తనిఖీ తదితర పలు ప్రధాన శాఖల్లో లైసెన్స్ మంజూరుకు అధిక మొత్తంలో డబ్బులు చేతులు మారుతున్నాయని పేర్కొన్నారు. ఒక దిన పత్రికలో ఇసుక దందాల్లో రు. 5,129 కోట్లు, పరిశ్రమలో అదనపు రాయితీలో రు. ఐదు వేల కోట్లు, పోలవరం నిర్మాణ పనుల విషయంలో రు.మూడు వేల కోట్లు, ఫించను అక్రమ వసూళ్లలో రు. 900 కోట్లు, పట్టిసీమ ఎత్తిపోతల పథకంలో రు. 700 కోట్లు, పత్తి కుంభకోణంలో రు. 200 కోట్లు, 'నీరూ–చెట్టూ' పథకం అమలులో రు. 100 కోట్లు, కుప్పం బ్రాంచ్ కెనాల్ పనుల్లో రు. 100 కోట్ల అవినీతి జరిగినట్లు ప్రచురితమైంది.

రాష్ట్ర వ్యాప్తంగా అక్రమ వడ్డీ వ్యాపారంలో అధిక శాతం అన్ని రాజకీయ పార్టీలకు చెందినవారున్నట్లు తేలింది. కాల్‌మనీ కేసులో పట్టుబడిన 118 మంది వ్యాపారులలో తెలుగుదేశం 20, వైకాపా 44, కాంగ్రెస్ 13, సిపిఐ ఆరు పార్టీలకు చెందినవారుగా తెలుస్తోంది. తెలుగుదేశం పార్టీకి చెందిన నిందితుల్లో 13 మంది విజయవాడకే చెందినవారున్నారు. అవసరంలో ఉన్నవారికి అధికశాతం వడ్డీకి అప్పులివ్వడం, సకాలంలో తీర్చలేకపోతే వారిని భయభ్రాంతులకు గురిచేసి బంగారం, ఆస్తులను లాక్కోవడం, ఛౌన్సర్లతో దాడులు, స్త్రీలతో అసభ్యంగా ప్రవర్తించడం, లొంగదీసుకోవడం, బలవంతంగా వ్యభిచారంలోనికి దించడం లాంటి దుర్మార్గపు పనులు కొనసాగిస్తున్నారు. ఈ నేరస్తులలో చాలామంది రాజకీయ నాయకులైన చంద్రబాబు, జగన్‌తో ఫొటోలు కూడా తీసుకున్న ఘనచరితులే కావడం విశేషం. రాజకీయ నాయకుల సహకారం లేకుండా ఇంత విచ్చలవిడిగా కాల్‌మనీ వ్యాపారాలు. జరగవని

మనకు తెలుసు. ఇటువంటి అక్రమ వ్యాపారాల ద్వారా సంపాదించిన సొమ్మే ఎన్నికల రాజకీయాలకు పెట్టుబడులుగా మారుతున్నాయి.

ఆదాయాన్ని పెంచడం కోసం 8 జిల్లాల్లో అదనంగా 67 కొత్త మద్యం దుఖాణాలు ఏర్పాటు చేస్తున్నారు. రాష్ట్రంలోని 13 జిల్లాల్లో 4,380 మద్యం దుఖాణాలున్నాయి. వీటిలో 438 దుఖాణాలను ప్రభుత్వమే నిర్వహిస్తోంది. ప్రస్తుతం రాష్ట్రంలో 771 బార్లున్నాయి. 30 వేల జనాభాకు ఒక బార్ ఏర్పాటు చేయాలని కొత్త నోటిఫికేషన్‌ను ప్రభుత్వం విడుదల చేసింది. దీని వలన అదనంగా మరో 30 నుండి 40 వరకూ బార్లు ఏర్పాటు చేస్తారు. గతంలో మద్యం బారిన పడి వందలాది మంది చనిపోయినా, విజయవాడ కల్తీ మద్యం ఉధంతంలో అయిదుగురు ప్రాణాలు కోల్పోయినా చంద్రబాబు ప్రభుత్వం ఆదాయమే ప్రధానంగా భావించడం జరుగుతోంది.

మద్యం దుఖాణాల్లో పరిశీలిస్తే చాలా ప్రాంతాల్లో వాస్తవంగా అమ్మవలసిన ధర కన్నా అదనంగా ఐదు రూపాయలు, పది రూపాయలు వసూలు చేస్తున్నారు. ఈ అధిక ధర విషయంలో సైతం అధికారులకూ, ప్రజా ప్రతినిధులకూ వాటాలున్నాయని పత్రికల్లో ప్రచురితమైన వార్తలే ప్రధాన సాక్ష్యం. రాష్ట్రంలో గత ఏడాది 13,880 కోట్ల రూపాయల మద్యం అమ్మకాలు జరిగాయి. మూడు వంతుకు పైగా మద్యం దుఖాణాలలో నిర్దేశిత ధర కంటే అధికంగానే వసూలు చేశారు. ఇలా ఏటా వెయ్యికోట్ల రూపాయల వరకూ అక్రమంగా గడిస్తున్నట్లు, ఆ సొమ్ము నెలనెలా వసూళ్లు ఆయా అధికారులకూ , రాజకీయ నాయకులకూ అందుతున్నాయని కూడా తెలుస్తోంది.

### ప్రచార హోరుతప్ప సహాయం శూన్యం

విశాఖలో హుదూద్ తుఫాన్ ఎంత విధ్వంసం సృష్టించిందో మనకు తెలుసు. దీనికి కారణం ప్రధానంగా పాలకవర్గాల విధానాలతోపాటు ప్రజల జీవితాలంటే వారికి ఉన్న తీవ్ర నిర్లక్ష్య ధోరణే కారణం. తీర ప్రాంతాల మీద ఒత్తిడి తగ్గించడం, మడ అడవులను రక్షించడం, తీరప్రాంతంలో సామాజిక వనాలను విరివిగా పెంచడం, తీరప్రాంతపు సున్నితత్వాన్ని పరిరక్షించడం లాంటి భద్రతా చర్యలు తీసుకోకపోగా తీర ప్రాంతాలను విలాసానికి వినియోగించే ప్రదేశాలుగా, వ్యాపార కూడళ్లుగా, పారిశ్రామిక కేంద్రాలుగా మార్చుతూ తీరప్రాంత విధ్వంసానికి కారకులవుతూ మరిన్ని భారీ హుదూద్ వంటి ప్రమాదాలకు అవకాశం కల్పిస్తున్నారు. హుదూద్ విధ్వంసం తర్వాత విశాఖకు వచ్చి చిట్టచివరి బాధితులకు సహాయం అందేవరకూ తను నిద్రపోనని, అధికారులను నిద్రపోనివ్వనని చంద్రబాబు ప్రకటించారు. ఆయన హంగామా అంతా ప్రధాన రహదారుల దగ్గరే జరిగింది కానీ, 8.42 లక్షల మంది నివశిస్తున్న 741 మురికివాడల వైపు కన్నెత్తి చూడలేదు. బయట ప్రాంతాల నుండి వస్తున్న కూరగాయలు, బియ్యం, కిరాణా వస్తువులు బాధితులకు అందించే వారే లేని పరిస్థితి మొదటి నాలుగు రోజులు కొనసాగింది. చాలా చోట్ల కుళ్లిపోయిన ఆహారపదార్థాలు రహదారుల మీద పడవేసిన సందర్భాలున్నాయి. స్వచ్ఛంద సంస్థలు, దయార్ద్ర హృదయం ఉన్నవారు ఇచ్చిన సహాయమే మురికివాడల ప్రజలను బతికించింది. టివిలు, పత్రికల్లో వచ్చిన వార్తలు చూసి అనేక ప్రాంతాల నుండి సహాయంగా లారీలో వచ్చిన కూరగాయలు, ఉల్లిపాయలు ప్రజలకు సరిగ్గా అందించే ఏర్పాట్లు లేక పోవడంతో అవి లారీల్లోనే కుళ్లిపోయాయి. దాంతో వాటిని రహదారుల పక్కనే పారబోశారు. లక్షలాది మంది పేద ప్రజలు చలికి ఒణికిపోతుంటే కనీసం ఇళ్లపైకి టార్పాలిన్స్ కూడా అందించలేదు. ఇప్పటికీ ఇళ్ల పైకప్పు వేసుకోడానికి లేక బాధపడుతున్న వారెందరో ఉన్నారు. చంద్రబాబు విశాఖలో ఉండగానే మంచినీటి సీసా వంద రూపాయలు, పాల ప్యాకెట్టు 140 రూపాయలకు అమ్మకాలు జరిగాయి. తుఫాను బాధితులకు రెండు లక్షల పక్కా ఇళ్లు నిర్మిస్తానని ప్రకటనలు గుప్పించి నేటి వరకూ ఒక్క ఇల్లు కూడా నిర్మించలేదు. అంతా ప్రచార ఆర్భాటమే తప్ప ప్రజల బాధలు పట్టించుకోలేదు.

### బాక్సైట్ తవ్వకాలపై కప్పగెంతులు

ప్రతిపక్ష నాయకుడి హోదాలో చంద్రబాబునాయుడు 2008 మార్చ్ 13న 'కాంగ్రెస్ పాలనలో గిరిజన భూములు, గనులు(బాక్సైట్) దోపిడీకి గురవుతున్నాయి. అమలులో ఉన్న రాష్ట్రపతి ప్రత్యేక ఉత్తర్వులను ఉల్లంఘించి పరిశ్రమలకు అనుమతులిస్తున్నారు. లక్షకోట్ల విలువైన ఖనిజ నిక్షేపాలను కాంగ్రెస్ నేతలకూ, వారి బినామీలకు కేటాయిస్తున్నారు. ఆదివాసి రక్షణకు రాజ్యాంగంలో 5,6 షెడ్యుల్‌లు ఉన్నాయి. వాటివల్ల అడవిలో సర్వ హక్కులు, ఆర్థిక, విద్య, ఉద్యోగ, రాజకీయ రంగాలలో రిజర్వేషన్లు అందుతున్నాయి. కాని మీరు వారి అవకాశాలకు గండి కొడుతున్నారు. ఇది చాలా దుర్మార్గం' అని మీడియా ముందు మాట్లాడారు. బహిరంగ సభల్లో ప్రకటించారు. మార్చ్ 8న 'విశాఖ జిల్లాలో గిరిజనుల ప్రయోజనాలకు విఘాతం కలిగిస్తూ, నిబంధనలకు విరుద్ధంగా ప్రభుత్వం బాక్సైట్ నిల్వలున్న భూములను జిందాల్, రస్‌అల్‌కైమా సంస్థకు కట్టబెట్టింది. ప్రజా ప్రయోజనాలని విస్మరిస్తూ లక్ష కోట్ల రూపాయల విలువైన గనులను ప్రైవేట్ వ్యక్తులకు ధారాదత్తం చేస్తూ రహస్య ఒప్పందాలు కుదుర్చుకుంటున్నారు. ఈ మొత్తం వ్యవహారం మీద సభా సంఘాన్ని నియమించాలి' అని అసెంబ్లీలో కోరారు. 2011 డిసెంబర్ 24న బాక్సైట్ గనుల లీజుతో పాటు, తవ్వకాలకిచ్చిన అనుమతులను రద్దు చేయాలని గవర్నర్‌కు వినతిపత్రం సమర్పించారు. తర్వాత స్వయంగా చంద్రబాబు గవర్నర్‌కు ఈ విషయాల మీద లేఖ కూడా రాశారు.

నిజానికి ముఖ్యమంత్రిగా 2000లోనే బాక్సైట్ తవ్వకాలకు దుబాయ్ అల్యుమినియం కంపెనీ లిమిటెడ్( దుబాల్) ను ఆహ్వానించి బాక్సైట్ నిల్వలు చూపించాడు. దుబాయ్ ప్రతినిధి బృందానికి సకల సదుపాయాలు కల్పించాని సూచిస్తూ 2000 ఫిబ్రవరి 29న ముఖ్యమంత్రి కార్యదర్శి స్వయంగా పరిశ్రమల శాఖ కార్యదర్శికి లేఖ కూడా పంపించారు. ఆ బృందానికి స్వయంగా చంద్రబాబే స్వాగతం పలికారు. 2000 మే 24న విశాఖపట్నం గిరిజన కోపరేటివ్ కార్పొరేషన్‌లో జరిగిన సమావేశంలో ట్రైబల్ అడ్వయిజరీ కౌన్సిల్ చేత 'మన్యంలో గనుల్ని గిరిజనుల కూడా తవ్వవచ్చు' అని తీర్మానం చేయించాడు. నిజానికి ట్రైబల్ అడ్వయిజరీ కౌన్సిల్ రాజ్యాంగబద్ధ సంస్థ అది గిరిజనుల హక్కుల కోసం మాత్రమే పని చేయాల్సి ఉండగా దాని చేత కూడా నిబంధనలకు విరుద్ధమైన, గిరిజన హక్కులకు భంగం కలిగించే తీర్మానం చేయించిన ఘనత చంద్రబాబుదే. దీనివల్లనే విశాఖ బాక్సైట్ మైన్ లీజుల్ని నేరుగా ప్రైవేటు వ్యక్తులకు కూడా కట్టబెట్టే ప్రమాదం ఏర్పడింది.

మళ్లీ అధికారంలోనికి రాగానే గిరిజనుల హక్కులను కాలరాసే ప్రభుత్వ ఉత్తర్వు నెంబరు 97ను తీసుకు వచ్చాడు. అదికూడా ప్రపంచ ఆదివాసి దినోత్సవం రోజున విడుదల చేశాడు. మన్యంలోని రిజర్వు ఫారెస్టులో ఉన్న 1212 హెక్టార్ల భూమిలోనూ చింతపల్లి మండలం జెర్రె అటవీ ప్రాంతంలో బాక్సైట్ మైనింగ్ చేపట్టే బాధ్యతను ఆంధ్రప్రదేశ్ మైనింగ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్( ఎపిఎమ్‌డిసి) కి అప్పగించారు. మన్యప్రాంతంలోని గిరిజనులు సాగిస్తున్న పోరాటాల ఫలితంగా తప్పనిసరి పరిస్థితుల్లో, తనకు తెలియకుండానే ప్రభుత్వ ఉత్తర్వు విడుదలయ్యిందని బుకాయిస్తూ, తాత్కాలికంగా ప్రభుత్వ ఉత్తర్వును నిలుపుదల చేసినట్లు ప్రకటించారు. కాని రద్దు చేయలేదు. దీని వల్ల ప్రమాదం తొలగిపోలేదని చంద్రబాబు చేస్తున్న ప్రకటన ద్వారానే విశదమవుతుంది.

### ప్రమాదకరమైన నూతన రాజధాని నిర్మాణం

నూతన రాజధాని అమరావతి శంకుస్థాపన కార్యక్రమానికి కె.పి.సి. సిమెంట్ కంపెనీ ఒక లక్ష ఇటుకలను ఉచితంగా ఇచ్చింది. రాష్ట్రంలో మారుమూల గ్రామాల ప్రజలు వారి ప్రాంతాల నుండి ఇటుకలు, వివిధ నదుల నుండి జలాలు కశాలలో పూజలు చేసి ఊరేగింపు ద్వారా కార్యక్రమానికి రావాలని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఇది భారతదేశంలో లౌకిక విలువలను అవహేళన చేయడమే. తెలుగు రాష్ట్ర రాజధాని కేవలం హిందువులదే కాదు కదా. ఇటువంటి ఇతర మతాల మత విశ్వాసాలను గాయపరిచే విధానాలు మత సామరస్యాన్ని తీవ్రంగా దెబ్బ తీస్తాయి.

నా ఇటుక – నా అమరావతి, ముఖ్యమంత్రి చంద్రబాబు పేరిట గిన్నిస్ రికార్డు నెలకొల్పే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇప్పటి వరకు చైనాలో ఓ స్వచ్ఛంద సంస్థ ఒక కార్యక్రమంలో 24 గంటల్లో 1,05,300 మందిని భాగస్వాములుగా చేసిన గిన్నిస్ రికార్డు ఉంది. దానిని అధిగమించి రెండు లక్షలకు తక్కువ కాకుండా చంద్రబాబు పేరిట రికార్డు సృష్టించాలని ప్రయత్నిస్తున్నారు. ఇందులో భాగంగా జల వనరుల శాఖ ఆన్‌లైన్ ద్వారా 13,52,500 ఇటుకలను రు.1,35,25,000 లకు కొనుగోలు చేసింది. దీనిలో ఆ శాఖకు చెందిన ఇఎన్ సిలు, మొదలు ఎస్.ఇ.లు, డి.ఇ. ఇలు, ఎ.ఇ.లు, 3,734 మంది నుండి ఈ సొమ్ము రాబడుతున్నట్లు తెలుస్తుంది. చంద్రబాబు ప్రతిష్ట కోసం అధికారులనూ, ఉద్యోగులనూ బెదిరించి బలవంతపు వసూళ్లు చేస్తున్నట్లు దీనిని బట్టే అర్థమవుతుంది.

16 వేల గ్రామాలు, వార్డుల నుండి మట్టి, నీరు తీసుకువచ్చేటట్లు ఏర్పాటు చేశారు. రాష్ట్రంలోని 150 దేవాలయాల్లో పూజలు చేసి పవిత్ర మట్టి జలాలను శంకుస్థాపనకు తీసుకువచ్చారు. ప్రపంచం మొత్తంలో సాటిలేని కొత్త రాజధానిని నిర్మిస్తానని, దీని చుట్టు నవ నగరాలు అంటే విద్య, విజ్ఞాన, పరిపాలన, ఆర్థిక, ఆరోగ్య, క్రీడా, వ్యయ, పర్యాటక నగరాలు ఉంటాయని చంద్రబాబు ప్రకటించారు. వీటితో పాటు రాజాధాని చుట్టు 24 పట్టణాలు రూపుదిద్దుకోనున్నాయి. రాజధానిలో భవనాలను నిర్మించడానికి ప్రపంచస్థాయి భవన నిర్మాణ నిపుణులను పిలిపించారు. ప్రపంచంలో 5 అగ్రశ్రేణి నగరాలకు ధీటుగా ఉండాలని, పని వేళల తరువాత కూడా నిర్మానుష్యం కాకుండా 24 గంటలు అక్కడ జనసంచారం ఉండేలా, ఏదో ఒక కార్యక్రమం జరిగేలా చూడడంతో పాటు ఖాళీ స్థలాలు, పార్కు, సమావేశ మందిరాలు, రెస్టారెంట్‌లు కూడా ఏర్పాటు చేసి ప్రపంచం మెచ్చే భవనాలు నిర్మిస్తామని చంద్రబాబు ప్రకటించారు.

ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తూ, ప్రపంచ స్థాయి రాజధానిగా అమరావతి నిర్మాణానికి వీలుగా విదేశాలలోని మేలైన నగరాలను పరిశీలించడం కోసం "ఆంధ్రప్రదేశ్ రాజధాని ప్రాంత అభివృద్ధి ప్రాధికార సంస్థ (సి. ఆర్, డి.ఎ.) ఆధ్వర్యంలో మూడు బృందాలు పర్యటనలు జరిపాయి. వీరిలో సి.ఆర్.డి.ఎ కమిషనర్ శ్రీకాంత్, పురపాలక శాఖ మంత్రి పి. నారాయణ, ఉన్నతాధికారి అజయ్‌జైన్, కృష్ణా, గుంటూరు జిల్లాల కలెక్టర్లు ఎ.బాబు, దండేకాంతిలాల్, డి.జి.పి. రాముడు, అదనపు డి.జి.పి సురేంద్రబాబు, ఇతర అధికారులు 25 మంది వరకు ఉన్నారు. వీరు యూరప్, బ్రెజిల్, చైనా, ఆస్ట్రియా, యు.ఎ.ఇ. తదితర దేశాలలోని 12 నగరాలను పరిశీలించారు.

మొదట్లో రాజధాని కోసం సేకరించిన భూములు, పంట భూములు కావని చంద్రబాబు ప్రభుత్వం బుకాయించింది. కాని పర్యావరణ అనుమతి కోసం రాసిన దరఖాస్తులో ఈ భూముల్లో 55.78 శాతం పంట భూములే అని పేర్కొన్నారు.14.36 శాతం భూముల్లో వివిధ రకాల తోటలున్నాయని తెలిపారు. మొత్తంగా 70.14 శాతం సాగులో ఉన్న భూములే అని తేలింది. పంట భూములు తరువాత 29.65 చదరపు కిలోమీటర్ల ప్రాంతం కృష్ణా నది, కాలువలు, వాగులు ఉన్నాయి. వీటి శాతం 13.65. మిగిలిన భూముల్లో కొండు, స్వల్పంగా ఖనిజాలు ఉన్నాయి.

చంద్రబాబు రంగుల కలలో భాగంగా రాజధాని అమరావతితో పాటు పరిసర ప్రాంతాల్లో భారీ నిర్మాణాలు, ఎత్తైన భవనాలు రాబోతున్నాయి. కాని గుంటూరు, విజయవాడలో తరచు భూకంపనాలు సంభవిస్తున్న కారణంగా ఆ ప్రాంతాలలో ఎత్తైన భవనాల నిర్మాణాల విషయంలో అవసరమైన భద్రతా చర్యలు చేపట్టడానికి 'టాల్ బిల్డింగ్ కౌన్సిల్'ను ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉందని ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజికి చెందిన రీసెర్చ్ సెంటర్ అధిపతి రామచంద్ర ప్రదీప్ కుమార్ అన్నారు. భూకంపాలు వచ్చే ప్రాంతాలలో ఎత్తైన భవనాలు నిర్మిస్తే, ప్రమాదం జరిగినప్పుడు భారీ ఆస్తి నష్టం, ప్రాణ నష్టం జరిగే అవకాశాలున్నాయి. దీని కోసం ఈ ప్రాంతాలలో ఎత్తైన భవనాలు ఎంత వరకు క్షేమం అనే దానిని నిర్ధారించడానికి ఒక కౌన్సిల్ అవసరం చాలా ఉందని అన్నారు.

నేపాల్‌లో రెక్టార్ స్కేలుపై 7.9 తీవ్రతతో భారీ భూకంపం సంభవించినప్పుడు దాని ప్రకంపనలు గుంటూరు, విజయవాడ పరిసర ప్రాంతాలలో కూడా సంభవించినప్పుడు ప్రజలు భయకంపితులైపోయారు. నర్సారావుపేట, గుంటూరులలో జూలై 27, 2015న వచ్చిన స్వల్ప భూ ప్రకంపనలు కూడా ప్రజలను భయాందోళనలకు గురి చేశాయి. కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో జరిగిన భూ కంపాల అధ్యయనం ప్రకారం రెండు రాష్ట్రాలుగా ఏర్పడక పూర్వం ఉన్న ఆంధ్ర ప్రదేశ్‌లో దాదాపు 34 శాతం, 2001లో భుజ్‌లో వచ్చిన భూకంప స్థాయి (6.9)లో 'ఇంటెన్సిటి–7' భూకంపాలు వచ్చే అవకాశం ఉన్న ప్రాంతాలుగా గుర్తించారు. 1917లో విజయనగరంలో 5.5 స్థాయి, 1969లో భద్రాచలంలో 5.7 స్థాయి, 1967లో ఒంగోలులో 5.4 స్థాయి భూకంపాలు సంభవించినట్లుగా తెలుస్తోంది. భూకంపాలు సంభవించినప్పుడు భూమి లోపల వచ్చే ప్రకంపనాల కారణంగా విజయవాడలో మూడు బురద

మట్టితో ఉన్న ప్రాంతాలు తీవ్రమైన నష్టానికి గురయ్యే అవకాశాలు ఉన్నాయని గుర్తించారు. 2011లో వచ్చిన 14 భూకంపనాలు వచ్చిన ప్రాంతాలను హైదరాబాద్, ఐఐఐటి సంస్థకు చెందిన ముగ్గురు రీసెర్చ్ స్కాలర్లు చేసిన అధ్యయనంలో ఈ విషయాలను నిర్ధారించారు.

నేషనల్ డిజాస్టర్ మేనేజ్‌మెంట్ అథారిటీలో మాజీ సభ్యుడైన ఎన్. వినోద్ చంద్ర మీనన్ 'మన దేశంలో సరైన భవన నిర్మాణ నిబంధనలు, నియంత్రణ లేకపోవడం వలన జాతీయ విపత్తులు, భూకంపాలు వచ్చినప్పుడు భారీ ప్రాణ, ఆస్తి నష్టాలకు గురవుతున్నారని చెప్పారు.

జనవరి 2010లో రెక్టార్ స్కేల్ 7.0 స్థాయి భూకంపం హైతీలో వచ్చినప్పుడు 2,30,000 మంది ప్రాణాలు కోల్పోయారు. ఫిబ్రవరి 2010లోనే చిలీలో 8.8 స్థాయి భూకంపం వచ్చినప్పుడు కేవలం 800 మందే చనిపోయారు. నిజానికి హైతీలో వచ్చిన భూకంపం కంటే చిలీలో 30 రెట్లు అధిక స్థాయి ప్రమాదం కలిగించింది. దాని ప్రకారం దాదాపు 10 లక్షల మంది చనిపోయే అవకాశముంది. కానీ అంత తక్కువ ప్రాణ నష్టం జరగడానికి కారణం ప్రధానంగా చిలీలో భూకంపాలను ఎదుర్కొనే భవన నిర్మాణ నిబంధనలు, నియంత్రణలు చాలా శాస్త్రీయంగా పాటించారు కాబట్టే ప్రమాద స్థాయిని తగ్గించుకోగలిగారని అన్నారు.

2013లో కాగ్ జరిపిన ఆడిట్ ప్రకారం జాతీయ విపత్తు ఏర్పడినప్పుడు కేంద్ర ప్రభుత్వ సంస్థలు ప్రమాద నివారణకు చేపట్టవలసిన చర్యలు తీసుకున్న దాఖలాలు ఏమాత్రం లేవు. అలాగే 5 సంవత్సరాల క్రితం తీసుకున్న నిర్ణయం ప్రకారం భూకంపాలు వచ్చినప్పుడు ప్రత్యేకంగా తీసుకోవలసిన జాగ్రత్తలు, వేగవంతమైన సమాచార రవాణా లాంటి విధానాల కల్పన కూడా ఇంతవరకూ జరగలేదు. చాలా రాష్ట్రాలు ఈ జాతీయ విపత్తు రక్షణ కార్యక్రమాలకు అవసరమైన విధివిధానాలను నిర్ణయించలేదు. అవసరమైన మానవ శక్తులను తయారుగా ఉంచడం లాంటి పనులను కూడా చేపట్టలేదు అని విమర్శించింది.

విజయవాడ, గుంటూరు ప్రాంతాలలో 20,000 హెక్టార్ల అటవీ భూమిని రాష్ట్ర రాజధాని కోసం డీనోటిఫై చేయడానికి అనుమతివ్వాలని రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. దీని కోసం అటవీ శాఖ వారు భౌతికంగానే కాకుండా, డ్రోన్ ద్వారా కూడా దాదాపు 20 కిలోమీటర్ల ప్రాంతాన్ని సర్వే చేశారు. ఈ అటవీ ప్రాంతం జీవవైవిధ్యానికి ఎంతో తోడ్పడుతూ అనేక రకాల జంతు జీవజాలం, రోగాల నుండి సంరక్షించే అనేక ఔషధ మొక్కలకు కేంద్ర ప్రాంతాలుగా ఉన్నాయి. రాజధాని కోసం ఈ అటవీ భూములను ధ్వంసం చేస్తే ఈ జాతీయ సంపద మొత్తం కనుమరుగైపోతుంది.

అక్టోబర్ 29న ఆంధ్రప్రదేశ్ 13 జిల్లాల అటవీ శాఖాధికారులు సమావేశమై, రాజధాని కోసం ధ్వంసం కాబోతున్న అటవీ ప్రాంతంలో నష్టపోబోతున్న అద్భుతమైన పుష్ప జాతులు, ఔషధ మొక్కలు, జింకలు, కుందేళ్లు, నెమళ్లు, జలచరాలు, పక్షులు, అడవి పందులు లాంటి భిన్న రకాల జంతు జీవ జాలంతో పాటు చిన్న చిన్న నదులు, చెరువులు, ఇతర నీటి వనరులు అన్నింటి గురించి చర్చించారు. కొండపల్లి అటవీ ప్రాంతం దాదాపు 62 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో వ్యాపించి ఉంది. దీనిలో అద్భుతమైన ఔషధ మొక్కలు, అడవి చేమ, పచ్చి తీగ, ఉసిక తమ్మిడి, మేకమేయని ఆకులు, అడవి ముగ, కుందేటి కొమ్ము, అంతుక, మెట్టమామిడి, వామింటాకు, ఎర్ర బెండ, కొండ నిమ్మ, అడవి నిమ్మ, గుండ బొంత లాంటి అనేక రకాల ఔషధ మొక్కలు ఉన్నాయి. ఇవి కనుమరుగైపోతాయి. ఇప్పటికే అడవుల విధ్వంసం, భారీ పట్టణీకరణ కారణంగా అనేక జంతువులు, పక్షులు అంతర్ధానమైపోయాయి. ఇంకా కొండపల్లి, కొండూరు మండలాలలో అటవీ ప్రాంతాలను ధ్వంసం చేస్తే మిగిలి ఉన్న జంతు జీవజాలం, ఔషధ మొక్కలు అన్నీ నాశనమైపోతాయని పర్యావరణ శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు. ఈ హెచ్చరికలు వేటినీ చంద్రబాబు ఖాతరు చేయలేదు.

రాష్ట్ర ప్రభుత్వాన్ని కార్పొరేట్ పాలనతో నింపేశారు. విద్య, వైద్యం, రియల్ ఎస్టేట్, గనుల తవ్వకాలు, ఇసుక, రవాణా వంటి రంగాలలో మాఫియా ముఠాలే కార్పొరేట్ శక్తుల కొరకు నడపబడుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వమే ఒక రియల్ ఎస్టేట్ వ్యాపారిగా భూసేకరణ సాగిస్తోంది. అధికారులతోనే దందాలు నడుపుతోంది. వనరుల అవకాశాలు, కార్యాలయాలు, పెట్టుబడుల కేంద్రీకరణ ఒకే చోట చేసి హైదరాబాద్ లాగే కృష్ణా, గుంటూరు నడుమ అమరావతి ప్రాంతంలో కేంద్రీకరించడం జరుగుతోంది. ఇంతకాలం అవకాశం కోల్పోయిన రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడు ప్రాంతాల ప్రజలు అభివృద్ధికి ప్రాధాన్యత ఇవ్వాలనే కనీస ఆలోచన కూడా చంద్రబాబు చేయడం లేదు. శివరామ కృష్ణ కమిటీ కొత్త రాష్ట్రం ఏ విధంగా ఉండాలన్నది స్పష్టీకరించినా దానికి విరుద్ధంగానే రాష్ట్ర రాజధాని నిర్మాణం నిర్వహించడం జరుగుతోంది.

పుష్కరాలకు 1600 కోట్ల రూపాయలు బూడిదలో పోసి మూఢ నమ్మకాలకు జీవం పోశారు. అంతేకాకుండా తొలిరోజే 27 మంది ప్రాణాలను అన్యాయంగా బలికొన్నారు. పెద్దఎత్తున తరలి వస్తున్న యాత్రికులు వాహనాల ప్రమాదంలో అధిక సంఖ్యలో బలయ్యారు. ప్రభుత్వ ప్రచారం కారణంగా పుష్కరాలకు వెళ్లక పోతే ఏదో నష్టం జరిగిపోతుందని వెళ్లిన అమాయక ప్రజలు చాలా మంది వాహన ప్రమాదాల్లో మృత్యువాత పడడం, తీవ్రంగా గాయాలపాలవ్వడం జరిగింది. ఈ తప్పిదాలకూ, మరణాలకూ చంద్రబాబు సర్కారు చేసిన ప్రచారహోరే ప్రధాన కారణమని అందరికీ విదితమే.

ఉత్తరాంధ్ర ప్రజల వ్యతిరేకతను, నిపుణుల హెచ్చరికలనూ ఖాతరు చేయకుండా ఉత్తరాంధ్రను అణుకుంపటిగా మార్చే కార్యక్రమాన్ని చంద్రబాబు ప్రభుత్వం శ్రీకాకుళం జిల్లా కొవ్వాడ వద్ద ఏర్పాటు చేస్తోంది. ఫుకుషిమా తర్వాత కూడా ఇటువంటి అభివృద్ధి మాకొద్దని శ్రీకాకుళం ప్రజలు చెపుతుంటే చంద్రబాబు మాత్రం ఏమాత్రం వెనకకు తగ్గడం లేదు. ఇది చాలదన్నట్లు రష్యా సహకారంతో రాష్ట్రంలో మరో అణువిద్యుత్తు పార్కు ఏర్పాటుకు కూడా ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

పెట్టుబడులు పెట్టే కార్పొరేట్ సంస్థలకు అనుకూలంగా భూముల లీజును ప్రస్తుతం ఉన్న 33 సంవత్సరాల పరిధిని 99 ఏళ్లకు పెంచుతూ నిర్ణయం తీసుకున్నారు. అంతర్జాతీయ స్థాయి విద్యా ప్రమాణాలతో పాటు, విద్యార్థుల్లో పోటీ తత్వం పెంచడానికి ప్రైవేట్ యూనివర్సిటీ బిల్లు పాస్ చేసి విద్యా వ్యవస్థ నాశనానికి మార్గం సుగమం చేశారు.

ప్రజాస్వామ్యం అంటే కార్పొరేట్ల, కార్పొరేట్ల చేత, కార్పొరేట్ల కొరకు అనే అర్థాన్ని మార్చి చంద్రబాబు కొనసాగిస్తున్న పాలన ఆంధ్రప్రదేశ్ ప్రజల జీవించే హక్కుపై దాడి చేస్తోంది. ప్రజల ఉమ్మడి ఆస్తులైన ప్రకృతి వనరులన్నీ ధ్వంసం కాబడుతున్నాయి. సాంస్కృతిక విలువలన్నీ కాలరాయబడుతున్నాయి. ప్రజల పోరాటాల మీద దమనకాండ తీవ్రంగా కొనసాగుతోంది. ప్రజలు తమ హక్కుల గురించి మాట్లాడే అవకాశమే ఇవ్వడంలేదు. ఈ విధ్వంసకర దాడిని ఎదుర్కోవడంలో అందరూ భాగస్వాములవ్వాల్సిన అవసరం ఎంతైనా ప్రస్తుతం ఉంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# నిజాం దక్కన్ షుగర్స్ లే ఆఫ్

***టిఆర్ఎస్ పార్టీ ఎన్నికలకు ముందు కార్మికులకు, ఉద్యోగులకు ఇచ్చిన వాగ్దానాన్ని కోస్తా, రాయలసీమ పాలకుల్లాగానే నిలబెట్టుకోలేదని అంటున్నారు* రావుల రాజేశం**

మేం అధికారంలోకి రాగానే నిజాం షుగర్స్‌ను ప్రభుత్వం స్వాధీనం చేసుకుని, చక్కెర కర్మాగార వృత్తిపై ఆధారపడిన రైతులు, కార్మికుల జీవితాల్లో వెలుగు ప్రసాదిస్తామని టిఆర్ఎస్ పార్టీ ప్రకటించింది. అధికారంలోకి వచ్చాక ఎన్నికల ముందు ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చ లేదు. కార్మికుల పొట్ట గొట్టింది. కార్మికులు, ఉద్యోగులు నిజాం దక్కన్ షుగర్ లిమిటెడ్ లే ఆఫ్‌ను వెంటనే ఎత్తివేయాలని ఆందోళనబాట పట్టారు. తెలంగాణ ప్రభుత్వానికి ఈ సమస్య సవాల్‌గా మారింది. తీపిని అందించే చక్కెర కర్మాగారం రైతులు, కార్మికులకు చేదును మిగిల్చుతుంది. ఆసియా ఖండంలోనే అరుదైన గుర్తింపును పొందిన (ఎన్‌డిఎస్ఎల్) నిజాం దక్కన్ షుగర్ లిమిటెడ్ 'లే ఆఫ్'కు చేరుకోవడం కార్మికుల, రైతుల, ఉద్యోగుల, భవితవ్యం ఆగమ్యగోచరం అయింది. ఎన్‌డిఎస్ఎల్ యాజమాన్యం నిజామాబాద్ జిల్లా బోధన్, మెదక్ జిల్లా ముంబోజుపల్లి, కరీంనగర్ జిల్లా ముత్యంపేట చక్కెర పరిశ్రమలను 2015-16 క్రషింగ్ సీజన్‌కు గాను 'లే ఆఫ్'ను ప్రకటిస్తూ ఈ నెల 23న నోటీసు బోర్డును అంటించారు. ఈ నెల 18న జరిగిన ఎన్‌డిఎస్ఎల్ బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్‌లో 'లే ఆఫ్' నిర్ణయం తీసుకున్నట్లు యాజమాన్యం ప్రకటించడంతో కార్మికులు ఆందోళనకు దిగారు.

నిజామాబాద్ జిల్లా బోధన్ నిజాం షుగర్స్‌కు అనుబంధంగా 1985-86లో ముత్యంపేట కర్మాగారం మొదటిసారి 'లే ఆఫ్'కు గురైంది. ఆ తర్వాత కర్మాగారం దిన దినాభివృద్ధి చెందింది. లాభాల్లో ఉన్న దీన్ని 2000 సంవత్సరంలో తెలుగుదేశం ప్రభుత్వం డెల్టా షుగర్స్ సంస్థకు 'ఉప్పు పుట్నాలకు' వలే అగ్గువకు అమ్మింది. 300 కోట్ల విలువైన వాటిని 36 కోట్లకే, టిడిపి పార్టీ, తమ ఆస్మదీయులకు కట్టబెట్టి కార్మికులకు తీవ్రమైన అన్యాయం చేసింది.

51 శాతం ప్రభుత్వం వాటా, 49 శాతం ప్రైవేట్ వాటాలో జాయింట్ వెంచర్‌లో ఎన్‌డిఎస్ఎల్‌గా కర్మాగారం రూపాంతరం చెందింది. తెలుగుదేశం పార్టీ ఈ కర్మాగారాన్ని సర్వ నాశనం చేసిందని అప్పట్లో కార్మికులు ఆవేదన వ్యక్తం చేశారు. ఆ తర్వాత 2004లో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చింది. వైఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. చంద్రబాబు చేసిన ద్రోహాన్ని, ప్రైవేటీకరణను రాజశేఖరరెడ్డి తప్పుపట్టారు. రాష్ట్ర ప్రభుత్వం నిజాం షుగర్స్‌ను స్వాధీనం చేసుకుంటుందని రాజశేఖరరెడ్డి ప్రకటించడంతో కార్మికులు సంతోషం వ్యక్తం చేశారు. 2004 జూలైలో దీనిపై శాసన సభ సంఘాన్ని (హౌజ్ కమిటీ) ని ఏర్పాటు చేశారు. ఈ సభా సంఘం 2006 జూలై 28న 300 పేజీల నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. నిజాం షుగర్స్ ఫ్యాక్టరీ యూనిట్లను ప్రైవేటీకరణలో అనేక అక్రమాలు జరిగాయని, వెంటనే స్వాధీనం చేసుకోవాలని సభా సంఘం తన సిఫార్సుల్లో పేర్కొంది. ఎన్నికల్లో ఉచిత హామీలు ఇచ్చిన వైఎస్. రాజశేఖరరెడ్డి, ఆ తర్వాత సభా సంఘం సిఫార్సులను పట్టించుకోలేదు. అక్రమాల మీద చర్యలు తీసుకోలేదు.

వలస పాలకులైన టిడిపి, కాంగ్రెస్ పార్టీలు తెలంగాణలోని అన్ని పరిశ్రమలను మూత వేశాయని టిఆర్ఎస్ పార్టీ భారీ ప్రచారం చేసింది. తెలంగాణ రాష్ట్రం వస్తే 100 రోజుల్లో నిజాం ఫ్యాక్టరీని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందని అదరగొట్టే ప్రచారం చేశారు. తెలంగాణ పరిశ్రమలు బాగుపడాలంటే టిఆర్ఎస్ పార్టీని గెలిపించాలని ప్రచారం చేశారు. తెలంగాణ ప్రజలు నమ్మి కెసిఆర్‌ను గెలిపించారు. ముఖ్యమంత్రి కెసిఆర్‌తో సహా, టిఆర్ఎస్ నేతలు పలు మార్లు ఎన్‌డిఎస్ఎల్‌ను సర్కారు స్వాధీనం చేసుకుంటుందని నమ్మ బలకడంతో రైతులు, కార్మికుల్లో ఆశలు చిగురించాయి. టపాసుల కాల్చి వేడుకలు చేసుకున్నారు. ఏప్రిల్ 30న ఎన్‌డిఎస్ఎల్ యూనిట్లను టేకోవర్ చేసుకోవడానికి తెలంగాణ సర్కారు జిఒ జారీ చేసింది. టేకోవర్ సందర్భంగా విధి విధానాలను ఖరారు చేయడానికై ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి రాజీవ్‌శర్మ నేతృత్వంలో ప్రత్యేక కమిటీని వేశారు. జూలై 2015లో వేసిన కమిటీ సకాలంలో నివేదికను అందజేయలేదు. కమిటీ వేసి చేతులు దులుపుకున్న పాలకులు కనీసం సమీక్ష సమావేశం నిర్వహించలేదు. ఈలోపు పుణ్యకాలం గడిచిపోయింది. టిడిపి, కాంగ్రెస్ పార్టీల వలే టిఆర్ఎస్ పార్టీ కూడా విఫలమైంది. ఈ నేపథ్యంలో 2015-16 క్రషింగ్ సీజన్‌లో బోధన్, ముంబోజుపల్లి, ముత్యంపేట యూనిట్లలో క్రషింగ్‌ను నిలిపివేస్తూ యాజమాన్యం నిర్ణయం తీసుకున్నది. దీంతో రైతులు ఆందోళనకు దిగారు. ప్రభుత్వ జోక్యంతో నిజామాబాద్ జిల్లా కామారెడ్డి శివారులో గల గాయత్రి కర్మాగారంలో ఎన్‌డిఎస్ఎల్ యూనిట్ల పరిధిలోని చెరుకును గానుగాడిస్తున్నారు.

కరీంనగర్ జిల్లా ముత్యంపేట ఎన్‌డిఎస్ఎల్‌లో 106 మంది రెగ్యులర్, 200 సీజనల్ ఉద్యోగులు బజారున పడ్డారు. యాజమాన్యం పలు కారణాలతో పర్మినెంట్ ఉద్యోగులను ఉద్యోగం నుంచి తొలగించడంతో కార్మికులు కర్మాగారం గేట్ల ముందు నిరాహార దీక్షలు చేస్తున్నారు. క్రషింగ్‌ను నిలిపివేయడం వల్ల వేతనాలు, ఎచ్ఆర్ఎ, ఇతర అలవెన్సులు, ఫించన్లు, కార్మికులు, ఉద్యోగులు కోల్పోయే ప్రమాదం ఉంది.

తెలంగాణలో కొత్త చక్కెర ఫ్యాక్టరీలను ప్రారంభించకపోయిన మంచిదే. కాని మూతపడిన, ప్రైవేటీకరణకు గురైన వాటిని సర్కారు స్వాధీనం చేసుకుని మాట నిలబెట్టుకోవాలి. 'తలా పిడికెడు తిలాపాపం' వలే అన్ని రాజకీయ పార్టీలు కార్మికులకు అన్యాయం చేశాయి. తెలంగాణలో విదేశీ పరిశ్రమల్ని ఆకర్షిస్తున్నారు. 15 రోజుల్లో ఐపాస్ ద్వారా పరిశ్రమలకు పర్మిషన్లు ఇస్తున్నారు. 100 రోజుల్లో నిజాం షుగర్స్‌ను సర్కారు స్వాధీనం చేసుకుంటుందన్న కెసిఆర్ మాట సంగతి ఏంటని ప్రశ్నిస్తున్నారు.

(రచయిత లెక్చరర్)

వీ

# విధ్వంసక అభివృద్ధి - చెన్నై వరదలు

***అభివృద్ధి పేరుతో ప్రభుత్వాలు అమలు చేస్తున్న కేంద్రీకృత అభివృద్ధి విధానాల అమలు ఫలితమే చెన్నై లాంటి ప్రకృతి వైపరీత్యాలని అంటున్నారు బైరెడ్డి సతీష్***

నవంబర్ మొదటి వారం నుండి డిసెంబర్ మొదటి వారం వరకూ కుండపోతగా కురిసిన వర్షంలో చెన్నై మహానగరం అతలాకుతలం అయింది. జన జీవనం స్తంభించిపోయింది. ఈ నెల రోజుల కాలంలో చెన్నై నగరానికి ముఖం చాటేశాడు సూర్యుడు. మెరుపులు, ఉరుములతో నగరం అంతా దద్దరిల్లిపోయింది. కరెంట్ లేకపోవడంతో నగరమంతా మహాచీకటి నెలకొన్నది. రోడ్లన్నీ కాలువలవడంతో రవాణా వ్యవస్థ పూర్తిగా స్థంభించిపోయింది. కమ్యూనికేషన్ వ్యవస్థ పనిచేయక పోవడంతో పక్కింట్లో ఏం జరుగుతుందో కూడా తెలియని అయోమయ స్థితి నెలకొన్నది. ప్రసార సాధనాలు పనిచేయకపోవడం, పనిచేసినా విద్యుత్ సరఫరా పూర్తిగా నిలిచిపోవడంతో ఒకరి సమాచారం మరొకరికి తెలియకుండా 'సమాచార యుగం'లో ప్రపంచానికి చెన్నైకి సంబంధం తెగిపోయినట్లయింది. ప్రజలంతా ఇంటి పైకప్పుకే పరిమితమైనారు. వేల నుండి లక్షల జీతం పొందేవాళ్లు, వందల రూపాయల ఆదాయం నుండి కోట్లు సంపాదించే సంపన్నులు కనీస అవసరాలు కూడా తీర్చుకోలేక విలవిలలాడి ప్రకృతి ప్రసాదించిన 'సోషలిజం'లో గడిపారు.

ప్రకృతి ప్రకోపం ఎంత తీవ్రంగా ఉందంటే చెన్నై విమానాశ్రయంలో నిలిపి ఉంచిన విమానాలు కాగితపు పడవల్లాగ కొట్టుకొనిపోయి చెట్ల మధ్యన ఇరుక్కొని పోయినవి. కూతపెడుతూ పరుగులు తీసే రైళ్లన్నీ ఎక్కడికక్కడే నిలిచిపోయినవి. పౌరులందరికీ పడవ ప్రయాణమే మిగిలింది. వందలాది మంది మరణించడంతో పాటు, వేలాది మంది ఈ వర్ష భీభత్సం వల్ల నిరాశ్రయులయ్యారు. నిరుపేదలు, మురికి వాడల అభాగ్యులు, దినసరి వేతన జీవుల వేదన వర్ణణాతీతం. తొలిసారిగా చెన్నై అంతర్జాతీయ విమానాశ్రయం మూత పడింది. 137 సంవత్సరాల చరిత్ర కలిగిన 'ది హిందూ' దిన పత్రిక ప్రస్థానంలో తొలిసారిగా డిసెంబర్ 2న పత్రికను వెలువరించలేక పోయారంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. నగరంలో పార్కులు, చారిత్రక కట్టడాలు, అనాథ శరణాలయాలు, ఆస్పత్రులు, ఆఫీసులు, ఒక్కటేమిటి సకలం వర్షం, వరద తాకిడికి దెబ్బతిన్నాయి. ఈ భీభత్సానికి గురికాని రంగమంటూ లేదంటే అతిశయోక్తి అసలే కాదు. దాదాపుగా 20 వేల కోట్ల ఆస్తి నష్టం సంభవించినట్లుగా ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. యథావిధిగా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఈ విలయం నుండి ప్రజల్ని రక్షించడానికి అన్ని చర్యలు చేపట్టినట్లు, సాయం వెంటనే అందిస్తున్నట్లు హడావిడిగా ప్రకటించాయి. ఇది ప్రకృతి విలయం అని దీన్ని పూర్తిగా అడ్డుకోవడం సాధ్యం కాదని, ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి చేతులెత్తేసింది. జాతీయ విపత్తుగా ప్రకటించాలనీ, వరద ప్యాకేజీని అందించాలని, రాష్ట్ర యంత్రాంగం పూర్తి స్థాయిలో పనిచేస్తుందని, షరా మామూలుగా ప్రకటించింది. వరద ప్రాంతాలలో ప్రధాని ఏరియల్ సర్వే దృశ్యాన్ని కూడా తప్పుగా అందించి అబాసుపాలయ్యారు. మరోవైపు మీడియా దృష్టంతా కూడా ఎంత వర్షపాతం నమోదయింది, ఎంత ప్రాణ నష్టం, ఆస్తి నష్టం జరిగింది, సహాయక చర్యల్లో ఎవరెట్లా పాల్గొంటున్నారని రీళ్లు రీళ్లుగా అందిస్తూ వచ్చింది.

### ప్రకృతి విలయమా? అభివృద్ధి విధ్వంసమా?

నిజానికి గత అర్ధ శతాబ్దంలో చెన్నై నగరానికి వర్షాల ముప్పు, వరద తాకిడీ సర్వ సాధారణం అయింది. ప్రతి దశాబ్దానికి ఒకసారి ఇటువంటి విపత్తును ఎదుర్కుంటూనే ఉంది. మరి ఇప్పుడే ఇంత దారుణంగా ఎందుకు జరిగిందనే మూలాల్లోకి ప్రభుత్వం ఎలాగూ వెళ్లదు. మీడియాకు ఆసక్తి ఉండదు కాని, మనిషి కేంద్రంగా అభివృద్ధి జరగాలని అది ప్రకృతి విధించిన పరిధికి లోబడి జరగాలనీ, కోరుకునే వాళ్లు ఈ విధ్వంసపు మూలాల్లోకి తొంగి చూడక తప్పదు. ఈ విపత్తు నేపథ్యంలోనే కేంద్ర పర్యావరణ శాఖా మంత్రి, అభివృద్ధి చెందిన దేశాల అభివృద్ధి నమూనాను తప్పుపడుతూ, వారి విధానాల మూలంగానే ప్రకృతిలో విపరీత పోకడలు తలెత్తి, ఇవి జరుగుతున్నాయని చెప్పుకొచ్చారు. నిజమే, ఈ విపత్తుకు కారణం పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలే. అయితే అటువంటి విధ్వంసక అభివృద్ధి నమూనానే ఈ దేశంలో ఎందుకు అమలు చేస్తున్నారో అని తమను తాము ప్రశ్నించుకునే సోయి మాత్రం లేదు.

గత రెండున్నర దశాబ్దాలుగా ఈ దేశంలో అమలవుతున్న నూతన ఆర్థిక విధానాలే వర్తమాన విధ్వంసానికి మూలమని ఈ పాలక వర్గాలకు తెలియదా? పునాది రంగంలో వచ్చిన మౌలిక మార్పులు దేశ వ్యాప్తంగా ఎన్నెన్ని రూపాల్లో విధ్వంసాన్ని తీసుకొచ్చినవో ప్రజా జీవిత అనుభవాల్లో ఉన్నాయి. ప్రకృతికి, మనిషికి ఉండే ఒక సహజమైన అనుబంధాన్ని ఎట్లా విచ్ఛిన్నం చేసిందో చెన్నై వరద భీభత్సమే చెపుతుంది. అభివృద్ధి పేరుతో ఏ ప్రాకృతిక నియమాన్ని పాటించకుండా, అసలు ప్రకృతి పట్ల కనీస గౌరవం లేని ఒక విశృంఖల విధానం ప్రకృతిని ప్రజలపై విరుచుకు పడేలా చేస్తున్నది. నయా ఉదారవాద విధానాలు, మార్కెట్ మయమైన అభివృద్ధి నమూనా అంతా ఒక కాంక్రీట్ జంగిల్ నిర్మిస్తూ, సహజమైన దాన్ని ధ్వంసం చేస్తూ పోతున్నవి.

చెన్నై వరద భీభత్సం వెనకాల ఉన్న అసలు రహస్యం అంతా ఇదే. ఇంత వర్షపాతం ఉందని ఊహించలేదని, వాతావరణ శాఖ వైఫల్యం ఉందని, ప్రజలు అప్రమత్తంగా లేరని పైపై కారణాలు చెప్పి చేతులు దులుపుకుంటున్నవీ ప్రభుత్వాలు. పైగా సైనికులు, పోలీసుల ఎలా

పనిచేస్తున్నదీ, ఎంత రిస్కు తీసుకుంటున్నదీ, బాధితుల పట్ల దాతల దయార్ద్ర హృదయం గురించి, సినిమా నటుల లాంటి వాళ్లు వరద పీడిత ప్రజానీకానికి ఏమి చేస్తున్నారు వంటివి మళ్లీ మళ్లీ చూపుతూ అసలు మూలాలను మరిపించేలా వ్యవహరిస్తారు.

అభివృద్ధి పేరుతో కేంద్రీకృతంగా ఆర్థిక సామ్రాజ్య నిర్మాణం అక్రమంగా సాగిస్తే తలెత్తే ఇటువంటి భీభత్సాల గురించి మీడియా ప్రధానంగా ఎలక్ట్రానిక్ మీడియాకు చర్చ చేసే ఆసక్తి అసలే ఉండదు. ఒక్క చెన్నై అనే కాదు, దేశమంతా ఇదే పరిస్థితి నెలకొని ఉన్నది. ఉత్తరాఖండ్ వరదల్లో 10 వేల మందికి పైగా మృత్యువాత పడితే, అక్కడి ప్రకృతి సమతుల్యతను దెబ్బతీసిన హైడల్ ప్రాజెక్టులు, అక్రమ నిర్మాణాలు, ఎట్లా అంతటి విషాదానికి కారణమో చెప్పే ప్రయత్నం చేయకపోగా, సైనికుల సాహస చర్యలనే కథలు కథలుగా గుప్పించింది మీడియా. ప్రభుత్వాల వెన్నుదన్నుతో ప్రకృతిని గుప్పిట పెట్టుకుని అపర కుభేరులు ఆడుతున్న అభివృద్ధి వికృత క్రీడలో విషాదాంతం అవుతున్న బడుగుజీవుల బతుకుగాథలు బయటి ప్రపంచానికి తెలియనివ్వడం లేదు.

సముద్ర మట్టంతో పోల్చితే చెన్నై సగటు ఎత్తు 6.7 మీటర్లు మాత్రమే ఉంటుంది. నిజానికి చాలా ప్రాంతాలు సముద్ర మట్టానికి సమాంతరంగా ఉంటాయి. ఈ సమాంతరం కారణంగా సాధారణ రోజులలోనే మురుగు నీరు పారడం ఇబ్బందిగా ఉంటుంది. అభివృద్ధి ఆరాటంలో ఇవేవి పట్టించుకోవడం లేదు. చిత్తడి నేలలన్నీ కాలనీలయ్యాయి. అసలు అడయార్ నది అనేది ఒకటి చెన్నైలో ఉందనీ ఈ వరదలతోనే బయట ప్రపంచానికి బాగా తెలిసింది. 32 రోజుల్లో 13 సెంటి మీటర్ల వర్షపాతం నమోదయింది. ఒక్క డిసెంబర్ ఒకటిన కురిసిన వర్షపాతమే 400 మిల్లిమీటర్లు. గడిచిన వంద సంవత్సరాలలోనే ఇది అతిపెద్ద వర్షపాతమంటే వర్ష తీవ్రత ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

చెన్నైలో వర్షాలు, వరదలు అసాధారణం కాకపోయినా, ఆ వరద నీరంతా చిత్తడి నేలలు, చిన్నా, పెద్ద చెరువులు సరస్సులలో నిల్వ ఉండడమే కాకుండా కువం, అడయార్, కొసంతళయార్ వంటి నదుల ద్వారా బంగాళాఖాతంలో కలిసేవి. నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో ఊపందుకున్న కేంద్రీకృత అభివృద్ధి అంతా మౌలిక సదుపాయాల పేరుతో చిత్తడి నేలల్లోనూ, నదుల ఒడ్డున, చెరువులను, కుంటలను ఆక్రమించో లేదా అక్రమంగా అనుమతులు సంపాదించో ఖరీదైన కళ్లు చెదిరే కట్టడాలను నిర్మించారు.

చెన్నై అంతర్జాతీయ విమానాశ్రయం, మాస్ ర్యాపిడ్ ట్రాన్సిట్ వ్యవస్థ (ఎంఎంటిఎస్ లాంటి రైల్వే రవాణా వ్యవస్థ), ఎక్స్‌ప్రెస్ హైవేస్, ఐటి కారిడార్, నాలెడ్జ్ కారిడార్, ఇంజనీరింగ్ కళాశాలలు, రియల్ ఎస్టేట్ వ్యాపారం నదుల అంచుననో, చెరువు కుంటల మధ్యలోనో, చిత్తడి నేలలోనో, కాలువ గట్లమీదనో నిర్మించడం వల్ల వాటి సామర్థ్యం తగ్గిపోవడం, వైశాల్యం కుంచించుకుపోవడం, నీటిని నిల్వ చేసుకునే శక్తిని కోల్పోవడంతో వరద జలాలన్నీ నగరంలోంచి బయటపడే మార్గం లేక నానా భీభత్సాన్ని సృష్టించాయి. 25 మీటర్ల వెడల్పు ఉన్న సౌత్ బకింగ్‌హామ్ కాలువ 10 మీటర్లకు కుంచించుకుపోయింది.

ఆధునిక రైలు రవాణా వ్యవస్థ దాన్ని మింగేసింది. చెన్నై లోపల, వెలుపల 600 సరస్సులు ఉండేవి. ఇవాళ అవి 10 మాత్రమే ఉన్నాయి. ఒకప్పుడు ఏ చెరువో, సరస్సో, చిత్తడి నేలో, కాలువో అయిన ప్రతి ప్రాంతం కూడా ఇవాళ ఏదో కట్టడంగా మారిపోయింది. 19 పెద్ద సరస్సుల వైశాల్యం 1130 హెక్టార్ల నుంచి 640 హెక్టార్లకు కుంచించుకు పోయిందంటే ఆక్రమాలు, అక్రమ కట్టడాలు తీవ్ర స్థాయిలో జరుగుతున్నాయని అర్థం అవుతుంది.

అడ్డదిడ్డంగా చేపట్టిన నగరీకరణ పనులే వరద ప్రవాహాన్ని పట్టించుకోకుండా, పరిగణనలోకి తీసుకోకుండా అవినీతి మత్తులో అక్రమ అనుమతులిచ్చి ప్రజా జీవితాలతో చెలగాటం ఆడుతున్నారు. దీనికి తోడు డ్రైనేజీ వ్యవస్థను సక్రమంగా నిర్వహించలేకపోవడం, పారిశ్రామిక వ్యర్థాలు భారీ పరిమాణంలో అడ్డుగా నిలవడం వంటి కారణాలు కూడా ఈ వరద భీభత్సానికి ఉన్నాయి. నరేంద్రమోడీ మేక్ ఇన్ ఇండియా లాగా తమిళనాడు ముఖ్యమంత్రి మేక్ ఇన్ చెన్నై అని దేశ, విదేశీ కంపెనీలను ఆహ్వానించి భారీ సదస్సు నిర్వహించింది.

ఇదే తరహాలో చెన్నైలోని మరిన్ని కంపెనీలు, ప్రాజెక్టులు వచ్చినా ప్రజలకు ఉపాధి, ఉద్యోగ అవకాశాలేమో కానీ, ఇటువంటి భీభత్సాలను మరిన్ని చూడాల్సి వస్తుంది. 1,50,000 అక్రమ నిర్మాణాలున్నాయని, 300 చెరువులు అదృశ్యమయ్యాయని చెన్నై నగర పాలక సంస్థ ప్రకటిస్తున్నది. కాని దానికి కారకులెవరని, ఏ విధానాల ఫలితంగా ఇటువంటి విషాదాలు జరుగుతున్నాయనే శోధన మాత్రం చేయడం లేదు. ఇటువంటి ముప్పు ఒక్క చెన్నైకే కాదు, దేశంలోని అన్ని ప్రధాన నగరాలకు పొంచి ఉన్నది. ఇప్పటికే ముంబై, హైదరాబాద్‌లో మొదలై చెన్నై వంతుగా ఈ సంవత్సరం, భవిష్యత్‌లో ఈ విధానాలు, అభివృద్ధి నమూనా కొనసాగితే ఇంతకంటే ప్రళయమే ఉండే ప్రమాదం ఉంది. ప్రకృతి మీద మనిషి సాధించిన ప్రతి విజయానికి ప్రకృతి ప్రతీకారం తీర్చుకోవడం అంటే ఇలాంటివేనేమో!

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- సాంఘిక వెలి - ప్రజారోగ్యం - డా. పట్టా వెంకటేశ్వర్లు
- ప్రజారోగ్యం ప్రైవేట్ పరం - మండి నాగమణి
- వరంగల్ జిల్లాలో గుత్తికోయల జీవన విధానం - కందికొండ కుమార్
- భావ విప్లవకారుడు బంకుపల్లి మల్లయ్య శాస్త్రి - విద్యాభూషణ్

# అభివృద్ధి వ్యూహంలో అన్నదాతల ఆత్మహత్యలు

***పాలకులు అభివృద్ధి పేరుతో తీసుకువచ్చిన సరళీకృత ఆర్థిక విధానాల అమలు ఫలితంగానే రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని, వ్యవసాయంపై వ్యాపారం చేస్తున్న దళారులు లాభపడుతున్నారని అంటున్నారు* మచ్చ శ్రద్ధానందం**

'భారతదేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి బాగానే ఉంది. కాని వాటిని తయారు చేసినవారే సమస్యల్లో ఉన్నారు.' అనే రవీంద్రనాథ్ ఠాగూర్ అభిప్రాయాన్ని గుర్తు చేసుకోవాలి. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో బెంగాల్‌లో వచ్చిన తీవ్ర కరువు కారణంగా దాదాపు 80 లక్షల మంది మరణించారనే విషయాన్ని మననం చేసుకోవాలి. ఈ సంఘటనకు స్పందించే అమర్త్యసేన్ 'సంక్షేమ అర్థశాస్త్రాన్ని' రాయగా నోబెల్ కమిటీ గుర్తించి 1998లో అర్థశాస్త్రంలో నోబెల్ బహుమతినిచ్చి సత్కరించింది.

స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్లలో మొదటి ప్రణాళికలో బడ్జెట్ కేటాయింపులో ఈ వ్యవసాయ రంగానికి మొదటి ప్రాధాన్యతనిచ్చారు. తర్వాత ప్రతి ప్రణాళికలో కొద్దో గొప్పో కొన్ని కేటాయింపులు చేస్తూనే ఉన్నారు. 67 ఏండ్ల స్వాతంత్ర్య చరిత్ర కలిగిన మనదేశంలో రైతులు లక్షల్లో తనువులు చాలిస్తున్న సందర్భం వెనుక అనుసరించిన, అనుసరిస్తున్న అభివృద్ధి నమూనాలను అవగతం చేసుకోవాలి. లేక వీక్షించుకోవాలి. మొదటి ప్రణాళికలో హరడ్ - డోమర్ (ఎచ్-డి) నమూనా (మోడల్) నుండి 1991లో చేసిన ఎల్‌పిజి నమూనా వరకు ప్రభుత్వాలు రైతుల సంక్షేమం కొరకే పని చేస్తున్నాయని తెలుపుతూ వస్తున్నాయి.

అయినా ప్రాంతీయ అసమానతలు, నిరుద్యోగం, పేదరికం, ఆర్థిక అసమానతలు మొదలైనవి తాండవిల్లుతూనే ఉన్నాయి. వీటికి తోడుగా 20 ఏళ్లుగా నమ్ముకున్న వ్యవసాయం దెబ్బతిని లక్షల్లో అన్నదాతలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. విరామమెరుగని రైతుల బలవన్మరణాలు మానవ జాతి పరిణతికి, నాగరికతకు మాయని మచ్చలా మారుతున్నాయి.

పరిశోధనల ఫలితాన్ని (రిజల్ట్) చూసి కూడా లక్ష్యాల్ని (ఆబ్జెక్టివ్) తెలుసుకోవచ్చు. అట్లాగే లక్ష్యాల్ని చూసి కూడా ఫలితాల్ని అంచనా వేయవచ్చు. దీనిలో మొదటి దానిని గూర్చి మనదేశానికి అనువర్తింప జేసినట్లయితే 1995 తర్వాత దేశంలో అన్నదాతల ఆత్మహత్యలు ప్రారంభమయినాయి. (1995లో ప్రపంచ దేశాల మధ్య స్వేచ్ఛా వాణిజ్యం కొరకు డబ్ల్యుటిఎ ఏర్పాటయింది) 1995-2014 మధ్య దాదాపు 3 లక్షల మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడినారంటే, ఇప్పటి వరకు అమలు చేసిన అభివృద్ధి నమూనాల ఫలితమే అని చెప్పుకోవడంలో తప్పేమీ లేదు. దేశంలో అభివృద్ధి నమూనా తొలుత పరిమితం (క్లోజ్)గా ఉన్నప్పటికీ 1991లో చేసిన ఎల్‌పిజి నమూనా బహిర్గతం (ఓపెన్) గా మారిందనుకోవచ్చు. ఈ ఎల్‌పిజి విధానాలు పంపిణీలో పేదవాడికి, ధనవంతుడికి జతకట్టిన సందర్భమది. ధనిక, పేద దేశాల మధ్య వ్యాపారోద్దేశ్యమై జరిగిన ఒప్పందమది. స్వతంత్రంగా జీవించిన రైతును ఆధారపడే స్థాయికి తీసుకొచ్చిన అగ్ర రాజ్యాల ఆలోచనది. లాభాపేక్షతో వ్యవసాయాన్ని పావులా వాడుకున్న వ్యూహమది. వ్యవసాయ రంగ సంక్షోభానికి విత్తనాలు చల్లిన ప్రణాళిక అది.

రైతు ఆత్మహత్యల కారణాలను రెండు పార్శ్వాలుగా చూడొచ్చు. 1) ఖర్చులు పెరగడం; 2) మద్దతు ధరలు లేకపోవడం. 1995 తర్వాత దేశంలో హైబ్రిడ్ విత్తనాల వినియోగం పెరిగింది. దీనికి హరిత విప్లవానికి చేసిన నూతన వ్యవసాయ వ్యూహమే నాంది. ముఖ్యంగా వాణిజ్య పంటలకు (ఇఎక్స్-పత్తి) ప్రాధాన్యత పెరిగింది. పత్తి విత్తనాల వినియోగం, ఎరువులు, క్రిమి సంహారక మందుల వినియోగం, యంత్రాల వినియోగం పెరిగింది. అంతేకాకుండా అనూహ్యంగానే పెరిగినాయి. ఎందుకంటే ఇవన్నీ ప్రైవేట్ కంపెనీల యాజమాన్యంలో తయారయినాయి కాబట్టి. ఉత్పాదకాల వినియోగంతో పాటు వాటి ధరలు పెరిగినందువల్ల వ్యవసాయ ఖర్చులు పెరిగినాయి. ప్రాజెక్టుల ద్వారా కానీ, చెరువుల ద్వారా కానీ, కుంటల ద్వారా కానీ నీటిని నిల్వ ఉంచుకుని వాడుకునే పరిస్థితి కనుమరుగయింది. ఫలితంగా భూగర్భ జలాలు అడుగంటి పోవడం, రైతులు బోర్లపై ఆధారపడి వ్యవసాయం చేయడం. భూగర్భ జలాలు తగ్గిపోవడం వల్ల వేస్తున్న బోర్లన్నీ విఫలం కావడం, ఆశతో అప్పుతెచ్చి మరిన్ని బోర్లు వేయించడం, అవి అంతంత మాత్రంగానే పనిచేయడం. ఫలితంగా పంటలెండడం. అప్పుతెచ్చే అవకాశం లేకపోవడం. వ్యవస్థాగత రుణ పరిణామం క్షీణించిపోవడం. సహకార వ్యవస్థ బలహీన పడడం వంటివి రైతుల్ని ఆత్మహత్యలు చేసుకోవడానికి పురిగొల్పినాయని చెప్పవచ్చు.

ఇక రెండవది నాటి నుండి నేటి వరకు గుండు పిన్ను ధరను నిర్ణయించే శక్తి తయారుదారుడికి ఉంది. కాని రైతుకు మాత్రం తన ఉత్పత్తులకు ధరను నిర్ణయించే శక్తి, నిర్ణయాధికారం మాత్రం ఉత్పత్తికి సంబంధం లేనోడి చేతిలోకి పోయింది. (మధ్యవర్తులు, దళారులు, కమిషన్ ఏజెంట్లు). కాని ప్రభుత్వాలు నిర్ణయిస్తున్న మద్దతు ధరలు (ఎంఎస్‌పి) రైతులను సంతృప్తి పరచలేకపోయింది. ఓ పక్క ప్రభుత్వమే చెపుతుంది. 1 వరిబస్తా పండించడానికి 1600 రూపాయల ఖర్చవుతుందని. కాని చెల్లించేది మాత్రం ఇన్ని రోజులు 1200 రూపాయలు దాటలే. ఇటీవల తెలంగాణ ప్రభుత్వం ఊరట కలిగించే విధంగా పెంచిందనుకోండి. ప్రభుత్వాలు ఎంఎస్‌పిని నిర్ణయించడానికి రైతుకు సంబంధం లేని 20 అంశాలను తీసుకోవడం విచారించ వలసిన విషయం.

ఇక దళారులు, కమిషన్ ఏజెంట్లు రైతుల్ని ఎలా మోసం చేస్తున్నారో ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. గత సంవత్సరంలో వరంగల్ పత్తి మార్కెట్లో రైతులకు జరిగిన అన్యాయాన్ని లేదా మోసపోయిన తీరును

అందరం చూసే ఉన్నాం. (సాక్షి పత్రిక ద్వారా) ఆర్థిక సంస్కరణల అమలు తర్వాత ఈ రంగానికి బడ్జెట్లో కేటాయింపులు తగ్గినాయి. సబ్సిడీలు తగ్గినాయి.

ఇక్కడొక విషయాన్ని గమనించాలి. 20 సంవత్సరాల నుండి వరుసగా జరుగుతున్న అన్నదాతల ఆత్మహత్యల వెనుక ప్రభుత్వాలు అనుసరించిన అభివృద్ధి నమూనాల వైఫల్యం ఫలితాన్ని ఒప్పుకోవడంలో సంకోచించవలసిన అవసరం లేదు. ప్రకృతి వైపరీత్యాల ప్రభావం కొంత మేరకు ఉన్నప్పటికీ, ఇటువంటి సందర్భాల్లో ప్రభుత్వం వీరికి భరోసా ఇవ్వకపోవడంలో జరిగిన వైఫల్యాన్ని కూడా గమనించాలి.

ఇవ్వాళ వ్యవసాయం వ్యయంగా మారిందే కాని, రాబడిని తెచ్చిపెట్టే విధంగా లేదు. ఫలితంగా రైతులు వ్యవసాయాన్ని వదిలి వెళ్లాలను కుంటున్నారు. జాతీయ నమూనా సర్వే ప్రకారం గ్రామాల నుండి వలస వెళ్లిన వారిలో 47 శాతం నిర్మాణ పనుల్లో నిమగ్న మవుతున్నారు. రోజుకు 2000 మంది రైతులు దేశవ్యాప్తంగా వ్యవసాయాన్ని వదిలి వెళుతున్నారని ప్రముఖ పాత్రికేయుడు పి. సాయినాథ్ మాటల్ని మననం చేసుకోవాలి.

జరుగుతున్న రైతు ఆత్మహత్యలు కూడా 2/3 వంతు కేవలం మహారాష్ట్ర, కర్నాటక, గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ (తెలంగాణ ప్రాంతంలోనే 62 శాతం), తమిళనాడు, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్ రాష్ట్రాల లోనే ఎందుకు జరుగుతున్నాయి. ఈ రాష్ట్రాల్లో ప్రతి 30 నిమిషాలకు ఒక రైతు ఆత్మహత్య చేసుకుంటున్నట్లు నివేదికలు చెపుతున్నాయి. ముఖ్యంగా హరిత విప్లవ ఫలితాన్ని అపారంగా పొందిన పంజాబ్‌లో కూడా జరుగుతున్నాయంటే హరిత విప్లవ లక్ష్యం ఏమైనట్లు. నిన్నటి వరకు ఎపి రైతు ఆత్మహత్యలు జరుగుతున్న రాష్ట్రాల్లో 2,3వ స్థానంలో ఉండగా, ఇవ్వాళ తెలంగాణ రాష్ట్రం 2వ స్థానానికి వచ్చింది. ఈ రాష్ట్రాల్లోనే జరగడం వెనుక గల మర్మాన్ని కూడా గమనించవలసిన అవసరం ఉన్నది. ఇక్కడ వ్యవసాయాధారిత కుటుంబాలు ఎక్కువ, జనాబా ఎక్కువ. ఎక్కడ జనాబా ఎక్కువగా ఉంటుందో అక్కడ లాభాలు ఆర్జించడానికి మంచి మార్కెట్ ఉంటుంది. కాబట్టి అధిక రైతు కుటుంబాలు ఉన్న ఈ రాష్ట్రాల్లో, రైతులకు కావలసిన ముడిసరుకులు, విత్తనాలు, ఎరువులు, క్రిమి సంహారక మందులు, యంత్రాలు, యంత్ర పరికరాలు మొదలైన వాటి వినియోగం పట్ల కార్పొరేట్ కంపెనీలు చేసే అడ్వర్‌టైజ్‌మెంట్లు, ఆర్భాటాలు మొదలైనవి రైతులను తీవ్రంగా ఆకర్షించగలిగినాయి. ఫలితంగా రైతుల ఖర్చులు పెరిగాయి. కొన్ని చోట్ల నకిలీ విత్తనాలు, ఎరువులు కూడా కనిపించినాయంటే ఎంతటి లాభాపేక్షతో ఈ సంస్థలు తమ ఉత్పత్తులను అమ్ముకున్నాయో అవగాహన చేసుకోవచ్చు. మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామి పథకం వల్ల కూలీల కొరత ఏర్పడింది. దీని ద్వారా వేతనాలు పెరిగి వ్యవసాయ ఖర్చులు కూడా పెరిగినాయి.

నూతన ఆర్థిక విధానాలు విద్య, వైద్యం వంటి అంశాలలో కూడా ప్రభావాన్ని చూపినాయి. విద్య, వైద్యం వ్యాపారీకరణ జరిగింది. ప్రభుత్వ విద్యాసంస్థలలో వసతులు, బోధన, నాణ్యత కొరతవల్ల రైతు కుటుంబాలు ప్రైవేట్ విద్యా సంస్థలను ఆశ్రయించడం జరిగింది. అదే విధంగా వైద్యం విషయంలో కూడా. ఈ విధంగా గ్రామీణ కుటుంబాలు విద్య, వైద్యంపై చేసే ఖర్చులు సంస్కరణల తర్వాత భారీగానే పెరిగాయని చెప్పవచ్చు.

ఇక నిత్యావసర వస్తువులైన బియ్యం, అన్ని రకాల పప్పు దినుసులు, నూనెలు, కిరోసిన్, వస్త్రం మొదలైన వాటి ధరలు కూడా అధిక రెట్లలో పెరిగాయి. కుల వృత్తులు, చేతి వృత్తులు కూడా నశించాయి. ప్రదర్శనా ప్రభావం కూడా బాగానే పనిచేసింది. పెళ్లిళ్లు, పురుడ్లు, విందులు, వినోదాలు, పుట్టిన రోజు వేడుకలు, సంస్కృతి సాంప్రదాయాల పేరిట అయ్యే ఖర్చులు కూడా పెరిగాయి. ఇలా నూతన ఆర్థిక విధానాల వల్ల అన్ని రకాల (వ్యవసాయ సంబంధ) ఖర్చులు, జీవన ఖర్చులు పెరిగి రైతులు రుణ ఊబిలో ఇరుక్కుపోవడం జరిగింది. 70వ ఎన్ఎస్ఎస్ఒ నివేదిక ప్రకారం 'దేశంలో గ్రామీణ రుణ గ్రస్తత గతంలో కంటే పెరిగింది.' ఆంధ్రప్రదేశ్‌లో 92.9 శాతం, తెలంగాణలో 89.1 శాతం, కేరళలో 77 శాతం గ్రామీణ కుటుంబాలు అప్పుల వలయంలో చిక్కుకున్నాయంటే ఎంతటి తీవ్రమైన ఆర్థిక సమస్యతో బాధపడుతున్నాయో అర్థం చేసుకోవచ్చు.

ఇన్నాళ్ల ప్రభుత్వ విధానాల వల్ల వ్యవసాయ ఖర్చులు, జీవన వ్యయం పెరిగినాయి. కాని మరోపక్క రైతు ఉత్పత్తికి సంబంధించిన మద్దతు ధరల్లో పెరుగుదల అంతగా ఆశా జనకంగా లేదు. అభివృద్ధి క్రమంలో చిన్న కుటుంబాలు పుట్టుకొచ్చాయి. వస్తు సంస్కృతి పెరిగింది. కుటుంబ కలహాలను పరిశీలించి, పరిష్కరించే పెద్ద మనుషులు లేకపోవడం కూడా రైతు ఆత్మహత్యలకు కారణంగా నిలుస్తున్నాయి. పారిశ్రామిక రంగంలో ఎంత పెట్టుబడి పెడితే అంతకంటే ఎన్నోరెట్లు లాభాలు వచ్చే అవకాశాలుంటాయి. కాని వ్యవసాయ రంగంలో మాత్రం ఖర్చులు పెరిగినాయి. రాబడిలో రుణాత్మక పెరుగుదల కనిపిస్తోంది/ఆశాజనకంగా లేదు. వ్యవసాయ ఖర్చులు – రాబడి మధ్య అంతరాయం విపరీతంగా పెరిగింది. అందుకే ఈ ఆత్మహత్యలు.

ఇన్నాళ్ల అభివృద్ధి వ్యూహంలో చెరువులు, కుంటలు కనుమరుగైనాయి. ప్రాజెక్టులు ఉన్నవి విస్తరించలేదు. కొత్తవి జాడేలేకుండా పోయాయి. కేవలం వ్యవసాయం అభివృద్ధి కోసమే ఏర్పడిన బ్యాంకులు, నీటిపారుదల శాఖ, వ్యవసాయ శాఖ, విద్యుచ్ఛక్తి మొదలైన విభాగాలలో సహకారం కొరవడింది. పంటల తీరును, ప్రాధాన్యతను, మెలకువలను నేర్పించి వివరించే వ్యవస్థాగత యంత్రాంగం సరిగ్గా పనిచేయకపోవడం కూడా సంక్షోభానికి కారణాలుగా నిలుస్తున్నాయి. మార్కెట్‌లో సరఫరా అవుతున్న నకిలీ విత్తనాలు, ఎరువులు, క్రిమి సంహారక మందులు మొదలైన వాటిని నియంత్రించే యంత్రాంగం సరిగ్గా పనిచేయకపోవడం కూడా.

ఆరుకాలం కష్టపడుతున్న అన్నదాత తనకు తెలియకుండానే అధిక ఖర్చుల పాలవుతున్నాడు. అదే సమయంలో అల్ప ఆదాయం పొందేవాడుగా మారుతున్నాడు. రైతు శ్రమను ఎవరో, ఏదో అగోచర హస్తం దోచుకున్నట్లుగా ఉంది. ఇటువంటి విపత్కర పరిస్థితుల మధ్య ప్రత్యక్షంగా వ్యవసాయాన్ని నమ్ముకున్న రైతు జీవితాల్లో వెలుగు నింపాల్సిన అవసరం ఉన్నది. సమాచార, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో పురోగమిస్తున్న భారతదేశంలో అన్నదాతల ఆత్మహత్యలు అభివృద్ధికి ప్రశ్నగానే మిగిలాయి.

మనో ధైర్యంతో బారెడాశతో బతుకులీడుస్తున్న రైతు అప్పటికప్పుడే ఆత్మహత్య చేసుకోవడానికి అవకాశం లేదు. దాని వెనుకాల దీర్ఘకాలిక మనో సంఘర్షణ, వేదన ఉంటుందని గమనించాలి. పరిహారం పేరిట రైతు ఆత్మహత్యలు జరిగిన కుటుంబాలను ఆదుకోవడంలో ఎంత

# ప్రభుత్వ పాపాల ఫలితమే రైతు ఆత్మహత్యలు

*సంస్కరణల పేరుతో ప్రభుత్వాలు వ్యవసాయరంగాన్ని విదేశీ కంపెనీలకు తాకట్టు పెట్టి రైతుల ఆత్మహత్యలకు కారణం అవుతున్నాయనీ, ప్రభుత్వాలపై ఒత్తిడి తెచ్చి రైతు బతుక్కు భరోసా కల్పించే విధానాలను సాధించుకోవాలనీ అంటున్నారు* **బి.రామకృష్ణ**

తెలుగు రాష్ట్రాల్లో జరుగుతున్న రైతుల ఆత్మహత్యల నివారణ గురించి దాఖలైన ప్రజా ప్రయోజన వాజ్యంపై స్పందించిన కోర్టు రెండు రాష్ట్రాలను ఏం చేస్తున్నారని ప్రశ్నించింది. ప్రభుత్వాలు ఇచ్చిన వివరణలతో కొంతమేరకు సంతృప్తి చెంది అవి సరిపోవని 2015 డిసెంబర్ 1న కోర్టు అభిప్రాయపడినట్లు మీడియాలో వచ్చింది. ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలు బాగానే ఉన్నాయంటూనే అధికారుల అవినీతి కూడా ఆత్మహత్యలకు కారణం అవుతోందని, ప్రభుత్వ పథకాలు ప్రజలకు సరిగా అందడం లేదని వాటిపై విస్తృత ప్రచారం జరగాల్సి ఉందని కోర్టు అభిప్రాయపడింది. రైతుల ఆత్మహత్యలకు కారణం వెతకమని చనిపోయాక పరిహారం ఇస్తే ప్రయోజనం ఏమిటని హైకోర్టు గత సెప్టెంబర్‌లో ప్రశ్నించింది. పరిహారమే పరిష్కారం కాదని చెప్పింది. రైలు ప్రమాదాలు, విమాన ప్రమాదాలు సంభవించినప్పుడు కమిటీలు వేస్తారని కాని రైతులు ఆత్మహత్యలకు గురవుతుంటే పట్టించుకోకపోవడం ఏమిటని ప్రశ్నించింది. ఇలాంటి సంఘటనలపై కోర్టులు సుమోటోగా స్పందించే అవకాశం ఉన్నప్పటికీ ఈ విషయంలో కోర్టు తనకు తానుగా స్పందించలేదు. ఎవరో వేసిన ప్రజా ప్రయోజన వాజ్యానికి స్పందనగా కోర్టు ఈ మేరకైనా స్పందించిందని సంతోషించాలో లేక రైతాంగ, వ్యవసాయ రంగ సమస్యల మౌలిక పరిష్కారాల గురించి ఆలోచనలేవని ప్రశ్నించాలో ఆలోచించుకోవాల్సి ఉంది. నిజంగానే కొంతమేరకైనా సంతృప్తికరంగా ప్రభుత్వ స్పందనలు ఉన్నాయా? ప్రభుత్వాలకు ప్రత్యేక రైతు సంక్షేమ విధానం గానీ వ్యవసాయ విధానం గానీ ఉన్నాయా? అవినీతి అధికారుల్లో మాత్రమే ఉందా? ప్రభుత్వాల విధానాలలో ఉందా? ప్రభుత్వంలో ఉన్న విధాన నిర్ణేతల్లో ఉందా?

తెలంగాణ రాష్ట్ర సమితి అధికారంలోకి వచ్చిన నాటి నుండి ఏడాదిన్నర కాలంలో 1,347 వరకు రైతు ఆత్మహత్యలు జరిగాయని రైతు సంఘాలు చెబుతుంటే అన్నికావు నిజమైనవి 342 మాత్రమేనని ప్రభుత్వం కోర్టులో వాదించింది. ఆత్మహత్యలకు కారణం చెబుతూ వరుసగా 2సంవత్సరాలు పంటలు సరిగా పండకపోవడంతో పాటుగా పండుగలకు, పబ్బాలకు, పెళ్లిళ్లకు దుబారా ఖర్చుల కోసం అప్పులు చేయడం అన్నదాన్ని ప్రస్తావించింది. అసలు కారణాల నుండి దృష్టి మరల్చడంలో భాగంగా ఇలా పెళ్లిళ్లకు దుబారా ఖర్చులు అనడం ద్వారా రైతులను అవమానించారు. ఇవే కాకుండా విచక్షణ రహితంగా బోరుబావుల తవ్వకాల కోసం, తమ పిల్లలను ప్రైవేటు బడుల్లో చదివించడానికి ఖర్చులకోసం భూములకు కౌలు చెల్లించడం కోసం గల్ఫ్ దేశాలకు వెళ్లేందుకు ఖర్చులకోసం చేసే రుణాలు, దీర్ఘకాలిక అనారోగ్యం అనేవి రైతు ఆత్మహత్యలకు కారణాలుగా తెలంగాణ ప్రభుత్వం కోర్టుకు నివేదించింది. ప్రభుత్వం చెప్పినవాటినే పరిశీలిస్తే అసలు బోరుబావులు ఎందుకు వేయాల్సి వస్తుంది. అవి ఎందుకు ఫెయిల్ అవుతున్నాయి ఆలోచించారా? భూగర్భ జలాల, నీటి పారుదల సౌకర్యాల పెంపుదల కోసం ఏం చర్యలు తీసుకుంటున్నారో కోర్టు వారు అడగకపోవడం, ప్రభుత్వం చెప్పకపోవడాన్ని ఏమనాలి. పిల్లల చదువుల ఖర్చులు ఎందుకు పెరుగుతున్నాయి. ప్రైవేటు బడులు ఎందుకు కుప్పలు

వాస్తవికత ఉందో, అంతకంటే ఎక్కువ సంక్షోభంలో చిక్కుకున్న వ్యవసాయ రంగానికి మూల కారణాలను వెతికి, లేదా వ్యూహాత్మక కారణాలను పరిశీలించాలి, పరీక్షించి పరిష్కార మార్గాలను చూపడంలో కూడా అంతే వాస్తవికతా ఉంది.

ఇవ్వాళ మొత్తంగా కూడా వ్యవసాయానికి కావాల్సిన ముడి సరుకుల లభ్యత, వాటి ధర నిర్ణయాధికారం మార్కెట్ చేతుల్లోకి పోయింది. అంతే కాకుండా వ్యవసాయోత్పత్తుల ధర నిర్ణయం కూడా మార్కెట్ చేతుల్లోకి వెళ్లింది. ఇటువంటి విషయాల్లో ప్రభుత్వం బాధ్యత దాదాపు తగ్గిపోయిందనే చెప్పవచ్చు. లాభాపేక్షతో నడిచే మార్కెట్ వ్యవస్థ విలువలు రైతుల్ని ఆధారపడే స్థాయికి చేర్చాయి, బలహీనుల్ని చేశాయి, రుణ గ్రస్తుల్ని చేశాయి. చివరికి ఆత్మక్షోభకు గురై ఆత్మహత్య చేసుకునేటట్లు చేసినాయి, చేస్తున్నాయి కూడా.

1991 తర్వాత దేశంలో వృద్ధిరేట్లు పెరిగినాయి (కొన్ని సంవత్సరాలలో తప్ప), అదే సమయంలో ఉపాధి అవకాశాల రేటు తగ్గింది. దీనినే 'జాబ్‌లెస్ గ్రోత్' 'ఉపాధి రహిత వృద్ధి'గా ఆర్థిక వేత్తలు పరిగణించారు. దీనికితోడు ఆర్థిక సమానతలు కూడా పెరిగాయి. ముఖ్యంగా ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అని కొనియాడుకుంటున్న వ్యవసాయరంగంలో రైతుల ఆత్మహత్యలు అత్యధిక రేటులో కనిపించాయి.

తాను బతుకుతూ ఇతరులకు భరోసానిచ్చే అన్నదాతల ఆత్మహత్యల వెనుక ఉన్న అభివృద్ధి వ్యూహాన్ని పునస్సమీక్షించుకోవాలి. కాబట్టి పాలకులు రైతుకు భరోసానిచ్చే భారీ వ్యూహాన్ని నిర్మించుకోవాలి. రైతుకు కావలసిన అన్ని ముడి సరుకులను ప్రభుత్వమే అందజేయాలి. అదే విధంగా ఉత్పత్తికి ధరలను ప్రభుత్వమే నిర్ణయించి కొనుగోలు చేయాలి. రైతు వ్యవసాయం పట్ల ఆసక్తిని చూపేటట్లుగా విధానాలు మారాలి. సేంద్రీయ వ్యవసాయ విధానాన్ని ప్రోత్సహించాలి. అహర్నిశలు శ్రమిస్తున్న అన్నదాత ఆనందంగా ఉన్నప్పుడే అభివృద్ధి నమూనాకు ఒక అర్థం ఉంటుందని గ్రహించాలి.

*(రచయిత అర్థశాస్త్ర అధ్యాపకులు)* వీ

తెప్పలుగా పెరిగిపోతున్నాయి. వాటిలో ఫీజులు ఎందుకు అధికంగా వసూలు అవుతున్నాయి. కెజి నుండి పిజి వరకు ఉచిత నాణ్యమైన విద్య గురించి ఏ చర్యలు తీసుకుంటున్నారు. విద్యా వ్యాపారీకరణను, ప్రైవేటు విద్యా సంస్థలను రద్దు చేయడం లేదు ఎందుకని కోర్టు వారు అడగకపోవడం ప్రభుత్వం చెప్పకపోవడం దేన్ని సూచిస్తుంది. భూములకు కౌలు డబ్బులు ఎందుకు చెల్లించాల్సి వస్తుంది. ఆత్మహత్యలు చేసుకున్న రైతుల్లో 80 శాతం మేరకు కౌలు రైతులేనన్నది తెలిసిన సత్యమే కదా? భూములను కౌలుకు తీసుకోవల్సిన ఆగత్యం ఎందుకు వస్తున్నది. పండించే రైతుకు కనీస సాగు భూములు లేవెందుకు? తనను తాను పోషించుకుంటూ మిగతా ప్రజలకు తిండి గింజలను అందించే రైతుకు సొంత సాగుభూమి, సాగునీటి వసతుల లేమి ఎందుకు దాపురించింది. భూములు లేకనా? లేక ఉన్న భూముల పంపిణీ సక్రమంగా జరగకనా? ఇదే ప్రభుత్వం పారిశ్రామిక వేత్తలకు లక్షల ఎకరాల భూములను సబ్సిడీ ధరలలో ధారాదత్తం చేయడానికి వేగవంతమైన, సులభమైన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించి ఉన్నది కదా? మరెందుకు రైతులకు ఈ దుస్థితి. దీనిపై కోర్టు వారు ఏమైనా అడిగారా? ప్రభుత్వం ఏమైనా చెప్పిందా?

గల్ఫ్ దేశాలకు వెళ్లేందుకు అప్పులు చేశారనేది నిజమే అనుకుంటే ఇక్కడ ఉపాధి అందకనే కదా వెళ్లేది. ఉపాధి అవకాశాలను పెంపొందించే ప్రయత్నం ఏది? ఆత్మహత్యలకు దీర్ఘకాలిక అనారోగ్యం కారణమైనట్లుగా చెప్పారుకదా? అనారోగ్యాలను నయం చేసేందుకు ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థను ఎలా మెరుగు పరుస్తారో, ఖరీదైన ప్రైవేటు దవాఖాన వ్యవస్థలను రద్దు చేయడమో, నియంత్రించడమో చేస్తూ ప్రజలకు ఉచిత నాణ్యమైన వైద్యం అందించే పనులేవని కోర్టు వారు అడిగారా? ప్రభుత్వం వారు వివరించారా? విద్య, వైద్యంలను వ్యాపార రంగంలో చేర్చిన డబ్ల్యుటిఒ-జిఎటిఎస్ ఒప్పందాలను సమర్థిస్తూ జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారీ శక్తులు వ్యాపారం చేయడానికి ప్రజలు విద్య, వైద్యాలను కొనుక్కునే సరుకుగా మార్చేసిన పాలకుల విధానాలు ఈ దుర్భర పరిస్థితులకు కారణం కావా? విద్యను, విజ్ఞానాన్ని అమ్మేవారుగా వ్యాపార శక్తులు ఉన్నాయి. వాటిని కొనుక్కోగలిగేవారు కొనుక్కుంటారు. లేనివారు అజ్ఞానులుగా మిగిలిపోతారు లేదా వాటికోసం అప్పులు చేసి తీర్చలేక ఆత్మహత్యలు చేసుకుంటారు. అక్కడ ఏ విద్య అందుతుందో అది ఎవరి అవసరాలను తీర్చేవిగా ఉంటాయనేది వేరే విషయం. వైద్యాన్ని వ్యాపార శక్తులు అమ్ముతుంటాయి. కొనుక్కోలేనివారు చస్తుంటారు లేదా అప్పులు చేసి తీర్చలేక ఆత్మహత్యలు చేసుకుంటుంటారు. ఇవేకదా తెలంగాణ ప్రభుత్వం కోర్టు వారికి నివేదించింది. తెలంగాణలో టిఆర్ఎస్ ప్రభుత్వం వచ్చాక రోజుకు సగటున ఇద్దరు లేదా ముగ్గురు రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇలాగే గత రెండు దశాబ్దాలుగా జరుగుతూనే ఉన్నాయి. ఇదెంతో విషాదకరం. ఏ ఆత్మహత్య అయినా ప్రత్యేకించి రైతాంగ ఆత్మహత్యలు సామాజిక సంక్షోభాన్ని సూచిస్తున్నాయి.

ఎన్నికల మేనిఫెస్టోలో చెప్పినట్లుగా దళితులకు 3 ఎకరాల భూ పంపిణీ ఎంతవరకు వచ్చిందో మాట్లాడరు నిజంగా ఈ భూమి సాగు యోగ్యమైనదిగా, సాగు నీరు ఉన్నదిగా ఉంటే అలా భూములు పంచబడి ఉంటే ఇన్ని ఆత్మహత్యలు జరిగి ఉండేవా? రైతు ఆత్మహత్యల సంఖ్యను తక్కువ చేసి కోర్టుకు చూపిస్తున్నారు. రైతు ఆత్మహత్యల కిందకు రావాలంటే తగిన భూ పత్ర ఆధారాలు, రుణ ఒప్పంద పత్రాలు మరెన్నో ధృవీకరణ పత్రాలు అవసరమవుతాయి. అలాగే పోలీసు స్టేషన్లో ఆ సంఘటన రైతు ఆత్మహత్యగా నమోదై ఉండాలి. ఇవన్నీ సక్రమంగా ఉంటే తప్పిస్తే ప్రభుత్వ రికార్డుల ప్రకారం రైతు ఆత్మహత్య కిందకు రాదు. ఇలా వ్యవసాయంపై ఆధారపడి తగిన పంట పండక, పెట్టిన పెట్టుబడి రాక ప్రాణాలు తీసుకునే ప్రతి ఒక్కరు ప్రభుత్వ లెక్కల ప్రకారం రైతు ఆత్మహత్యల కిందకు రారన్నమాట. ఇవన్నీ ఒక ఎత్తయితే వ్యవసాయ రంగంలో గత రెండు దశాబ్దాలుగా వస్తున్న మార్పులను అందులో ప్రభుత్వాల పాత్రను పరిశీలిస్తే వ్యవసాయం ఇంతగా సంక్షోభంలో పడిపోవడానికి మూలాలు అర్థం అవుతాయి.

విభిన్న రకాల పంటల సాగు స్థానంలో కొన్ని(మోనోక్రాప్ సేద్యం) రకాల పంటలే వచ్చి చేరాయి. తెలంగాణ జిల్లాలో ఆత్మహత్యలకు లోనైన రైతుల్లో చాలావరకు బిటి కాటన్ పంట వేసినవారే. ఈ ప్రాంత వ్యవసాయ పరిస్థితులకు ఇవి సరితూగవని ఎందరో వ్యవసాయ శాస్త్రవేత్తలు చెబుతున్నప్పటికీ వాటిని నివారించే పద్ధతి లేకుండా పోయింది. ఎన్నో రకాల ఆహార ధాన్యాలు పండించే దశ నుండి వరి, కాటన్ మరితర కొన్ని రకాల పంటలకే పరిమితం కావడంలో ప్రభుత్వాల పాత్ర ప్రధానమైనదిగా అర్థం చేసుకోవాలి. అంతర్జాతీయంగా వ్యవసాయ రంగంపై గుత్తాధిపత్యాన్ని కలిగి ఉన్న మోన్‌శాంటో, సిన్‌జెంట, కార్గిల్, డోపాంట్ వంటి బహుళజాతి సంస్థల వ్యాపార ప్రయోజనాలకు తలొగ్గి వాటికి తగిన విధానాలను ముందుకు తెస్తున్న గత, నేటి ప్రభుత్వాల తీరులో ఆచరణలో మార్పులు లేకుండా పోయింది. విత్తనాల నుండి మొదలు, హానికర రసాయనిక ఎరువులు, పురుగు మందులు అన్నీ కూడా ఈ కంపెనీల లేదా వాటి బినామీ సంస్థలు, వాటి సబ్ కాంట్రాక్ట్ సంస్థలే ఉత్పత్తి చేస్తున్నాయి. ఇవాళ రైతుకు తాను చేస్తున్న వ్యవసాయం పై సాధికారతగానీ, స్వతంత్రతగానీ, హక్కుగానీ లేకుండా పోయింది. అంతాకూడా మార్కెటే నిర్ణయిస్తుంది. ఈ మార్కెట్‌ను బడా కార్పొరేట్ శక్తులు శాసిస్తున్నాయి. ఈ కార్పొరేట్ శక్తులకు తలొగ్గకుండా రైతులకు స్వయం నిర్ణయాధికారం ఉండేలా వారివారి వాతావరణ పరిస్థితులు, భూముల స్వభావం, సాగునీరు లభ్యతను అనుసరించి రకరకాల పంటలను పండించుకునే జ్ఞానాన్ని అందించే ప్రభుత్వ యంత్రాంగం నేడు పూర్తిగా లేకుండాపోయింది. వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లో వీటిపై పరిశోధనలు జరగాలి. వ్యవసాయ శాస్త్రవేత్తలు, అధికారులు, రైతులతో పాటు కలిసి పనిచేసే వ్యవస్థ లేదు. అటువైపుగా ఏ ప్రభుత్వమైనా తగు చర్యలు తీసుకుంటే ఇన్నేసి ఆత్మహత్యలు జరిగేవా?

విత్తనాలను ఒకప్పుడు కొనుక్కునే పరిస్థితి లేనేలేదు. ప్రతి రైతు తన వద్ద నుండి లేదా సాటి వారి వద్ద నుండి సమకూర్చుకునేవారు. నేడు వాటిని మార్కెట్‌లో కొనుక్కోవలసిన పరిస్థితి దాపురించింది. దీనిపై ప్రభుత్వ నియంత్రణ లేకుండా పోయింది. ప్రభుత్వమే వాటిని గ్రామ గ్రామానికి సరిపడా అందించే ఏర్పాటు చేసే విషయం గురించి ఏ ప్రభుత్వం ఆలోచించిన పాపాన పోలేదు. నిజానికి పంటలు సరిగ్గా పండాలంటే ఇంతలా రసాయనిక ఎరువులను, పురుగు మందులను వాడాలా? ఇవి వాడడం వల్ల వ్యవసాయం ఖర్చు పెరుగుతున్నది. ఒకసారి పంట వేస్తే వాటి నుండి వచ్చే ధాన్యంలో కొన్నిటిని విత్తనాలుగా వాడుకునే పరిస్థితి లేకుండా పోయింది. మార్కెట్‌లో లభించే విత్తనాల ద్వారా వచ్చే పంట నుండి విత్తనాలుగా వాడుకోలేకుండా ఒకవేళ వాడినా ఏ మాత్రం దిగుబడి రాకుండా వాటిని మార్చివేస్తున్నాయి. ఇది వ్యవసాయ కార్పొరేట్ శక్తుల కుటిల నీతిని, కర్కశత్వాన్ని బయటపెడుతున్నాయి. ఈ దుర్మార్గమైన పద్ధతిని నియంత్రించలేని, రద్దు చేయలేని, ప్రశ్నించలేని ప్రభుత్వాలను ఏమనాలి?

పర్యావరణానికి, పంటలకు మేలు చేసే ఇతర పురుగులను సైతం నాశనం చేసే పురుగు మందుల వాడకాన్ని గానీ, భూసారాన్ని, భూమిలో ఉన్న పంటలకు మేలు చేసే ఎన్నో రకాల సూక్ష్మజీవులను నాశనం చేస్తున్న రసాయన ఎరువుల వాడకంపై శాస్త్రీయ అధ్యయనాలు, పరిశోధనలు ప్రభుత్వ పరంగా లేకుండా పోయాయి. ఇతరులు చేసిన పరిశోధనలను, ప్రభుత్వాలు పట్టించుకున్న పాపాన పోలేదు. విత్తనాలను కొనకుండా రసాయనిక ఎరువులు, పురుగు మందుల వాడకం లేకుండా పంటలు పండిస్తున్న అనుభవాలు తెలంగాణ రాష్ట్రంలో ఎన్నో ఉన్నాయి. మెదక్ జిల్లాలో జహీరాబాద్ దగ్గర పాస్తాపూర్ దాని సమీప ఎన్నో గ్రామాల్లో ఈ విధానంలో పంటలు పండిస్తున్నారు. వీరికి డెక్కన్ డెవలప్ మెంట్ సొసైటీ వారు సహాయ సహకారాలను అందిస్తున్నారు. ఈ ప్రాంతంలో రైతుల ఆత్మహత్యలు లేవంటే అతిశయోక్తి కాదు. జనగామ దగ్గర ఎనబావి మరితర ఎన్నోచోట్ల ఎంతోమంది ప్రత్యామ్నాయ సహజ సిద్ధమైన వ్యవసాయం చేస్తున్నారు.

తైదలు, సజ్జలు, కొర్రలు తదితర ఎన్నో రకాల తృణధాన్యాలను వదిలి వరి, పత్తి వెంటపడే దుస్థితిని తెచ్చింది ప్రభుత్వ విధానాలే కాదా? తద్వారా ఆహారకొరత ఏర్పడే పరిస్థితి, ఆహారంలో పోషక విలువలు తగ్గి వ్యాధి నిరోధక శక్తి సన్నగిల్లి ఎన్నో రకాల జబ్బులబారిన పడి వైద్య ఖర్చులు పెరుగుటకు దోహదపడుతున్నది. రేషన్ షాపుల ద్వారా బియ్యంనే సరఫరా చేయడం, ఒకప్పుడు ప్రజల ఆహారంలో ప్రధాన పాత్ర పోషించిన మిగతా చిరుధాన్యాలను నిర్లక్ష్యం చేసి క్రమేపి అవి కనుమరుగై కేవలం వరి పండించడానికే పరిమితం చేసిన పాపం ఎవరిది? వరి పండించాలంటే పుష్కలమైన నీరు అవసరమవుతుంది. కానీ తైదలు, సజ్జలు, జొన్నలు, కొర్రలు వంటివి పండించడానికి అంతగా నీరు అవసరం ఉండదు. అటువంటి ఆహార పంటలను ప్రోత్సహించకుండా వాటికి కావలసిన సహాయ సహకారాలను అందించడానికి కృషి చేయ వలసిన బాధ్యత ప్రభుత్వాలకు లేదా? ఈ మాత్రం ఇంగితజ్ఞానం లేకుండా పోయిందా? మన వ్యవసాయ పరిశోధనా సంస్థలకు అలాగే వాటికి నేతృత్వం వహించే ప్రభుత్వాలకు అని అనిపిస్తే తప్పెవరిదవుతుంది.

జాతీయ, అంతర్జాతీయ, బహుళజాతి పెట్టుబడి శక్తుల విషకౌగిలిలోకి వ్యవసాయ విధానాన్ని తీసుకెళ్లిన ప్రభుత్వ విధానాలను తిరగరాయకుండా రైతులకు స్వయం సాధికారతను సాధించడం సాధ్యం కాదు. ఇదేదో రైతుల వ్యక్తిగత విషయంగా చూడడం, సమస్యను తప్పుగా అర్థం చేసుకోవడం లేదా సమస్యలను కుట్రపూరితంగా పక్కదారి పట్టించడం అవుతుంది. శాస్త్రీయమైన వ్యవసాయ విధానాన్ని రూపొందించి వ్యవసాయానికి రైతు సంఘాలు డిమాండ్ చేస్తున్న పదిశాతం ప్రత్యేక బడ్జెట్‌ను కేటాయించాల్సి ఉంది. తెలంగాణలో అదే విధంగా దేశవ్యాప్తంగా రైతులను అప్పుల ఊబిలో, ఆత్మహత్యల వైపు నెట్టివేస్తున్న ప్రమాదకర బహుళజాతి సంస్థల వ్యవసాయ విధానాలకు భిన్నంగా స్థానిక పరిస్థితులకు అనుగుణంగా సహజ పద్దతుల్లో పండించే వ్యవసాయ విధానాలు తెలంగాణ రాష్ట్రంలో అలాగే దేశంలో ఎన్నోచోట్ల ఆచరించ బడుతున్నాయి. వాటి నుండి అనుభవాలను తీసుకుని మరింతగా పరిశోధనలు చేసి సుస్థిర వ్యవసాయ పద్దతులను అభివృద్ధి చేసే బాధ్యత ప్రభుత్వాల పై ఉంది. వ్యవసాయ విశ్వవిద్యాలయాలకు జయశంకర్ పేరు పెట్టినంతమాత్రాన అది సాధ్యపడదు. జయశంకర్ కాంక్షించిన పచ్చటి తెలంగాణ సాధ్యపడాలంటే వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్ పెట్టుబడి విషపు పట్టు నుండి విడిపించాల్సిందే ప్రతి రైతుకు తగినంత వ్యవసాయ భూమిని సరిపడా సాగునీటి వసతులను స్థానిక పరిస్థితులకు అనుగుణంగా సహజ సేద్యం చేసేలా, రైతు స్వయం సమృద్ధిగా ఉండేలా, పర్యావరణ, స్నేహపూరిత పంటలు, పద్దతులు పాటించేలా ప్రభుత్వం చొరవ తీసుకోవాల్సి ఉంది. ఆ దిశలో ప్రభుత్వం నడిస్తేనే తెలంగాణ సాధనలో ప్రాణాలను త్యాగం చేసినవారిని గౌరవించినట్లవుతుంది.

ఒకప్పుడు కాకతీయులు నిర్మించిన చెరువులు, గొలుసుకట్టు చెరువుల ప్రాధాన్యత నేడు ఎంతగానో ఉంది. ఎక్కడికక్కడ నీటిని భూమిలో ఇంకేలా తగు చర్యలు తీసుకోవాల్సి ఉంది. అటువైపుగా చిత్తశుద్ధితో పనిచేస్తే వ్యవసాయదారులకు సాగునీరును అందించే అవకాశం ఉంది. ఈ ఉద్దేశ్యంతోనే మిషన్ కాకతీయను ప్రారంభించినట్లుగా చెబుతున్నప్పటికి ఆచరణలో అది కొద్దిమంది జేబుల్లోకి డబ్బులు నింపే పనిగా మారింది.

తెలంగాణ ప్రభుత్వం ఆగస్టు 2015లో విడుదల చేసిన విధానపత్రం లాంటి తెలంగాణ సామాజిక ఆర్థిక చిత్రం వ్యవసాయం–సవాళ్లు అనే అంశంలో వ్యవసాయ సంక్షోభం గురించి విశ్లేషణ లేదు. సంక్షోభ కారకుల గురించి మాటవరసకైనా ప్రస్తావించలేదు. నక్సలైట్లు చెప్పే దున్నేవాడికే భూమి అనేది ఎప్పటినుండో ఉన్న డిమాండ్. అయినప్పటికి ప్రజలకు కనీస భూమినైనా పంచడం గురించి ఈ పత్రంలో ప్రస్తావించనేలేదు. సహజమైన వ్యవసాయ పద్దతుల గురించిగానీ అటువైపుగా వ్యవసాయ పరిశోధనా సంస్థల కృషి గురించి తెలుపనే లేదు. అయితే ఈ పత్రంలో వ్యవసాయం చాప్టర్ మొదట్లో "వ్యవసాయం అంటే కొందరనుకున్నట్లుగా కేవలం పంటలు వేయడం కాదు. అది ప్రపంచంలోని భూమి నుంచి నీటి నుంచి ఆహారాన్ని, గ్రాసాన్ని ఉత్పత్తి చేయడం. వ్యవసాయం లేకుండా ఓ నగరం, ఓ స్టాక్ మార్కెట్, బ్యాంకులు విశ్వవిద్యాలయం, చర్చి, సైన్యం ఏవీ మనలేవు. నాగరికతకు సమస్తమైన, సుస్థిర ఆర్థిక వ్యవస్థలకు వ్యవసాయమే పునాది" అనే కొటేషన్‌తో ప్రారంభించారు. వ్యవసాయం అంటే అంతమాత్రమే కాదు అది అత్యధిక ప్రజల జీవన విధానం, వారి జీవితాలు వ్యవసాయంతో ముడిపడి ఉన్నాయి. అందులోని ఒడిదుడుకులకు వారి జీవితాలు తీవ్రంగా ప్రభావితం అవుతున్నాయి. ఈ ప్రభావాన్ని రైతుల ఆత్మహత్యల్లో చూడవచ్చు.

తెలంగాణ రాష్ట్రంలో 55.49 శాతం మంది తమ జీవనోపాధికోసం ఏదోవిధంగా వ్యవసాయ కార్యకలాపాల మీదనే ఆధారపడి ఉన్నారని ప్రభుత్వం విడుదల చేసిన తెలంగాణ సామాజిక ఆర్థిక చిత్రం 2015 చెప్పింది. అంత కీలకమైన వ్యవసాయరంగాన్ని అభివృద్ధి పరచడానికి శాస్త్రీయ విధానాన్ని రూపొందించి ప్రత్యేక బడ్జెట్‌ను కేటాయించాల్సి ఉంది. మోన్సాంటో, కార్గిల్, సిన్‌జెంటా, డూపాంట్ అంతర్జాతీయ మార్కెట్ శక్తులను నిర్వీర్యం చేస్తూ స్థానిక వ్యవసాయ పద్దతులను అభివృద్ధి పరిచే పరిశోధనలను చేయాల్సి ఉంది. రైతులతో కలిసి క్షేత్రస్థాయిలో పనిచేసే వ్యవసాయ శాస్త్రవేత్తలను, పరిశోధనా సంస్థలను విస్తరింప చేయాల్సి ఉంది. అటువైపుగా కోర్టులు స్పందిస్తాయేమో వేచి చూడాల్సిందే. అది అత్యాశ కాకుండా ఒకవేళ స్పందించినా, ప్రభుత్వాలు తమ విధానాలను మార్చుకుంటాయనే గ్యారంటీ ఏమి లేదు. ప్రజాచైతన్యం, ప్రజా ఒత్తిడి సంఘటిత ప్రతిఘటనలు మాత్రమే ప్రభుత్వాలచే ప్రజానుకూల వ్యవసాయ విధానాలను అమలు చేయించగలుగుతాయి.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

# పసిఫిక్ దేశాల భాగస్వామ్య ఒప్పందం

***పసిఫిక్ మహాసముద్ర తీర దేశాలన్నీ కలిసి అమెరికా నాయకత్వంలో కుదుర్చుకున్న వాణిజ్య ఒప్పందం పర్యవసానాలు ఎలా ఉండబోతున్నాయో చర్చిస్తున్నారు ఎ.నర్సింహారెడ్డి***

రాజకీయ అంశాల కంటే ఆర్థికాంశాలే కీలకంగా మారుతున్న ప్రస్తుత ప్రపంచ వ్యవహారాల్లో 'ట్రాన్స్ పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం (టిపిపిఎ) ఒకటి. 2015 అక్టోబర్ 4న అట్లాంటా (అమెరికా)లో ట్రాన్స్ పసిఫిక్ దేశాలైన ఆస్ట్రేలియా, బ్రూనై, కెనడా, చిలి, జపాన్, మెక్సికో, న్యూజిలాండ్, పెరూ, సింగపూర్, మలేషియా, అమెరికా, వియత్నాం (మొత్తం 12 దేశాలు) తమ మధ్య వాణిజ్య అభివృద్ధి కోసం 'ట్రాన్స్ పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం' కుదుర్చుకున్నట్లు ప్రకటించాయి. ప్రామాణికమైన, స్ఫూర్తిమంతమైన, సమగ్రమైన ఈ ఒప్పందంతో ఆర్థికవృద్ధి పెరుగుదల, సభ్య దేశాల మధ్య సహాయ సహకారాలు, జీవన ప్రమాణాల మెరుగుదల, పేదరికం తగ్గింపు, సుపరిపాలన సాధన, కార్మిక చట్టాల అమలు, పర్యావరణ పరిరక్షణ, వాణిజ్య వ్యవహారాల్లో పారదర్శకత తీసుకురావడానికి ఈ ఒప్పందం దోహద పడుతుందని అంటున్నారు. ఇందులోని సభ్య దేశాలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో 40 శాతం, ప్రపంచ వాణిజ్యంలో 24 శాతం ఆక్రమిస్తున్నాయి. సభ్య దేశాలలోని జనాభా 80 కోట్లు ఉంటుంది.

చైనా ఆర్థిక వ్యవస్థను, వాణిజ్యాభివృద్ధిని అడ్డుకోటానికి అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా వ్యూహరచన అయిన 'ఆసియా పివోట్'లో అంతర్భాగమే ఈ ఒడంబడిక నిర్దేశం. తొలుత చైనాను ఆహ్వానించక పోయినప్పటికీ తర్వాత చైనాకు ఆహ్వానం అందినా ఈ సమావేశాల్లో చైనా పాల్గొనలేదు. ఆహ్వానానికి గల ప్రధాన కారణం కార్పొరేట్ కంపెనీలకు అనూహ్యమైన మార్కెట్‌ను చైనా పొంది ఉండడమే. కార్పొరేట్ కంపెనీల ఒత్తిడికి ఒబామా తలొగ్గక తప్పలేదు. అయినప్పటికీ చైనా బ్రిక్స్ దేశాల కలయికకే అధిక ప్రాధాన్యతనిస్తుంది. మరొకవైపు 'టిపిపిఎ యూరప్‌దేశాల భద్రతను బలహీన పరచడానికే అమెరికా వ్యూహమని' యూరోపియన్ పార్లమెంటేరియన్ షాప్ హౌజర్ అంటున్నారు. భవిష్యత్తులో టిపిపిఎలో దక్షిణ కొరియా, ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, తైవాన్ దేశాలు చేరే అవకాశాలు ఉన్నాయి. ఉత్తర అమెరికా స్వేచ్ఛా వాణిజ్యం (నాఫ్తా), అమెరికా ఇయు దేశాల మధ్య స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం, టిపిపిఎల ఏర్పాటు వల్ల ధనిక దేశాలు ఇంకా ధనికదేశాలై, వర్ధమాన దేశాలు మరింత వ్యత్యాసంతో కునారిల్లుతాయని ఆర్థిక శాస్త్రవేత్తలు విశ్లేషిస్తున్నారు.

పసిఫిక్ మహా సముద్ర తీర ప్రాంతాల్లోని అమెరికా, జపాన్, న్యూజిలాండ్, సింగపూర్, ఆస్ట్రేలియా తదితర 12 దేశాలు కుదుర్చుకున్న ఈ ఒప్పందంపై ఇప్పుడు అనేక అభ్యంతరాలూ, ఆందోళనలూ వ్యక్తమవుతున్నాయి. చైనా ఆర్థిక ప్రాబల్యాన్ని దెబ్బతీయడం లక్ష్యంగా అమెరికా చొరవతో ప్రారంభమైన ఈ చర్చలు ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో 2008లో మొదలై... అమెరికాలోని అట్లాంటాలో 2015 అక్టోబర్‌లో ముగిశాయి. అయితే ఈ ఒప్పందంపై ఆయా దేశాల పార్లమెంట్‌లో కూడా ఆమోదం పొందాల్సి ఉంటుంది. అంతకుముందు ఆయా దేశాల్లో అమలవుతున్న అనేక చట్టాలను సవరించుకోవాల్సి ఉంటుంది. మరోవైపు నోమ్ చోమ్‌స్కీ, జోసెఫ్ స్టిగ్లిజ్ వంటి మేధావులైతే కార్పొరేట్ లాభార్జననూ, ఆధిపత్యాన్నీ మరింతగా పెంచుకునేందుకు ఇది అమెరికా పన్నిన వ్యూహమని విమర్శిస్తున్నారు.

వ్యాపార, ఆర్థిక, వాణిజ్య, శాస్త్ర, సాంకేతిక, పర్యావరణం మొదలైన అంశాల్లో పరస్పర సహాయ సహకారాలకు 2006లో బ్రూనై, చిలి, న్యూజిలాండ్, సింగపూర్ దేశాలు ట్రాన్స్ పసిఫిక్ వ్యూహాత్మక ఆర్థిక భాగస్వామ్యం (పి-4) పేరిట ఒక ఒప్పందం కుదుర్చుకున్నాయి. దానిని ఇంకా విస్తృతపరిచి ఇంకొన్ని దేశాలను సభ్యులుగా చేర్చుకోవాలనే ప్రతిపాదనను అమెరికా చేసింది. దాంతో 2008 నుంచి ట్రాన్స్ పసిఫిక్ ఒప్పందం కొరకు 19 సార్లు మంతనాలు జరిగాయి. ఎనిమిదేళ్లపాటు చర్చించుకున్నా అందులోని అంశాలు కాస్తయినా వెల్లడికాకుండా అత్యంత గోప్యంగా ఉండిపోయాయంటే ఆ చర్చలు లోక కల్యాణానికి అయి ఉండకపోవచ్చునని ఎవరికైనా అనుమానం వస్తుంది. విశాల పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం (టిపిపిఎ)పై వివిధ వర్గాలు గత కొన్నేళ్లుగా వ్యక్తం చేస్తూ వస్తున్న సందేహాల్లో నిజం ఉందని ఇప్పుడిప్పుడే వెలుగులోకి వస్తున్న ఆ ఒప్పందం వివరాలు తెలియజెబుతున్నాయి.

2012 కల్లా ఒప్పందంపై సంతకాలు పూర్తికావాలని ముందనుకున్నా అడుగడుగునా ఎదురైన సమస్యల కారణంగా మరో మూడేళ్లకుగానీ చర్చలు ఒక కొలిక్కి రాలేదు. టిపిపి ఒప్పందంలో వాణిజ్య సంబంధిత అంశాలు. పెట్టుబడులు, ప్రభుత్వ సేకరణ, మేధో సంపత్తి హక్కులు, కార్మికులు, పర్యావరణం, వాణిజ్య ప్రత్యామ్నాయాలు, సాంకేతికపరమైన అడ్డంకులు తదితర అంశాలపై పూర్తి వివరణల కోసం 30 చాప్టర్‌లుగా విభజించి, అందులో ప్రతి అంశంపై సమగ్ర సమాచారం పొందు పరిచారు. ఆర్థికాభివృద్ధి, ఉద్యోగ కల్పన, ఉత్పాదకత, సృజనాత్మకత పెంపు ఈ వాణిజ్య ఒప్పందం కీలక లక్ష్యాలని సభ్య దేశాల అధినేతలు చెబుతున్నారు. వీటితోపాటు జీవన ప్రమాణాల పెంపు, పేదరిక నిర్మూలన, పాలనలో పారదర్శకత వంటివి కూడా సాధ్యమవుతాయని వారంటున్నారు.

టిపిపి ఒప్పందం తమ జాతీయ ప్రయోజనాలను దెబ్బతీస్తుందని సభ్య దేశాలన్నిటా విపక్షాల నుండి అభ్యంతరాలు వ్యక్తమవుతున్నాయి. వచ్చే నవంబర్‌లో జరిగే అమెరికా అధ్యక్ష ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని అమెరికాలోనే విపక్షమైన రిపబ్లికన్ పార్టీతోపాటు అధికార డెమొక్రటిక్ పార్టీలోని కీలకమైన నాయకులు కూడా దీన్ని వ్యతిరేకిస్తున్నారు. అందులో డెమొక్రటిక్ పార్టీ తరపున అధ్యక్ష పదవి అభ్యర్థిత్వానికి పోటీపడుతున్న హిల్లరీక్లింటన్ కూడా ఉన్నారు. అయితే, ఎన్నికల ప్రచారానికి కార్పొరేట్ విరాళాలపై ఆధారపడే అమెరికా రాజకీయ నేతలు ఎంతకాలం టిపిపిని వ్యతిరేకించగలరన్నది ప్రశ్న. అమెరికాతోపాటు చిలీ, పెరూ, వియత్నాం వంటి దేశాలలో సైతం అభ్యంతరాలున్నాయి. న్యూజిలాండ్, జపాన్,

ఆస్ట్రేలియా, కెనడాలో విపక్షాలు గట్టిగా వ్యతిరేకిస్తున్నాయి. అయితే అందరి అభ్యంతరాలూ ఒకే రకమైనవి కావు. తమ మార్కెట్‌కు సభ్య దేశాల నుంచి చవక ఉత్పత్తులు వచ్చిపడతాయని, ఉన్న ఉద్యోగాలు కోల్పోవలసి వస్తుందని అమెరికాలో ఆందోళన వ్యక్తమవుతుంటే... ప్రాణావసరమైన ఔషధాల పేటెంట్లను గుప్పెట్లో పెట్టుకుని అధిక లాభాలు ఆర్జించేందుకు సంపన్న దేశాలు పూనుకుంటాయని పేద దేశాల్లోని పౌర సమాజ కార్యకర్తలు ఆరోపిస్తున్నారు.

టిపిపి ఒప్పందంలోని అంశాలు మాత్రం అమెరికాకు విపరీత ప్రయోజనాలు చేకూర్చేవిగా ఉన్నాయని అమెరికా వాణిజ్య శాఖ అధికారిక పత్రాల ద్వారా వెల్లడవుతోంది. లీడర్‌షిప్, జాబ్స్ అండ్ గ్రోత్, వ్యాల్యూస్ ప్రధాన అంశాలుగా అనేక ఉప అంశాలను ఒప్పందంలో చేర్చింది. ఇందులో ముఖ్యంగా ప్రస్తుత అమెరికా వాణిజ్య వ్యాపార ఉద్దీపనకు, డిజిటల్ ఆధార వ్యాపారం, ఆర్థిక లాభాలు, అమెరికా చిన్న, మధ్య తరహా వాణిజ్య అభివృద్ధి, అమెరికా తయారీ, వ్యవసాయరంగ వృద్ధి, ఆటోమొబైల్ రంగ అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ, ఆహార భద్రత, బహిరంగ, స్వేచ్ఛాయుత ఇంటర్‌నెట్ వినియోగం (వ్యాపారం కోసం) తదితర అంశాలు ప్రధానంగా ఉన్నాయి. ఇవన్నీ కూడా అమెరికా స్వలాభం, స్వప్రయోజనాలు, వ్యాపార, వ్యాణిజ్య అభివృద్ధి, ఆధిపత్యం కోసం సాగేవే అని విమర్శకులు ఇప్పటికే పేర్కొన్నారు. ఈ టిపిపి అమలులోకి వస్తే ఆసియాలోని రెండు ప్రధాన దేశాలైన చైనా, భారత్‌లపై దాని ప్రతికూల ప్రభావం తీవ్రస్థాయిలో ఉంటుందని ఒక అంచనా. పసిఫిక్ మహా సముద్రం ఆధారంగా, భౌగోళిక అంశాలను ఆసరాగా చేసుకుని అమెరికా ఈ మహావ్యాపార సామ్రాజ్య ఒప్పందం కుదుర్చుకుందని స్పష్టమవుతోందని స్పష్టమవుతోంది.

టిపిపి ఒప్పందం కుదిరిన తర్వాత అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా చేసిన అధికారిక ప్రకటనలో పేర్కొన్న అంశాలు విస్మయం కలిగిస్తున్నాయి. విశ్వవాణిజ్యంలో చైనా ఆధిపత్య ధోరణి, ప్రపంచాన్ని నిర్దేశించే లక్షణం అమెరికాకు ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదని మరీ తెగేసి చెప్పారు. దీంతో దీని వెనుక అమెరికా రాజకీయ, వాణిజ్య, వ్యాపార విశాల ప్రయోజనాలు ఎలా ఉన్నాయన్నది సులభంగానే అంచనా వేయచ్చు. అంతేకాదు 21వ శతాబ్దం అంతా ఈ వాణిజ్యం, వ్యాపారం సాగుతుందని, అది అమెరికాకు ఎంతో మేలు చేకూరుస్తుందని బరాక్ ఒబామా ప్రకటించడంతోపాటు ఒప్పందం అంతిమ లక్ష్యం అమెరికా ప్రయోజనాలే అని చెప్పడం ఆశ్చర్యకరం. ఆసియాలో జపాన్‌ను ఎంపిక చేసుకోవడం వ్యూహాత్మకమే. ఇప్పటికే చైనా సముద్రజలాల్లో పాగా కోసం, ఆధిపత్యం కోసం అమెరికా ప్రయత్నాలు చేయడం, అమెరికాతో పాటు చైనాను తీవ్రంగా వ్యతిరేకిస్తున్న జపాన్‌ను భాగస్వామిగా చేసుకొని చైనాకు వ్యతిరేకంగా అమెరికా పావులు కదిపింది.

ఆసియా పసిఫిక్ ప్రాంతంలో వాణిజ్యంపై చైనా గుత్తాధిపత్యాన్ని దెబ్బతీసే సత్తా టిపిపిఎకి ఉందని అమెరికా బహిరంగంగా ప్రకటించింది. టిపిపిఎ కారణంగా 2025 నాటికి చైనా 4,600 కోట్ల డాలర్ల మేరకు వ్యాపారం కోల్పోతుందని అంచనా. దక్షిణ చైనా సముద్రంలో ఆగ్నేయాసియా దేశాలతో, తూర్పు చైనా సముద్రంలో జపాన్‌తో చైనా వివాదం పెట్టుకోవడంవల్లే తీర దేశాలు టిపిపిఎ ద్వారా అమెరికా కౌగిట్లోకి చేరుకున్నాయి. దీనితో పసిఫిక్ ప్రాంతంలో చైనా పట్ల వ్యతిరేకత మరింత పెరగబోతోంది. టిపిపిఎ సభ్య దేశాల మధ్య ఐటి, ఆర్థిక సేవల వ్యాపారం పెరగడం భారత్ మార్కెట్ వాటాను తగ్గించవచ్చు. రాబోయే అయిదేళ్లలో తన ఎగుమతులను రెట్టింపు (90 వేల కోట్ల డాలర్లకు) పెంచాలన్న భారతదేశ లక్ష్యానికి టిపిపిఎ గండి కొట్టవచ్చునని సింగపూర్‌కు చెందిన డిబిఎస్ గ్రూప్ పేర్కొంది. టిపిపిఎ నిర్దేశించిన పర్యావరణ, కార్మిక ప్రమాణాలను పాటించి వస్తు సేవలను ఉత్పత్తి చేయడం చైనాకే కాదు భారత్‌కు కష్టమే. ఔషధ తయారీపై టిపిపిఎ నియంత్రణలు భారతీయ ఫార్మా కంపెనీలకు తీవ్ర నష్టం కలిగించక మానవు.

భారత ప్రధాని నరేంద్రమోడీ ప్రవేశపెట్టిన 'మేక్ ఇన్ ఇండియా' (ఇండియాలో తయారీ) భావన నుంచి అమెరికా మరింత ముందుకెళ్లి "మేడిన్ అమెరికా" (అమెరికాలో తయారైన) అనే నూతన వ్యాపార విధానాన్ని తీసుకురావడం విశేషం. మేకిన్ ఇండియాకు ఇంతవరకూ చెప్పుకోదగిన విధంగా ఇతర దేశాలతో ఇండియాకు ఒప్పందాలేవి అమలు జరగలేదు. ఆ అవకాశాలు కూడా ఉన్నట్టు అనిపించడం లేదు. కానీ అమెరికా తన విధానం ద్వారా ఇతర 11 దేశాలతో ఒప్పందం కుదుర్చుకోవడం, దాని అమలుకు వ్యూహం ప్రణాళిక సిద్ధం చేయడం మరో ముందడుగే మరి. మోడీ అమెరికాలో ఉన్నప్పుడు అమెరికాతో అంటకాగడానికి భారత్ ఎల్లప్పుడూ సిద్ధమేనని ప్రకటించినా, గొప్పలు చెప్పినా అమెరికా అంత ఆసక్తిగా లేదని, భారత్‌కు అవసరముంటే తాము చెప్పినట్లు వినవలసి ఉంటుందని టిపిపి ద్వారా పరోక్షంగా హెచ్చరించినట్లు అర్థం చేసుకోవచ్చు. కాబట్టి ఇండియా వ్యూహాత్మకంగా ముందుకెళ్లక పోతే భవిష్యత్తులో అశనిపాతం తప్పదు.

ప్రస్తుతం అమెరికా వస్తు ఉత్పత్తులకు వివిధ దేశాల్లో 18 వేల రకాల పన్నులు వేయబడుతున్నాయి. ఈ ఒప్పందం ద్వారా అమెరికా ఉత్పత్తులకు పన్నుల రాయితీ లభించి తొలుత చౌకగా వస్తువులు లభ్యమైనప్పటికీ తదుపరి కాలక్రమంలో స్వదేశీ పరిశ్రమలూ, ఉత్పత్తులూ మూలనపడి భాగస్వామ్య దేశాల ఆర్థిక వ్యవస్థలు చిన్నాభిన్నమైపోయే ప్రమాదం పొంచి ఉంది. 'తద్వారా అప్పుల ఊబిలో కూరుకుపోయి తక్కువ ధరలకు ముడిసరుకులు విక్రయించుట ద్వారా దేశాల కొనుగోలు శక్తి దిగజారే ప్రమాదం ఉంది. వాణిజ్య ద్రవ్య సంస్థల ఒప్పందాల వల్ల అంతిమంగా ప్రయోజనాలు పొందుతున్నవి బహుళజాతి కంపెనీలు మాత్రమే. ఈ ఒప్పందాల ద్వారా భాగస్వామ్య దేశాల్లోని వస్తు తయారీకి కావలసిన పరిశోధన, సాంకేతిక పరిజ్ఞానం వృద్ధి చెందవు. అధిక లాభాల మూలంగా అమెరికా, జపాన్ దేశాలు ఆటోమేషన్‌వైపు వెళుతూ నిరుద్యోగాన్ని పెంచుతాయి. దీనికితోడు భాగస్వామ్య దేశాలలో సాంఘిక కోతల ద్వారా ఆర్థిక అసమానతలు పెరుగుతాయి.

టిపిపి ఒప్పందం అమలైతే ఎలాంటి అప్రజాస్వామిక విధానాలు అమలవుతాయో అర్థం చేసుకోవాలంటే అందులోని పెట్టుబడిదారుల, ప్రభుత్వాల మధ్య వివాద పరిష్కార ప్రక్రియ (ఐఎస్‌డిఎస్) నిబంధనను గమనించాలి. ఒక దేశంలో పెట్టుబడులు పెట్టిన విదేశీ సంస్థలు తమ పెట్టుబడులకు, లాభాలకు, ఆస్తులకు సదరు దేశ చట్టాలు, విధానాలు భంగం కలిగిస్తున్నాయని భావిస్తే, వాటిని ఆ దేశం వెలుపల కోర్టుల్లో, రహస్య ట్రిబ్యునళ్లలో సవాలు చేయవచ్చు. సాధారణంగా అంతర్జాతీయ న్యాయస్థానాలు ఒక దేశం మీద మరో దేశం వేసిన దావాను మాత్రమే విచారణకు స్వీకరిస్తాయి. కానీ, ఐఎస్‌డిఎస్ కింద కంపెనీలు నేరుగా ప్రభుత్వాల మీద దావా వేయవచ్చు. ప్రభుత్వాలు మాత్రం కంపెనీల మీద దావా వేసే వీలు లేదు. ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్లుటిఓ) నిబంధనల ప్రకారమైతే కంపెనీలు తమ దేశాల ప్రభుత్వాల ద్వారా ఇతర దేశాలపై దావాలు వేయవలసి ఉంటుంది. ప్రస్తుతం 3000 అంతర్జాతీయ ఒప్పందాల్లోని ఐఎస్‌డిఎస్ నిబంధనల ప్రకారం ప్రభుత్వాల మీద దావా వేసే అధికారాన్ని విదేశీ కంపెనీలకు ఇస్తున్నా, స్వదేశీ కంపెనీలకు ఆ అధికారం ఇవ్వలేదు. 1990 నుంచి ఇప్పటివరకు 100

# ఆచరణకు రాని పారిస్ ఒప్పందం

***మనిషి మనుగడనే ప్రశ్నార్థకంగా మార్చే ఉద్గారాలను నియంత్రించే ఒప్పందాల అమలులో బాధ్యతారహితంగా ఉంటున్న అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చెందుతున్న దేశాలపై మాత్రం ఆంక్షలు విధిస్తున్న తీరును వివరిస్తున్నారు ఎ. సంతోష్***

భూతాపం పెరుగుదల నియంత్రణపై ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో పారిస్‌లోని లిబార్గెట్‌లో 'క్లైమెట్ చేంజ్' పై కాన్ఫరెన్స్ ఆఫ్ పార్టీస్ (సిఒపి-21) సమావేశం196 దేశాల నేతల భాగస్వామ్యంతో నవంబర్ 30 నుంచి డిసెంబర్ 12 వరకు 13 రోజులు జరిగింది. తీవ్ర చర్చోపచర్చల తరువాత... భూమిపై మనిషి మనుగడను ప్రశ్నార్థకం చేసే భూతాపోన్నతిని రెండు డిగ్రీల సెల్సియస్ కంటే తక్కువ స్థాయికి పరిమితం చేస్తామని 196 దేశాలు అంగీకరించడం చారిత్రకంగా ఒక ముందడుగే. కోపెన్‌హాగన్ చర్చల నాటి నుండి చేతి చమురు వదులుతుందన్న బెంగతో అమెరికా వంటి సామ్రాజ్యవాద దేశాలు కొంత బెట్టు చూపాయి. కాలుష్యం మోతాదు ఆధారంగా వర్ధమాన దేశాలు బాధ్యతలు పంచుకోవాలని భారత్, చైనాలు పట్టుబట్టాయి. భూతాపం పెరిగితే అందరికంటే ముందుగా బలయ్యేది తామేనని చిన్న ద్వీప సముదాయాల దేశాలు ఆందోళన వ్యక్తం చేశాయి. ఇప్పుడు పారిస్ వాతావరణ సదస్సులో మాత్రం విభేదాలను పక్కనపెట్టి మార్గం సుగమం చేయడంలో దేశాధినేతలు కృతకృత్యులయ్యారు. భూతాపాన్ని నియంత్రించేందుకు 196 దేశాలు సమ్మతించడం ఇదే మొట్టమొదటిసారి.

ప్రపంచ వాతావరణ సంస్థ తాజా నివేదిక ప్రకారం ఉద్గారాల విడుదల ఇలానే కొనసాగితే పుడమిపై ఉష్ణోగ్రతలు 2025 నాటికి రెండు డిగ్రీలు పెరిగితే 20శాతం వృక్ష, జంతుజాలం కను మరుగవుతాయి. వరి, గోధుమ వంటి ప్రధాన ఆహార పంటల దిగుబడులు తగ్గి, ధరలు పెరిగి

దేశాల ప్రభుత్వాలపై 550 సార్లు దావా వేశారు. వీటిలో 65శాతం కేసుల్లో బహుళజాతి కంపెనీలకు అనుకూలంగా తీర్పు వచ్చింది.

ఒప్పందం అమలు ప్రారంభమయ్యాక భాగస్వామ్య ప్రభుత్వం కొత్తగా ఏవైనా నియంత్రణ చట్టాలను తీసుకొస్తే... ఆ చర్య తమ ప్రయోజనాలను దెబ్బతీస్తుందంటూ ప్రభుత్వంపై కంపెనీలు వేరే దేశాల్లోని కోర్టుల్లో, ట్రిబ్యునల్లలో దావా వేయడానికి ఈ నిబంధన వీలు కల్పిస్తోంది. ఆ దావాల విచారణ రహస్యంగా ఉంటుంది. మరోవైపు కార్పొరేట్ పరిశ్రమలు ఏ చట్టాలనైనా ఉల్లంఘిస్తే వాటిపై చర్యలు తీసుకునే అధికారం ప్రభుత్వాలకు ఉండదు. ఆ కంపెనీల కారణంగా నేల, నీరు, పర్యావరణం కాలుష్యం బారిన పడినా నోరెత్తడం సాధ్యం కాదు. ఇంతవరకు విదేశీ ప్రభుత్వాలపై దావాలు వేసిన కంపెనీల్లో అత్యధికం అమెరికాకు చెందినవే. నియంత్రణలు విధించడానికి ప్రభుత్వాలకున్న సార్వభౌమాధికారాన్ని ఐఎస్‌డిఎస్ దెబ్బతీస్తోంది. ప్రజారోగ్యం, నైతిక విలువలు, ఆహారభద్రత, పర్యావరణ, జీవజాలం, సహజ వనరుల రక్షణ కోసం నియమ నియంత్రణలను రూపొందించే హక్కు సభ్యదేశాలకు ఉండేది. టిపిపి నిబంధనల ద్వారా కార్పొరేట్లదే పైచేయి అవుతుందన్న భయాలు వ్యక్తమవుతున్నాయి.

విదేశీ కంపెనీల అక్రమాలను ఎవరైనా ఇంటర్నెట్, యూట్యూబ్, ఫేస్‌బుక్ వంటి మాధ్యమం ద్వారా ప్రపంచానికి వెల్లడించడానికి ప్రయత్నిస్తే అలాంటివారిపై కేసులు పెట్టొచ్చు. ఆ సమాచారాన్ని తొలగించమని కంపెనీలు కోరినప్పుడు ఫేస్‌బుక్ వంటి సంస్థలు అంగీకరించక తప్పదు. కార్పొరేట్ అక్రమాలు ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా వెల్లడి చేయడం నేరంగా టిపిపి పరిగణించడంపై సర్వత్రా హాహాకారాలు రేగుతున్నాయి. ఎలాంటి వాణిజ్య ప్రయోజనం లేని ఫైల్ షేరింగ్‌ల విషయంలో సైతం ఎవరిపైన అయినా సివిల్, క్రిమినల్ కేసులు పెట్టేందుకు అందులోని నిబంధనలు వీలు కల్పిస్తున్నాయి. ఇది అంతర్జాలంలో సమాచార వ్యాప్తికి, నవీకరణకు, కొత్త ఐటి కంపెనీలకు, ప్రజావేగులకు పిడుగుపాటు అవుతుంది.

ఇక పేటెంట్లకు సంబంధించిన నిబంధనలు మరీ కఠినంగా ఉన్నాయి. అవి వాణిజ్య సంబంధ మేధోపరమైన హక్కుల (ట్రిప్స్)ను మించిపోయాయి. టిపిపిఎ అమలైతే ప్రాణావసరమైన ఔషధాల పేటెంట్లు బడా కంపెనీల వద్ద దీర్ఘకాలం ఉండిపోతాయని, వాటిని ఇతర సంస్థలు చవగ్గా ఉత్పత్తి చేయడం సాధ్యపడదని ఆ రంగంలోని నిపుణులు చెబుతున్నారు. నేడు టీకాలు, ప్రొటీన్లు, యాంటీ టాక్సిన్లతోపాటు ఎబోలా, క్యాన్సర్ వంటి వ్యాధుల చికిత్సకు ఔషధాలను జెనెటిక్ ఇంజినీరింగ్ ప్రక్రియలో తయారు చేస్తున్నారు. వీటిని బయోలాజిక్స్ అంటారు. ఇవి రసాయన ఔషధాలకన్నా సమర్థమైనవి. అయితే 22 రెట్లు ఎక్కువ ఖరీదైనవి. బయోలాజిక్స్‌ను అనుకరించి తయారుచేసే బయోసిమిలర్ ఔషధాలు బాగా చవక ధరలకు లభిస్తాయి. కానీ, టిపిపి వల్ల బయోలాజిక్స్ తయారీ పరిజ్ఞానానికి ఎనిమిదేళ్లపాటు పేటెంట్ రక్షణ లభించడం వల్ల పేదలకు చవక బయోసిమిలర్స్ అందుబాటులో లేకుండా పోతాయి.

టిపిపిఎలో భాగం కాబోతున్న మెక్సికో, వియత్నాం, చిలీ, మలేసియా దేశాల్లోని రోగులకు చావు తప్ప మరో గత్యంతరంలేని స్థితి కలగబోతున్నది. టిపిపి ఒప్పందంలోని నిబంధనలు ప్రమాదకరమైనవని కార్మిక, పౌర సంఘాలు, ప్రతిపక్షాలు ఆక్షేపిస్తున్నాయి. టిపిపి గుట్టును రట్టు చేసి అందులోని ప్రమాదకర అంశాలను ప్రజల ప్రయోజనం కొరకు మసి చేయాలని విఖ్యాత ఆర్థికవేత్త జగదీశ్ భగవతి సూచించారు. దీనికి ఆయన 'డ్రాక్యులా భస్మీకరణ' అని నామకరణం చేశారు. ప్రధానంగా అయిదు గుప్త అంశాలపై నిరసనాగ్రహాలు వ్యక్తమవుతున్నాయి. ప్రజా ప్రయోజనాలకు విఘాతం కలిగించే ఈ మాదిరి ఒప్పందాల విషయంలో అందరూ అప్రమత్తంగా ఉండి ప్రతిఘటించడం అవసరం.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

పేదలు పస్తులతో అలమటించే ప్రమాదం పొంచి ఉందని కూడా శాస్త్రజ్ఞులు హెచ్చరించారు. ఇదంతా స్వయం కృతాపరాధమేనని ప్రపంచ దేశాలన్నింటికీ తెలిసినా, దిద్దుబాటు దిశగా పటిష్ట కార్యాచరణ ఎండమావిని తలపించింది. భూతాపం పెరుగుదలకు కారణమైన బొగ్గు పులుసు వాయువుల విడుదలను 1990 స్థాయిలో కనీసం అరవై శాతమైనా తగ్గించనిదే ప్రకృతి వైపరీత్యాల తీవ్రతను తట్టుకోవడం సాధ్యం కాదని 1995 నాటికే తెలిసినా దీటైన కార్యాచరణ చేపట్టని నిష్క్రియాపరత్వంలో ప్రభుత్వాలు నిద్రించాయి.

భూతాపం పెరుగుదల మానవాళికి జీవన్మరణ సమస్య. మానవ నాగరికతకు అస్తిత్వ సమస్య. రెండు దశాబ్దాలుగా వాతావరణ మార్పులపై సర్వత్రా ఆందోళన వ్యక్తమౌతోంది. ఉష్ణోగ్రతలు పెరగడం, అనావృష్టి, అతివృష్టి, అకాల వర్షాలు, సునామీలు వగైరాలను మానవాళి ఇప్పటికే అనుభవిస్తున్నది. అభివృద్ధి పేరిట మనిషి సాగిస్తున్న పర్యావరణ విధ్వంసంతో జీవుల మనుగడకే ప్రకృతి పెనుముప్పుగా పరిణమిస్తుంది. గ్రీష్మంలో రోడ్లు పగిలే ఎండలు, శీతాకాలంలో చలిపులి గాండ్రింపులు, వానకాలంలో మింటినీ మంటినీ ఏకంచేసే వర్షాలు, తుఫానులు, తగలబడుతున్న అడవులు, కరువులు, గతితప్పుతున్న రుతువులు ఇవన్నీ వాతావరణ మార్పుల పర్యవసానమే. ఈ శతాబ్ది చివరి నాటికి భూమి సగటు ఉష్ణోగ్రతలో పెరుగుదల పారిశ్రామికీకరణ పూర్వదశ కంటే 2 డిగ్రీల సెల్సియస్ మించి పెరిగితే తిరిగి మరల్చరాని విపత్కర వాతావరణ మార్పులు తప్పవని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు.

ప్రస్తుతం భూమి సగటు ఉష్ణోగ్రత 15 డిగ్రీల సెల్సీయస్. ప్రపంచ దేశాలేవీ కర్బన్ ఉద్గారాలను నియంత్రించకపోతే 2100 నాటికి (ఈ శతాబ్దం ఆఖరి నాటికి) భూమి సగటు ఉష్ణోగ్రత 19.6 డిగ్రీల సెల్సీయస్‌కు వెళ్లిపోతుందని అంచనా! భూమి సగటు ఉష్ణోగ్రత 16 డిగ్రీల సెల్సీయస్‌కు చేరుకుంటేనే అనేక విపత్తులు సంభవిస్తాయి. ఇప్పుడు మనం చూస్తున్న ఎల్‌నినోలు, భీకర తుఫాన్‌లు, రుతు పవనాల అనుక్రమం తీవ్రరూపం దాల్చుతుంది. అలాంటిది 19.6 డిగ్రీల సెల్సీయస్‌ను చేరుకోవడమంటే మానవ మనుగడకు అంతిమ బిందువు చేరువైనట్టేనని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. 2100 నాటికి భూమి సగటు ఉష్ణోగ్రతలో పెరుగుదల 2 డిగ్రీల సెల్సీయస్‌కు మించరాదు లేదా తక్కువ ఉండేలా చూడాలి అన్నది వాతావరణ నిపుణుల సూచన. ఇదే పారిస్ ఒప్పందంలోని ప్రధాన సారాంశం.

నిజానికి వాతావరణ మార్పుల అంశంపై చర్చ 19వ శతాబ్దంలోనే తెరపైకి వచ్చినా.. దాన్ని కట్టడి చేసే అంశంపై మాత్రం అంతర్జాతీయంగా చర్చలు గత పాతికేళ్లుగా మాత్రమే నిర్మాణాత్మకంగా సాగుతున్నాయి. అయినా నిఖార్సైన ఒప్పందం ఒక్కటీలేదు. కుదిరిన క్యోటో (1997) ఒప్పందంపై కూడా అగ్ర రాజ్యాలు ముఖం చాటేయడంతో అది కార్యరూపం దాల్చలేదు. ప్రపంచం మొత్తం మీద విడుదలవుతున్న గ్రీన్‌హౌజ్ వాయువుల్లో (బొగ్గు పులుసువాయువు, మిథేన్, నైట్రస్ ఆక్సైడ్ తదితరాలు) 99 శాతానికి భాధ్యులైన 166 దేశాలు, వచ్చే 10-15 సంవత్సరాల్లో (2015-2030 మధ్య) తమ దేశాల నుంచి ఉద్గారాల విడుదలను ఏమేరకు తగ్గించగలవో పారిస్ సదస్సుకు ముందే నివేదికలు (ఐఎన్‌డిసిలు) పంపాయి. వాటన్నింటిని విశ్లేషించిన పర్యావరణ శాస్త్రజ్ఞులు-వాటిని కచ్చితంగా అమలు చేసినా, 2100 సంవత్సరం నాటికి ప్రపంచ ఉష్ణోగ్రత రమారమీ 3 డిగ్రీల సెల్సియస్ పెరుగుతుందని అంచనా వేస్తున్నారు.

భూతాపోన్నతి, వాతావరణ మార్పుల నియంత్రణకు ప్రపంచదేశాలు రియో డి జెనీరోలో (1992) జరిగిన ఎర్త్ సమ్మిట్‌తోనే చర్యలు మొదలు పెట్టాయి. 'వాతావరణ క్షీణతకు వివిధ దేశాలు భిన్నమైన స్థాయిల్లో కారణమవుతున్నందున, లక్ష్యం ఉమ్మడిదే అయినప్పటికీ, బాధ్యతలు మాత్రం వేరు వేరు స్థాయిల్లో ఉంటాయి' అని రియో ధరిత్రి సదస్సు సూత్రీకరించింది. 1997లో క్యోటో ప్రోటోకాల్ అమల్లోకి వచ్చింది. ఆ చారిత్రక బాధ్యతను తప్పించుకోవడానికి క్యోటో ఒప్పందానికి అమెరికా దూరంగా ఉండిపోయింది. ఈ ఒప్పందానికి 82 దేశాలు మాత్రమే అంగీకారం తెలిపాయి. అమెరికా సహా కొన్ని పారిశ్రామిక దేశాలు ఒప్పందంపై సంతకాలు చేయలేదు. దీని ప్రకారం పారిశ్రామిక దేశాలు తమ కర్బన ఉద్గారాలను 1990 నాటి స్థాయి కంటే కనీసం 5 శాతం తక్కువ చేయాలి. ఈ ఒప్పందం అమల్లో కొన్ని దేశాలు విముఖత చూపాయి. అయితే ఇదే సమయంలో 36 దేశాలు తగ్గించుకున్న ఉద్గారాల కంటే ఎక్కువ మోతాదులో చైనా వంటి దేశాలు ఉద్గారాల విడుదలను విపరీతంగా పెంచేయడంతో మొత్తం మీద క్యోటో ప్రోటోకాల్ తాలూకు ఫలితం కనిపించకుండా పోయింది.

2009 కోపెన్‌హగన్ సదస్సులో తొలిసారి అన్ని దేశాలు తమ తమ కర్బన ఉద్గారాలను తగ్గించుకోవాలన్న ఉమ్మడి నిర్ణయానికి వచ్చాయి. అయితే ఇందుకు సంబంధించి చట్టబద్ధమైన ఒప్పందాన్ని కుదుర్చుకోవడం మాత్రం కుదరలేదు. 2011 దర్బన్ సదస్సు వాతావరణ సంబంధ అంశాల్లో వర్ధమాన దేశాలకు ఆసరా అందించేలా ఏటా 10వేల కోట్ల డాలర్ల 'హరిత నిధి' ఏర్పాటును ప్రస్తావించినా, పారిశ్రామిక రాజ్యాల కూటమి కచ్చితమైన హామీలివ్వకుండా ముఖం చాటేసింది. 2012లో దోహాలో జరిగిన సమావేశంలో క్యోటో ప్రోటోకాల్ ఒప్పంద కాలాన్ని 2020 వరకూ పొడిగించారు. 2015 ప్యారిస్ సదస్సులో కుదిరిన ఒప్పందం 2020 నుంచి 2030 వరకూ అమల్లో ఉంటుంది. ఒప్పందం అమలుపై తొలి మదింపు 2023లో జరుగుతుంది.

ప్రస్తుతం ప్రపంచ దేశాలన్నీ కూడా బొగ్గు, పెట్రోలు, డీజిలు వంటి శిలాజ ఇంధానాలను బారీగా వాడేస్తున్నాయి. ఈ క్రమంలో పెద్ద ఎత్తున కర్బన కాలుష్యాన్ని సృష్టిస్తున్నాయి. ఈ విషయంలో ఏ దేశమూ మినహాయింపు కాదు. కాకపోతే పారిశ్రామిక దేశాలు పెద్ద ఎత్తున కాలుష్యం సృష్టిస్తుంటే పేద, వర్ధమాన దేశాలు తమ తాహతుకు తగ్గట్టుగా కాస్త తక్కువ కాలుష్యం సృష్టిస్తున్నాయి. మొత్తానికి ప్రపంచ దేశాలన్నీ ఎలాంటి నియంత్రణలూ లేకుండా శిలా ఇంధనాలను ఈ స్థాయిలోనే విచ్చలవిడిగా వాడేసుకుంటూ పోతే 2100 నాటికి భూ ఉష్ణోగ్రత పారిశ్రామిక విప్లవానికంటే ముందరి రోజులతో పోలిస్తే దాదాపు 5.2 డిగ్రీల సెల్సియస్ అధికంగా పెరుగుతుందని శాస్త్రవేత్తలు అంచనా వేశారు. అదే జరిగితే తలెత్తే వినాశనాన్ని మాటల్లో చెప్పటం కష్టం. శాస్త్రవేత్తలంతా కలిసి కనీసం సమీప భవిష్యత్తులో ఇది 2 డిగ్రీలు దాటకుండానైనా చూడడం తప్పనిసరి అని లక్ష్యాన్ని నిర్దేశిస్తున్నారు.

**పారిస్ ఒప్పందంలో ఏముంది?**

పారిస్‌లో 2015 డిసెంబర్ 12 రాత్రి చారిత్రక పర్యావరణ

ఒప్పందంపై 196 దేశాలు సంతకాలు చేశాయి. వచ్చే ధరిత్రీ దినోత్సవం (2016 ఏప్రిల్ 22) నాడు మొదలై సంవత్సరంపాటు కొనసాగే సంతకాల ప్రక్రియలో కనీసం 55 శాతం ఉద్గారాలకు కారణమయ్యే దేశాలు సమ్మతి తెలిపినప్పటి నుంచి నూతన ఒడంబడిక పట్టాలకు ఎక్కనుందంటున్నారు. ఇందులో ఏముందంటే.... భూతాపాన్ని 2 డిగ్రీల సెల్సియస్ కన్నా తగ్గించాలి. వీలైతే 1.5 డిగ్రీల సెల్సియస్ స్థాయికి పరిమితం చేయాలి. సదస్సుకు మునుపే భారత్‌సహా 166 దేశాలు ఏ మేరకు కర్బన ఉద్గారాలను తగ్గించగలవో తెలుపుతూ ప్రణాళికలు ఇచ్చాయి. ఒప్పందం కింద వాటికి ఆమోదం లభించినా చట్టబద్ధత ఉండదు. శిలాజ ఇంధనాలకు స్వస్తి పలికి, పునరుత్పాదక ఇంధనాలకు మళ్లడానికి తమకు ఆర్థిక, సాంకేతిక సాయం కావాలని వర్ధమాన దేశాలు గట్టిగా వాదిస్తు వచ్చాయి. అయితే వాతావరణ మార్పుపై పోరుకోసం వర్ధమాన దేశాలకు 2020 నుంచి ఏటా 6.71 లక్షల కోట్ల సాయానికి ధనిక దేశాలు అంగీకరించాయి. కానీ అమెరికా అడ్డుతో దానికి చట్టబద్ధత కల్పించలేదు. కాబట్టి చట్టబద్ధతలేని ఈ హామిని గత అనుభవం దృష్ట్యా అమెరికా నెరవేర్చేందుకు ముందుకు వస్తుందా అనేది అనుమానమే. నిధులు, సాంకేతిక పరిజ్ఞానం 2020 తర్వాత అందిస్తారు. అయితే సహాయంగా ఇస్తారో, అప్పుగా ఇస్తారో స్పష్టతలేదు.

ఈ ఐదేళ్ల కాలంలో భూతాపం మరింత పెరిగే అవకాశం ఉందనే వాస్తవాన్ని మరువరాదు. కర్బన ఉద్గారాలను 2050-2100 నడుమ సున్నాస్థాయికి తేవాలని ఒప్పందం స్పష్టం చేసింది. అయితే 2070 నాటికే ఆ స్థాయిని సాధిస్తేనే పర్యావరణానికి మేలు కలుగుతుందని ఐక్యరాజ్య సమితి సైన్స్ ప్యానెల్ చెబుతోంది. 2020 నుంచి 2030 లోపు కర్బన ఉద్గారాలను ఎలా తగ్గించేదీ దేశాలన్నీ చెప్పాల్సి ఉంటుంది. కొత్త విధానం ప్రకారం ప్రతి దేశం తాను తగ్గించదలచుకున్న లక్ష్యాన్ని వెల్లడించడంతోపాటు దానిని సాధించే ప్రణాళికను వివరించాల్సి ఉంటుంది. ఈ హామీలను క్రమంగా పెంచుతూ పోవాలి. 2018 నుంచి ప్రతి ఐదేండ్లకు కొత్త ప్రణాళికను సమర్పించాలి. ఒప్పందానికి ప్రతి దేశం కట్టుబడి ఉండేందుకు, అమలు చేయడానికి నిపుణుల కమిటీని ఏర్పాటు చేస్తారు. అయితే దీనిని ఉల్లంఘించిన దేశానికి శిక్ష విధించే ఏర్పాటు లేదు. ఇప్పటికే రూపొందించుకున్న ప్రణాళికలు భూతాపాన్ని తగ్గించలేవు కాబట్టి ఆ ప్రణాళికలను ఐదేళ్లకొకసారి సమీక్షించుకోవాలి.

తీవ్ర వాతావరణ పరిస్థితుల వల్ల ఆర్థికంగా నష్టపోయే దేశాల ఇబ్బందులపై చర్యలకు లాస్ అండ్ డ్యామేజ్ యంత్రాంగం ఏర్పాటవుతుంది. కోపెన్ హాగన్, క్యోటో, డర్బన్ సదస్సుల్లో పశ్చిమదేశాలు ససేమిరా అన్న అంశాలను ఈ సదస్సులో అంగీకరించాయి. అందులో ఒకటి క్లయిమెట్ జస్టిస్, అంటే కర్బన్ ఉద్గారాల విడుదలకు ఎక్కువ కారణమైన అభివృద్ధి చెందిన దేశాలు ఎక్కువ భారం మోయాలని యునైటెడ్ నేషన్స్ ఫ్రేమ్ వర్క్ కన్వెన్షన్ క్లయిమెట్ చేంజ్ సూత్రం సూచిస్తోంది. పారిస్ సదస్సులో అభివృద్ధి చెందిన దేశాలు అదనపు తగ్గింపు బాధ్యత నుంచి తప్పించుకున్నాయి. భిన్నమైన బాధ్యతలంటూనే వాటిని ఉమ్మడి బాధ్యతల్లో మిళితం చేశారు. అమెరికా అధ్యక్షుడు ఒబామా వ్యూహం ఫలించింది. ఉద్గారాలను ఏ దేశం ఎంత పరిమాణంలో తగ్గించుకోగలదో తమకు తాముగా నిర్ణయించుకుని సవివరమైన నివేదికలను (జాతీయంగా నిర్ణయించుకున్న లక్ష్యాలు-ఎన్‌డిసిలు) వాతావరణ మార్పుపై ఐరాస కమిటీ (యుఎన్ఎఫ్‌సిసిసి)కి పంపేవిధంగా కార్యసరళిని అంగీకరింపచేశారు. తద్వారా గత రెండు శతాబ్దాల్లోనే కాదు, వచ్చే ఐదేళ్లలో 2020 వరకు తాము గావించే వాతావరణ కాలుష్యానికి బాధ్యత నుంచి అభివృద్ధి చెందిన దేశాలు తప్పించుకున్నాయి.

**లోపించిన శాస్త్రీయ వాస్తవికత**

పారిస్‌లో వాతావరణ సమస్యపై కుదిరిన ఒప్పందం అమలుకు సంబంధించి జాగరుకత అవసరమని వాతావరణ నిపుణులు అంటున్నారు. ఈ ఒప్పందమే భూతాపాన్ని నియంత్రించడానికి సమగ్ర పరిష్కారం కాదని, శిలాజ ఇంధనాల వాడకం తగ్గింపుకు మార్గం కాదని, ఇది తొలి అడుగు మాత్రమే అవుతుందని అంటున్నారు. తాజా ఒప్పందంలోని లక్ష్యాన్ని చేరుకోవటం అంత సులభం కాదని వాతావరణ పరిశోధకులు అంటున్నారు. భూతాపం '2 డిగ్రీల సెల్సీయస్' పెరగకుండా చూడాలన్న లక్ష్యంలో 'శాస్త్రీయ వాస్తవికత' లోపించిందన్న విమర్శలు కూడా వస్తున్నాయి. భూతాప నియంత్రణ లక్ష్యానికి అనుగుణంగా ఉపశమన చర్యల లక్ష్యం లేదు. ఒప్పందంలో ఒక పక్క ఉష్ణోగ్రత తగ్గింపు లక్ష్యాన్ని పేర్కొనడం, మరోపక్క ఆ లక్ష్యసాధన దిశగా సాగే పురోగతికి సంబంధించిన కొలమానాలను తొలగించడం వల్ల అసమతౌల్య పరిస్థితి ఏర్పడిందని వాతావరణ నిపుణులు అంటున్నారు. ఉద్గారాల తగ్గింపు స్థాయి, సమయంపై విస్పష్ట సంకేతాన్ని ఒప్పందం అందించడంలేదు. అలాగే లక్ష్యాన్ని అందుకోవటంలో అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక సాయం, సాంకేతిక పరిజ్ఞాన బదలాయింపు వంటివి ఏ మూలకూ సరిపోదన్న వాదన వినపడుతోంది.

'కార్బన్ బడ్జెట్' అన్నదానిపై భారత్, చైనా సహా కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ వాదనలు బలంగా వినిపించాయి. ఇందులో గరిష్ఠ భాగాన్ని పారిశ్రామిక విప్లవ కాలంలోనే పారిశ్రామిక దేశాలు ఖర్చు చేశాయన్నది విమర్శకుల వాదన. పారిశ్రామిక విప్లవం మొదలైనప్పటి నుంచి 2100 వరకూ దాదాపు లక్ష కోట్ల టన్నుల కార్బన్ డైయాక్సైడ్‌ను విడుదల చేసినా భూమి ఉష్ణోగ్రత రెండు డిగ్రీల సెల్సియస్‌కు మించి పెరగదు. పారిశ్రామిక విప్లవం నాటి నుంచి 2011 వరకూ 52 వేల కోట్ల టన్నుల కార్బన్ డైయాక్సైడ్ వాతావరణంలోకి విడుదలైంది. ఇందులో గరిష్ఠ భాగం పారిశ్రామిక దేశాలదే. కాబట్టి 'వాతావరణ ఆర్థిక సాయం'లో కూడా వారిదే ప్రధాన భూమికగా ఉండాలని భారత్, చైనా వాదనలు వినిపించాయి. కానీ ఈ ఒప్పందంలో ఆ ప్రస్తావన లేదు. ఇదొక పెద్ద లోపం. సంపన్న దేశాలు ఇప్పటికే అత్యధికంగా కాలుష్యాన్ని విడుదల చేస్తున్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందాల్సి ఉన్న భారత్, చైనా లాంటి దేశాలు భవిష్యత్తులో కాలుష్యాన్ని పెంచే అవకాశం ఉంటుంది. కాబట్టి రాబోయే కాలంలో ఈ ఒప్పందం వల్ల ఈ రెండు దేశాలపై ఒత్తిడి పెరిగే ప్రమాదం ఉంటుంది. రానున్న 85 ఏళ్లలో కేవలం 48 వేల కోట్ల టన్నుల ఉద్గారాలు మాత్రమే విడుదల చేసేందుకు అవకాశం ఉంది. దీనిలో అత్యధిక శాతం వాటా వర్ధమాన దేశాలకు ఇవ్వాలి. అలాంటిదేమి ఒప్పందంలో చేర్చలేదు. ఈ ఒప్పందం వలన భారత్‌కు ప్రయోజనం శూన్యమేనన్నది గుర్తించాలి.

వర్ధమాన దేశాలకు పారిశ్రామిక దేశాల ఆర్థిక చేయూతపై ముసాయిదాలో కచ్చితమైన కఠినమైన నిర్దేశాలను పేర్కొన్నారు. కానీ తుది ఒప్పందంలో చట్టబద్ధత కల్పించలేదు. దీనిపై భారత్ చివరకు రాజీపడాల్సి వచ్చింది. వర్ధమాన దేశాలు, పారిశ్రామిక దేశాలు అన్న

తేడా లేకుండా కర్బన ఉద్గారాల నియంత్రణకు అన్ని దేశాలకు ఒకే విధమైన నిర్దేశాలను విధించారు. ఇది వర్ధమాన దేశాలపై మరింత భారాన్ని మోపుతుంది. కర్బన ఉద్గారాల నియంత్రణకు ఉద్దేశించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని పారిశ్రామిక దేశాల నుంచి వర్ధమాన దేశాలకు బదిలీ అంశంపై ఒప్పందంలో స్పష్టత లోపించింది. పర్యావరణ విపత్తుల కారణంగా సంభవించే నష్టాలకు ఎవరు బాధ్యతవహించాలన్న దానిపైన స్పష్టత లోపించింది. దీంతో పర్యావరణ మార్పులకు ప్రధానంగా కారణమవుతున్న పారిశ్రామిక దేశాలకు ఈ అంశంలో ఎలాంటి బాధ్యత లేకుండా పోయింది. ఈ అంశాలపై తొలుత గట్టిగా తన వాదనను విన్పించిన భారతదేశం ఆ తర్వాత పరిస్థితులకు అనుగుణంగా రాజీపడింది.

**సాధించింది తక్కువ ప్రచారం ఎక్కువ**

విభేదాలు, ఆందోళనల నడుమ పారిస్ అంతర్జాతీయ పర్యావరణ సదస్సు ఎట్టకేలకు ఓ ఒప్పందం సాధించగలిగింది. ఏ ఒప్పందానికి రాకపోవడం కన్నా ఏదో ఒక ఒప్పందం కుదుర్చుకోవడం ఎల్లప్పుడూ మెరుగే. అదే సమయంలో దీనిలో లోటుపాట్లేమిటి అనేది పరిశీలించాలి. ఈ సదస్సు సాధించిన దానికన్నా ఎక్కువగా ప్రచారం జరుగుతోంది. భారతదేశ పర్యావరణ మంత్రి ప్రకాశ్ జవ్‌దేకర్ కూడా స్వీయ అభినందనల ప్రకటనలతో ఉబ్బితబ్బిబు అవుతున్నారు. వాస్తవానికి పశ్చిమదేశాల మీడియా ఎత్తుగడలో భారత్ వంటి వర్ధమాన దేశాలు చిక్కుకుపోయాయనే చెప్పాలి. భూమిపైన వాతావరణ ఉష్ణోగ్రతను రెండు శాతం మించి పెరగకుండా చూడాలనేది ఈ సదస్సు లక్ష్యం. అయితే ఈ ఒప్పందం ద్వారా 1.5 డిగ్రీలు కూడా పెరగకుండా చూస్తామన్నారు. కార్బన్ ఉద్గారాల విడుదల తగ్గింపుపై వివిధ దేశాలు ఇచ్చిన లక్ష్యాల (ఐఎన్‌డిసి) ప్రకారం భూతాపోన్నతి మూడు డిగ్రీల కన్నా ఎక్కువ పెరుగుతుంది. అంటే పారిస్ ఒప్పందంలో అభివృద్ధి చెందిన దేశాలు భూతాపం తగ్గింపునకు ఇచ్చిన నిబద్ధత చాలా తక్కువ, ఇక ముందు చేస్తామన్నది ఎక్కువ. ఆకాంక్షలు, వాస్తవాలకు మధ్య తేడాను ఇక్కడ గుర్తించాలి. ఇది ఒక డిక్లరేషన్ మాత్రమే, దీనికి చట్టబద్ధత లేదు. అంటే దీన్ని కచ్చితంగా అమలు చేయాలనే ఒత్తిడి ఏమీ ఉండదు.

భూతాప నియంత్రణకు ఏం చేయాలన్న విషయంలో మాత్రమే పారిస్‌లో అవగాహన కుదిరింది. ఎలా చేయాలో అందుకు గరిష్టంగా అనుసరించవలసిన కార్యాచరణేమిటో స్పష్టం చేసి, దాన్ని సాధించని పక్షంలో ఎలాంటి చర్యలుంటాయో ఒప్పందంలో చెప్పి ఉంటే వేరుగా ఉండేది. అందువల్ల అందరికీ భరోసా ఏర్పడేది. ఒప్పందానికి చట్టబద్ధత లేకపోతే సంపన్న దేశాలు దానికి కట్టుబడి ఉంటాయని నమ్మేదెలా? లాభాపేక్ష తప్ప ధరిత్రి క్షేమం పట్టని సంపన్న దేశాలు భారీఎత్తున వాతావరణంలోకి కర్బన ఉద్గారాలను విడుదల చేస్తున్నాయి. ప్రపంచాన్ని చుట్టుముట్టిన కర్బన కాలుష్యంలో వాటి వాటా 70 శాతం పైబడేనని వివిధ గణాంకాలు చెబుతున్నాయి.

పారిశ్రామిక విప్లవం తర్వాత 1850 మొదలుకొని 2011 వరకూ విడుదలైన కర్బన ఉద్గారాల్లో అమెరికా వాటా 27శాతం, యూరోప్ దేశాల భాగం 28 శాతం అని గణాంకాలు వివరిస్తున్నాయి. చైనా 11 శాతం, రష్యా 8 శాతం కాలుష్యానికి కారణమయ్యాయి. భారతదేశం వాటా 3 శాతం మించలేదు. పర్యావరణ ధ్వంసానికి తామే ప్రధాన కారకులమన్న స్పృహను ప్రదర్శించి అందుకు తగినట్టుగా పెద్దయెత్తున ఉద్గారాల విడుదలపై కోత విధించుకోవాల్సింది పోయి సంపన్న దేశాలు పేచీకి దిగడం విడ్డూరం. అందరికీ సమానంగా బాధ్యతలు పంచాలని డిమాండ్ చేయడం శోచనీయం. మరోవైపు కాలుష్యాన్ని వడబోసే సాంకేతిక పరిజ్ఞానాన్ని వర్ధమాన దేశాలకు ఉదారంగా అందించేందుకు సైతం అవి ముందుకు రావడంలేదు. కర్బన ఉద్గారాలపై విధించే కోతలోనూ అవి వ్యాపారం ప్రయోజనాలను వెదుక్కుంటున్నాయి.

**ముగింపు**

ఇప్పటి వరకు పర్యావరణానికి జరిగిన, జరుగుతున్న, జరుగనున్న నష్టం తీవ్రత తక్కువేమీకాదు. దాని దుష్ప్రభావం అందరికీ బాగా అనుభవంలోకి వచ్చిన కాలంలో ఆశయాన్ని, సంకల్పాన్ని మాత్రమే ప్రకటించి, తీసుకోవల్సిన చర్యల్ని తేల్చకుండా వదిలేయడం ఆశ్చర్యం కలిగించకమానదు. ఈ లోటుపాట్లు గమనిస్తే పారిస్‌లో రాజకీయంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకున్నారే తప్ప మానవాళికి ఎదురుకాబోయే సవాళ్లు, వాటిని ఎదుర్కొవలసిన తీరుతెన్నులపై చిత్తశుద్ధితో, హేతుబద్ధమైన అవగాహనతో దృష్టి పెట్టలేదని అర్థమవుతుంది. ఏ ఒక్క దేశం, ఏ ఒక్క అంశానికీ కట్టుబడాల్సిన అవసరం లేకుండా చేసింది పారిస్ ఒప్పందం. అంటే వాతావరణ మార్పును నిరోధించే నిర్దిష్ట చర్యలను సూచిస్తూ ఏ దేశాన్ని నిర్బంధించకపోవడమే పారిస్ చర్చలు విజయవంతం కావడానికి కారణం.

అగ్రదేశాలకు, వర్ధమాన దేశాలకు, బడుగు దేశాలకు మధ్య 2009 కోపెన్‌హేగన్ సదస్సు నుండి చిచ్చు రాజుకోవడంతో ఇప్పుడు ముందస్తు చర్యలతో, చర్చలతో, జాగ్రత్తలతో, రాజీలతో, లాబియింగులతో అన్ని దేశాలు పరస్పరం సహకరించుకునే ధోరణితో ఒక ఒప్పందాన్ని చేశారు. బడుగు దేశాలు పారిస్ చర్చలలో కీలక అంశాలను నిర్బంధం చేయలేకపోయాయి. ఒక రోజు సదస్సును పొడగించి ధనిక దేశాలకు ఏమాత్రం బాధ్యతలేని విధంగా మార్పులు చేశారు. 'చట్టబద్ధత అనగానే అందరూ భయపడతారు. అదే, స్వచ్ఛందంగా అమలు చేసుకోమంటే, అన్ని దేశాలూ మరింత పెద్దపెద్ద లక్ష్యాలు పెట్టుకొని ఉత్సాహంగా కృషి చేస్తాయి'. అని అమెరికా ప్రతినిధి చేసిన వ్యాఖ్య వాతావరణ పరిరక్షణ మీద ప్రపంచానికి ఉన్న శ్రద్ధకు అద్దం పడుతుంది.

శిలాజ ఇంధనాలు రోజురోజుకూ అడుగంటుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో రాబోయే కాలం సౌరశక్తిదే. దానివైపుగా కదలాలని చెప్పడం బాగానే ఉన్నా అది ఎంత వేగంగా జరగాలి... దానికి దేశాలన్నీ ఏం చేయాలన్న దిశా నిర్దేశం లేదు. ప్రధాని నరేంద్ర మోదీ పదే పదే ప్రస్తావించిన 'వాతావరణ న్యాయం' అనే పదం ఒప్పందంలోని పీఠికకే పరిమితమైంది తప్ప ఇతరచోట్ల దానికి అనుగుణమైన ప్రతిపాదనలు లేవు. ఈ నేపథ్యంలో పుడమిని కాపాడే ఈ బృహత్ కార్యాసాధన చురుగ్గా సాకారమయ్యేలా చూసే బాధ్యతను ధనిక దేశాలు చొరవగా భుజాలకు ఎత్తుకోవడమే అన్నివిధాల న్యాయం. ఐక్యరాజ్య సమితి సారథి బాన్ కీ మూన్ ఉద్బోధించినట్లు 'మన గ్రహాన్ని రక్షించుకోవడానికి అందరూ చేతులు కలపాల్సిందే'. పుడమిని ఆవాసయోగ్యంగా నిలిపి హరిత ఆర్థికానికి, సుస్థిర అభివృద్ధికి దోహదపడగలిగేది వివేచనాయుత ఉమ్మడి కార్యాచరణే!

వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# మానవీయతకు రూపం ప్రొ. శివరామకృష్ణారావు

**- డా. సాదు రాజేశ్**

విశ్వవిద్యాలయాల్లో ఉన్నతమైన విలువలు కొరవడి కనీసపు విలువలు ఆచరించని అధ్యాపకుల సంఖ్య పెరుగుతున్న సందర్భంలో, విద్యార్థులకూ, పరిశోధకులకూ, అధ్యాపకులకూ జ్ఞానభాండాగారంగా ఉత్తమమైన విలువలను ఆచరించిన, సామాజిక శాస్త్రాల పరిశోధన భీష్మాచార్యుడిగా, అందరు పెద్దసార్‌గా పిలిచే కాకతీయ ప్రొ. సి. శివరామకృష్ణారావు మరణించడం విషాదకరమైంది. ఆయన డిసెంబర్ 4న హన్మకొండలో తుదిశ్వాస విడిచినారు. ఆయన జీవితం నిజంగానే నేటి తరానికి ఆదర్శనీయమైనది. అనుసరణీయమైనదిగా నిలుస్తుంది.



కాకతీయ యూనివర్సిటీ 1976లో ప్రొ. శివరామకృష్ణా తన అధ్యాపక వృత్తిని ప్రారంభించారు. ఆయన జీవితం, ఆచరించిన సారం ఆధునిక సమాజంలో మనిషిగాను ఒక ప్రొఫెసర్‌గాను ఇలా కూడా జీవిస్తారా అనిపిస్తుంది. ఆయన సాధారణ మనిషిగా, ముఖంలో చిరునవ్వుతో ఎలాంటి స్థిరాస్తులు లేకుండా (హన్మకొండలో, ఒక అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్) మాత్రమే ఉండడం ఆశ్చర్యమే. తన శిష్యులను, పుస్తకాలను గొప్ప ఆస్తులుగా భావించి నివసించారు.

ప్రొ. కావుటూరి శివరామకృష్ణారావు పూర్వ ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లాలోని 1944 జూలై 4న జన్మించారు. స్కూల్ విద్యాభ్యాసం, కళాశాల, డిగ్రీ వరకు పక్కనే ఉన్న ఒంగోల్‌లో పూర్తి చేసుకున్నారు. ఎం.ఎ., అర్థశాస్త్రం, గణాంకశాస్త్రం ఆంధ్రా యూనివర్సిటీలో పూర్తి చేశారు. 1965 జూన్‌లో హైదరాబాద్‌లో గణాంకశాస్త్ర శాఖలో 3 నెలలు పని చేసిన అనంతరం అధ్యాపక వృత్తికి రావాలనే దృఢ నిశ్చయంతో 1965 లోనే లెక్చరర్‌గా (ఉస్మానియావర్సిటీ) జీవితం ప్రారంభించారు. 1968లో వరంగల్‌కు మారి ఇక్కడి సాయంకాలపు కళాశాలలో చేరి అర్థశాస్త్రాన్ని బోధించినారు. 1976 నుండి అర్థశాస్త్ర విభాగం, కె.యు.లో బోధిస్తూ 2004లో పదవీ విరమణ పొందినారు. ఆయనకు భార్య, ముగ్గురు కుమారులున్నారు. అందులో భార్య (నాగేశ్వరి), రెండవ కుమారుడు రవికుమార్ చనిపోగా, ప్రస్తుతం పెద్ద, చిన్న కుమారులు డా. రఘు కుమార్, రంజిత్ కుమార్ ఇద్దరు అమెరికాలో నివసిస్తున్నారు.

ప్రొ.సి. శివరామకృష్ణారావు యూనివర్సిటీ ఏర్పడిన తొలి రోజు నుండి పదవి విరమణ పొందే వరకు నిత్య బోధకుడిగా, వందలాది విద్యార్థులను తీర్చిదిద్ది సమాజానికి అందించారు. అర్థశాస్త్ర విభాగానికి జాతీయస్థాయి గుర్తింపును తీసుకురావడంలోను, కాకతీయ యూనివర్సిటీ అభివృద్ధిలోను ఆయన కృషి ఉంది. ప్రధానంగా 1980 దశకంలో వర్సిటీలోని విద్యార్థి తరంపై ఆయన గణనీయమైన ప్రభావాన్ని వేశారు. ఆనాడు విద్యార్థులు సమాజం పట్ల స్పష్టమైన వైఖరితో ఉండి వివిధ అంశాలపై తరగతి గదుల్లో అధ్యాపకులను ప్రశ్నించే వారు. అలా అధ్యాపకులు తమ ఆలోచనలను కూడా మార్చుకునేవారని ఆ ఆలోచనలే కాకతీయ యూనివర్సిటీ వామపక్ష విద్యార్థి సంఘాలకు సలహాదారుడిగా పని చేయడానికి పురకొల్పినాయి. సనాతన సంప్రదాయవాదులైన కొంత మంది సీనియర్ ప్రొఫెసర్‌లను ఎదిరించి విద్యార్థులకు అండగా నిలిచిన సందర్భాలు ఆయన అనుభవంలో అనేకం ఉన్నాయి. మేధావులు, ఉద్యమకారులు ఆనాడు శిష్యులుగా నిత్యం ఆయనతో సామాజిక సంఘర్షణపై జాతీయ, అంతర్జాతీయ అంశాలపై సంభాషించడం ఆయనకు మరింత బాధ్యతను పెంపొందించింది. ఆయన అమితంగా తన శిష్యులతో మాట్లడడం అది అర్ధరాత్రి దాకా కొనసాగేది. సాయంత్రం వరకు డిపార్ట్‌మెంట్, ఆ తరువాత తన ఇంటివద్ద వివిధ రకాల అంశాలపై భిన్నాభిప్రాయాలను, నూతనమైన ఆలోచన ధోరణులను శిష్యులకు అందించేవారు.

ప్రొ. రావు గొప్ప మానవతావాది, ఏ విభాగం విద్యార్థి అయినా తన దగ్గరికి వస్తే కచ్చితంగా వారి అనుమానాలకు, ప్రశ్నలకు సమాధానాలను ఓపికతో అందించేవారు. ప్రొ. శివరామకృష్ణారావుతో నాకు వ్యక్తిగతంగాను, పరిశోధకునిగాను దాదాపు 10 సంవత్సరాల అనుబంధం ఉంది. 2006లో హక్కులనేత ప్రొ. బుర్ర రాములు పర్యవేక్షణలో నా పరిశోధన అంశంపై సంబాషించడానికి వెళ్లినప్పుడు ఆయన ఎంతో ప్రేమతో రాజకీయ ఆర్థిక నేపథ్యంలో పరిశోధన అంశాలను అధ్యయనం చేసినపుడు మాత్రమే వాస్తవాల వెల్లడవుతాయని అది ఎంచుకోవడం సముచితంగా ఉంటుందని చెప్పారు. అందుకుముందే 2004 లో పి.జి. చదువుతన్న సందర్భంలో మాట్లాడాను. ఆ సందర్భంగా నేను మాట్లాడిన విషయం గుర్తు చేసినారు. ఆ తర్వాత ప్రొఫెసర్ భార్య 2009లో చనిపోవడంతో ఆయన బాగా కృంగిపోయారు. తన కుమారుల వద్ద కొంతకాలం ఉన్నప్పటికి వరంగల్ మాత్రమే తనకు ఉపశమనాన్ని, ఓదారుస్తుందని భావించే వరంగల్‌లో ఎప్పటికి తన శిష్యులు వస్తూ పోతుంటారు. కావున ఇక్కడే ఉండాలని తన శిష్యులు కోరడంతో వరంగల్‌లోనే ఉన్నారు.

ప్రొ. బుర్ర రాములు 2011 మే 14న మరణించడంతో ఇక నా పరిశోధన పూర్తి కాదేమోననే అపనమ్మకంతో ఉండడంతో, పెద్దసార్ అప్పటికే అమెరికాలో ఉండడం మూలంగా కొంత ఇబ్బంది పడినాను. తరువాత వరంగల్ రావడంతోనే నన్ను పిలిపించుకొని నీ పరిశోధన కొనసాగించమని ప్రొ. పాపిరెడ్డికి చెప్పారు. నేను తెలుగులో రాసిన కొన్ని కేస్ స్టడీస్‌ను ఓపికతో పరిశీలించి నా పరిశోధనకు పూర్తిగా సహకరించిన గొప్ప మానవతవాది పెద్దసార్. ఇలాంటి అనేకమైన పరిశోధనలకి ఆయన మార్గదర్శిగా కెయులో పని చేసినారు. తనకు గుండెపోటుతో స్టంట్ వేసినప్పటికి తన పరిశోధనా వ్యాసంగాన్ని ఆయన మరవలేదు. వ్యవసాయరంగ సంక్షోభంపై రాసిన వ్యాసాన్ని ఆంధ్రజ్యోతి పత్రికకు పంపమని నాకు చెప్పడం, పత్రికలో వ్యాసం రావడంతో చాలా మంది ఆర్థికశాస్త్ర మేధావులు ఆ వ్యాసంపై తనతో మాట్లాడిన అంశాలు చెప్పుతూ సంతోషపడ్డారు. వ్యవసాయ రంగాన్ని కూడా ప్రభుత్వరంగంగా గుర్తించితే సంక్షోభాన్ని కొంత మేరకైన నివారించ వచ్చునని అభిప్రాయపడ్డారు.

తన కళ్లముందే యూనివర్సిటీలో విద్యా ప్రమాణాలు పడిపోవడం అధ్యాపకుల్లో కొరవడిన విలువల రాహిత్యం, విద్యార్థులకు బోధించేవారు లేకుండాపోవడం, ముఖ్యంగా అర్థశాస్త్ర విభాగంలో చాలామంది అధ్యాపకులు లేకపోవడంతో విచారం వ్యక్త పరచినారు. కాకతాళీయంగా అప్పుడప్పుడు ఆయన ఎవరిని బాధించకుండా, ఎవరికి భారం కాకుండా వెళ్లిపోవాలని అనేవారు. ఆయన అనుకున్నదే డిసెంబర్ 4న జరిగింది. కానీ ఆయన ఔదార్య స్వభావం, పరిశోధన దూరదృష్టి, అహంలేనితనం ఎవరినైనా అమ్మ, నాన్న అని పిలిచే గొంతు ఇక వినిపించదు.

*(రచయిత అర్థశాస్త్ర విభాగం కాకతీయ విశ్వవిద్యాయం)*

# అడవి బిడ్డల మార్గదర్శి - బిడి శర్మ



ఈ దేశ మూలవాసులైన గిరిజనుల పట్ల రాజ్యాంగ బాధ్యతలను, నైతిక కర్తవ్యాలను స్వతంత్ర భారతదేశం పూర్తిగా విస్మరించిందన్న మానవతా స్పృహను ప్రజలలో కలిగించడానికి నిరంతరం కృషి చేసిన మహామనీషి, బిడి శర్మగా ప్రఖ్యాతుడైన డా. బ్రహ్మదేవ్ శర్మ.

డిసెంబర్ 6న మధ్యప్రదేశ్‌లోని గ్వాలియర్‌లో తన 84 సంవత్సరాల వయసులో తుదిశ్వాస విడిచిన డా. బి.డి. శర్మ మరణంతో ప్రజా ఉద్యమాలు అనుభవజ్ఞుడైన ఒక కార్యకర్తను కోల్పోయాయి. ఆయన తుది క్షణం వరకు ప్రజా ఉద్యమాలలోనే తలమునకలుగా ఉన్నారు. మెరుగైన జీవన స్థితిగతుల కోసం పోరాడే ప్రజల పౌర, మానవ హక్కులను ఉల్లంఘిస్తూ భారత రాజ్య వ్యవస్థ తీవ్ర సంక్షోభాన్ని సృష్టించిన ప్రతిచోటా బాధితులకు ఆయన మద్దతుగా నిలబడ్డారు. దేశంలో పేదలలోకెల్లా నిరుపేదలైన ఆదివాసీల అభ్యున్నతికి ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు. అవిభక్త బస్తర్ జిల్లాకు కలెక్టర్ (1958-71) పనిచేసిన నాటి నుంచి ఆ అమాయక అడవి బిడ్డల యోగక్షేమాలపై ఆయన శ్రద్ధాసక్తులు ప్రారంభమయ్యాయి.

తన అధికార బాధ్యతలు, ఆదివాసీ సమాజంలోని వాస్తవాల మధ్య వైరుధ్యాన్ని తొలిదినాల్లోనే బిడి శర్మ గుర్తించారు. అధికారిక బాధ్యతలను నిర్వర్తిస్తూనే, రాజ్యవ్యవస్థ సృష్టిస్తున్న సమస్యలకు సున్నితంగా ప్రతిస్పందించారు. గిరిజనుల ప్రయోజనాలను కాపాడడంలో చిత్తశుద్ధితో వ్యవహరించారు. అలా ఒక సామాజిక కార్యకర్తగా పరిణమించారు. చాలా సంవత్సరాల పాటు ప్రభుత్వాధికారిగానే కొనసాగుతూ వివిధ బాధ్యతలను సమర్థంగా నిర్వహించారు. ప్రజలకు శ్రేయస్సునివ్వని ప్రభుత్వ విధానాలను బహిరంగంగానే వ్యతిరేకించారు. ఇటువంటి ప్రజాహిత దృక్పథమే ఆయనకు ప్రజలలోనూ, ప్రభుత్వ వ్యవస్థలోనూ ప్రత్యేక గుర్తింపునిచ్చింది. మధ్యప్రదేశ్ గిరిజన సంక్షేమ మంత్రిత్వ శాఖలో ఎమర్జెన్సీకి ముందు, ఆ తరువాత కేంద్ర ప్రభుత్వంలోనూ ఉన్నతస్థాయి బాధ్యతలను నిర్వర్తిస్తూ బస్తర్, ఇతర గిరిజన ప్రాంతాలలో ప్రపంచ బ్యాంకు అభివృద్ధి పథకాలలో, కార్యక్రమాల అమలులో జరుగుతున్న విధ్వంసాన్ని నిరోధించడానికి ఆయన ఎంతో కృషిచేశారు.

ఆదివాసీల ప్రయోజనాలను కాపాడడంలో ప్రభుత్వ ఉన్నతాధికారులకు ఉన్న పరిమితులను అర్థం చేసుకొని ఆయన 1981లో స్వచ్ఛందంగా ఉద్యోగ విరమణ చేశారు. ఐ ఎ ఎస్ నుంచి వైదొలిగినప్పటికీ అప్పటి ప్రధాన మంత్రుల అభ్యర్థన మేరకు వివిధ ప్రభుత్వ పదవులను చేపట్టి సమర్థంగా నిర్వహించారు. నార్త్-ఈస్ట్ హిల్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ (1981-86)గా, షెడ్యూల్డ్ క్యాస్ట్స్ అండ్ షెడ్యూల్డ్ ట్రైబ్స్ కమిషనర్ (1986-91) గా ఆయన పనిచేశారు. ఆదివాసులకు, దళితులకు ప్రతి జీవనరంగంలోనూ ప్రభుత్వ విధానాలు ఏ విధంగా అన్యాయం చేస్తున్నాయో ఎస్టీ, ఎస్సీ కమిషనర్‌గా ఆయన సమర్పించిన నివేదికలు స్పష్టంగా ఎత్తి చూపాయి. అట్టడుగు ప్రజల జీవనస్థితిగతులను మెరుగుపరచడంలోనూ, సామాజికమార్పులను సాధించడంలోనూ ప్రభుత్వ విధానాలు పూర్తిగా విఫలమయ్యాయని, అసలు వాటిద్వారా అటువంటి మార్పులను సాధించలేమని ఆయన తెలుసుకున్నారు. నిజమైన మార్పు సాధించాలంటే ప్రజా ఉద్యమాలే మార్గాంతరమన్న దృఢ విశ్వాసానికి బి.డి. శర్మ వచ్చారు.

ఆ నమ్మకంతోనే బస్తర్‌లోని మవాలిభట అనే గిరిజన గ్రామానికి వెళ్లి 1992లో 'నాటె-న-రాజ్ ఆందోళన్' అనే సంస్థను నెలకొల్పారు. ఇది అట్టడుగు స్థాయి ప్రజల మొట్ట మొదటి ఉద్యమ సంస్థ. ఆ తరువాత భారత జనాందోళన్ అనే ఉద్యమ సంస్థను కూడా నెలకొల్పారు. దేశపాలకుల సహకారంతో సంపన్న దేశాల బహుళ జాతి సంస్థలు బస్తర్‌ను దోపిడీ చేసేందుకు చేస్తున్న ప్రయత్నాలను అరికట్టేందుకు పూనుకున్నారు. ఈ సందర్భంగానే ఆయనకు వివిధ ప్రజా ఉద్యమాలతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. గిరిజన ప్రాంతాలలో పరిస్థితులను మెరుగు పరచేందుకు బి.డి. శర్మ చేసిన కృషి ఫలితంగా కేంద్ర ప్రభుత్వం 1996లో పెసా చట్టాన్ని తీసుకు వచ్చింది. ఈ చట్టం గిరిజన ప్రాంతాల్లోని గ్రామసభలకు సర్వాధికారాలను ఇచ్చింది. అయితే ఈ అధికారాలేవీ ఆచరణలోకి రాలేదు.

క్రమంగా ప్రపంచ వాణిజ్య సంస్థకు వ్యతిరేకంగా రైతుల ఉద్యమం, వివిధ కార్మిక ఉద్యమాలలో శర్మ చురుగ్గా పాల్గొన్నారు. వ్యవసాయ, అసంఘటిత రంగాల కార్మికుల సమస్యల పరిష్కారానికి ఉద్యమించారు. ఆర్థిక వనరులకు ప్రభుత్వంపైన, సంపన్న దేశాల సంస్థలపైన ఆధారపడని ప్రజా ఉద్యమాలే సత్ఫలితాలను సాధించగలవని ఆయన విశ్వసించారు. 2007లో కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు వివిధ బహుళజాతి సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాల మూలంగా దేశవ్యాప్తంగా లక్షలాది ప్రజలు నిర్వాసితులయ్యే ప్రమాదమేర్పడింది. ఈ ముప్పును నివారించేందుకు రాంచిలో 'విస్థాపన్ విరోధి జన్ వికాస్ ఆందోళన్'అనే సంస్థను ఆయన నెలకొల్పారు. రాంచి డిక్లరేషన్‌ను తీసుకురావడంలో కీలకపాత్ర వహించారు. ప్రభుత్వం 1947 నుంచి అనుసరిస్తున్న అభివృద్ధి నమూనాకు ప్రత్యామ్నాయంగా ప్రజా అభివృద్ధినమూనా అనే డాక్యుమెంటును వెలువరించడంలోకూడా ఆయన కృషి ఎంతో ఉన్నది. బిడి శర్మ దేశవ్యాప్తంగా సల్వాజుడుంకు వ్యతిరేకంగా ప్రచారం చేశారు. ప్రజలకు వాస్తవాలు తెలియపరిచారు. అలాగే 2009 నుంచి ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా కూడా దేశ ప్రజలను జాగృతపరిచారు. మధ్య భారతం, తూర్పురాష్ట్రాలలోని గిరిజన ప్రాంతాలలో ప్రభుత్వ భద్రతా దళాలు చేస్తున్న దాడులు 18, 19 శతాబ్దాలలో అమెరికాలో రెడ్ ఇండియన్లను మట్టు బెట్టిన యూరోపియన్ వలవాదుల దాడుల లాంటివేనని ఆయన అనేవారు. ఛత్తీస్‌గఢ్, ఒడిశా ప్రభుత్వాలకు, సీపీఐ (మావోయిస్టు) పార్టీ ప్రతినిధులకు మధ్య చర్చల్లో శర్మ చురుగ్గా పాల్గొన్నారు. ఈ సంప్రదింపుల సందర్భంగా ప్రభుత్వాలు ఇచ్చిన హామీలు అమల్లోకి వచ్చేందుకు ఆయన నిరంతరమూ కృషిచేసేవారు. జైళ్లలో ఉన్న ఆదివాసీ ఖైదీలనందరినీ విడుదల చేస్తామని ఛత్తీస్ గఢ్, ఒడిశా ప్రభుత్వాలు ఇచ్చిన హామీని, ఇతర హామీలను నెరవేర్చేందుకు తగు చర్యలు చేపట్టేలా ఆ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలకు ఆయన పదే పదే గుర్తుచేస్తుండేవారు.

బి.డి. శర్మ మరణం భారత ఉపఖండంలోని సకల ప్రజా ఉద్యమాలకు తీరని లోటు. వీ

# వ్యవసాయం - తీరుతెన్నులు

***అభివృద్ధి మంత్రం జపిస్తూ దేశ దేశాలు తిరుగుతున్న ప్రధానమంత్రి వ్యవసాయ రంగాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారనీ, బహుళజాతి సంస్థల అభివృద్ధికే విధానాలు రచిస్తున్నారనీ అంటున్నారు* **వి. హనుమంతరావు**

గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు రైతులను వారి భూముల నుంచి వెళ్లగొట్టి అదానీలాంటి కార్పొరేట్లకు అర్పించిన మోడీకి, దేశ దేశాల విద్యుత్ దీపాల వెలుగుల్లో, మృష్టాన్న విందులారగించి వచ్చిన ప్రధాని మోడీకి దేశంలోని గ్రామాల్లో గోచీ పాత రాయుళ్లయిన రైతులు, కూలీలు ఎలా కనపడతారు? వారి కష్టాలు, సమస్యలు ఆయనకు వినబడకపోవడంలో, కనబడకపోవండంలో ఆశ్చర్యం లేదు. అలాగే వారిని వారి భూముల నుంచి వెళ్లగొట్టి విదేశాల నుంచి వచ్చే బహుళజాతి కార్పొరేట్లకు వారు స్థాపించే పరిశ్రమలకు భూమి కావాల్సి వచ్చినప్పుడే రైతులు ఆయన దృష్టిలోకి వస్తారు. మౌలిక సౌకర్యాల ఏర్పాటుకు భూమి కావాల్సి వచ్చినప్పుడు రైతులు గుర్తుకు వస్తారు. సస్య విప్లవం పుణ్యమా అంటూ ఆహార ధాన్యాల దిగుమతుల మీద ఆధారపడుతూ వచ్చిన దేశాన్ని సస్య శ్యామలం చేసి ఎగుమతి చేయగలిగే స్థాయికి తీసుకు వచ్చిన, 125 కోట్ల ప్రజానీకానికి తిండిగింజలు అందజేస్తున్న రైతాంగం, ముఖ్యంగా చిన్నా, సన్నకారు రైతులు ప్రధాని కంటికి ఆనకపోవడం వల్లనే 2015 ఆర్థిక సంవత్సరంలో వ్యవసాయం అభివృద్ధి మొదటి మూడు నెలల్లో 2.6 శాతం పెరుగుదల చూపిస్తే, ఆ సంవత్సరం ఆఖరి మూడు నెలల్లో 1.4 శాతానికి దిగజారింది. వ్యవసాయం బతికి బట్టకట్టాలంటే నీటి సదుపాయం కనీసావసరం నీటి విషయం వచ్చేసరికి ఆయనకు గంగా నది ప్రక్షాలనే ప్రాథమిక అవసరంగా కనిపించి, అధికార పీఠం అదిష్టించి మొదటి బడ్జెట్‌లోనే కేటాయింపు చేశారు.

సస్య విప్లవం ఈ సంవత్సరమే స్వర్ణోత్సవం జరుపుకుంటుంది. రకరకాల ఉత్సవాలు, దినాలు అట్టహాసంగా జరుపుతారు కాని ఈ స్వర్ణోత్సవం జరపాలని ఆయనకు గుర్తుకు రాకపోవడమే వ్యవసాయం, రైతాంగం పట్ల ఆయన అంధకార వైఖరిని బట్ట బయలు చేస్తుంది. రైతాంగం పట్ల ఆయన నిర్లక్ష్య భావనకు ఇదొక తిరుగులేని సాక్ష్యం. ఒక హెక్టారుకన్నా తక్కువ భూమి మీద 70 శాతం మంది చిన్నా, సన్నకారు రైతులు బతుకులు వెళ్లదీస్తున్నారు. అలాంటి పేదలకు సబ్సిడీల కోత, ఎరువులు, పురుగు మందుల ధరల పెరుగుదల, మధ్య దళారీల పుణ్యమా అంటూ గిట్టుబాటు కాని ధరలు, మార్కెట్ యార్డ్ అధికారులతో కుమ్మక్కై అయిదోవంతు రైతులు వారికున్న చిన్నా, చితక భూముల మీద వచ్చే ఆదాయం చాలక కూలీ పనులకు వెళ్లాల్సిరావడం, 44 శాతం ఇతరులు ఎంజిఎన్‌ఆర్ఇఎ పథకం కింద బతకాల్సి రావడం, ఇలా చాలీ చాలని ఆదాయాలతో బతుకు కొనసాగించలేక పట్టణాలకు, నగరాలకు వలస పోవడం, ఈ ఏడాది 29 రాష్ట్రాల్లో 18 రాష్ట్రాలు కరువు పరిస్థితిల్లో బతకాల్సి రావడం (ఇవన్ని నేటషనల్ శాంపిల్ సర్వే లెక్కలు) ఇవన్నీ ఒక ఎత్తయితే, బ్యాంకులు కేవలం 30 శాతం మందికే రుణ సౌకర్యం కల్పించడంతో కరువు కాటకాల ఫలితంగా రుణాలు తిరిగి చెల్లించలేక, అలాగే ప్రైవేట్ వ్యక్తుల నుంచి అధిక వడ్డీలకు తెచ్చుకున్న రుణాలను, వడ్డీలను చెల్లించకపోవడంతో, ఒత్తిడి తట్టుకోలేక, ముఖం చెల్లక దేశ వ్యాప్తంగా లక్షలాది మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడడం ప్రతిరోజు వార్తలైపోయాయి. వ్యవసాయం చేయదగిన భూముల్లో 55 శాతం కేవలం వర్షాధారితం. దేశం పారిశ్రామికంగా గుర్తించదగిన మేరకు అభివృద్ధి చెందినా, ఇంకా ప్రధానంగా వ్యవసాయాధారిత దేశం. ప్రభుత్వం, పాలకులు వారి దృష్టినంతా అలాంటి రంగం మీద కేంద్రీకరించకుండా మేక్ ఇన్ ఇండియా నినాదం ఇచ్చి, చిప్ప పట్టుకుని దేశదేశాలు తిరుగుతున్న ప్రధానిని చూస్తే మీకనిపిస్తుంది? ఉద్యాన విశ్వ విద్యాలయం శాస్త్రవేత్త డా. పిడికెం సైదయ్య ప్రకారం 'ఈ ఒక్క ఏడాదే దేశంలో15 రాష్ట్రాలపై పర్యావరణ అననుకూలతల ప్రభావం పడింది. దాదాపు 33 శాతం పంటల సాగు విస్తీర్ణత దెబ్బతింది. రైతులు 20 వేల కోట్ల రూపాయలపైనే నష్టపోయారు'.

**ఆర్థిక పరిస్థితి –** ప్రతీకూల వాతావరణ పరిస్థితి వ్యవసాయాన్ని దెబ్బతీయడంతో వారి ఆదాయం తగ్గి వస్తువుల కొనుగోలు శక్తి పడిపోయింది. ధరలు పెరగడం మూలాన, మధ్యతరగతి పారిశ్రామిక కార్మికుల పరిస్థితి కూడా అదే. ఆ కారణంగా దుకాణాల్లో అమ్మకాలు తగ్గాయి. కాగా పారిశ్రామిక వేత్తలు తమ పరిశ్రమల్లో పూర్తి ఉత్పత్తి స్థాయి మేరకు ఉత్పత్తి చేయడం తగ్గించారు. విదేశాల్లో ఆర్థిక పరిస్థితి కూడా కుంగిపోవడంతో గత 11 నెలలుగా ఎగుమతులు పడిపోతూ వచ్చాయి. ఇలా అటు వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో ఉత్పాదన, ఉత్పాదకత తగ్గినపుడు స్థూల జాతీయాదాయం తగ్గి, దేశ ఆర్థిక పరిస్థితిని దెబ్బతీసింది. తాజా అంచనా ప్రకారం 8, 8.5 శాతం పెరగగలదని అంచనా తప్పింది. 7–7.5 శాతం మాత్రమే ఉండగలదని ఆర్థిక శాస్త్ర వేత్తల లెక్క. తయారీ రంగం ఎన్ని నెలల నుంచో కునికి పాట్లు పడుతూనే ఉంది. జిడిపిలో తయారీ రంగం శాతం ఇలా ఉంది.

| | **క్యు1** | **క్యు2** | **క్యు3** | **క్యు4** |
|---|---|---|---|---|
| 2014 – 15 | 8.4 | 7.9 | 3.6 | 8.4 |
| 2015 – 16 | 7.2 | 9.3 | 8.2 | – |

2014 సంవత్సరం మధ్యలో అధికారంలోకి వచ్చిన మోడీ ప్రభుత్వం సామాజిక సంక్షేమ పథకాలకు (అంటే విద్య, వైద్యం వగైరా) ఆకర్షణీయంగా కేటాయింపు చేసి ఆ సంవత్సరం సెప్టెంబర్ నెలలోనే కేటాయింపుకు కొత విధించారు. తిరిగి ప్రస్థుత ఆర్థిక సంవత్సరంలో కూడా కూటాయింపు, కోత, కోత విధించిన మేరకైనా పూర్తిగా ఖర్చు చేస్తారా అనేది అనుమానం. సేవల రంగంపై పన్ను రెండు సార్లు పెంచారు. పారిశ్రామిక వేత్తలు పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రాకపోవడంతో ప్రభుత్వమే ఆ పని చేయాల్సి వస్తుంది. ప్రభుత్వ రంగంలో ఉన్న కొన్ని పరిశ్రమల్లో కొన్ని వాటాలు అమ్మకానికి పెట్టినా లక్ష్యం సాధించడం కూడా అనుమానమే. పెరుగుదల కుంటు పడడంతో, ప్రభుత్వమే పెట్టుబడులతో ముందుకు రావాలని దేశంలో అతిపెద్ద అయిదు ప్రభుత్వ రంగ బ్యాంకు యాజమాన్యాలు అంటున్నాయి. కాని అప్పుల్లో కూరుకుపోయిన ప్రభుత్వం నిధులెక్కడి నుంచి తెస్తుంది? బ్యాంకులే ఇచ్చిన రు. 3–4 లక్షల కోట్ల రుణాలను వసూలు చేయలేక తలలు పట్టుకుంటున్నాయి. కోట్లు రుణాలు తీసుకున్న కొన్ని కార్పొరేట్లు

# సంస్కృతి అంటే ఏమిటి?

***సంస్కృతి పేరుతో ఎవరికి వారు తమ తమ విశ్లేషణలు ప్రజల మెదళ్లలో జొప్పిస్తూ తప్పదోవ పట్టిస్తున్నారనీ, ప్రజల సామాజిక ప్రగతే సంస్కృతికి నిజమైన నిర్వచనం అనీ అంటున్నారు* గోపి**

మా సంస్కృతి చాలా గొప్పది. కాదు మా సంస్కృతే చాలా గొప్పది. మాది శతాబ్దాల సంస్కృతి గల దేశం. మా దేశం అంతర్జాతీయ సంస్కృతికి ప్రతీక. వారు మన సంస్కృతిని పాడు చేస్తున్నారు. మనం మన సంస్కృతిని కాపాడుకోవాలి. ఆ వ్యక్తి సంస్కృతి గలవాడు. ఇతడు సంస్కృతి హీనుడు. ఇలాంటి మాటలే కాకుండా సంస్కృతికి సంబంధించిన ఎన్నో మాటలను ఈ రోజుల్లో వింటుంటాం. లో కల్చర్, హై కల్చర్, ఇండియన్ కల్చర్, వెస్టర్న్ కల్చర్, రొటిన్ ఇంపోర్టెడ్ కల్చర్, మాల్ కల్చర్, పబ్ కల్చర్, కేఫ్ కల్చర్, డెనిమ్ కల్చర్, ఎంటర్‌టైన్‌మెంట్ కల్చర్, మొబైల్ కల్చర్, పబ్లిక్ కల్చర్, గ్లోబల్ కల్చర్, రాక్ కల్చర్, గే కల్చర్, యూత్ కల్చర్, స్టైల్ కల్చర్, బ్యాక్‌వార్డ్ కల్చర్, బ్లాక్ కల్చర్, కొలోనియల్ కల్చర్, రూరల్ కల్చర్, అర్బన్ కల్చర్, పోస్ట్ – కొలోనియల్ కల్చర్, పోస్ట్ మోడ్రన్ కల్చర్, సైబర్ కల్చర్, ఆదివాసి కల్చర్, కమర్షియల్ కల్చర్, కమొడిటీ కల్చర్, కల్చరల్ పొల్యూషన్ ఇంకా ఎన్నెన్నో వింటుంటాం.

కాని ఈ మాటలు వాడే వారిని మీరనే ఈ మాటలకు అర్థం ఏమిటని అడిగితే బహుశా నూటికి ఒక్కరు కూడా జవాబు చెప్పలేకపోవచ్చు. ఆ మాటకు వస్తే ఈ రోజుల్లో సంస్కృతిని గురించి తెలిసినవారి కంటే తెలియనివారే చాలా సులువుగా వెనకా ముందూ ఆలోచించకుండా అనర్గళంగా మాట్లాడడం చూస్తున్నాం.

ఇదే కాదు సంస్కృతి అనగానే సంఘపరివార్ గుర్తుకు వస్తారు. వారు జాతీయ సంస్కృతిని సాంస్కృతిక జాతీయ వాదమని చెపుతుంటారు. మొత్తానికి సంస్కృతిని గురించి సరైన అవగాహన లేకపోవడం వల్లనే సమాజంలో నానా రకాల అనార్థాలు, అల్లకల్లోలాలు, వైరుధ్యాలు, యుద్ధాలు, మారణ హోమాలు జరుగుతూ ఉన్నాయి. మనిషి ఎదగవలసినంతగా ఎదగకపోవడం, సమాజంలో ఉండవలసిన సామరస్యం ఉండకపోవడం, జీవితంలో మనిషి ఆనందించవలసినంతగా ఆనందించకపోవడం, ఇవన్నీ సంస్కృతి గురించిన తప్పుడు భావాల వలన జనించే అపశ్రుతులే. మరీ విశేషంగా ఈ రోజుల్లో సంస్కృతి పేరున వేలాది మంది అమాయకుల ప్రాణాలు సమిధలైపోవడం మనమందరం చూస్తున్నాం.

---

కావాలనే తిరిగి చెల్లించకుండా ఠలాయిస్తున్నాయి. కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ గత సంవత్సర కాలంలో మూడు, నాలుగు సార్లు బ్యాంకర్ల సమావేశాలు జరిపారు కాని పరిష్కారం లభించలేదు. అవును కార్పొరేట్ల నీడలో బతుకుతున్న ప్రభుత్వం వారిపై తీవ్ర చర్యలు తీసుకునే దమ్ముంటేగా? దేశంలో బ్యాంకుల్లో రుణాలు తీర్చడానికి డబ్బు లేదు కాని, విదేశాల్లో పరిశ్రమలను కొనేయడానికి, లేదా స్థాపించడానికి డబ్బెలా వచ్చింది? బడ్జెట్ విషయానికొస్తే ద్రవ్య లోటును తగ్గించడంలో అనుకున్న లక్ష్యాన్ని చేరుకుంటామని ఆర్థిక మంత్రి బల్ల గుద్ది చెపుతున్నారు. ద్రవ్యలోటు అంటే దేశ ఆదాయ వ్యయాల్లో, ఆదాయంలో చేసిన అప్పు మొత్తం కలిసి ఉంటుంది. కాబట్టి, ఆ మొత్తాన్ని తీసేసి మిగిలిన ఆదాయానికి ఖర్చుకు మధ్యనున్న తేడాయే ద్రవ్యవలోటు. ఇది ఇలా ఉండగా పే కమిషన్ సిఫార్సులను అమలు పరచడం ప్రారంభిస్తే, జైట్లీ బండి బోల్తా పడుతుంది. లేదా ప్రజలపై అదనపు పన్నుల భారం పడుతుంది. ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు పెరిగినా, వారి ఆదాయంలో 25–30 శాతం ఆదాయపు పన్ను రూపంలో తిరిగి ప్రభుత్వ బొక్కసానికే తిరిగి పోతుంది. బహుళజాతి సంస్థలు దేశంలో పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రావాలని మోడీ మేక్ ఇన్ ఇండియా నినాదాన్నిచ్చారు. పిలిచి పిల్లనిస్తానంటే కాదనే వారుండరు. కాని పిల్లనిచ్చే తండ్రికి పెళ్లి ఖర్చులు బోలెడుంటాయి. అలాగే బహుళజాతి సంస్థలు దేశంలో పరిశ్రమలు పెట్టి, లాభాలు చేసుకోండి, విదేశాల్లో అమ్ముకోండి అంటే తప్పకుండా వస్తారు కాని, వాళ్లకు భూమి చూపించాలి, ముఖ్యంగా మౌలిక సౌకర్యాలమీద వారి ఒత్తిడి ఉంటుంది. గత ప్రభుత్వ హయాంలో ఆ సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి నిధులులేక ప్రైవేట్ రంగానికి భాగస్వామ్యం (పిపిపి) కల్పించారు. కాని ఆచరణలో ప్రైవేట్ రంగం ఘోరంగా వైఫల్యమైంది. భూమిని రైతుల నుంచి లాక్కొంటే దేశంలో అల్లకల్లోలం అవుతుంది. ఆ సౌకర్యాలు మీరే నిర్మించుకోండి, నిధులు మేమిస్తాం అంటారా? నిధులుండి ఉంటే పిపిపి వ్యవస్థ ఏర్పడి ఉండేదేకాదు. అయితే విదేశీ పెట్టుబడులు దేశంలోకి రావడానికి ఇదివరకున్న పరిశ్రమలు, షరతులు, అడ్డంకులన్నీ తొలగిస్తూ తాజాగా మంత్రి మండలి నిర్ణయించింది. అంటే వారికి సాష్టాంగ ప్రమాణం చేసిందన్న మాట. 'తాకట్టులో భారతదేశం' అని కమ్యూనిస్టు నాయకుడు తరిమెల నాగిరెడ్డి రాసిన పుస్తకంలో (50 సంవత్సరాల ముందు) ఇలా జరుగుతుందని అప్పుడే హెచ్చరించారు.

సాధారణ ఎన్నికల సందర్భంలో మోడీ నల్లధనాన్ని విదేశాల నుంచి తెచ్చి ప్రతీ ఒక్కరికి ఇంతింత పంచిపెడతానని వాగ్దానం చేశారు. అమెరికాలో ఒక థింక్ ట్యాంక్ అంచనా ప్రకారం ప్రపంచంలో నల్లధనం విషయంలో నాలుగో స్థానంలో ఉందని, 2004–15 మధ్య కాలంలో 510 బిలియన్ డాలర్ల నల్లధనం విదేశాలకు చేరిందని పత్రికల్లో వచ్చింది. మోడీ అధికారంలోకి వచ్చిన తర్వాత కొన్ని నెలలు హడావుడి చేశారు. విదేశీ ప్రభుత్వాలతో చర్చలు జరిపారు. స్విస్ బ్యాంకుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. రెండు, మూడు దేశాలు కొంత మంది పేర్లు కూడా ఇచ్చారు. ఎంక్వయిరీ చేస్తామన్నారు. తర్వాత ప్రభుత్వం గప్‌చుప్, ప్రజలు మరిచిపోయారు. కాని మీడియా ఎందుకు మరిచిపోయింది? నా తెలివితెల్లారా? నల్లధనం దాచిన వాళ్లలో కొంత మంది ఇవాళా మీడియా యాజమాన్యాలు! విదేశాల్లో దాచిన నల్లధనం సరే, దేశంలో ఉన్న నల్లధనం మాటేమిటి? ఇది కూడా తెలివితక్కువ ప్రశ్నే. ఎందుచేతనంటే మోడీ ఎక్కిన పల్లకి మోసేది వాళ్లే. మరి? దేవుడి మీద నమ్మకం ఉన్నవాళ్లు ఆ దేవుళ్లకు దండాలు పెడుతూండండి. నమ్మకం లేనివారు తూర్పు తిరిగి దండం పెట్టండి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

సమాజంలో కులతత్వం, మతతత్వం, సంకుచితత్వం ప్రగతికి అవరోధంగా నిలుస్తునే ఉన్నాయి.

సంస్కృతి అంటే ఏమిటి? కులానికి, సంస్కృతికి సంబంధం ఏమిటి? నాగరికతకు, సంస్కృతికి సంబంధం ఏమిటి? శ్రమకు సంస్కృతికి సంబంధం ఏమిటి? మతానికి, సంస్కృతికి సంబంధం ఏమిటి? భూమికి, సంస్కృతికి సంబంధం ఏమిటి? మార్కెట్ శక్తులకు, సంస్కృతికి సంబంధం ఏమిటి? ఇలా భూమి, నాగరికత, మతం, కులం, రకరకాల సమాజాల్లో ఉండే ఉత్పత్తి సంబంధాలు వగైరా విషయాల్లో ఒక స్పష్టత ఉంటేనే/మొత్తంగా సంస్కృతి గురించిన లోతైనా అవగాహన కలుగుతుంది. సంస్కృతికి రెండు వందలకు పైగా నిర్వచనాలు ఉన్నాయని చెపుతున్నారు చలసాని ప్రసాద్‌రావు గారు. ఇక్కడ మనం కొన్ని సంస్కృతికి సంబంధించిన నిర్వచనాలనీ గుర్తుకు చేసుకోవడం మంచిది.

'ఒక నిర్దిష్ట రాజకీయ, ఆర్థిక పునాది మీద నిర్మితమైన కట్టడియే సంస్కృతి' అన్నాడు మావో.

'సంస్కృతి అంటే మన బుర్రలో నిలువ ఉండేది కాదు. అది జీవితంలో జ్వలించేది. పాండిత్యం పోగు చేయడం కాదు, విద్యనీ, అనుభవాన్ని అన్వయించేది సంస్కృతి' అంటున్నాడు అమెరికన్ రచయిత విల్ డురట్.

సంస్కృతి గురించి ఎవరేమి చెప్పినా ప్రతి ఒక్కరికి, ప్రతి రాజకీయ సామాజిక నిర్మాణానికి సంస్కృతి గురించి ఒక ఎజెండా ఉంది. అప్పుడప్పుడు దాన్ని ప్రకటించుకుంటూ ఉంటారు. ఏదీ ఏమైనా కల్చర్ ఇజ్ ద మ్యాన్-మెడ్ పార్ట్ ఆఫ్ ఎన్విరాన్‌మెంట్ గా గుర్తించాలి.

కోట్ల సంవత్సరాల నుండి ఈ విశ్వం ఉంది. లక్షల సంవత్సరాల నుండి మానవులు ఉన్నారు. వేల సంవత్సరాల నుండి నాగరికత ఉంది. టోన్‌బి అనే రచయిత ప్రకారం ప్రపంచంలో 26 నాగరికతలు వెల్లివిరిశాయి. అందులో 12 చచ్చిపోయాయి. చాలా విచిత్రమైన విషయం ఏమిటంటే మనదేశంలో మన మతమే మన సంస్కృతి అని, మన మతమంటే హిందూ మతమనే భావం చాలా కటువుగా నిరోచితంగా ఉద్ఘాటిస్తున్నారు. ఒకవైపు కుల వివక్షతలు పాటిస్తూ ఉన్నా, బాల్య వివాహాలు, అంటరాని తనం లాంటివి అమల్లో ఉన్నా అమానుష సంబంధాలు అమల్లో పెడుతూ ఉన్నా, సాంస్కృతికంగా మనమందరం ఒకే బాటకు అనగా హిందూ మత బాటకు చెందినవారనే వాదన కొందరు నాయకులు ప్రచారం చేస్తున్నారు. ఈ వాదనలో లేనిదంతా ఒక్కటే-అదే సంస్కృతి. సంస్కృతి గలవారు ఇలాంటి వాదన చేయరు. ఈ వాదన మనుషులను సంస్కృతీ హీనులుగా చేయడానికి బలంగా తోడ్పడుతుంది. హిందూ మతం వేరు. భారతీయ సంస్కృతి వేరు. భారత సంస్కృతి భారతదేశంలో అన్ని మతాల, మతేతర సంస్కృతి. రవీంద్రనాథ్ ఠాగూర్ అన్నట్లు - 'వొ

సంస్కృతి ఒక మనిషిది కాదు. ఒక దృక్పథం. అమెరికాలో క్రైస్తవులు, హిందువులు, ముస్లింలు ఇంకా ఎన్నో మతాల వారున్నారు. కాని వారందరిది అమెరికన్ సంస్కృతే. మత గుర్తింపు వేరు, జాతీయ సంస్కృతి వేరు. అలాగే భారతీయులు అంటే హిందువులే కాదు. ద్రావిడులు, ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు, పార్సీలు, బౌద్ధులు, ఆదివాసులు కూడా. కాబట్టి మన సంస్కృతి అంటే భారతీయ సంస్కృతి అని అర్థం వస్తుంది గాని, హిందూ సంస్కృతి అనే అర్థం రాదు. రాకూడదు.

మరో విచిత్రమేమిటంటే మన దేశంలో సంస్కృతి అంటే కులం లేదా వర్ణాశ్రమ ధర్మాలే అనే ప్రచారం కూడా బాగానే జరుగుతుంది. మన మహా భారతంలో ఒక ప్రత్యేక విషయం ఉంది. ఎక్కడికక్కడ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర-అంటూ చతుర్వర్ణాల మాటలు అనే పేర్లతో కులాల మాటలు చెప్పడం ప్రతీచోటా ఉంది. అదే రచనలో బ్రాహ్మణుల్ని పూజించండి! వేదాల్ని పూజించండి! అని చెప్పబడి ఉంది.

సంస్కృతం, సంస్కృతి ఒకటి కాదు. అలానే ధర్మం, న్యాయం, నాగరికత ఒకటి కాదు. హింస సంస్కృతి మనదీ కాదు. అయితే ఏదీ భారతీయ సంస్కృతి? పదహారు వేల తొమ్మిది మంది స్త్రీలతో జీవించిన కృష్ణుడిదా? ఏక పత్నీవ్రతుడైన శ్రీరాముడిదా? అలాగే యజ్ఞ యాగాదుల సంరక్షణ కోసం విల్లు ఎక్కుపెట్టిన శ్రీరాముడిదా? యజ్ఞ యాగాదుల్ని నిరసించిన బుద్ధుడిదా? మాయ వాదాన్ని మోసుకు తిరిగిన శంకరుడిదా? ఏనాటి నుంచో ఈ దేశంలో భౌతిక వాదాన్ని భుజాల మీద ఎక్కించుకున్న చార్వాకులదా? నాగళ్లతో పనిచేసే వాళ్ల దగ్గర నుంచి భూమి కార్పొరేట్ శక్తుల చేతుల్లోకి, పారిశ్రామిక వేత్తల చేతుల్లోకి బదలాయించబడడం మన సంస్కృతా? మన సమాజంలో నిరంతరం శారీరక శ్రమలో ఉండే శ్రామికులకూ యోగా వంటి ప్రత్యేక వ్యాయామం అవసరమా? లేదా సాధారణంగా శారీరక శ్రమలో లేని విశ్రాంతి వర్గ, మధ్య తరగతి ప్రజలకు అవసరమా? అందుకని భారతీయ సంస్కృతి ఒక సజీవ స్రవంతి. అందులో అనేక రూపాలు ఉన్నాయి.

సంస్కృతి అనగా ప్రాపంచిక దృక్పథం సాధారణ దృక్పథం కాదు. ప్రపంచ శ్రేష్టతను ఔన్నత్యాన్ని మూర్తీభవించే దృక్పథం. ఇది జీవన విధానం కాదు. జీవిత దృక్పథం. సంస్కృతి అంటే సంస్కారమని కూడా అంటారు. సంస్కృతి గలవాడన్నప్పుడు సాధారణంగా మంచి భావాలు గలవాడనే ఉద్దేశంతోనే వాడుతుంటారు. అనగా దృక్పథం అందరికీ ఉండవచ్చు గాని ఆ దృక్పథంలోని శ్రేష్టతకు ప్రతీకగా ఉండే దృక్పథాన్ని మంచి సంస్కృతి అనవచ్చు. సంస్కృతి మానవ కృషికి, సృష్టికి ప్రతీక. ఈ కృషి వలన వృద్ధి చెందిన పరిస్థితిని సంస్కృతి చెందడమంటారు. అతి శ్రేష్టమైన మానవ జీవితాన్ని ఆనందించడానికి, ఆనందింప చేయడానికి మనిషి చేసే కృషే సంస్కృతి. అది మానవ జీవిత ఔన్నత్యానికి, పరిణామానికి మూలం. అది మానవ బాధ్యతను ప్రతిభింబిస్తుంది.

మూఢ నమ్మకాలు, మతం, పురాణాలు ఒక్క భారతదేశంలోనే కాదు ప్రపంచంలో అన్ని దేశాల్లో ఉన్నాయి. వీటికి సంస్కృతితో సంబంధం ఉన్నది కాని అవే సంస్కృతి అనుకోవడం తప్పు. శ్రమ నుంచి సంస్కృతి పుడుతుంది అంటున్నారు శ్రీశ్రీ. దేశమంటే మట్టికాదోయ్/ దేశమంటే మనుషులోయ్/ నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయ్/ మతములన్నియు మాసిపోవును. జ్ఞానమొక్కటే నిలిచి వెలుగును అని అన్నారు గురజాడ.

సంస్కృతి అనే పదం సామాజిక పదం. అది ప్రజాపరమైన శ్రేష్టతకు ప్రతీక. సంస్కారం గల వ్యక్తి తన మట్టుకే, తన కొరకే బతకడు. సంస్కృతి సమిష్టి జీవితాభివృద్ధి కొరకైన కృషి, తన విజ్ఞానాన్ని, మేధాశక్తిని వినియోగించి, తనను తన చుట్టూ ఉన్న పరిసరాల్ని మల్చుకొని అంతకు ముందున్న పరిస్థితి కంటే మెరుగుపరచడాన్ని, మార్చడాన్ని, బాగుచేయడాన్ని, అభివృద్ధి చేయడాన్ని సంస్కృతి అంటారు. సంస్కృతి అంటే శ్రేష్టత అని కూడా అనవచ్చు. సామాన్య మానవుడు సాంస్కృతిక విప్లవం ద్వారా చెడు భావాలను దూరం చేసుకోగలడు. సంస్కృతి గలవాని కొన్ని లక్షణాలు; వ్యక్తిని వ్యక్తిగా గౌరవిస్తాడు. ఇతరుల స్వేచ్ఛను మన్నిస్తాడు. వ్యక్తిలోని మానవత్వాన్ని ఒప్పుకుంటాడు. పౌర స్పృహ, సమూహిక స్పృహ కలిగి ఉంటాడు. మానవ బలహీనతలను దృష్టిలో పెట్టుకుంటాడు. తనను ఎదుటివారి స్థానంలో పెట్టుకుని ఆలోచిస్తాడు. శ్రమను గౌరవిస్తాడు. శుభ్రతను పాటిస్తాడు. స్త్రీ స్వేచ్ఛను గౌరవిస్తాడు. కష్టాల్లో, బాధల్లో ఉన్నవారి పట్ల సానుభూతి వ్యక్తపరుస్తాడు. అన్యాయాన్ని ఎదిరించే స్వభావం కలిగి ఉంటాడు. ప్రశ్నించడం, పరిశీలించడం, పరిశోధించడం, యదార్థాన్ని తెలుసుకుని అనుసరించడం మానవ ప్రగతికి మూలంగా భావిస్తాడు. ఇతరుల వ్యక్తిగత వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోడు. తన లాభం, సుఖం కొరకు ఇతరులను వాడుకోడు. ఇతరుల అభివృద్ధిని హర్షిస్తాడు. సామాజిక దృక్పథంతో ఆలోచిస్తుంటాడు. ప్రజాస్వామ్య జీవితానికి విలువనిస్తాడు.

(రచయిత ఉపాధ్యాయుడు) వీ

# మురికివాడల పిల్లల మరణాలు

***మురికివాడలలో నివసిస్తున్న వారికి సరైన మౌలిక సౌకర్యాలు కల్పించకుండా, సరైన పునరావాసం కల్పించకుండా పాలకులు విస్మరిస్తున్నారనీ, ఇది ఏ ఒక్క రాష్ట్రంలో కాకుండా దేశవ్యాప్త సమస్య అని అంటున్నారు ఎం.కె.కుమార్***

ఢిల్లీలోని షాకూర్ బస్తీ, మురికివాడల తొలగింపు ఓ బాలుని మృతికి కారణమైనాయి. రైల్వే అధికారులు కనీసం ముందస్తు ప్రకటనలు, పునరావాస చర్యలు చేపట్టకుండానే మురికివాడను తొలగించే కార్యక్రమం చేపట్టడంతో, తీవ్రమైన చలికి బాలుడు చనిపోయాడు. ఢిల్లీ హైకోర్టు ఈ విషయంపై తీవ్రంగా స్పందించి రైల్వే సలహాదారు జగ్జీత్‌సింగ్‌ను నిలదీస్తే, ఆయనిచ్చిన బాధ్యతలేని సమాధానం దేశ ప్రజానీకాన్ని మరింత నివ్వెరపర్చింది. మురికివాడలను తొలగించడానికి ముందుస్తు ప్రకటన చేశామని, అయినా నివాసితులు నిర్లక్ష్యం వహించారని, వారికి పునరావాసం కల్పించడం తమ బాధ్యత కాదని విస్పష్టంగా కోర్టుకు చెప్పారు. పేదవర్గాల పట్ల కేంద్రప్రభుత్వ వైఖరి ఎలా ఉంటుందో ఈ సంఘటనతో మరోసారి స్పష్టమైంది. 2006 నుండి ఢిల్లీలో ఉన్న నివాసాలకు రక్షణ కల్పించాల్సిన బాధ్యత ఢిల్లీ పట్టణ నివాసాభివృద్ధి బోర్డు (డియుఎస్‌ఐబి) మీద ఉంది. కేజ్రీవాల్–మోడీకి మధ్య జరుగుతున్న ఆధిపత్య పోరులో భాగంగా రైల్వేశాఖ సైతం మురికివాడల్లోని ప్రజలకు పునరావాసం కల్పించాల్సిన బాధ్యత ఢిల్లీ ప్రభుత్వానికి సంబంధించినదని కోర్టుకు విన్నవించింది.

డిసెంబర్ 12న మురికివాడలను కూలుస్తున్న సమయంలో మొహమ్మద్ అన్వర్ తన ఏడు నెలల కూతురుని గుడిసె నుండి కాపాడుకునే ప్రయత్నం చేసి విఫలమయ్యాడు. పైనుంచి పెద్ద బట్టల మూట ఆ చిన్నారిపై పడడంతో ఛాతి, మెదడుకు బలమైన గాయాలు తగిలి అక్కడికక్కడే మరణించింది. పంజాబీబాగ్ పోలీసు స్టేషన్లో ఈ మేరకు సెక్షన్ 304 ఎ కింద కేసు నమోదు చేయబడింది. సంజయ్ మహాత్మా గాంధీ మెమోరియల్ ఆసుపత్రి పోస్ట్‌మార్టం నివేదిక బలమైన వస్తువులు ఆ పాప తల, ఛాతీపై పడడం వల్లే ఆ పాప మరణించిందని తేల్చి చెప్పాయి. మురికివాడ తొలగింపుకు శ్రీకారం చుట్టినదేమో రైల్వేశాఖ. మురికివాడ ప్రజలకు పునరావాసం కల్పించాల్సిన బాధ్యత డియుఎస్‌ఐబికు కూడా ఉంది. ఈ నేపథ్యంలో ఎవరిపై కేసు నమోదు చేయాలో తెలియడం లేదని పోలీసులు అమాయకంగా చెప్తున్నారు. ఈ విధంగా మురికివాడల్లో పిల్లలు చనిపోవడం కొత్తమే కాదు. దేశంలోని మురికివాడల్లోని పిల్లలు ప్రతి 10 రోజులకు ఒకరు చొప్పున అనేక కారణాల రీత్యా చనిపోతుంటారు. ఇవి ప్రభుత్వ లెక్కల్లోకి ఎక్కవు. ఎందుకంటే ఆ పిల్లలకు బర్త్ సర్టిఫిట్ ఉండదు. తల్లిదండ్రులకు ఓటు హక్కు ఉండదు. ఆధార్లు, రేషన్ కార్డుండవు. రాజ్యాంగం, చట్టం ప్రకారం హత్యకు ప్రభుత్వం బాధ్యత వహించాల్సిన అవసరమే లేదు.

ఆశ్చర్యకర విషయమేమిటంటే మురికివాడను వెంటనే తొలగించాలని జాతీయ హరిత ట్రిబ్యూనల్ ఆదేశించింది. గతంలోనే పలుసార్లు చెప్పినప్పటికీ రైల్వేశాఖ నిర్లక్ష్యం ప్రదర్శిస్తోందని జరిమానా సైతం విధించింది. రైల్వేట్రాక్‌కు అతి సమీపంలో ఈ మురికివాడుండటం వల్ల ట్రైన్ శబ్దాలకు అక్కడి ప్రజలు శబ్దకాలుష్యానికి తీవ్రంగా గురౌతున్నారని ట్రిబ్యూనల్ అభిప్రాయపడింది. మరోవైపు గత సంవత్సరంలో నలుగురు పిల్లలు ట్రైన్ పట్టాలపై ఆడుకుంటున్న సందర్భాల్లో ట్రైన్ కింద చనిపోయారని రైల్వేశాఖ ప్రకటించింది. ఒక న్యాయస్థానం మురికివాడను, అక్కడి ప్రజల ప్రాణాలను రక్షించడం కోసం తొలగించమంది. మరో న్యాయస్థానం తొలగించే ముందర వారికి సరైన వసతి ఏర్పాట్లు చేసి తొలగించాలని చెప్పింది. ఇరు న్యాయస్థానాలు అవమానవీయమైన తీర్పులే చెప్పాయి. మురికివాడల్లో నివసిస్తున్న ప్రజలకు పునరావాస చర్యలు చేపట్టిన తర్వాతే వారిని తొలగించాలనే ప్రజాస్వామిక అంశాన్ని విస్మరించారు. రైలు ట్రాక్ ప్రక్కనే మురికివాడలు 1995 నుండి ఉన్నాయి. రైలు పట్టాల సమీపంలో, రైల్వేశాఖ అధీనంలో ఉన్న స్థలాల్లో మురికివాడలు ఉండడం చట్టవిరుద్ధమని, అక్కడ నివసించే ప్రజలపై కేసులు పెట్టాలని ఇవే న్యాయస్థానాలు పలు సందర్భాల్లో తీర్పు చెప్పాయి. రాజ్యానికి, న్యాయస్థానానికి పేదవర్గం పట్ల ఎటువంటి దయా, దాక్షిణ్యాలు ఉండవని, చట్టం పేరుతో మానవ విషాదాన్ని రగల్చడానికి వెనకాడరని తేటతెల్లమౌతోంది.

ఇది ఒక్క ఢిల్లీ మురికివాడల సమస్య కానే కాదు. దేశవ్యాప్తంగా మురికివాడల్లో నివసిస్తున్న 12 కోట్ల పేద ప్రజల సమస్య. 2001 లోనే భారత్ స్లమ్ జనాభా బ్రిటన్ దేశ జనాభాను మించిపోయింది. 1981లో మురికివాడల్లో నివసిస్తున్న దరిద్రులు 3 కోట్లుంటే 2001 నాటికి వారి సంఖ్య 7 కోట్లకు చేరింది. భారత వృద్ధి రేటు 8 శాతంగా స్థిరంగా నిలకడగా కొనసాగుతుందని గబ్బాలు కొట్టుకుంటున్న ప్రభుత్వం 40 కోట్ల మంది దరిద్రులకు కరెంటు, మంచినీరు, గ్యాస్, స్వంత ఇళ్లు లేవనే అంశానే విస్మరిస్తుంది. పెరుగుతున్న జనాభా వల్లే మురికివాడల్లో జనాభా పెరుగుతున్నదని కేంద్ర ప్రభుత్వం ఇటీవలే తేల్చి చెప్పింది. దాని ప్రకారం ధనిక, మధ్యతరగతి వర్గాలే పిల్లన్ని కనాలని, పేదవర్గం వారు పిల్లలను కనకూడదని హుకుం జారీ చేసినట్లైంది. దేశంలో ముంబాయి తర్వాత ఎక్కువ మురికివాడలను కల్గివున్న పట్టణం ఢిల్లీ. 1.8 కోట్ల జనాభా ఉన్న ఢిల్లీలో 25 లక్షల మంది మురికివాడల్లో నివసిస్తున్నారు. వీరికి కనీస మౌలిక వసతులను దశాబ్దాలుగా ప్రభుత్వాలు కల్పించడం లేదు. 2017 నాటికి దేశంలోని మురికివాడల్లోని జనాభా 17 కోట్లకు పెరుగుతుందని కేంద్ర ప్రభుత్వం అంచనా వేసింది. ఇది

ప్రభుత్వాలు గుర్తించిన మురికివాడల సంఖ్యలోని జనాభా మాత్రమే. చాలా ప్రాంతాలను ముఖ్యంగా వలస ప్రజలు నివసిస్తున్న కొత్త మురికివాడలను అధికారికంగా ప్రభుత్వం గుర్తించదు. దీనివల్ల వారికి కరెంటు, డ్రైనేజీ, తాగునీరు, రోడ్లు, రేషను కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వం మీద ఉండదు. వారందరూ ప్రభుత్వ స్థలం ఆక్రమిత దారులౌతారు. వారిపై కేసు పెట్టవచ్చు. పోలీసులు పెండింగ్ కేసులకు ఆ ప్రజలను నిందితులుగా చూపెట్టుకోవచ్చు.

వీరిని ఆధారంగా చేసుకుని పనిచేస్తున్న స్వచ్ఛందసంస్థలు 3 వేలకి పైగా ఉన్నాయి. స్వచ్ఛంద సంస్థలు ప్రధానంగా పోరాడేది వీరికి ఓటుహక్కు కల్పించాని. ఓటుహక్కు కల్పిస్తే వారి ఓట్లను పొందడానికి రాజకీయపార్టీలు మురికివాడలను నోటిఫైడ్ స్లమ్స్‌గా పరిగణిస్తాయని వారి వాదన. ఒకవేళ ఓటుహక్కు ఉంటే మిగిలిన ప్రభుత్వం సంక్షేమ పథకాలు వారికి చేరాలని వినతిపత్రాలు పై అధికారులకు టన్నులకొద్దీ సమర్పిస్తుంటారు. ఆశ్చర్యకర విషయమేమిటంటే ఇంత మహత్తర పోరాటం చేస్తున్న ఎన్‌జిఓ పై ఒక్క పోలీసు కేసు ఉండక పోవడం. మురికివాడల్లోని ప్రజలందరూ అసంఘటిత రంగాలలో పనిచేస్తున్న వారే. వీరెవ్వరికీ కార్మికచట్టాల భద్రత ఉండదు. 2014 సాధారణ ఎన్నికల్లో బిజెపి గెలుచుకున్న ఓట్ల సంఖ్య 31 శాతమే. మురికివాడ ప్రజల ఓట్ల శాతం 20 శాతం పైగా ఉంది. నిజానికి వీరందరినీ సంఘటితం చేసి, ఓటు హక్కును కల్పిస్తే స్వచ్ఛంద సంస్థలు అనుకున్నది కొంతమేరకన్నా సాధించే అవకాశముంది. కాని స్వచ్ఛంద సంస్థలు వీరిని సంఘటితపర్చవు. రాజకీయపార్టీలు వీరిలోని మిలిటెన్సీ స్థాయిని చంపేస్తాయి. ధర్నాకు, రాస్తారోకోకు మాత్రమే వీరిని పరిమితం చేస్తాయి.

సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాలో పట్టణీకరణ మరొక విధ్వంసకర ఫలితం. పట్టణీకరణ మురికివాడల సంఖ్యను, అక్కడ నివసించే ప్రజలను విపరీతంగా పెంచుతోంది. పట్టణ మొత్తం జనాభాలో మురికివాడల్లో నివసించేవారు 15 శాతంపైగా ఉన్నారు. ప్రైవేటు రంగాన్ని అభివృద్ధి చెయ్యడానికి భారత పాలకులు స్వాతంత్ర్యానంతరం మిశ్రమ ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టారు. ఇది పట్టణీకరణకు దారితీసింది. 1901 జనాభా లెక్కల ప్రకారం పట్టణ జనాభా 11.4 శాతమే. 2011 నాటికి అది 31.16 శాతానికి పెరిగింది. 2025 నాటికి పట్టణ జనాభా 50 శాతం పైగా పెరుగుతుందని ప్రపంచ జనాభా రిపోర్టు చెపుతోంది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ప్రభుత్వం తన సేవలను పెంచింది. అభివృద్ధి–సంక్షేమం అనే మంత్రాన్ని జపించడం మొదలుపెట్టింది. మరోవైపు పారిశ్రామిక విప్లవం గ్రామాల నుండి ప్రజలను పట్టణాలకు చేరవేసింది. 5 వ పంచవర్ష ప్రణాళికలో పాలకుల పట్టణీకరణ వల్లే భారతదేశం ఆర్థిక వృద్ధి చెందుతదని రాసుకున్నాయి. అందుకు తగ్గట్టు బడ్జెట్‌ను కేటాయించడం మొదలుపెట్టారు. ఇది గ్రామ ఆర్థిక వ్యవస్థను ధ్వంసం చేయనారంభించింది. వ్యవసాయంలో సంక్షోభం చేతి వృత్తిదారుల ను, వ్యవసాయ కూలీలను వలసబాట పట్టించింది.

1990 తర్వాత ఈ వలసలు వేగవంతమయ్యాయి. పట్టణీకరణ కారణంగా మురికివాడలు పెరగడమే గాకుండా, ప్రజల జీవన ప్రమాణాలు పడిపోయాయి. 300 మిలియన్ భారత ప్రజలు పట్టణాలలో నివసిస్తున్నారు. ఇది అక్రమలే అవుట్లకు, చెరువుల ఆక్రమణకు, కబ్జాలకు దారితీసి రియల్ ఎస్టేట్ లాంటి సేవారంగాలను అభివృద్ధి చేసింది. నేషనల్ శాంపిల్ సర్వే ప్రకారం పట్టణాలలో నిరుద్యోగం 34 శాతంగా ఉంది. మహిళల్లో ఇది 52 శాతంగా ఉంటే, పురుషుల్లో 30 శాతంగా ఉంది.

ఎన్నికల్లో రాజకీయ పార్టీల జెండాలను మోసేది ఈ మురికివాడల ప్రజలే. పార్టీ కోసం, సెలబ్రటీల కోసం కొట్టుకునేది వీరే. రాజకీయ పార్టీల కార్యక్రమాలకు రిజర్వుడు సైన్యంగా ఉపయోగపడుతున్నా వీరికి మౌలిక వసతులను కల్పించడంలో మాత్రం పార్టీలు నిర్లక్ష్యం వహిస్తున్నాయి. మురికివాడల ప్రజలు జీవనోపాధి కోసం నేరాలకు పాల్పడుతున్నట్టు స్వచ్ఛందసంస్థలు తమ గణాంకాల్లో విస్తృతంగా పేర్కొంటున్నాయి. మురికి వాడల్లో నివసించే సగటు మనిషి జీవితకాలం సగటు భారతీయుడి కన్నా 7 సంవత్సారాలు తక్కువ ఉంటున్నట్లు వైద్యులు పేర్కొంటున్నారు. వెనిజులా ల్లాంటి దేశాల్లో మురికివాడలను తొలగించడానికి ఏకంగా సైన్యాన్ని ఉపయోగిస్తున్నారు. వీరంతా డ్రగ్స్‌ను, అక్రమ ఆయుధాలను కల్గివున్నారనే నెపంతో వారిపై ప్రభుత్వం హింసాత్మక దాడులను చేస్తోంది. మురికివాడల్లో మహిళలపై లైంగిక హింస ఎక్కువుగా జరుగుతుంది. ముంబై, ఢిల్లీలో ప్రతి 30 మంది మహిళలకు ఒక మహిళ లైంగిక హింసకు, ప్రతి 100 మందికి ఒక మహిళ అత్యాచారానికి గురౌతున్నట్లు మీడియా పేర్కొంటోంది. మురికివాడల్లోని వాతావరణం యువతను హింసకు ఎక్కువుగా ప్రేరిపిస్తోంది. వారి దారిద్ర్యానికి కారణం ప్రభుత్వ వైఫల్యం అని తెల్సినప్పటికీ, దానికి ఎటువంటి పోరాట రూపాలను ఎంచుకోవాలో తెలియకపోవడంతో వారు పక్కదారి పడుతున్నారు.

అపరిశుభ్రత, వ్యాక్సినేషన్ లేకపోవడం వల్ల వ్యాధులు ఎక్కువుగా మురికివాడల్లో ప్రబలుతుంటాయి. తక్కువ స్థలంలో ఎక్కువ జనాభా నివసించడం వల్ల వ్యాధుల వ్యాప్తి త్వరిత గతిన జరుగుతుంది. తట్టు, మలేరియా, డెంగ్యూ, టైఫాయిడ్, విరోచనాలు ఇక్కడివారికి తరుచుగా వస్తుంటాయి. మురికివాడల్లోని పిల్లలకు పౌష్ఠికాహారలోపం ఎక్కువుగా ఉంటుంది. న్యూఢిల్లీలో 51 శాతం పిల్లలు పౌష్ఠికాహార లోపంతో బాధపడుతుంటే, 36 శాతం మంది తక్కువ బరువు సమస్యతో బాధపడుతున్నారు. పౌషికాహారలోపం వ్లల స్లమ్స్‌లో సంవత్సరంలో 65,000 మంది పిల్లలు చనిపోతున్నారని అభయ్ బ్యాంగ్స్ రిపోర్టు పేర్కొంటోంది. స్లమ్స్‌లోని 80 శాతం పిల్లలకు మూడు పూటలా సరైన తిండే ఉండదు.

మురికివాడల్లో నివసించే ప్రజలను భారతీయులుగా గుర్తించరు. కాబట్టి రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులు వారికి అవసరం లేదని ప్రభుత్వం వాదన. అందుకే వారిని మురికివాడల నుండి గెంటెయ్యడానికి పోలీసులను, చట్టాలను ప్రభుత్వం ఉపయోగిస్తుంటుంది. ఎందుకంటే రాజ్యాంగాన్ని రూపొందిలచినపుడు దేశంలో మురికివాడలు పెద్దగా లేవు. వీరందరూ వివిధ ప్రాంతాల నుండి పొట్టకూటికోసం వలస వచ్చినవారే. ప్రభుత్వ స్థలాలను ఆక్రమించిన ఆక్రమణాదారాలు గానే ప్రభుత్వం వీరిని గుర్తిస్తోంది. మురికివాడలను తొలగించాలని ప్రభుత్వం అర్ధరాత్రి పోలీసు బలగాలతో, ప్రొక్లైనర్లతో దాడులు చేసి వారిని బలవంతంగా గెంటివేస్తుంది. దీన్ని అతిపెద్ద సామాజిక సమస్యగా

ప్రభుత్వం గుర్తించడం లేదు. మురికివాడల ప్రజలకు వేరేచోట ఇల్లు కట్టించాలని, వారికి మౌలిక వసతులను అక్కడే కల్పించాలని అందుకు తాము ప్రభుత్వాలకు అప్పులిస్తామని ప్రపంచ బ్యాంకు ప్రకటనలు చేస్తుంది. కాని, వారికి జీవనోపాధి కల్పించాలని చెప్పదు. ఎందుకంటే ఖాళీ చేసిన మురికివాడల్లో మల్టీప్లెక్సు, విలాస భవంతులు నిర్మించుకోవ డానికి ప్రపంచబ్యాంకుకు మరోమార్గం కనిపించడం లేదు. ప్రస్తుతం ఢిల్లీలోని మురికివాడలను ఖాళీ చేసి వారందరికి సింగిల్ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్లు కట్టించడానికి అయ్యే ఖర్చు కన్నా 7 రెట్లు అధిక సొమ్ము వారు నివసిస్తున్న ప్రాంతాలను అమ్మితే వస్తుంది. అందుకే ప్రభుత్వాలు నిర్మూలనకు ఉబలాట పడుతున్నాయి.

మురికివాడలను క్రమబద్ధీకరించి పట్టణ అభివృద్ధికి పాటుపడే చర్యలు కొన్ని దేశాలు చేపడుతున్నాయి. 1972లో జాన్‌టర్నర్ ఈ విధానానికి రూపకల్పన చేశాడు. అయితే ఇది పూర్తిగా ప్రైవేటు వ్యక్తులకే అప్పగించాలని చెప్పాడు. ఎందుకంటే ప్రభుత్వం ఎన్నటికీ అటువంటి పాడుపనులు చెయ్యదు. వెనిజులా, పిలిప్పైన్స్, చైనా దేశాలలో ఇది మంచి వ్యాపారంగా అభివృద్ధి చెందింది. పెట్టుబడిదారులకు కావలసినంత సొమ్మును ఈ పేద ప్రజల నుంచి లాక్కోవచ్చు. మొదటగా రోడ్లు, ఇళ్లు నిర్మాణం పేరిట వారికి ఉపాధి కల్పిస్తారు. వేతనాలు అతి తక్కువుగా ఇస్తారు. ఇందుకోసం వారు నివసిస్తున్న స్థలాల్లో 40 శాతం అభివృద్ధి పేరిట కార్పొరేట్ శక్తులు గుంజుకుంటాయి. మురికివాడల క్రమబద్ధీకరణ పేరుతో లండన్, సింగపూర్, హాంకాంగ్, సియోల్, షాంగై దేశాలు ఇదే తరహా విధానాన్ని పాటించాయి. అందులో మెజారిటీ ప్రజలు మురికివాడల నుండి నెట్టివేయబడ్డారు. 15 శాతం మందికి మాత్రమే లబ్ధి చేకూరింది. ఇదే తరహా విధానాన్ని నూతన రాజధాని పేరిట చంద్రబాబు ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పబోతున్నాడు.

పట్టణీకరణ అనేది అభివృద్ధి విధ్వంసానికి మరో రూపం. మురికివాడల ప్రజల శ్రమ నైపుణ్యాలను వాడుకుని, తద్వారా ఉత్పత్తిని పెంచే విధానాలు పెట్టుబడిదారీ దేశాలు చేయడం లేదు. పక్కా ఇళ్ల పేరిట ఊరికి దూరంగా అపార్ట్‌మెంట్ల పేరిట మరో వాడను స్థాపిస్తున్నారు. అందులో 15 శాతం మందికి చోటు కల్పించి, అందరినీ మురికి వాడలనుండి గెంటివేస్తారు. వీరందరు ఉన్న చోట మాల్స్, మల్టీప్లెక్స్‌లు వెలుస్తాయి. వీటిలో వాచ్‌మెన్‌లుగా, కూలీలుగా వీరిలో 5 శాతం మందికే ఉపాధి దొరుకుతుంది. మురికివాడల నుండి మరో మురికివాడకు ఈ వలసలు నిరంతరం జరుగుతూనే ఉంటాయి. ముంబాయి నడిబొడ్డున మురికివాడల నిర్మూలనల పేరుతో చేపడుతున్న చర్యలు, ముంబాయి శివార్లలో మురికివాడలను ఏర్పరుస్తున్నాయి. 2050 నాటికి 70 శాతం ప్రజలు పట్టణాల్లో నివసిస్తారని ఐరాస ప్రకటించింది. దీనిర్థం 50 శాతం ప్రజలు మురికివాడల్లో నివసిస్తారనే. వారందరికి, మౌలిక వసతులు ఉండవని చెప్పడమే. వ్యవసాయ ప్రధాన భారతదేశంలో వ్యవసాయాన్ని అభివృద్ధిపరిస్తేనే ఈ మురికివాడల ప్రజలు తిరిగి వ్యవసాయంలోను, తత్సంబంధిత అనుబంధ పరిశ్రమల్లోను ఉపాధిని వెతుక్కుంటారు. పారిశ్రామికీకరణ, పట్టణీకరణ వ్యవస్థకు అనుగుణమైన మోతాదులో జరగాలి. అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక విధానాలను ఇక్కడ రుద్దడం వల్ల విస్థాపనే జరుగుతుంది. 12 కోట్ల మురికివాడల ప్రజల దుర్భర పరిస్థితులను ఒక జంతువు(ఆవు)కు విలువిచ్చే దేశభక్తులు అస్సలు పట్టించుకోరు.

రాజ్యాంగంలో స్పష్టంగా మురికివాడల ప్రజల కోసమే చట్టాలు లేకపోయినప్పటికీ, ఆర్టికల్ 21 ప్రకారం ప్రతి పౌరుడు స్వేచ్ఛగా, హుందాగా, మర్యాద పూర్వకంగా జీవించే హక్కు కల్గివున్నాడు. మహారాష్ట్ర ప్రభుత్వం స్లమ్ రిహాబిలిటేషన్ యాక్టు 1995లో తెచ్చింది. దీని ప్రకారం జనవరి 1995 ముందర ముంబైలో నివసిస్తున్నట్టు కార్పొరేషన్ అధికారుల దగ్గర సర్టిఫికేట్ తెచ్చుకుంటే, వారికి పునరావాసాన్ని రాష్ట్ర ప్రభుత్వమే కల్పిస్తుంది. పేవ్‌మెంట్లపై నివసించే వారికి సైతం ఈ చట్టం ప్రకారం పక్కా ఇళ్లు నిర్మించాలి. ఈ చట్టం ప్రకారం 20 వేల మందికి పక్కా ఇళ్లను మహారాష్ట్ర ప్రభుత్వం నిర్మించి ఇచ్చింది. ఇది ముంబైలోని మొత్తం మురికివాడల జనాభాలో 5 శాతం మాత్రమే.

ముఖ్యంగా పేవ్‌మెంట్ నివాసితులందరూ క్రిమినల్స్‌గా ప్రచారం చేయడంలో ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం ఉత్సాహం చూపిస్తుంది. నిజానికి రోజువారీ పట్టణ ఆర్థిక వ్యాపారంలో మురికివాడ, ఫుట్‌పాత్ పేద ప్రజలు ప్రముఖ పాత్ర వహిస్తారు. యూరప్ సమాజం ఇప్పుడిప్పుడే మురికివాడల ప్రజలకు ఇళ్లు కట్టించే ప్రక్రియతో పెద్ద ఎత్తున రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తోంది. మార్కెట్ ధరకే ఇళ్లు అనే పేరుమీద పేదల దగ్గరే ఆ సొమ్మును విడతల వారీగా సేకరిస్తోంది. ఐరాస డిక్లరేషన్ 1976లోను, ఇస్తాంబుల్ డిక్లరేషన్ 1996లోను భారత్ సంతకం చేసింది. దీని ప్రకారం ఇళ్లు లేని మురికివాడల ప్రజలకు పునరావాసం కల్పించాలి. మురికివాడల ప్రజలు 20 శాతం నెలవారీ సంపాదనతోనే ప్రభుత్వం వారికి ఇళ్లు కట్టివ్వచ్చుని నేషనల్ హౌసింగ్ బ్యాంక్ (పలుడ్కో) అనేక రకాల ఇళ్ల నిర్మాణ స్కీములను సైతం ప్రవేశపెట్టి పెద్ద మార్కెట్‌ను సృష్టించింది. మురికివాడకు సంబంధించి న్యాయస్థానాలు చాలా సందర్భాల్లో వారికి పునరావాసాన్ని కల్పించాలని తీర్పు చెప్పాయి. వారు ప్రజలేనని రాజ్యాంగంలోని అన్ని ప్రాథమిక హక్కులు వారికి వర్తిస్తాయని, వారికి పునరావాసాన్ని, ఉపాధిని, వైద్యాన్ని, విద్యను, మౌలిక వసతులను కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేనని అనేక ప్రజాసంఘాలు పోరాటాలను ఉధృతం చేస్తున్నాయి. నిజానికి పెట్టుబడిదారీ వ్యవస్థకు సవాలు విసిరిన ఈ అతిపెద్ద సామాజిక సమస్యను పరిష్కరించకుండా అభివృద్ధి పేరుమీద మరిన్ని మురికివాడలను సృష్టించడం వల్ల వ్యవస్థ విధ్వంసానికి దారితీసే ప్రమాదముంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.

# ఆదివాసులకు స్వయం ప్రతిపత్తి కల్పించాలి

*పాలకులు ఆదివాసులపై పెద్దఎత్తున విధ్వంస చర్యలకు పూనుకుని, వారి జీవించే హక్కును కాలరాస్తూ, వారి మనుగడనే ప్రశ్నార్థకంగా మారుస్తున్నారనీ, వారిని కాపాడుకోవడం కోసం ప్రజాస్వామ్యవాదులందరూ పోరాటం చేయాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* **పూకె రామకృష్ణ**

ప్రపంచ వ్యాప్తంగా ఆదివాసులు నేడు తమ మనుగడ కోసం, అస్తిత్వం కోసం, ఉనికి కోసం పోరాటం చేయాల్సిన దుస్థితి నేడు సమాజంలో నెలకొని ఉంది. ఆదివాసి సమాజం నేడు తీవ్రమైన సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోంది. తరతరాలుగా దట్టమైన అడవులు, కొండలతో ఎంతో జీవరాశితో మమేకమై, వాటితో అవినాభావ సంబంధం కలిగి జీవనం గడిపిన ఆదివాసులు ప్రపంచ వ్యాప్తంగా నేడు ఏ ఖండం చూసినా, ఏ దేశం చూసినా, రాష్ట్రంలో, జిల్లాలో చూసినా తమ ఉమ్మడి, సాంస్కృతిక జీవన వ్యవస్థ వారసత్వం విధ్వంసం కాబడి, జల్, జంగల్, జమీన్ అనేది నేడు అగ్రవర్ణ, అర్ధవలస భూస్వామ్య వ్యవస్థతో, గిరిజనేతరుల వలసలతో విధ్వంసం చేయబడుతుంది. ఆదివాసుల స్వయం పాలన, హక్కు నేటికి హరించుకుపోతుంది, పోయింది. ప్రత్యేకమైన జీవనశైలి, సాంస్కృతిక, సాంప్రదాయ వారసత్వం కలిగి ఉన్న ఆదివాసులు ఈ దేశ మూల వాసులు. భారతదేశానికి అసలు వారసులు. తరతరాలుగా వలసవాద దోపిడీకి వ్యతిరేకంగా పోరాడుతూ దేశాన్ని, రాజ్యాధికారాన్ని గణనీయ భూభాగాన్ని కోల్పోయి బ్రిటిష్ కాలం నాటికి అటవీ ప్రాంతానికి పరిమితమై పోయిన అడవితల్లి ముద్దు బిడ్డలు. ఈ ప్రపంచానికి నాగరికత నేర్పిన అసలైన నాగరికులు. నేడు ఆ నాగరికతతోనే తమ అస్తిత్వం, మనుగడను కాపాడుకోవడం కోసం సాగే పోరాటంలో ఆదివాసులు బలైపోతున్నారు. సామ్రాజ్యవాద ముసుగులో జరిగే విధ్వంసక అభివృద్ధికి బలైపోతున్నారు. నేటి పాలక వర్గాలు ఆదివాసుల హక్కులు, రాజ్యాంగ పరమైన రిజర్వేషన్లు అమలు చేయడంలో తీవ్రంగా వైఫల్యం చెందాయి.

ఆదివాసుల స్వయం పాలన తిరుగుబాటుకు ఆదివాసుల సాయుధ పోరాటానికి తలొగ్గిన బ్రిటిష్ పాలకులు ఆదివాసులను ట్రైబల్స్‌గా, ఆదివాసి ప్రాంతాలను ఏజెన్సీ ఏరియాలుగా గుర్తించి ఆదివాసుల జీవన విధానానికి ఇబ్బందులు కలగని విధంగా పాలనా సాగేందుకు ప్రజాస్వామిక విధానాన్ని రూపొందించి బ్రిటిష్ పాలననూ ట్రైబల్ ఏరియాలో 1875లో షెడ్యూల్డ్ డిస్ట్రిక్ట్స్‌గా నియంత్రించుకున్నారు. స్వాతంత్ర్యం అనంతరం రాజ్యాంగ కమిటీ భారత ప్రభుత్వం కూడా అదే విధానాన్ని రాజ్యాంగ బద్ధం చేసి దేశ వ్యాప్తంగా ఆదివాసులకు 5వ, 6వ షెడ్యూల్డ్ ప్రకారం ఆదివాసి ప్రాంతాల రక్షణ చట్టాలు, పాలన విధానాలు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ నేపథ్యంలో ఆదివాసి భూభాగం గోండ్వానా భూభాగాన్ని ఆనాడు ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాల్సి ఉండగా ఆ ప్రయత్నం నాటి పాలకులు చేయాల్సి ఉండగా నాటి, నేటి అగ్రవర్ణ భూస్వామ్య అర్ధవలస భావజాలంతో ఆగిపోయింది. పైగా భాషా ప్రయుక్త రాష్ట్రాల పేరిట 5వ షెడ్యూల్డ్ భూభాగాన్ని ముక్కలు చెక్కలుగా చేసి వివిధ రాష్ట్రాల్లో ఒడిశా, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రల్లో విలీనం చేసి ఆదివాసులను పంచుకున్నారు. ఇదే సాంప్రదాయం నేటి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటులో కూడా మనం చూశాం. దేశంలో అత్యధిక ఆదివాసి జనాభా కలిగిన ప్రాచీన సంస్కృతి, భాషలు, నాగరికత ఉన్న ప్రాంతాల్లో ఒకటైన భద్రాచలం ఏజెన్సీ ఏరియా విఆర్ పురం, కూనవరం, చింతూర్, వేలేర్‌పాడు, కుక్కునూర్ ప్రాంతాలను పోలవరం పేరుతో ఆదివాసులను జల సమాధి చేస్తున్నారు. మరోవైపు కంతనపల్లి ప్రాజెక్టు, కవ్వాల్ ప్రాజెక్టు, టైగర్ జోన్ ప్రాజెక్టులు సింగరేణి ఓసిల ద్వారా ఆదివాసులను నిర్వాసితులను చేస్తూ ఆదివాసుల సమాధులపై అభివృద్ధి ప్రాజెక్టులు కడుతున్నారు. ఆదివాసులపై నాడు తెల్ల దొరలకు ఉన్న మానవ దృక్పథం కూడా నేడు నల్ల దొరలకు లేదు. కాని నేడు వాస్తవంగా ఆలోచిస్తే అభివృద్ధి ముసుగులో ఆదివాసి సమాజం అంతం కాబోతుంది.

ప్రస్తుతం పాలక వర్గాలు అనుసరిస్తున్న 'అభివృద్ధి మార్క్' సామ్రాజ్యవాదులకు దోచిపెట్టేదిగా ఉంది. ఓపెన్ కాస్ట్ మైనింగ్ పాలసిని గతంలో వ్యతిరేకించిన టిఆర్ఎస్ పార్టీ ఇప్పుడు అభివృద్ధికి అవసరమంటుంది. ఆదివాసులకు సంబంధించిన జీవనాధారమైన భూములను హరితహారం పేరిట తీసుకుని మొక్కలు నాటుతూ ఆదివాసుల జీవించే హక్కును హరిస్తున్నారు. కొమురం భీం స్ఫూర్తిని కొనసాగించాలని చెపుతూనే, ఆదివాసి వ్యతిరేక విధానాలను అవలంబిస్తున్నారు. ఆదివాసులను నాశనం చేస్తున్నారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడవ దశ దాడులను వేగవంతం చేస్తూ ఆదివాసి ప్రజల్ని అడవుల నుండి వెళ్లగొడుతున్నారు. ఈ దాడులను, అణచివేత విధానాలను వ్యతిరేకిస్తున్నందుకు ఆదివాసుల ప్రజలపై ఎన్‌కౌంటర్ హత్యలు, జైలు నిర్బంధాలు, లాఠీ చార్జీలు నిత్యకృత్యమైనాయి. అడవి జంతువులను, అడవిని కొల్లగొడుతున్నారనే సాకుతో మహబూబ్‌నగర్ చెంచు పంటలను మైదాన ప్రాంతాలకు తరలించడానికి కుట్రలు పన్నింది తెలంగాణ ప్రభుత్వం. చెంచు, కొండరెడ్డి ఆదివాసి తెగలు అంతరించి పోతుంటే మరోవైపు తెలంగాణ ప్రభుత్వం షెడ్యూల్డ్ తెగలో ఇతర అగ్ర కులాలను కలుపుతూ ఆదివాసులను నిర్వీర్యం చేస్తున్నది. బంగారు తెలంగాణ లక్ష్యంతో ఏర్పడిన టిఆర్ఎస్ ప్రభుత్వం బంగారు తెలంగాణ పక్కన పెట్టి లంబాడా తెలంగాణ నిర్మించుకుంటూ ఆదివాసులకు దక్కాల్సిన రాజ్యాంగ ఫలాలు లంబాడీలకు దోచిపెడుతోంది. ఈ ఉమ్మడి రాష్ట్రం 1976లో ఎస్‌టి జాబితాలో అక్రమంగా కలపబడిన లంబాడీలు నేడు అన్ని రంగాల్లో ఆదివాసులను అణగదొక్కారు. లంబాడీలు నిజంగా ఎస్‌టిలు కాదు.

వారు రాజ్యాంగ బద్ధంగా ఎస్‌టిలుగా గుర్తింపు పొందలేదు. కాబట్టి లంబాడీలకు ఎస్‌టి రిజర్వేషన్ రద్దు చేయాలని, వారిని ఎస్‌టి జాబితా నుండి తొలగించాలని దశాబ్ద కాలానికి పైగా ఆదివాసి సంఘాలు ఉద్యమాలు చేస్తున్నాయి. ఇది గమనించిన లంబాడీలు ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి రాజ్యాంగ బద్ధంగా ఎస్‌టిలుగా గుర్తింపు పొందాలని కుట్రలు పన్నుతున్నారు. ఇందులో భాగంగానే తెలంగాణ ప్రభుత్వం జస్టిస్ చెల్లప్ప కమిషన్ ద్వారా బోయి, వాల్మికి, ఐతా లంబాడీలు ఎస్‌టిలు గుర్తించే ప్రయత్నం చేస్తున్నది. 1976లో లంబాడీ, యానాది, ఎరుకుల కులాలు ఓటు బ్యాంకు కోసం ఎస్‌టిలలో కలిపారు. 1976లో 1,32,000 ఉన్న లంబాడీలు ఈ రోజు 50 లక్షల పైనే ఉన్నారు. మహారాష్ట్రలో బిసి, రాజస్థాన్‌లో ఒసి, కర్ణాటకలో ఎస్‌సిలుగా చెలామణి అవుతున్నారు. భవిష్యత్‌లో తెలంగాణలో కూడా తెలంగాణ ప్రభుత్వం ఓటు బ్యాంకు రాజకీయాలకు పెద్ద పీట వేసి ఆదివాసులను అణగదొక్కదనే గ్యారంటీ లేదు. ఆంధ్ర ప్రాంత వాసులు విద్య, ఉపాధి, ఉద్యోగ రంగాలలో తెలంగాణ ప్రాంతం వారిని ఏ విధంగా దోచుకు తిన్నారో, ఏ విధంగా వలసలు వచ్చి ఆధిపత్యం చెలాయిస్తున్నారో అంతకంటే వంద రెట్లు ఎక్కువగా తెలంగాణకు లంబాడీలు వలసలు వచ్చి ఆదివాసులపై ఆధిపత్యం చలాయిస్తున్నారు. డినోటిపై ట్రైబ్స్‌గా కొనసాగుతున్న లంబాడీలు ఆదివాసులుగా ఆధిపత్యం చెలాయిస్తున్నారు. లంబాడీలు మొదటగా ఆదివాసుల రాష్ట్రాన్ని వ్యతిరేకిస్తున్నారు. 610 జిఒ ప్రకారం ఆంధ్ర ప్రాంత వలసలను వ్యతిరేకించిన తెలంగాణ వాదులు ఆదివాసి ప్రాంతాలకు లంబాడీలు వలసలు వస్తుంటే ఎందుకు వ్యతిరేకించట్లేదు? ఆంధ్ర ప్రాంతానికి వర్తించే 610 జిఒ వలస లంబాడీలకు వర్తించదా? ఈ వలసలపై మేధావులు ఎందుకు నోరు మెదపడం లేదు?

2005లో నక్కల, పిట్టల వారిని కలిపి, 2009న వాల్మికి, రజక, బోయలను కలపాలని కుట్రలు పన్నుతూ ఆదివాసులను సర్వనాశనం చేస్తున్నారు. ఆదివాసి తెగలైన కొండరెడ్డి, చెంచు, కులియా, బిల్ తెగలు అంతరిస్తుంటే పట్టించుకోని నేటి పాలక వర్గాలు రాజ్యాంగ నిబంధనలు పాటించకుండా కులాలను తెగలలో కలిపి ఓటు బ్యాంకు రాజకీయాలు చేస్తూ ఆదిమ తెగలను అంతం చేస్తున్నారు. వాకపల్లి, భల్లుగూడ ఆదివాసి మహిళలపై అత్యాచారాలు జరిగి నేటికి ఎనిమిది సంవత్సరాలు అవుతున్నా నిందితులు ఎవరో ఇంతవరకూ తేల్చలేని ప్రజాస్వామిక వ్యవస్థ మనది. ఆదివాసి మహిళలపై అత్యాచారాలు చేసిన గిరిజనేతర రాజకీయ ప్రోద్బలంతో తుంగలో తొక్కబడుతున్నాయి. ఆదివాసుల చట్టాలు ఉన్నోడికి చుట్టాలుగా మారుతున్నాయి. ఆదివాసుల చట్టాలు ఏనాడు నేటి పాలక వర్గాలు అమలు చేసిన పాపాన పోలేదు. 1/70 చట్టం, పీసా చట్టం, అటవీ హక్కుల చట్టం, జిఒ నెం-3, మాడా చట్టం, తదితర చట్టాలు ఉన్నాయి. భారత రాజ్యాంగంలో 5వ షెడ్యూల్డ్, 6వ షెడ్యూల్డ్ ఉన్నాయి. ఆదివాసుల చట్టాలకు రాష్ట్రంలో గవర్నర్, దేశంలో రాష్ట్రపతి అధిపతులుగా ఉంటున్నారు. కాని నేడు ఆదివాసుల చట్టాలు, సంస్కృతి ధ్వంసం అవుతున్నా ఏనాడు గవర్నర్లు, రాష్ట్రపతులు పట్టించుకోలేదు. ఆదివాసి ప్రాంతాలలో ఏనాడూ పర్యటనలు చేయలేదు. ఆదివాసి సమస్యలపై, ఆదివాసుల జీవన విధానంపై ఏనాడు గవర్నర్లు, రాష్ట్రపతులు సమీక్ష చేయలేదు. ఈ పరిస్థితులన్నీ పరిగణలోకి తీసుకుంటే తెలంగాణ రాష్ట్రం ఆదివాసులకు శాపంగా మారిందని చెప్పవచ్చు. భాషా ప్రయుక్తం రాష్ట్రాలు (1956) వలన దేశంలోని ఆదిమ జాతి తెగల ప్రాంతాల వారిగా మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, ఒడిశా రాష్ట్రాలలో విచ్ఛిన్నం కావడం వలన ఆదివాసుల హక్కులు, సంస్కృతి, సాంప్రదాయాలు, భాషలు ఆయా నాటి పాలక వర్గాలు పరిశీలనలోకి తీసుకోలేదు. దానితో ఆదివాసులు బాహ్య ప్రపంచానికి దూరమైనారు. 6వ షెడ్యూల్డ్ ప్రాంతంలో ఉన్న ఆదివాసులు ఉమ్మడిగా స్వయం ప్రతిపత్తిలో సహజీవనం చేస్తుంటే, 5వ షెడ్యూల్డ్ ప్రాంతాలు పరాయి పాలనలో మగ్గుతూ మనుగడ కోల్పోతున్నారు. ఈ విధంగా ఆదివాసుల పోరాట ఫలితంగా ఏజెన్సీ భూభాగాన్ని అభివృద్ధి పేరుతో ప్రత్యేక రాష్ట్రాల పేరిట, ప్రాజెక్టుల పేరిట, పరిశ్రమల పేరిట, వన్యప్రాణి టైగర్ జోన్ సంరక్షణ పేరిట చీల్చి ఆదివాసులను విచ్ఛిన్నం చేసి ఆదివాసుల మధ్య ఐక్యతను దెబ్బతీసి ఏజెన్సీ ప్రాంత అపార ఖనిజ సంపదను దోచుకోవడం కోసం అలాగే వెనకబాటు తనం పేరిట ఏజెన్సీ రిజర్వేషన్ ఫలాలనూ ఇతరులకు దోచిపెట్టడం కోసం నేటి పాలక వర్గాలు కుట్రలు పన్నుతున్నాయి. స్వార్థపూరిత రాజకీయ ప్రభుత్వాల చెరలో ఆదివాసుల చట్టాలు నిర్వీర్యం అయిపోతున్నాయి. ఆదివాసులను ప్రకృతి నుండి విడదీసి అడవులను నాశనం చేసి 'సరుకులుగా' మార్చే కుతంత్రానికి ప్రపంచీకరణ తోడయింది. రాచరికపు మహా సామ్రాజ్యాలు కూడా ఆదివాసుల విషయంలో చేయనంత విధ్వంసాన్ని ఓపెన్ కాస్ట్‌ల పేరిట, సామ్రాజ్యవాద అభివృద్ధి పేరిట నేటి పాలకులు చేస్తున్నారు. పర్యావరణం చెడిపోయి కలుషిత వాతావరణం ఏర్పడి నష్టపోతున్నది ఆదివాసులే. దోమకాటు, మలేరియా, కలరా, డెంగ్యూ, టైఫాయిడ్, అతిసారా, అత్యాచారాలకు బలవుతున్నది ఆదివాసులే. వారి భాషకు గుర్తింపు లేదు. వారి ప్రాణాలకు విలువ లేదు. వారి చరిత్రకు విలువ లేదు. ఇది ఘనత వహించిన భారత ప్రజాస్వామ్యం గొప్పగా చెప్పుకునే గత వర్తమాన వైభవం.

ఈ నేపథ్యంలో ఆదివాసులకు ప్రత్యేక స్వయం ప్రతిపత్తి కల్పించి, ఆదివాసుల హక్కులను కాపాడాలి. ఆదివాసుల అస్తిత్వం కోసం ఆదివాసి పోరాట యోధులు కొమురం భీం, ఘంటందొర, మల్లుదొర, భీర్సాముండా పోరాట వారసత్వాన్ని పుణికి పుచ్చుకుని ఆదివాసులందరూ మిలిటెంట్ ఉద్యమాలకు సిద్ధం కావాలి.

**ఆదివాసుల డిమాండ్స్**

1) పోలవరం, కంతనపల్లి ప్రాజెక్టులు రద్దు చేయాలి; 2) ఆదివాసుల చట్టాలు, సంస్కృతిని పరిరక్షించాలి; 3) తెలుగు రాష్ట్రాల్లో నాన్ షెడ్యూల్డ్ గ్రామాలుగా ఉన్న ఆదివాసి గ్రామాలను షెడ్యూల్డ్ గ్రామాలుగా ప్రకటించాలి; 4) ఎస్‌టి జాబితా నుండి లంబాడీలను తొలగించాలి; 5) షెడ్యూల్డ్ గ్రామాల్లో, ఏరియాల్లో ఆదివాసుల స్థితిగతులపై రాష్ట్రపతి, గవర్నర్‌ల పర్యవేక్షణ జరగాలి; 6) చెంచులను మైదాన ప్రాంతాలకు తరలించడాన్ని విరమించుకోవాలి; 7) ఐటిడిఎలో, గిరిజన సంక్షేమ శాఖలో అటెండర్ నుండి ఐఎఎస్ వరకూ ఆదివాసులనే నియమించాలి; 8) ఆదివాసి ప్రాంతాలకు ప్రత్యేక కౌన్సిల్, ప్రత్యేక ఆదివాసి జిల్లాలు ఏర్పాటు చేయాలి.

*(రచయిత తెలంగాణ ఆదివాసి రచయితల సంఘం అధ్యక్షులు)* వీ

# అలుపెరుగని విప్లవ యోధుడు యాకొవ్ స్వెర్డ్‌లోవ్

*బోల్షివిక్ పార్టీ నాయకుడు, విప్లవానంతర రాజ్యాంగ నిర్మాత స్వెర్డ్‌లోవ్ జీవితాన్నీ, కార్యాచరణనూ వివరిస్తున్నారు*

**ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

**బో**ల్షివిక్ పార్టీ అగ్రశేణి నాయకుల్లో యాకొవ్ స్వెర్డ్‌లోవ్ ఒకడు. లెనిన్‌కు అత్యంత సన్నిహితునిగా ఉన్న ఇతడు, తన చిన్నతనంలోనే (16వ సంవత్సరంలో) బోల్షివిక్ పార్టీలో చేరి, తన విప్లవ జీవితాన్ని ఆరంభించాడు. పార్టీ క్లిష్ట పరిస్థితుల్లో ఉన్న 1917 జూన్, జూలై నెలల్లో కార్మిక, నావిక, సైనికుల సాయుధ ప్రదర్శనను అత్యంత క్రమశిక్షణతో నిర్వహించడంలో ప్రధాన బాధ్యత ఇతడిదేనని చెప్పవచ్చు. ప్రదర్శనల అనంతరం, పార్టీ అగ్రశేణి నాయకులంతా అరెస్టవ్వడమో, అజ్ఞాతంలోకి వెళ్లడమో జరిగినప్పుడు, పార్టీని విచ్ఛిన్నం కాకుండా కాపాడడమేకాక, పార్టీ ఆర్గనైజర్‌గా దాన్ని ఏకోన్ముఖంగా నడిపించిన అత్యంత ప్రతిభా వంతుడు స్వెర్డ్‌లోవ్. అక్టోబర్ విప్లవ కాలంలో సైనిక విప్లవ కమిటీ సభ్యునిగా తీవ్ర కృషిచేసి, విప్లవ విజయం తర్వాత, అఖిల రష్యా సోవియట్ల కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికై, దాని పదవీరీత్యా సోషలిస్టు రష్యా దేశానికి మొదటి అధ్యక్షుడయ్యాడు. ఒకపక్క దేశాధ్యక్షునిగా పనిచేస్తూనే, మరోపక్క పార్టీ ఆర్గనైజర్ ఉన్నతమైన సేవలందించి, శిశు ప్రాయంగా ఉన్న విప్లవ ప్రభుత్వానికి అవసరమైన సోషలిస్టు రాజ్య యంత్రానికి కావలసిన పనిముట్లను అందించడంలో ముఖ్యపాత్ర వహించాడు.

సోషలిస్టు రష్యా రాజ్యాంగాన్ని రాసిన స్వెర్డ్‌లోవ్ విప్లవ ప్రభుత్వపు తొలి రోజుల్లో పార్టీనీ, దేశాన్నీ నడిపించడంలో అవిశ్రాంత కృషి జరిపాడు. తన అమిత ప్రతిభతో పార్టీ ఆర్గనైజర్‌గా ఉన్నత కృషి జరుపుతూనే, పార్టీకి ప్రాణసముడైన లెనిన్ జీవితం ప్రమాదాల్లో చిక్కుకున్న ఎన్నో సందర్భాల్లో, ఆయన ప్రమాదాల బారిన పడకుండా రక్షించాడు. (అలాంటి ఒకానొక సందర్భాన్ని (జూలై 5, 1917) లెనిన్ సోదరి మరీయ ఉల్యానొవ స్వయంగా తన జ్ఞాపకాల్లో పేర్కొనడం జరిగింది) దేశాధ్యక్షునిగా తను పనిచేస్తున్నప్పటికీ, లెనిన్‌ను (అపుడు లెనిన్ ప్రధానిగా పనిచేస్తున్నాడు) తన గురువుగా గౌరవిస్తూ, ఏమాత్రం ఆధిక్యాన్ని చూపకుండా తన కృషిని కొనసాగించాడు స్వెర్డ్‌లోవ్. ఆ రోజుల్లో వీరిద్దరి సమన్వయ కృషి ఎలా ఉండేదంటే, సైద్ధాంతిక మార్గదర్శకత్వం లెనిన్ చేస్తే, ఆచరణాత్మక కృషి స్వెర్డ్‌లోవ్ చేసేవాడు. విప్లవ ప్రభుత్వానికీ, విప్లవ పార్టీకీ ఏమాత్రం హాని జరగకుండా వెయ్యి కళ్లతో కాపలా కాసిన స్వెర్డ్‌లోవ్, తన అమిత కృషి, ఏమాత్రం విశ్రాంతి తీసుకోక పనిచేయడం వల్లనే, అత్యంత చిన్న వయస్సులోనే, కేవలం 34 సంవత్సరాల వయస్సులోనే, ఉజ్వల భవిష్యత్తు ఎదురుచూస్తుండగానే పార్టీనీ, శ్రామిక ప్రజల్నీ దుఃఖసాగరంలో ముంచి మరణించాడు. స్వెర్డ్‌లోవ్ మరణం ఏ ఒక్కరికన్నా లెనిన్‌నే ఎక్కువ విచారంలో ముంచెత్తింది. (ఆ సందర్భంగా లెనిన్ ఇచ్చిన సుదీర్ఘ ఉపన్యాసం ఈ కింది వ్యాసంలో ఇవ్వబడింది) అత్యంత వివాదరహితుడైన స్వెర్డ్‌లోవ్ తన విశేష ప్రతిభ ద్వారా పార్టీ నాయకులందరి మన్ననను పొందినవాడు. ఆ విధంగానే మరణించాడు.

కానీ, లెనిన్ మరణం తర్వాత, స్టాలిన్‌తో అభిప్రాయ భేదాలేర్పడినప్పుడు, ట్రాట్స్కీ దుర్బుద్ధితో స్వెర్డ్‌లోవ్‌తో స్టాలిన్‌ని పోలుస్తూ, అధఃకరిస్తూ, రాసిన రాతలవల్ల స్వెర్డ్‌లోవ్‌ని వివాదాస్పదునిగా కొందరు భావిస్తున్నారు గానీ, అది సరికాదు. స్వెర్డ్‌లోవ్ బతికే ఉంటే ఏమై ఉండేవాడు? బహుశా రష్యా పాలకునిగా అతడే అధికారం నెరపేవాడా అని కొందరు ఊహించేందుకు ప్రయత్నించారు గానీ, అలా ఊహించడం చరిత్రకు జోతిష్యాన్ని జమ చేయడమే అవుతుంది తప్ప, వేరుకాదు. స్వెర్డ్‌లోవ్ జరిపిన కృషివేరు, స్టాలిన్ జరిపిన కృషివేరు. ఇద్దరూ వేర్వేరు రంగాలలో కృషి చేశారు. ఎవరి ప్రతిభ వారిది. అంచేత ఈ ఇద్దరినీ సరిపోల్చడం సరికాదు. ఏమైనా ట్రాట్స్కీ దురుద్దేశంతో చేసిన పోలిక వల్ల కావచ్చు, నేడు చాలా మంది విప్లవాభిమానులకు స్వెర్డ్‌లోవ్ గురించిన సమాచారం తెలియకుండా ఉంది. బోల్షివిక్ విప్లవం (అక్టోబర్ విప్లవం) విజయం సాధించి వంద సంవత్సరాలు అవుతున్న సందర్భంగా, ఆ విప్లవంలో పాల్గొన్న మిగిలిన నాయకుల గురించీ, ప్రముఖ కార్యకర్తల గురించీ వివరాలు తెలుసుకోవలసిన అవసరముంది. అందులో భాగంగానే స్వెర్డ్‌లోవ్ గురించిన విశేషాలను పాఠకులకు తెలపాలనే అభిప్రాయంతో ఈ వ్యాసం. లెనిన్ ఇచ్చిన ఉపన్యాస అనువాదాన్ని అందించే ముందు అత్యంత ఆసక్తిని కలిగించే స్వెర్డ్‌లోవ్ జీవిత విశేషాలు కొంత వివరంగా తెలుసుకుందాం.

### స్వెర్డ్‌లోవ్ బాల్యం

నీఝ్నీ నొవొగొరొద్ పట్టణంలో యూదు దంపతులైన మిహాయ్‌లోవిచీ స్వెర్డ్‌లోవ్, ఎలిజవేత సొలొమొనోలీ అనే వారికి యాకొవ్ స్వెర్డ్‌లోవ్ 1885 మే 22 (కొత్త కేలెండర్ ప్రకారం 1885 జూన్ 3న) జన్మించాడు. తండ్రి అక్షరాలూ, డిజైన్లూ చెక్కే శిల్పి. అయితే రాజకీయాల్లో తిరుగుతూ కుటుంబాన్ని అంతగా పట్టించుకునేవాడు. ఇతడు శిల్పి అయినప్పటికీ, మరో రహస్య వృత్తి నిర్వహించేవాడు. అదేమిటంటే, అధికారిక పత్రాలకూ, స్టాంపులకూ నకిలీలు తయారు చేయడం, వాటిని విప్లవ కారులకు అందించి, వారిచ్చిన సొమ్ముతో పిల్లలను చదివించాడు. ఇతను సృష్టించిన నకిలీ పత్రాలూ, స్టాంపులూ అసలును ఖచ్చితంగా పోలి ఉండేవి. అందువల్ల వాటిని పోలీసులు ఏమాత్రం గుర్తించలేకపోయేవారు. అందువల్ల వాటిని ప్రతిదాన్నీ అసలైనవిగానే భావించేవారు. ఇంతేగాక మిహాయ్‌లోవిచ్ అక్రమ ఆయుధాలు నిల్వచేస్తూ, విప్లవ కారులకు అమ్మేవాడు. అందువల్ల అతడి ఇల్లు విప్లవ కారులు కలుసుకునే ఒక రహస్య కేంద్రంగా పనిచేసేది. తద్వారా యాకొవ్ స్వెర్డ్‌లోవ్‌కి చిన్న తనంలోనే పలువురు విప్లవ కారులతో పరిచయం లభించింది.

మిహాయ్‌లోవిచ్‌కి మొత్తం ఆరుగురు సంతానం. ఇద్దరు అమ్మాయిలు సోఫియా, సారా అనేవాళ్లు. నలుగురు కొడుకులు జినోవీ, యాకోవ్, వెనియమిన్, లెవ్ అనేవాళ్లు. 1900 సంవత్సరంలో భార్య చనిపోవడంతో, మిహాయ్‌లోవిచ్ తన కుటుంబాన్ని రష్యన్ ప్రాచీన చర్చి సంప్రదాయంలోకి మార్చి, మలియా అలెక్సాంద్రోవ్నా కోర్మిల్‌త్సెవ్ అనే ఆమెను వివాహమాడాడు. తద్వారా హెర్మన్, అలెక్సాండ్ర్ అనే మరో ఇద్దరు కొడుకులకు తండ్రి అయ్యాడు. పెద్ద కొడుకు జినోవీని ప్రముఖ రచయిత మక్సీమ్‌గోర్కీ దత్తత తీసుకున్నాడు. గోర్కీ వారింటికి తరచు అతిథిగా వస్తూ, ఈ దత్తత చేపట్టాడు.

**విప్లవ విద్యార్థి**

స్వెర్ద్‌లోవ్‌కి 10 సంవత్సరాల వయసులో 1896 ఏప్రిల్‌లో తండ్రి అతన్ని నీఝ్నినొవొగొరొద్‌లో గల ప్రాంతీయ జిమ్నాజియంలో చేర్పించాడు. (జిమ్నాజియంలో మొత్తం 8 తరగతులుంటాయి. ప్రవేశ పరీక్షల్లో ఉత్తీర్ణులైనవారినే ఇందులో చేర్చుకుంటారు. జిమ్నాజియంలో ఉత్తీర్ణులైన వారిని విశ్వవిద్యాలయంలో డిగ్రీ తరగతుల్లో చేర్చుకుంటారు) ఉపాధ్యాయులతో అతనికి సరైన సంబంధాలు ఉండేవి కావు. స్కూలు నిబంధనల్ని స్వెర్ద్‌లోవ్ తీవ్రంగా వ్యతిరేకించేవాడు. దాంతో పలువురు ఉపాధ్యాయులు అతడిపట్ల కోపాన్ని వెళ్లగక్కేవారు. వ్యతిరేకత తీవ్రంగా పెరిగిపోవడంతో వారు విసుగుచెంది, ఐదు తరగతుల తర్వాత అతన్ని స్కూలు నుంచి బహిష్కరించారు.

ఆ కౌమార దశలోనే స్వెర్ద్‌లోవ్ తన శక్తి యుక్తులన్నింటినీ శ్రామిక ప్రజల హక్కుల్ని సమర్థించడానికే అంకితం చేయాలన్న నిశ్చయానికి వచ్చాడు. స్కూలు నుంచి బహిష్కరించబడ్డాక స్వెర్ద్‌లోవ్ ఒక రసాయనాలు అమ్మే షాపులో అప్రెంటిస్‌గా పని నేర్చుకునేందుకు చేరాడు. ఆ షాపు నీఝ్ని నొవొగొరొద్ నగరం దగ్గర్లోగల 'కనాలినా' అనే పట్టణ ప్రాంతం. ఆ పట్టణంలోనే ఒక అతిపెద్ద ఫర్నీచర్ తయారు చేసే కార్ఖానా ఉంది. అందులో పెద్ద సంఖ్యలో పనివాళ్లు పని చేస్తుంటారు. ఆ కార్మికులతో సంబంధాలలోకి వచ్చిన స్వెర్ద్‌లోవ్, వారి నుండి, వారు చేసే రోజువారీ శ్రమలోని తీవ్ర ఇబ్బందుల్ని గురించిన కథనాల్లో పాలుపంచుకునేవాడు. అదే కాలంలో స్వెర్ద్‌లోవ్ తన తీరిక సమయాల్ని ఎక్కువగా ముసలివాడైన ఒక నరోద్నిక్ మాజీ విప్లవ కారుడు నడిపే పుస్తకాల షాపులో గడిపేవాడు. అక్కడ ప్రముఖ విప్లవ కారుడూ, రచయితా అయిన అలెక్సాండ్ర్ హెర్జిన్ రాసిన పుస్తకాలూ, గోర్కీ రచనలూ చదివి, నాటి జార్‌ల నిరంకుశ పరిపాలనా వివరాలు తెలుసుకున్నాడు. ఈ విధంగా విప్లవ భావాల్ని సంతరించుకున్న స్వెర్ద్‌లోవ్ తన ఆలోచనల్ని తండ్రికి చెప్పేవాడు.

**విప్లవ కారునిగా**

స్వెర్ద్‌లోవ్ తన 16వ ఏట 1901లో సోషల్ డెమొక్రటిక్ కార్మిక సంఘంలో చేరి, నీఝ్ని నొవొగొరొద్ నగరంలో తొలిసారి ఏర్పడ్డ రహస్య కమిటీ ఏర్పాటులో పాలు పంచుకున్నాడు. అంతేగాక, పార్టీ నిధిని సేకరించడంలో, రహస్య ప్రచురణా యంత్రాన్ని ఏర్పాటు చేయడంలో ప్రముఖ పాత్ర వహించాడు. కొద్ది కాలంలోనే అతడు రహస్యోద్యమంలో ప్రముఖుడై, అధ్యయన గ్రూపుల నిర్వహణలోనూ, ప్రచార సాహిత్యాన్ని ప్రచురించడంలోనూ, లండన్, జెనీవా మొదలైన విదేశీ కేంద్రాల నుంచి సోషల్ డెమొక్రసీకి సంబంధించిన ప్రచురణలను రహస్య మార్గాల ద్వారా తెప్పించడంలోనూ ఆరితేరాడు.

1903లో పార్టీలో మితవాద మెన్సివిక్కులకూ, విప్లవకర బోల్షివిక్కులకూ మధ్య చీలిక వచ్చినప్పుడు, స్వెర్ద్‌లోవ్ బోల్షివిక్ ఫాక్షన్‌లో చేరాడు. అటుపై దేశంలోని సోషల్ డెమొక్రాట్లను ఏకం చేసి, దేశ వ్యాప్త విప్లవ పార్టీని ఏర్పరచి, దానికొక కనీస ఉమ్మడి కార్యక్రమాన్ని, క్రమం తప్పని ప్రచురణలనూ ఏర్పాటు చేయడంలో, రహస్య కార్యక్రమాల్ని నిర్వహించడానికి కావలసిన విభిన్న ఏర్పాట్లు చేయడం వగైరాల్లో లెనిన్‌తో చర్చించి, ఆయన అభిప్రాయాలతో ఏకీభవించాడు. ఇక అప్పట్నుంచీ తన మరణం దాకా, మిక్కిలి తీవ్రమైన సంతోషంతో వ్లదీమిర్ ఇల్యీచ్ లెనిన్‌ని సమర్థించసాగాడు.

పార్టీ పనికోసం స్వెర్ద్‌లోవ్ మొదట కజ్నాన్‌కు, ఆ తర్వాత ఉరాత్సకు వెళ్లి, రహస్య కమిటీల్ని నిర్వహించాడు. 1905 విప్లవం నాటికి 'శ్రామిక సహాయకుల సోవియట్' ఆ ప్రాంతంలో అకస్మాత్తుగా తలెత్తడానికి కారకుడయ్యాడు. అంతేగాక ఆ కాలంలో పార్టీ తరపున బహిరంగ వేదికలపై ఉపన్యాసకునిగా కూడా అతడు తన సామర్థ్యాన్ని నిరూపించుకున్నాడు. అదే సంవత్సరంలో అతడి భార్య 'ఎలిజవేత స్మిజ్'కు 'ఎలీనా' అనే కుమార్తె జన్మించింది.

1906లో తన చట్ట వ్యతిరేక కార్యక్రమాలకు గాను స్వెర్ద్‌లోవ్ మొట్ట మొదటిసారిగా అరెస్టయ్యాడు. 1906 నుంచి 1917 దాకా గల మధ్య కాలంలో ఎక్కువ భాగం అతడు జైల్లోనైనా ఉన్నాడు. లేదా ప్రవాస శిక్షనైనా అనుభవించాడు. అరెస్టయిన ప్రతిసారీ తప్పించుకున్నాడు. ఆ విధంగా అతడు ఆ కాలంలో మొత్తం 14 సార్లు అరెస్టయ్యాడు. తాను ఎక్కడున్నా శ్రామిక వర్గ రాజకీయాలతో తన సంబంధాల్ని కొనసాగిస్తూ, రష్యన్ విప్లవం కోసం అహర్నిశలూ శ్రమించాడు, తపించాడు. వివిధ జైళ్ల నుంచి తప్పించుకునే క్రమంలోనే స్వెర్ద్‌లోవ్ ఒకసారి, తన మొదటి భార్యతో విడిపోవడమో, మరేమి జరిగిందో తెలీదుగానీ, రెండో భార్య అయిన 'క్లవేదియా నోవ్‌గొరొర్‌త్సేవా'ను వివాహమాడాడు. ఈ వివాహం ద్వారా అతడికి ఇద్దరు పిల్లలు కలిగారు.

ఈ నిర్బంధ కాలంలోనే రష్యన్ కార్మికులు తమ సమ్మె పరంపరల ద్వారా బహిరంగంగా పనిచేసే అవకాశాన్ని గెలుచుకున్న క్రమంలో, 1912లో 'లేనా' గని కార్మికుల సమ్మెపై గుర్రపు దళాలతో పెద్ద పెట్టున సాగిన హత్యాకాండ అనంతరం జరిగిన సమ్మెల సమయంలో, స్వెర్ద్‌లోవ్ పార్టీ పత్రిక అయిన 'ప్రావ్ద'కు సంపాదకునిగా కీలక బాధ్యతలు నిర్వర్తించాడు. ఆపై 1912లో జైల్లోంచి తప్పించుకున్న సమయంలో స్వెర్ద్‌లోవ్ పెట్రోగ్రాడ్‌కు వెళ్లినప్పుడు సెంట్రల్ కమిటీలోనికి ఎన్నికయ్యాడు. 1913లో స్వెర్ద్‌లోవ్ అనుపానులు తెలుసుకున్న పోలీసులు ఏజెంటైన రొమాన్ మలినోవ్‌స్కీ అతన్ని అరెస్ట్ చేయడంతో, స్వెర్ద్‌లోవ్ సుదూర సైబీరియా ప్రాంతమైన తురుహాన్‌స్కీలో ప్రవాస శిక్ష అనుభవించాల్సి వచ్చింది. అక్కడ స్వెర్ద్‌లోవ్ మూడేళ్ల పాటు, మరో ప్రవాసి అయిన జోసెఫ్ స్టాలిన్‌తో కలిసి ఒకే ఫ్లాట్‌లో ఉన్నాడు. ఈ విధంగా అతడు 1917 ఫిబ్రవరి విప్లవం దాకా శిక్షను అనుభవించిన స్వెర్ద్‌లోవ్, విప్లవానంతరం విడుదలై, రాజధాని పెట్రోగ్రాడ్‌కి తిరిగొచ్చాడు. అప్పుడతడు సామ్రాజ్యవాద యుద్ధంగా బోల్షివిక్కులచేత పిలవబడుతున్న మొదటి ప్రపంచ యుద్ధంలో రష్యా పాత్రకు వ్యతిరేకంగా సాగిస్తున్న ప్రచారకాండలో చురుకైన పాత్ర నిర్వహించాడు. ఏప్రిల్ నెలలో అతడు ఉరాల్స్‌కి వెళ్లి, ఎకతెరీన్‌బర్గ్ పట్టణంలోని పార్టీ కార్యక్రమాన్ని పర్యవేక్షించాడు.

తాత్కాలిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా జూలై 4న జరిగిన సైనికుల, నావికుల, కార్మికుల అతిపెద్ద సాయుధ ప్రదర్శనలను అత్యంత పకడ్బందీగా నిర్వహించడంలో ప్రధాన పాత్ర స్వెర్ద్‌లోవ్‌దే. అయితే ఈ ప్రదర్శనల వల్ల ప్రజలకు ఇబ్బంది కలిగిందని ఆరోపిస్తూ తాత్కాలిక ప్రభుత్వం, పార్టీ నాయకుల్ని అన్యాయంగా నిందించడమే గాక, ప్రావ్ద పత్రికపై కూడా దాడిచేసి, దాన్ని ధ్వంసం చేసింది.

అంతటితో సరిపుచ్చక, పార్టీ ప్రధాన నాయకులపై అరెస్ట్ వారెంటును కూడా జారీ చేసింది. ఆ సమయంలో లెనిన్ గనుక అరెస్ట్ అయితే, అతన్ని చంపివేయమని మిలటరీ శిక్షణ పాఠశాల విద్యార్థులకు రహస్య ఆజ్ఞల్ని జారీ చేసింది ప్రభుత్వం. లెనిన్ మీద కోర్టులో అన్యాయంగా ప్రభుత్వాన్ని కూల్చడానికి కుట్రకు పూనుకున్నాడన్న అభియోగాన్ని మోపింది. అందుకు బాధపడిన లెనిన్ కోర్టులో లొంగిపోయి విచారణ నెదుర్కోవాలని మొదట అనుకున్నాడు గాని, ఏమైనాసరే ఆయన్ని రహస్య జీవితంలోకి వెళ్లమని స్వెర్ద్‌లోవ్ పట్టుబట్టి, సకాలంలో అజ్ఞాత జీవితంలోకి పంపించి, ఆయన్ని ఇతరులు గుర్తుపట్టకుండా ఉండేందుకు తన వర్షపు కోటునిచ్చిమరీ పంపించాడు. ఆ విధంగా లెనిన్ అజ్ఞాత జీవితంలో ఉంటే, పలువురు ఇతర నాయకులు అరెస్టు పాలై జైళ్లలో ఉన్నారు. అలాంటి నిరాశాజనక వాతావరణంలో స్వెర్ద్‌లోవ్ ఒక్కడే, తన ఒంటి చేత్తో, అవిశ్రాంతంగా కృషిచేసి, పార్టీని విచ్ఛిన్నమైపోకుండా పునర్నిర్మించాడు. ఆ విధంగా జూలై రోజులకు ముందుదాకా పార్టీ జనరల్ స్టాఫ్‌లో ఒకనిగా ఉన్న స్వెర్ద్‌లోవ్, జూలై రోజుల్లో ఒక్కసారిగా వెలుగులోకి వచ్చాడు. ఆగస్టులో పార్టీ సెంట్రల్ కమిటీ ఆర్గనైజింగ్ బ్యూరో అధిపతిగా పనిచేస్తూ తన అసాధారణ నైపుణ్యంతో పార్టీకి జవ జీవాల్ని అందించాడు. పార్టీ నిర్వాహకుడు (ఆర్గనైజర్) అంటే ఇలా ఉండాలి అనేట్లుగా, ఒక అత్యంత ఉత్తమ నిర్వాహకునిగా, నిర్వాహకులకు ఒక ఉదాహరణ ప్రాయంగా స్వెర్ద్‌లోవ్ నిలిచాడు. అతడిలోగల ఈ నైపుణ్యాలను గురించి, పార్టీ మరో ప్రముఖుడూ, సోవియట్ ప్రభుత్వంలో విద్యా మంత్రిగా పనిచేసి, సోవియట్ విద్యా విధానాన్ని రూపొందించిన ప్రముఖ విద్యావేత్త అయిన లునచార్‌స్కీ, స్వెర్ద్‌లోవ్‌లో గల ఈ నైపుణ్యాలను ఒక వ్యాసంలో ఇలా వివరించాడు.

'ఆ రోజుల్లో బోల్షివిక్ కార్యకర్తలకు ఒక నమూనాగా స్వెర్ద్‌లోవ్ ఉండేవాడు. ఆ విషయంలో అతడు రెండు చెప్పుకోదగిన నైపుణ్యాలను అతడు సంపాదించాడు. ఇలాంటివి బయట కనబడవు. నా అభిప్రాయంలో ఒక్క రహస్యోద్యమంలోనే కనిపిస్తాయి. అవేమిటంటే, ఒకటి: యావత్తు పార్టీకి సంబంధించిన సమస్త విషయాలూ తెలిసి ఉండడం కాగా, రెండోది ఏమిటంటే, పదుల వేల వ్యక్తుల చేత నిర్మించబడిన పార్టీలోని ప్రతివ్యక్తి గురించీ సంపూర్ణ అవగాహన కలిగి ఉండడం! కమ్యూనిజానికి చెందిన సమస్త వ్యక్తుల జీవిత చరిత్రల నిఘంటువు అతడని చెప్పవచ్చు. ఆయా వ్యక్తుల నడవడికలోని అన్ని కోణాలు, విప్లవ కారునిగా పనిచేసేందుకు ఖచ్చితంగా సరిపోయేదీ లేనిదీ నిర్ణయించగల అసాధారణమైన, సున్నితమైన నిశిత దృష్టి అతడికి ఉంది. ఈ విషయంలో అతడు నిజమైన మనస్తత్వ శాస్త్రజ్ఞుడు. అతడెన్నడూ దేన్నీ మరచిపోడు. అతడికి ఆయా మనుషుల ఉన్నతమైన ప్రవర్తన, సాధించిన విజయాలు తెలుసు. అదే విధంగా వారి లోపాలూ, పొరపాట్లూ తెలుసు. అజ్ఞాత జీవితంలోని పార్టీ పనిద్వారా స్వెర్ద్‌లోవ్ సాధించిన మొదటి నైపుణ్యం ఇది. రెండోది నిస్సందేహమైన అతడి నిర్వహణా సామర్థ్యం. క్రమక్రమంగా, స్పష్టంగా మన విప్లవ సిద్ధాంతాలలోని సత్యానికి గుర్తింపు పెరిగే కొద్దీ, అజ్ఞాత నిర్వాహకునిగా, రోజువారీ ఆర్థిక, రాజకీయ కార్యక్రమాల్ని స్వెర్ద్‌లోవ్ అంత ఉన్నతంగా ఎలా నిర్వహించగలిగేవాడన్నది సహజంగా నేను చెప్పలేను గానీ, తన విధి నిర్వాహణలో అతను చూపిన ప్రజ్ఞ అత్యద్భుతమని మాత్రం చెప్పగలను...' (లునచార్‌స్కీ రాసిన 'వెలుగు నీడల్లో విప్లవకారుల రేఖా చిత్రాలు' నుండి)

స్వెర్ద్‌లోవ్ విప్లవపు అత్యంత సన్నిహితమైన పూర్వపు రోజుల్లో, అనగా ఆగస్టు నెల, ఆ తర్వాత ఎలా పార్టీ కోసం కృషి జరిపిందీ ట్రాట్స్కీ ఇలా రాశాడు: 'స్వెర్ద్‌లోవ్ ఉన్నత గుణగణాలు అత్యంత తీవ్రమైన క్లిష్ట సమయాల్లో కొట్టొచ్చినట్లు కనిపించేవి. ఉదాహరణకు, జూలై రోజుల తర్వాత, 1917లో, అదెప్పుడంటే, వైట్ గార్డులు పార్టీని పెట్రోగాడ్‌లో నలిపేశాక, మళ్లీ తిరిగి, 1918లో జూలై రోజుల్లో, అదెప్పుడంటే, వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు తీవ్రమైన హింసాపూరిత తిరుగుబాటు చర్యలకు పూనుకున్న తర్వాత, ఈ రెండు సందర్భాల్లోనూ ఆర్గనైజేషన్ పునర్నిర్మించాల్సిన అవసరం ఏర్పడింది. అప్పుడు సంబంధాల్ని పునరుద్ధరించడం, లేదా వాటిని అధిగమించి ఏర్పాట్లు చేసుకోవడం అవసరమైంది. అలాంటి సందర్భాల్లో వారిని పరీక్షించి, అందులో వారు బాగా కృతార్థులైతేనే సంబంధాలు కలుపుకోవడం జరగాలి. ఈ రెండు సమయాల్లోనూ స్వెర్ద్‌లోవ్ విప్లవాత్మకమైన నిశ్శబ్దంతో, సుదూర దృష్టితో వనరులను ఏర్పాటు చేయడంలో అతడి స్థానం భర్తీ చేయరాని విధంగా ఉంది' (ట్రాట్స్కీ చేత స్వెర్ద్‌లోవ్ గురించి 1925 మార్చ్ 13న రాయబడిన ఈ వ్యాసం, రష్యన్ భాషలో అధికారిక వార్షిక సంచికలో 1926లో పార్టీ చరిత్ర బ్యూరోచేత విడుదలైంది. మూలం - ఫోర్త్ ఇంటర్నేషనల్ (న్యూయార్క్) క్రాడ్ 7, నం. 11, డబ్ల్యుఎచ్‌డి నం. 72)

తన రహస్య జీవితంలో ఆంద్రేయ్, మిహాలిచ్, స్మిర్నోవ్ పెర్మ్యాకోవ్ వంటి పలు మారు పేర్లతో వ్యవహరించిన స్వెర్ద్‌లోవ్, అక్టోబర్ విప్లవానికి తగిన పథకం రూపొందించడంలో ముఖ్య భూమిక వహించాడు. అంతేగాక, అక్టోబర్ విప్లవ సమయంలో కేంద్ర కమిటీ నియమించిన సైనిక విప్లవ కమిటీలో సభ్యునిగా గొప్ప ప్రజ్ఞను కనబరిచాడు. ఇక కేంద్ర కమిటీ సమావేశాలకు లెనిన్ గైర్హాజరీలో స్వెర్ద్‌లోవే కేంద్ర కమిటీ సమావేశాలకు అధ్యక్షత వహించాడు. అంతేగాక అన్ని కీలక సమయాల్లోనూ స్వెర్ద్‌లోవ్ లెనిన్‌కు ఎన్నడూ ప్రశ్నించరాని విధంగా విధేయత ప్రదర్శించాడు.

అక్టోబర్ విప్లవ సమయంలో అఖిల రష్యా సోవియట్ల కాంగ్రెస్‌కు అధ్యక్షునిగా ఉన్న కామెనెవ్ ద్రోహపూరితంగా పార్టీకి నష్టం కలిగించే విధంగా లెనిన్ ప్రతిపాదనలపట్ల వ్యతిరేకత ప్రదర్శించినప్పుడు, అధ్యక్షునిగా అతన్ని తొలగించి, అతని స్థానంలో స్వెర్ద్‌లోవ్‌ని ఎన్నుకోవడం జరిగింది. ఆ విధంగా స్వెర్ద్‌లోవ్ అఖిల రష్యా సోవియట్ల కార్యనిర్వాహక కమిటీకి అధ్యక్షునిగా ఎన్నికై, పదవీ రీత్యా కొత్తగా ఏర్పడ్డ సోషలిస్టు ప్రభుత్వానికి తొలి అధ్యక్షునిగా బాధ్యతలు చేపట్టాడు. ఈ విధంగా పార్టీ కేంద్ర ఆర్గనైజర్‌గా విప్లవ విజయానంతరం తొలినాళ్లలో ఏర్పడ్డ సంక్షోభ పరిస్థితుల్లో కీలక బాధ్యతలు నెరవేరుస్తూనే, మరోపక్క ప్రభుత్వాధ్యక్షునిగా నవజాత సోషలిస్టు దేశానికి అవసరమైన ఏర్పాట్లు చేయడంలో లెనిన్‌కు గట్టి తోడ్పాటునందించాడు.

1917 అంతంలో 'విప్లవ కార్యక్రమ వేగం' (వర్క్ ఫ్లో ఆఫ్ రెవల్యూషన్) గా పిలువబడే కార్యక్రమం మొత్తానికి యాకొవ్ స్వెర్ద్‌లోవే పూర్తి జవాబుదారీగా ఉన్నాడు. అంతెందుకు అక్టోబర్ విప్లవ సమయంలో

కూడా విప్లవానికి ముందు విప్లవ కమిటీలోకి జరిపిన వ్యక్తుల నియామకాలకు స్వెర్డ్‌లోవే వ్యక్తిగతంగా బాధ్యత వహించాడు. విప్లవం ముగిసేదాకా తాత్కాలిక ప్రభుత్వంలోని సభ్యులపై చర్యల్ని నియంత్రించాడు. (మొదటిరోజే వారంతా వింటర్ పాలెస్‌లోని నివాసాల్లో అరెస్టయ్యారు) ఇక విప్లవ విజయానంతరం ఏర్పడ్డ నూతన ప్రభుత్వానికి అవసరమైన నియామకాలు జరపడంలో కూడా స్వెర్డ్‌లోవే పూర్తి బాధ్యత వహించాడు. పార్టీకి సంబంధించి అతడికిగల బహుళ విషయ పరిజ్ఞానం ఈ విషయంలో ఎంతైనా తోడ్పడింది. ఎందుకంటే ఈ నూతన ప్రభుత్వం ఒక పూర్తి కొత్త తరహా ప్రభుత్వం. ఇది జాతీయ సోవియట్ల అనుసంధానమే పునాదిగా గల శ్రామిక రాజ్యం నిర్మించడం కోసం ఏర్పడింది. ఆనాటి ఈ నియామకాల వ్యవహారంలో స్వెర్డ్‌లోవ్ ఎలాంటి నిర్ణయాలు తీసుకునేవాడో ట్రాట్స్కీ తన పై వ్యాసంలోనే ఈ విధంగా సవివరంగా వర్ణించాడు:

'సోవియట్ ప్రభుత్వానికి సంబంధించిన వివిధ శాఖలూ, సంస్థలూ ఏర్పాటయ్యే తొలి దశల్లో అవన్నీ తమతమ అవసరాలకు తగిన మనుషుల కోసం ఆయన వంకే చూసేవి. పార్టీ సభ్యుల్ని ప్రాథమికంగా, తాత్కాలికంగా కేటాయించిన సందర్భంలో వారంతా తమ అసాధారణ నైపుణ్యాలనూ, మేధో సంపదలనూ పరిగణనలోనికి తీసుకోవలసిందిగా ఆయన్ను ఒత్తిడి చేసేవారు. అయితే శాశ్వతంగా ఉండే ఈ యంత్రాంగాన్నీ, ఫైళ్లనూ, ప్రజా సంబంధమైన పత్రాలనూ, ఇంకా ఇలాంటి వాటినీ నిర్వహించే పనికోసం చేసే నియామకాలు ఇలాంటి ఒత్తిడితో చేయడం ఏమాత్రం కుదరదు. కానీ ఈ నియామకాలు జరపడానికి అప్పటికింకా స్పష్టంగా ఏ పద్ధతీ నిర్వచించబడింది కాదు. కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ సరాసరి నియామకాలు జరపడం కుదరదు. తగిన అభ్యర్థుల్ని వెతకడానికి, ఉదాహరణకు ప్రజా కమిస్సార్ నియామకానికి, లేదా ఇజ్వెస్తియా పత్రిక ముద్రణశాల మేనేజర్ నియామకానికి, లేదా సోవియట్ సెంట్రల్ కమిటీ సభ్యుని నియామకానికి, లేదా క్రెమ్లిన్ కమాండెంటు నియామకానికి ఇలా ఇలాంటి ఎంతోమంది అభ్యర్థుల్ని వెతకడానికి స్వెర్డ్‌లోవ్ విచారణలు జరిపేవాడు. నియామక పత్రాలిచ్చేవాడు. ఇదంతా ఏ అర్హతలతో చేసేవాడు అని అడిగితే, అదంతా కేవలం అతడికిగల సాధారణ అధికారాలతోనే. కానీ అన్ని సందర్భాల్లోనూ అత్యధిక భాగం నిర్వహించింది అతడు తన వ్యక్తిగత బాధ్యతతోనే, దానికి మద్దతు సహజంగానే వ్లదీమిర్ ఇల్యిచ్ ఇచ్చేవాడు.'

ఆరోజుల్లో కొత్తగా ఆలోచించే సృజనాత్మక ఆలోచనాపరుల అవసరం అన్నిచోట్లా ఉండేది. ఎలా అంటే అరాచక పరిస్థితులు ఉత్పన్నమైనప్పుడు, ఎలాంటి చట్టబద్ధ ఆజ్ఞలూ, నిబంధనలూ లేకుండానే వాటిని సరిచేయడం కావాలి. అన్ని రకాల పరిస్థితులనూ అర్థం చేసుకుని సరిచేసేవారి అవసరం ఎక్కువగా ఉన్న ఆ రోజుల్లో స్వెర్డ్‌లోవ్ నిరంతరం అలా ఉండడమేగాక, తన స్థానం నుంచి అన్ని ప్రమాదాలనూ జాగ్రత్తగా గమనిస్తుండేవాడు. ఆ ప్రమాదాల్ని అతడు ఎలా నివారించేవాడో, సరిచేసేవాడో ట్రాట్స్కీ వివరంగా చెప్పాడు.

'స్వెర్డ్‌లోవ్ అదేమాదిరి, తాను ఎంత గొప్పగా ఉపయోగపడగలడో, అంతగానూ చివరికంటా... ఆ రోజుల్లో ఆ ఒక్కడూ ప్రజల గురించి నిజంగా తెలిసినవాడు... నిజం చెప్పాలంటే, ఎవరితోనూ పోలికే లేనంత ఎత్తుగా – ఆత్మవిశ్వాసం, నిర్భయత్వం, దృఢత్వం, వనరుల అందుబాటు – ఈ అత్యుత్తమ బోల్షివిక్ లక్షణాలు కలిగి! సంక్లిష్టమైన ఆ నెలల్లో ఇదంతా వివరంగా, స్పష్టంగా కనిపించేది. అప్పుడు ఇదంతా గ్రహించే లెనిన్ స్వెర్డ్‌లోవ్‌ని అభినందించాడు. ఎన్నోసార్లు, అప్పటికప్పుడు వ్లదీమిర్ ఇల్యిచ్ ఫోన్ అందుకుని స్వెర్డ్‌లోవ్‌కి వరుసగా, అత్యవసర పరిస్థితికి అనుగుణమైన చర్యలు, ఫలానా అంశంలో తీసుకోవాలని సూచించేవాడు. చాలాసార్లు స్వెర్డ్‌లోవ్ నుండి ఈ విధమైన సమాధానం వచ్చేది 'ఇప్పటికే' (ఆల్‌రెడి) అని! దీనర్థం ఏమంటే, ఆ చర్యలు అప్పటికే తాను తీసుకున్నానని...'

ఇది స్వెర్డ్‌లోవ్ పనిచేసే పద్ధతి! అందువల్లనే ఎవరైనా నిర్దిష్ట సమస్య గురించి తనవద్దకు వచ్చినప్పుడు, 'ఈ విషయాన్ని స్వెర్డ్‌లోవ్‌కి చెప్పండి, అయిపోతుంది' అనేవాడు లెనిన్ పలు సందర్భాల్లో. ఏదైనా పెద్ద ఆచరణాత్మక సమస్య ఎదురైనప్పుడు, దాని పరిష్కారంలో ఒక మార్గం ఏమంటే – అలిఖిత రాజ్యాంగం ప్రకారం – 'స్వెర్డ్‌లోవ్‌తో మాట్లాడితే పనవుతుంది' అనేది! అంతమాత్రాన స్వెర్డ్‌లోవ్ తనంతట తాను ఇలాంటి తీవ్రమైన వ్యక్తిగత పద్ధతిలో తన దగ్గరికి వచ్చిన వారందరికీ అనుకూలంగా వ్యవహరిస్తాడనుకోవడం పొరపాటు. ఏదైనా విభేదం పొడసూపినప్పుడు, అతడి పని విధానం అంతా పూర్తిగా – పరిస్థితులకు అనుగుణంగా మరింత అధికమైన సాధారణ పద్ధతుల్లో పార్టీ, సోవియట్ల సమస్యలకు పరిష్కారం వెతికేవాడు.

లెనిన్‌కు ముఖ్య సహచరునిగా ఉన్న స్వెర్డ్‌లోవ్, సెంట్రల్ కమిటీలో ఏదైనా ఒక చర్యకు ఆమోదం పొందాల్సిన సమయంలో, విప్లవానికి ముందూ, తర్వాతా కూడా, లెనిన్ ప్రతిపాదించిన విప్లవ వ్యూహానికి ఎలాంటి సంశయం లేకుండా బేషరతుగా మద్దతిచ్చే ఒకే ఒక సభ్యుడు స్వెర్డ్‌లోవ్ మాత్రమే అంటే అతిశయోక్తి కాదు. అతని తర్వాత మిగిలినవారి మద్దతు ఆయనకు లభించేది. వివాదాస్పద పలు నిర్ణయాల్లో, ఉదాహరణకు రాజ్యాంగ పరిషత్తును రద్దు చేయడంలో, అలాగే బ్రెస్ట్‌లితోవ్స్క్ శాంతి సంధిని కుదుర్చుకోవడంలోనూ స్వెర్డ్‌లోవ్ కీలకపాత్ర పోషించాడు. రాజ్యాంగ పరిషత్తు రద్దు విషయంలో స్వెర్డ్‌లోవ్ ఎంత గట్టిగా, దృఢంగా, సభ్యులందరిపై తన వ్యక్తిత్వ ముద్ర పడేలా గంభీరంగా వ్యవహరించిందీ లునచార్స్కీ వివరంగా వర్ణించాడు. అది అతడి చరిత్రలో మరోసారి మకుటాయ మానంగా వ్యవహరించిన సందర్భం అని లునచార్స్కీ స్వెర్డ్‌లోవ్‌ని కొనియాడాడు.

ఇక బ్రెస్ట్ – లితోవ్‌స్క్ శాంతిసంధి విషయంలో దాన్ని అడ్డుకునేందుకు ప్రతిపక్షాలతో పాటు పార్టీలోనే ఉన్న ట్రాట్స్కీ, వామపక్ష కమ్యూనిస్టులూ తీవ్రంగా దుష్ప్రచారం సాగిస్తున్నప్పుడు, సంధికి మద్దతుగా జరిగిన ప్రచారానికి స్వెర్డ్‌లోవే సారథ్యం వహించాడు. చాలా మంది ప్రత్యక్ష సాక్షులు చెప్పిందాన్ని బట్టి, లెనిన్ కేవలం విప్లవ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం వరకే చేసేవాడనీ, కాగా వాటిని ఆచరణలోకి పెట్టే బాధ్యతను స్వెర్డ్‌లోవే నిర్వహించేవాడనీ, ఈ విషయమై నాటి ప్రభుత్వంలో విద్యా మంత్రి, పార్టీలో ప్రముఖ ప్రచారకుడూ, నాయకుడూ అయిన లునచార్స్కీ చెప్పిన విషయాలు ఆయన మాటల్లోనే.

'లెనిన్ మరికొద్ది మంది ఇతరులూ విప్లవానికి మేధోపరమైన మార్గ దర్శకత్వాన్ని సమకూర్చినప్పటికీ, వారికీ ప్రజలకూ మధ్య, పార్టీ, సోవియట్ యంత్రాంగం, చిట్ట చివరికి రష్యా మొత్తానికీ మధ్య, నూలుకండె చేతికీ మధ్య దారంలా, ఒక వైరు ద్వారా అంతా సంధానించేట్టుగా, స్వెర్డ్‌లోవ్ సంధానిస్తాడు. అదీ స్వెర్డ్‌లోవ్ స్థానం.

*(ఇంకా ఉంది...)*

*(రచయిత సాహిత్యకారుడు, లెనిన్ జీవితచరిత్ర పరిశోధకుడు)* వీ

# వాగ్నర్ నుంచి రంగనాయకమ్మ వరకు కాపిటల్ వక్రీకరణలు

***మార్క్స్ కాపిటల్ వెలువడిననాటినుంచి ఇప్పటివరకు వ్యతిరేకులూ, మార్క్సిస్టులమని అనుకునేవారూ కూడ కాపిటల్ లోని కొన్ని అంశాలను ఎలా వక్రీకరించారో వివరిస్తున్నారు ఇ.ఎస్. బ్రహ్మాచారి***

మార్క్స్ చెప్పినవి చెప్పలేదని ప్రచారం చేసీ, చెప్పకపోవడం తప్పు అనీ విమర్శించినవారు కొందరు, అలాగే, మార్క్స్ చెప్పనివి ఆయనకు ఆపాదించి దాని ఆధారంగా తప్పుపట్టేవారు కొందరు చాలమంది ఉన్నారు. ఇలాంటి వాళ్లలో ప్రథముడు సోషలిస్ట్ ప్రొఫెసర్ అడాల్ఫ్ వాగ్నర్ (1835-1917). మార్క్స్ తన విశ్లేషణ నుంచి ఉపయోగపు విలువని పూర్తిగా తొలగించాడని వాగ్నర్ ఆరోపించాడు. ఇదేదో చిన్న విషయం మీద విమర్శ అనిపించవచ్చు. కాని మార్క్సుకి అదే ఎంతో ముఖ్యమయినది. అందుకే Marginal Notes on A. Wagner (1879) లో మార్క్స్ దాన్నితీవ్రంగా ఖండించాడు.

**ముందుగా మార్క్స్ కాపిటల్‌లో ఏం చెప్పాడో చూడాలి:**

"సరుకు ఉపయోగపు విలువ, మారకం విలువల సమ్మేళనం. ఉపయోగం లేనిదేదీ సరుకు కాదు." "ఉపయోగపు విలువ ... మారకం విలువ యొక్క వ్యక్తీకరణ రూపం, దృగ్గోచర రూపం అవుతుంది."

"ఒక సరుకు విలువ మరొక సరుకు ఉపయోగపు విలువలో, అంటే మరొక సరుకు సహజ రూపంలో దర్శనమిస్తుంది."

"అన్నిటినీ మించి, అదనపువిలువ శ్రమశక్తి యొక్క విశిష్ట మైన, దానికి మాత్రమే ప్రత్యేకంగా ఉన్నఉపయోగపు విలువ నుంచి లాగబడింది."

వీటినిబట్టి చూస్తే ఉపయోగపు విలువ మార్క్సుకి పై పై విషయంకాదు. కీలకమైనది. ఇదంతా కాపిటల్ లో సుస్పష్టంగా ఉన్నదే. దాన్ని చదివి కూడా 'మార్క్స్ అర్థశాస్త్రంలో ఉపయోగపు విలువకి స్థానం లేదు' అన్నాడు వాగ్నర్.

అందుకే "కావాలనే అస్పష్టంగా వుండేవాడు, కాపిటల్ లో ఒక్క ముక్క కూడా అర్థం కాని వాడు మాత్రమే మార్క్స్ రచనలో ఉపయోగపు విలువకి ఏపాత్రా లేదు అనగలడు" అన్నాడు మార్క్స్ ఘాటుగా. (Marx & Engels Collected Works -Vol 24 p.545)

"ఇప్పటి దాకా ఉన్న అర్థశాస్త్రంలో కంటే, నా అర్థశాస్త్రంలో ఉపయోగపు విలువ చాలా ఎక్కువ పాత్ర పోషిస్తుంది" అన్నాడు మార్క్స్.

ఇది మార్క్స్ చెప్పినా చెప్పలేదు అని విమర్శించిన విషయం.

◆ ◆ ◆

చెప్పకపోయినా చెప్పాడు అన్నది అదనపు విలువకి సంబంధించినది. 'శ్రామికులు మాత్రమే ఉత్పత్తిచేసిన అదనపు విలువ అనుచితంగా, అన్యాయంగా పెట్టుబడిదారుల వద్ద వుండి పోతుంది' అని మార్క్స్ అన్నట్లు వాగ్నర్ ఆరోపించాడు. అనుచితంగా, అన్యాయంగా అని మార్క్స్ అనలేదు. వాగ్నర్ అదనపువిలువ గురించి తాను చెప్పనిది తనకు ఆపాదించాడని 'మార్జినల్ నోట్స్' లో మార్క్స్ తప్పుబట్టాడు: "నిజానికి, నేను దీనికి సరిగ్గా వ్యతిరేకమైనది చెప్పాను: ఏమనంటే, సరుకు ఉత్పత్తి ఒకానొక కాలంలో పెట్టుబడిదారీ సరుకు ఉత్పత్తిగా ఉంటుంది. ఈ పెట్టుబడిదారీ సరుకును నిర్దేశించే విలువ నియమం ప్రకారం, అదనపువిలువ తప్పనిసరిగా పెట్టుబడిదారునిదే అవుతుంది, కార్మికునిది కాదు." (Marx & Engels Collected Works Vol 24 p.558)

మార్క్స్ ప్రకారం ఉత్పత్తి విధానాన్నిబట్టి న్యాయం ఉంటుంది. బానిస వ్యవస్థలో న్యాయమయింది, పెట్టుబడిదారీ వ్యవస్థలో అన్యాయం కావచ్చు. సోషలిస్టు సమాజంలో అన్యాయం కావచ్చు. అందువల్ల ఒక వ్యవస్థను పరిశీలించేటప్పుడు మరొక వ్యవస్థ న్యాయాన్ని కొలబద్ద చెయ్యకూడదు.

'అర్థశాస్త్ర విమర్శకు చేర్పు ' ఉపోద్ఘాతంలో మార్క్స్ ఇలా అన్నాడు:

"పరిశోధనద్వారా నేను సాధించిన సాధారణ ఫలితాన్ని - ఏదైతే సాధింపబడిన తర్వాత నా అధ్యయనానికి మార్గదర్శక సూత్రంగా పనిచేసిందో ఆఫలితాన్ని - క్లుప్తంగా యిలా సూత్రీకరించవచ్చు: తమజీవితానికి సంబంధించిన సామాజికోత్పత్తిలో, మానవులు నిర్దిష్టమూ, అవశ్యకమూ, తమ యిచ్ఛకు అతీతమూ అయిన సంబంధాలను, తమ భౌతిక ఉత్పాదకశక్తుల అభివృద్ధిలో ఒకానొక నిర్దిష్ట దశకు అనురూపమైన సంబంధాలను పెట్టుకుంటారు. ఈ ఉత్పత్తి సంబంధాల వెరశి మొత్తమే సమాజపు ఆర్థిక నిర్మాణ చట్రం, దాని నిజమైన పునాది. ఆపునాది మీదనే చట్టబద్ధ, రాజకీయ ఉపరినిర్మాణం లేస్తుంది, సామాజిక చైతన్యానికి సంబంధించిన నిర్దిష్టరూపాలు దానికి అనురూపంగానే ఉంటాయి. భౌతిక జీవితానికి సంబంధించిన ఉత్పత్తి విధానమే మొత్తం మీద సామాజిక, రాజకియ, బౌద్ధిక జీవిత క్రమాన్ని నిర్దేశిస్తుంది. మానవుల అస్తిత్వాన్ని నిర్దేశించేది వారి చైతన్యం కాదు, తద్భిన్నంగా, వారి సామాజిక అస్థిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. వాటి అభివృద్ధికి సంబంధించిన ఒకానొక దశవద్ద, సామాజపు భౌతిక ఉత్పాదకశక్తులు అప్పటికి అస్థిత్వంలో ఉన్న ఉత్పత్తి సంబంధాలతో, లేక - దానికే చట్టబద్ధమైన పదబంధం అయిన ఆస్థి సంబంధాలతో - అవి యింతవరకూ వేటిలోనైతే పనిచేస్తున్నాయో ఆ ఆస్థి సంబంధాలతో ఘర్షణలోకి వస్తాయి. ఉత్పాదక శక్తుల అభివృద్ధి రూపాలుగా వున్న యీ సంబంధాలు వాటికి శృంఖలాలుగా మారుతాయి. అప్పుడొక సామాజిక విప్లవ శకం ఆరంభమవుతుంది. ఆర్థికపునాది మార్పుతో బ్రహ్మాండమైన యావత్తూ ఉపరినిర్మాణమూ కొద్దోగొప్పో వేగంగా రూపాంతరం చెందుతుంది."- మార్క్స్ ఎంగెల్స్ సంకలిత రచనలు-భాగం2-పే. 11

దీన్నిబట్టి వర్తమాన ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడానికే చట్టాలూ, నీతినియమాలూ ఏర్పడతాయి. ఉత్పత్తివిధానం మారితే, అవీ మారతాయి. అన్ని వ్యవస్థలకూ వర్తించే ఏకైక న్యాయం అంటూ ఏదీ ఉండదు. ఇదీ ఆయన అభిప్రాయం. ఈ చారిత్రక దృక్కోణం నుంచి ఆయన క్షణమైనా వైదొలగడు. దీనికి భిన్నంగా ఆయన వాదన ఉండదు. మార్క్స్ ని చదివేవారెవరైనా దీన్ని వదిలిపెట్టకూడదు. ప్రతి దాన్నీ చారిత్రక దృష్టితో పరిశీలించాలి. సోషలిష్టు సమాజాన్ని వూహించి దానికనుగుణ మైన నియమాలు పెట్టుబడిదారీ వ్యవస్థకు వర్తింపచెయ్యాలంటే కుదరదు. సమాన విలువల మారకం అనేది ఈవ్యవస్థలో విలువ నియమం. దీని మీద ఆధారపడి,మార్క్స్ అదనపువిలువని నిరూపించాడు. ఈ నియమం ఏ సరుకుల మారకానికైనా వర్తించి తీరుతుంది. ఇది ఎట్టి పరిస్థితులలోనూ భంగపడరాదు. మార్క్స్ పాటించిన నియమం ఇది.

◆ ◆ ◆

బోం బావర్క్ (1851–1914) ఆస్ట్రియా ఆర్థిక వేత్త. ఆర్థిక మంత్రిగా పనిచేశాడు. పెట్టుబడిదారులు కార్మికులను దోపిడి చెయ్యటం లేదని వాదించాడు. వాగ్నర్ బాటలోనే ఇతడు కూడా మార్క్స్ అర్థశాస్త్రంలో ఉపయోగపువిలువకి చోటే లేదు అన్నాడు. అతను అప్పుడే తలెత్తుతున్న మార్జినలిస్ట్ స్కూల్ కి ప్రతినిధి. అది విలువ నిర్ణయంలో ఉపయోగపువిలువకి పెద్దపీట వేస్తుంది. అందుకే అంత ముఖ్యమైన అంశాన్ని వదిలివేశాడని మార్క్స్ ను విమర్శించాడు.

ఫెర్డినాండ్ లాసాల్ (1825–64) జర్మన్ సోషలిస్టు. 1848 నుంచీ మార్క్స్ శిష్యుడు. జర్మన్ కార్మిక ఉద్యమ నిర్మాతల్లో ఒకడు. ఆ కాలంలో మార్క్సు, ఎంగెల్స్ లతో సంబంధంలో ఉండేవాడు. జర్మన్ సోషల్–డెమొక్రటిక్ పార్టీ మార్క్సిస్టు పునాది మీద నిర్మాణమవుతున్నదని చెప్పేవాడు. అయితే ఏఒక్కరూ తనకు తాను సాధించుకోలేని దాన్ని రాజ్యం సాధిస్తుంది అని అతను కార్మికులకి చెప్పాడు. మార్క్స్ చెప్పింది ఇందుకు సరిగ్గా వ్యతిరేకం: కార్మికవర్గం తన విముక్తి తాను సాధించుకొని, ప్రస్తుత రాజ్యాన్ని రద్దుచెయ్యాలి. లాసాల్ రాజ్యం ఉండాలంటాడు. దానిని పటిష్టపరచాలంటాడు. ఇది మార్క్సుకి వ్యతిరేకమైనది.

లాసాల్ కఠిన వేతన నియమాన్ని సమర్థించాడు. మాల్థస్ జనాభా సిద్ధాంతం ప్రకారం ఎప్పుడూ కావలసినదానికన్న ఎక్కువమంది శ్రామికు లుంటారు గనక శ్రామికుడు సగటున కనీసవేతనం మాత్రమే పొందుతాడు. మార్క్స్ వేతనాల్ని నిర్ణయించే నియమాలు ఏ అర్థంలోనూ కఠినమైనవి కాదనీ, సాగగలవనీ (ఎలాస్టిక్) చెప్పాడు. 'పెట్టుబడి సమీకరణ' అనే అధ్యాయంలో మాల్థస్ వాదనని తిప్పికొట్టాడు. వేతనాలను నియంత్రించే నియమాలు చాలా సంక్లిష్టమైనవనీ, పరిస్థితులను బట్టి ఒకప్పుడు ఒక నియమమూ, మరొకప్పుడు మరొక నియమమూ ప్రాబల్యం వహిస్తుందనీ, మరి అందుచేత అవి ఏవిధంగానూ కఠిన నియమాలు కావనీ చెప్పాడు. లాసాల్ భావించినట్లు ఈవిషయాన్ని ఏవో రెండు మాటల్లో పరిష్కరించడం సాధ్యం కాదని సవివరంగా రుజువు చేశాడు.

మాన్యుస్క్రిప్ట్స్‌లో మొదటిది ఈమాటలతో మొదలవుతుంది: "పెట్టుబడిదారుడికీ, కార్మికుడికీ మధ్య పోరాటం ద్వారా వేతనాలు నిర్ణయమవుతాయి."

జూల్స్ గెస్డె (1845–1922) ఫ్రెంచ్ సోషలిస్టు. కాపిటల్ చదివాడు. 1875 జూన్ లో లండన్ లో లాఫార్జ్ ను, మార్క్స్, ఎంగెల్స్ లను కలిశాడు. మార్క్సిస్టునయ్యానని చెప్పాడు. అయితే లాసాల్ చెప్పిన వేతన దృఢత్వ సిద్ధాంతాన్ని – పెట్టుబడిదారీ విధానంలో వేతనాలు బాగా పెరగవు అని నొక్కివక్కాణించే సిద్ధాంతాన్ని – మార్క్సుకి అంటగట్టాడు. లాఫార్జ్, గెస్డె ఇద్దరూ తాము మార్క్సిజానికి ప్రతినిధులమని చెప్పుకున్నారు. 1880 లో జూల్స్ గెస్డె, పాల్ లాఫార్జ్ లు %ఆబిజీశిరి తిఖీజీరిలిజీ ఓజీబిఔబిరిరీ (ఆంఓ, లీజీ ఓజీలిదీబీ ఇళిజీదిలిజీరీ% %ఆబిజీశిగి%) పేరుతో సోషలిస్ట్ పార్టీని స్థాపించారు. పెట్టుబడిదారీ వ్యవస్థని రద్దుచేసి సోషలిస్టు సమాజాన్ని స్థాపించడం దాని లక్ష్యం. పెట్టుబడిదారీ చట్రంలోనే సాధించగల డిమాండ్ల కోసం ఆందోళనకి ఆచరణాత్మక సాధనంగా కనీస కార్యక్రమాన్ని మార్క్స్ చూశాడు. కాని గెస్డె దాన్ని పోరాట కార్యక్రమంగా చూడలేదు. రాడికలిజం నించి కార్మికుల్ని బయటకు పంపించేదిగా పరిగణించాడు.

మార్క్స్ 1883లో చనిపోయే ముందు వాళ్లకి రాసిన లేఖలో సంస్కరణ పోరాటాల్ని తిరస్కరించినందుకు వాళ్లను "విప్లవపదారాధకులు" అన్నాడు.

కార్మిక సంఘాల పాత్రను ఫ్రెంచ్ సోషలిస్టులు వ్యతిరేకించారు. "అదే మార్క్సిజమయితే నాకు తెలిసిందల్లా నేను మార్క్సిస్టును కాననే" అని లాఫార్జ్ తో మార్క్స్ చెప్పాడు. అంతగా ఆయన సిద్ధాంతాన్ని వక్రీకరించారన్నమాట.

వీళ్లందరూ మార్క్సు సమకాలికులు. వీళ్లలో వాగ్నర్, బాం బావర్క్ ఇద్దరూ మార్క్సుకి వ్యతిరేకులు. మిగిలిన వాళ్లు మార్క్సిస్టులమని చెప్పుకున్న వాళ్లు.

◆ ◆ ◆

మార్క్స్ వ్యతిరేకి వాగ్నర్ ఉపయోగపు విలువని తప్పించాడని మార్క్స్ ను విమర్శిస్తే, మార్క్సిస్టులైన మీక్, డాబ్, స్వీజీ ప్రభృతులు, మార్క్స్ అలా చేశాడనుకుని, అలా చెయ్యడం సరయిందేనన్నారు. ఇది మార్క్సుమీద విమర్శ కాదు, సరయినదే అనుకున్నారు.

ఉపయోగపు విలువ "..సహజ వస్తువుగా ప్రకృతి శాస్త్రానికి చెందిన వస్తువ్కు సామాజిక వస్తువుగా...రాజకీయ అర్థశాస్త్రానికి చెందిన వస్తువు.... సరుకు ప్రాకృతిక అంశం. దాని ఉపయోగపు విలువ, రాజకీయ అర్థశాస్త్రం బయటనే ఉంటుంది" అన్నాడు హిల్ఫర్డింగ్. అది కొంతకాలం చలామణీ అయింది. అయితే ఆ అవగాహన తప్పు.

1859 లో వెలువడిన మార్క్స్ ' క్రిటిక్' లో ఉన్నది ఇలా: "ఉపయోగపు విలువగా ఉండడం సరుక్కి ముందుషరతు, కాని అది సరుకా కాదా అనేది ఉపయోగపు విలువకి నిమిత్తం లేదు. దానికదిగా ఉపయోగపు విలువ, నిర్ణాయక ఆర్థిక రూపానికి స్వతంత్రంగా ఉంటుంది కాబట్టి, అది రాజకీయ అర్థశాస్త్ర పరిశోధనకి ఆవల ఉంటుంది. దానికదే నిర్ణాయక రూపం అయినప్పుడు ఈ పరిధిలోకి వస్తుంది".

ఇందులో చివరి వాక్యాన్ని పట్టించుకోకపోవడమే గందరగోళానికి కారణం. అదనపు విలువ ఉత్పత్తిలో శ్రమశక్తి ఉపయోగపు విలువది నిర్ణాయక రూపం. కనక అది అర్థశాస్త్ర పరిధిలోకి వస్తుంది.

వాగ్నర్ మీద రాసిన నోట్స్ బయటకొచ్చాక మార్క్సిస్టులు ఉపయోగపు విలువకున్న ప్రాధాన్యతని తెలుసుకున్నారు. మార్క్సే స్వయంగా చెప్పాడని తెలిశాక పాత ఆలోచనలు ఉన్నవాళ్లు గాడిన పడ్డారు.

అయితే మార్క్సిస్టులందరూ ఆయన అదనపు విలువ సిద్ధాంతాన్ని యథాతథంగా అంగీకరించారు. అదనపువిలువని రాబట్టిన తీరుని తలదాల్చారు. మార్క్సిస్టులు ఎవ్వరూ దీనితో విభేదించలేదు. రంగనాయకమ్మగారు ఒక్కరే మినహాయింపు.

◆ ◆ ◆

1867 లో కాపిటల్ అచ్చయ్యాక, పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు ఆయన సిద్ధాంతం వివరణల్లో వైరుధ్యాలేమైనా దొరుకుతాయేమోనని ఆయన రచనల్ని ఉత్తరాలతో సహా గాలించారు. దొరకలేదు. మార్క్సిస్టునని చెప్పుకునే రంగనాయకమ్మ గారు మాత్రం సులువుగా ఇది వైరుధ్యం కాదా అని ప్రశ్నించారు.

"కార్మికుడు పెట్టుబడిదారుడికి ఎక్కువ విలువ ఇస్తే పెట్టుబడిదారుడు కార్మికుడికి తక్కువ విలువ ఇస్తాడు కదా? వాళ్ళమధ్య మారకం ఎప్పుడూ ఇలా అసమానంగానే జరుగుతూ ఉంటుంది కదా? 'మారకం అనేది సమాన విలువల మధ్యనే జరుగుతుంది 'అనే విలువసూత్రం ప్రకారం, ఇది వైరుధ్యం కాదా?" అని ప్రశ్నించి "అవును, ఇది తప్పనిసరిగా వైరుధ్యమే" అన్నారు. (కొత్త పరిచయం–1–పే.226)

మార్క్స్ ప్రకారం: మారకం జరిగేది కార్మికుడి శ్రమశక్తికీ, పెట్టుబడిదారుడి డబ్బుకీ. అది సమాన విలువల మారకమే. శ్రమశక్తిని అమ్మాక దాని ఉపయోగపువిలువ కొన్నవాడిదే. ఎంత శ్రమజరిగినా అంతా పెట్టుబడిదారుడిదే.

అయితే తయారైన సరుకుల్లో చేరిన విలువ మొత్తం కార్మికునికే రావాలి అనే వాదన వుంది. అదంతా వాళ్లదే. కాని అలా రావడం లేదు. కొంత యజమానికి చేరుతున్నది. కనక అది అసమాన మారకం. ఇది రికార్డియన్ సోషలిష్టుల వాదం. రికార్డియన్ సోషలిష్టులు కార్మికుడు తన ఉత్పాదితం మొత్తానికీ హక్కుదారుడు అని వాదించారు. జాన్ ఫ్రాన్సిస్ బ్రే అసమాన మారకాల మోస విధానం చట్టబద్ధ బందిపోటు

అని దుయ్య బట్టాడు. చార్లెస్ హాల్స్ శ్రమ ఉత్పత్తి మొత్తం మీద హక్కు సహజ మానవ హక్కు అనీ, భగవంతుని ఆజ్ఞ అనీ చెప్పాడు. జాన్ గ్రే ఈ విధానపు పునాది అన్యాయం అని నిరసించాడు.

రికార్డియన్ సోషలిష్టులు 1820, 1830 దశకాల్లో కృషి చేశారు. దోపిడీ సిద్ధాంతానికి అసమాన మారకాన్నే పునాది చేశారు. ఇది పెట్టుబడిదారీ విధానం పరిధిలోనే దోపిడీని నిర్మూలించే అవకాశం ఉంది అనే అభిప్రాయానికి అవకాశమిస్తుంది. మార్క్సు దీన్ని తీవ్రంగా ఖండించాడు. మార్క్స్ తన అర్థశాస్త్రానికి ఎప్పుడూ నైతిక విషయాల్ని ఆధారం చేసుకోలేదు.

రికార్డియన్ సోషలిస్టులు సామాజిక సామరస్యం నెలకొనడానికి సరసమైన, సమానమైన మారకం సరిపోతుంది అని నమ్మారు. ఇది బూర్జువా భ్రాంతి/భ్రమ అన్నాడు మార్క్స్. మార్క్స్ ఖండించిన దాన్ని సరైనదని రంగనాయకమ్మ గారు భావిస్తున్నారు. ఇది వైరుధ్యం కాదా అని ప్రశ్నిస్తున్నారు. ఇది అంతకుముందే రికార్డియన్ సోషలిష్టులు చెప్పిందే.

రంగనాయకమ్మ గారు అంతటితో ఆగలేదు. మరికొంత ముందుకు పోయి పెట్టుబడిదారుడికీ కార్మికుడికీ అసలు మారకమే లేదు అన్నారు.

"కార్మికుడు పెట్టుబడిదారుడికి ఇచ్చేది తన శ్రమని. దానికి బదులుగా పెట్టుబడిదారుడు కార్మికుడికి ఇచ్చే సరుకు ఏదీ వుండదు. కార్మికుడు ఇచ్చే శ్రమలోనించే కొంతభాగాన్ని తీసి, దానికి జీతం అనే పేరుబెట్టి, దాన్ని కార్మికునికి ఇస్తాడు. మిగిలిన శ్రమనంతా పెట్టుబడిదారుడు తీసుకుంటాడు. పెట్టుబడిదారుడు జీతం పేరుతో ఇచ్చేది, పెట్టుబడిదారుడి శ్రమకాదు. వాడు కార్మికుడి నించి తీసుకోవడమే గాని కార్మికుడికి ఇచ్చేదేమీ లేదు. అంటే, పెట్టుబడిదారుడు కార్మికుడి శ్రమని దోచడమే గాని ఆ ఇద్దరి మధ్యా మారకం అనేది వుండదు." (కొత్తపరిచయం, పే. 248)

"ఇద్దరి మధ్యా అసలు మారకమే ఉండదు. జరిగేది కార్మికుడి శ్రమలో కొంతభాగాన్ని పెట్టుబడిదారుడు లాగడమే."

సరే. మిగతాభాగం ఏమవుతుంది? కార్మికునికి పోతుందికదా! అది మారకమే. సొంత డబ్బుల్లోనించి ఇచ్చాడా లేక ఆ తర్వాత తన సరుకులు అమ్మగా వచ్చిన డబ్బుతో ఇచ్చాడా అన్నది మారకానికి సంబంధంలేని విషయం. మారకం జరిగినట్లే అని మార్క్స్ చెప్పాడు.

"పెట్టుబడిదారుడు యీవేతనం చెల్లించేది అతనికి బట్టనుండి వచ్చే డబ్బుతో కాదు, అతనివద్ద అప్పటికే వుండిన డబ్బుతో. నేతకార్మికునికి అతని యజమాని సరఫరా చేసిన మగ్గమూ, నూలూ యెలా ఆ కార్మికునివి కాదో, అలాగే శ్రమశక్తి అనే తనసరుకుకు సాటాగా ఆ కార్మికుడు పొందే సరుకులు కూడా అతని ఉత్పాదితం కాదు. యజమానికి తన బట్టకు కొనుగోలుదారుడే దొరికివుండక పోవచ్చు. దాని అమ్మకం ద్వారా అతనికి వేతనం డబ్బులు కూడా వచ్చివుండక పోవచ్చు. నేతకార్మికుని వేతనంతో పోలిస్తే అతను దానిని చాలా లాభదాయకంగా అమ్ముకోవచ్చు. అవన్నీ నేతకార్మికునికి సంబంధం లేదు. పెట్టుబడిదారుడు తనదగ్గరున్న ధనంలో – తన పెట్టుబడిలో – కొంత భాగంతో నేత కార్మికుని శ్రమశక్తిని కొంటాడు." (వేతనశ్రమా, పెట్టుబడీ– సం.ర.–1 పే 95)

"పెట్టుబడికీ, శ్రమకీ మొదటి మారకం పద్ధతి ప్రకారం జరిగే ప్రక్రియ. ఇక్కడ డబ్బు పెట్టుబడిగానూ, శ్రమశక్తి సరుకుగానూ ఉంటాయి... చట్టరీత్యా శ్రమశక్తి అమ్మకం ఈ మొదటి ప్రక్రియలో జరుగుతుంది – శ్రమ జరిగిన తర్వాతే రోజు చివరో, వారం చివరో మరొకప్పుడో చెల్లించినప్పటికీ. ఇది శ్రమశక్తి అమ్మబడిన లావాదేవీని ఏవిధంగానూ మార్చదు." (అదనపు విలువ సిద్ధాంతాలు– భాగం1– పే.397)

"ఏమయినప్పటికీ డబ్బు కొనుగోలు సాధనంగా వ్యవహరిస్తుందా, చెల్లింపు సాధనంగా వ్యవహరిస్తుందా అన్నది సరుకుల మార్పిడి స్వభావాన్ని మార్చదు. ఒప్పందంలో శ్రమశక్తి ధర నిర్ణయమవుతుంది. అయితే ఇంటి అద్దె లాగానే, అది కొంతకాలం తర్వాతనే చేతికి వస్తుంది. శ్రమశక్తి విక్రయం జరిగింది. అయితే కొంత కాలం తర్వాత మాత్రమే అది చెల్లించబడుతుంది. విషయం స్పష్టంగా అర్థం గావడానికి గాను ప్రతి అమ్మకంలోనూ శ్రమశక్తి కలవాడు దానికి నిర్ణయించిన ధరను వెంటనే పుచ్చుకోగలుగుతున్నాడని కాసేపు భావిద్దాం." (Capital 1-p 171)

సార్వత్రిక సమానకం అయిన డబ్బు ఇస్తాడు. అయితే రంగనాయకమ్మ గారు ఆడబ్బు అతనికెలా వచ్చింది, అదికూడా కార్మికులదే కాబట్టి మారకమే లేదు అంటున్నారు. అయితే ఆడబ్బు అతనికి ఎక్కడిది అనే దానితో మారకానికి సంబంధం ఉండనే ఉండదు.

2013 జూలై వీక్షణంలో రంగనాయకమ్మ గారు పెట్టుబడిదారుడికీ, కార్మిక నాయకుడికీ ఒక ఊహా సంభాషణ సృష్టించారు. శ్రమశక్తిని డబ్బు పెట్టి కొంటున్నానని పెట్టుబడిదారుడు అన్నప్పుడు, "నీడబ్బుపెట్టా? డబ్బు నీదా? ఏ శ్రమచేసి డబ్బు సంపాదిస్తున్నావు? నా శ్రమను అమ్మి, నాడబ్బులోనించి ఒక్క పైసా నాకు పడేస్తావు. మిగతా డబ్బు రాశి నీ పరం" అంటాడు కార్మికుడు. పరిచయంలో "ఆ డబ్బు కార్మికులదే, పెట్టుబడిదారుడిది కాదు" అంటాడు కార్మికుడు. "జీతం కార్మికుడి శ్రమలోది తీసి కార్మికుడికి ఇచ్చేదే"

ఈ వాదనను మార్క్స్ ఒప్పుకోలేదు. పెట్టుబడిదారు తన దగ్గరున్న డబ్బునుంచి ఇస్తాడని అన్నాడు. ఆ డబ్బు అతనికి ఎక్కడిది, కార్మికుల శ్రమ నించి వచ్చిందే కదా అని రంగనాయకమ్మ గారి ప్రశ్న. అయితే పెట్టుబడిదారీ విధానం కొనసాగినంతకాలం అదనపు విలువ పెట్టుబడిదారుడిదే. కనక ఆ డబ్బు చట్టరీత్యా కూడ అతనిదే. ఇది నైతిక వ్యవహారం కాదు.

డబ్బూ సరుకూ చేతులు మారాయంటే అది మారకమే. ఆ డబ్బు ఎలా వచ్చిందీ, ఆ సరుకు ఎవరు చేసిందీ అనే విషయాలతో మారకచర్యకి సంబంధం ఉండదు. మారకంలో పాల్గొన్నవాళ్లు సమానులా కాదా అనేదానితో నిమిత్తం ఉండదు. మారినవి రెండు సరుకులయినా ఒకటే, డబ్బూ సరుకూ అయినా ఒకటే.

"శ్రమశక్తి విలువని నేను చెల్లించేస్తున్నాను కదా, ఇంకా తప్పేమిటి?" అంటున్నాడే పెట్టుబడిదారుడు? ఆ శ్రమశక్తి విలువ ఎవరు నిర్ణయించింది? వాడు నిర్ణయించిందే!...దోపిడీదారుడి నియమం ప్రకారం మనిషి (శ్రమచేసే మనిషి) అర్ధాకలితో మాడాలి. శ్రామికుడి అవసరాల్ని ఇంత కనీస స్థాయిలో నిర్ణయించి, ఆ కనీస విలువనే యిచ్చి 'శ్రమశక్తి విలువని ఇచ్చేస్తున్నానే!' అంటున్నాడు పెట్టుబడిదారుడు." (పాత పరిచయం–2– 266–67)

శ్రమశక్తి విలువని నిర్ణయించేది పెట్టుబడిదారుడొక్కడే కాదు. కార్మికుడు కూడా. అది ఒప్పందం. ఇరువురూ ఒప్పుకుంటేనే కుదురుతుంది. సంప్రతింపులుంటాయి. వేతనాల మార్పుకి బాగా అవకాశం వుందని మార్క్స్ విశ్వసించాడు. ఈ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకోవటం కార్మికసంఘాల బాధ్యతగా భావించాడు. వాస్తవానికి వేతనం సరఫరా, గిరాకీలను బట్టీ, కార్మికులు వేతనపెంపు కోసం చేసే పోరాటాల పటిమను బట్టీ వుంటుంది. అంతేగాని పెట్టుబడిదారుడొక్కడే తన యిష్టానుసారం 'కనీసావసరాల విలువే శ్రమశక్తి విలువ' అంటే సాగదు.

వీక్షణం వ్యాసంలో కొత్త విషయం ఏమంటే: శ్రమ శక్తి సరుకు కాదు అనేది.

"శ్రమశక్తి సరుకు అనీ, దాన్ని శ్రామికుడు అమ్ముతాడనీ, పెట్టుబడిదారుడు కొంటాడనీ ఈరకంగా చెప్పడం వల్ల, శ్రమదోపిడీ జరుగుతోందనే వాదం బలహీనపడిపోదా?" అని ప్రశ్నించారు

రంగనాయకమ్మ గారు.

"(శ్రమ దోపిడిని నిజమైన విషయంగా చూపించాలంటే '(శ్రమశక్తిని పెట్టుబడిదారుడు కొంటాడు' అనే వాదం తప్పనీ, దాన్ని వదులుకోవాలనీ నావాదం" అంటూ సరిపుచ్చారు.

దోపిడీ రుజువు కావాలంటే, పెట్టుబడికీ, శ్రమశక్తికి మారకం లేదని చెప్పాలి. అంతకు ముందూ చెప్పారు. అయితే కారణం ఆ డబ్బు అతనిది కాదు. అతని శ్రమతో వచ్చింది కాదు. కార్మికులది. వాళ్లదే వాళ్లకి ఇస్తున్నాడు కనక మారకమే లేదు. ఇది నాటి వాదన. నేటి వాదన ప్రకారం శ్రమశక్తి సరుకు కాదు. సరుకు కానిది మారకం కాజాలదు. అందువల్ల మారకం లేదు.

"శ్రామికుడికీ పెట్టుబడిదారుడికీ మధ్య నిజంగా జరిగే విషయాలు అమ్మడాలూ - కొనడాలూ కాదు" అని తేల్చారు.

అయితే మార్క్స్ చెప్పింది ఇది: ఈ మొదటి మారకం లేకపోతే పెట్టుబడిదారీ ఉత్పత్తి ఉండదు. శ్రమ సరుకు కావడంతోనే, పెట్టుబడిదారీ విధానం మొదలయింది.

"పెట్టుబడిదారుడికి దక్కే అదనపువిలువ, సరిగ్గా శ్రామికుడు తన శ్రమశక్తిని సరుకుగా అతనికి అమ్మాడు అనే వాస్తవం నించి ఏర్పడుతుంది" (అదనపు విలువ సిద్ధాంతాలు-1-పే 315)

శ్రమశక్తి సరుకు కాదనీ, మారకం లేదనీ అంటే, మార్క్స్ వివరణని బట్టి అసలు పెట్టుబడిదారీ విధానం రానట్లే, లేనట్లే.

"పెట్టుబడిదారుడు శ్రమశక్తిని కొంటాడనీ, శ్రమశక్తి ఇచ్చే ఉపయోగపువిలువ అతనిదే అనీ, ఒకవేపు వాదిస్తూ ఆ శ్రమశక్తి ద్వారా అదనపువిలువని తీసుకోవడం శ్రమదోపిడీ అవుతోందని ఇంకోవేపు వాదిస్తే ఆ రెంటికీ ఎలా పొసుగుతుంది?"అని రంగనాయకమ్మ గారు ప్రశ్నించారు. (వీక్షణం జూన్ 2013 పే. 56)

ఎలా పొసుగుతుందో మార్క్స్ 'పెట్టుబడి' లో వివరించాడు. అయితే ఆ వాదన తప్పంటున్నారు వీరు.

"పెట్టుబడిదారుడు దోచడమే నిజం కాబట్టి, ఆవాదాన్నే సరైనదిగా భావించి దాన్నే నిలబెట్టాలి. 'శ్రమశక్తి ఇచ్చే ఉపయోగపు విలువ, పెట్టుబడిదారుడిదే' అనే వాదానికి దారితీసే శ్రమశక్తిని అమ్మడం-కొనడం అనే భావాల్ని మాత్రం వదలి వెయ్యాలి. అప్పుడే సమస్య తీరుతుంది." (వీక్షణం జూన్ 2013 పే. 57)

కాని, "శ్రమశక్తి ఎలాంటిదంటే, అది తన విలువ కన్నా ఎక్కువ విలువగల పని చెయ్యగలదు" అని అదే వ్యాసంలో అనడంలో రంగనాయకమ్మ గారు కూడ శ్రమశక్తిని సరుకుగా చూస్తున్నారు. దానికి విలువా, ఉపయోగపు విలువా వున్నాయంటున్నారు. "నేను అమ్మేదీ, నువ్వుకొనేదీ, నా శ్రమశక్తి వరకే. నేను నా మొత్తం శ్రమనంతా నీకు అమ్మడం లేదు" అనడంలోనూ శ్రమశక్తిని అమ్మేది అది సరుకైనప్పుడే గదా.

శ్రమ శక్తి అనేది సరుకు కాదు అని రంగనాయకమ్మ గారి కార్మిక నాయకుడు ఒప్పుకుంటాడు. అంతేగాదు మార్క్స్ పొరపాటు పెట్టుబడిదారుడి వాదనకి ఉపయోగపడిందని చెబుతాడు.

"నీ వల్ల జరిగేది శ్రమదోపిడీ కాదని నువ్వు వాదించడానికి నా పొరపాటు నీకు ఎంత సాయపడిందో, నీకు ఎంత ధైర్యం ఇచ్చిందో నాకు ఇప్పుడు తెలుస్తున్నది." "శ్రమదోపిడేయే లేదని దోపిడీదారుడు విర్రవీగుతుంటే, నోరెత్తలేని స్థితిలో శ్రామికుడు పడిపోయాడంటే కారణం నా గురువు పొరపాటే" అంటాడు. ఇది చిన్నపొరపాటు అని సర్దుబాటు చేస్తాడు. తప్పకుండా మార్చుకుంటాడని హామీ ఇస్తాడు. ఆ పొరపాటు వల్ల మార్క్స్ దోపిడీని నిరూపించలేకపోయాడు. అనుకున్నదానికి సరిగ్గా వ్యతిరేకమైన దాన్ని రుజువు చేశాడు. అందుకు కారణం శ్రమశక్తిని సరుకు అనడమూ, శ్రామికుడికీ పెట్టుబడిదారుడికీ మారకం ఉందనడమూ అని రంగనాయకమ్మ గారి వాదం.

కాని మార్క్స్ సమాన విలువల మారక నియమానికి అనుగుణంగా దోపిడీని నిరూపించగలిగింది శ్రమశక్తిని సరుకు అనడం ద్వారానే. శ్రమ సరుకు కాదు అని చెప్పడం ద్వారానే. కనక ఇది చిన్న పొరపాటు కాదు. మార్క్స్ చేసింది కాదు. ఈ కార్మికనాయకుడే మార్క్సిజం తప్పు అని నిరూపించే కీలక దోషానికి పాల్పడుతున్నాడు. దోపిడీ లేదని పెట్టుబడి వాదించినప్పుడు కార్మికుడు నోరెత్తలేని పరిస్థితిలో పడడానికి కారణం శ్రమశక్తి సరుకు అనడమట!

"ఒక సైన్సుని నేర్చుకునేచోట చిన్నపొరపాటు అయినా పొరపాటే" అని రంగనాయకమ్మ గారే హెచ్చరించారు. (పాత పరిచయం-1 పే. 14)

"దోపిడీని గ్రహించడానికీ, దోపిడీని నిర్మూలించే నూతన సమాజాన్ని నిర్మించడానికీ, మార్క్స్ ఇచ్చిన సిద్ధాంతమే మార్క్సిజం" (పాత పరిచయం-1 పే. 4) సరిగా అక్కడే మార్క్స్ పొరపాటు చేశాడంటూ, దోపిడీని గ్రహించడానికి ఆయనే సిద్ధాంతాన్ని సమకూర్చాడనడాన్ని ఏమనాలి?

మొత్తం మీద మార్క్స్ అదనపు విలువని వివరించడానికి తీసుకున్న అధారమే తప్పని తేల్చారు. మార్క్స్ సిద్ధాంతానికి పునాది తప్పని మార్క్స్ శిష్యుడైన కార్మికుని చేతనే అనిపించారు. మరి ఆధారం తప్పయితే, మార్క్స్ నిర్ధారణ తప్పన్నట్లే. అదనపు విలువ సిద్ధాంతం తప్పు అన్నట్లే.

శ్రమ సృజించిన విలువ అంతా పెట్టుబడిదారీ విధానం నియమాల ప్రకారం శ్రామికులకు రాదు. అంతేకాదు నూతన సమాజంలో కూడ కార్మికులు పూర్తి శ్రమ విలువని పొందుతారనే వాదనను మార్క్స్ తిరస్కరించాడు. మొత్తం శ్రమ వుత్పాదితంలో చాలా మినహాయింపు లుంటాయి అని స్పష్టంగా గోథా కార్యక్రమ విమర్శలో కుండబద్దలు కొట్టి మరీ చెప్పాడు. ఆదిమ సమాజంలోకూడా సమాజ వుత్పత్తిని వుమ్మడిగా వాడుకున్నారే తప్ప ఎవరు చేసినవి వాళ్లవి కావు.

మార్క్స్ పొరపాటు బయటపెట్టడమే లక్ష్యంగా వ్యాసమంతా రాసి, చివరలో సంబంధంలేకుండా ఒక వాక్యం! మార్క్సు మూలసూత్రాన్ని మూలకునెట్టి, మార్క్సుని తప్పుబట్టి, "మార్క్స్ శిష్యులు గురువునించి ఏమి నేర్చుకుని ఉంటారో ఊహించలేక నన్ను పిలిచావు. నీ ఎత్తుగడలు ఎక్కడయినా చేసుకో, మార్క్స్ శిష్యుల మీద కాదు. అక్కడ సాగవు" అనడం. వారే తప్పుబట్టి మార్క్సునించి అంతా నేర్చామనడం. ఒకపక్క తప్పంటూనే, మరొక పక్క శిష్యులం అనడం. గురువుని మించిన శిష్యులా, ముంచిన శిష్యులా?

"ఆయన వివరించి చెబితేనే శ్రమదోపిడీ రహస్యం, సమాజానికి తెలిసింది" అన్నారు. మళ్ళీమార్క్సు చెప్పింది తప్పని తేల్చారు. శ్రమశక్తి సరుకు కాదు. పెట్టుబడికీ శ్రమకీ మారకం లేదు. అదీ మిధ్య ఇదీ మిధ్య అయితే, మధ్యలో దోపిడి ఏమిటి? పెట్టుబడికీ శ్రమశక్తికీ మారకం జరిగితేనే ఉత్పత్తి మొదలవుతుంది. అప్పుడు అదనపు ఉత్పాదితం పెట్టుబడిదారుడికి చిక్కుతుంది. ఈ మారకం మిధ్య అయితే అదనపు ఉత్పత్తీ మిధ్యే, అదనపు విలువా మిధ్యే. అయితే దోపిడీ శాస్త్రపరంగా ఎలా వివరించాలో వారికే ఎరుక! వారు ఏమి చెప్పినా అది మార్క్సుది కాదు. మరొకరిది. మార్క్సిజం కాదు, మరొకరిజం.

కాపిటల్ పరిచయం ముందుమాటలో "ఇది ఒరిజినల్ నించి ఎక్కడా భిన్నమైనది కాదు" అని చెప్పుకున్నారు. మార్క్స్ రాసిన దానికి భిన్నమైనవి చెప్పటమే కాక, మూలాధారమైన అదనపు విలువ వివరణనే తప్పుపట్టారు. వారన్నట్లు 'మార్క్స్ ఇచ్చిన సిద్ధాంతమే మార్క్సిజం' అయితే రంగనాయకమ్మగారిది మార్క్సిజం కాదు. మరొకరిజం. "అదే మార్క్సిజం అయితే నాకు తెలిసిందల్లా నేను మార్క్సిస్టును కాను" అన్న మార్క్స్ మాటల్ని గుర్తుచేసుకోవలసి వస్తుంది.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతం పై ఒక వివరణ

- వై.వి. రమణారావు

'అదనపు విలువ' గురించి ఇ.ఎస్.బ్రహ్మచారి వివరించినది చదివినా, ఈ విషయంలో ఇంకా స్పష్టం కాని అంశాల్ని వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం. ఈ క్రమంలో సరుకు, విలువ, శ్రమశక్తి, ఉపయోగపు విలువ, అదనపు విలువ, వగైరా అంశాలను కలిపి అర్థం చేసుకుందాం. 'పెట్టుబడి' గ్రంథంలో లేని కొటేషన్ గుర్తులు, బ్రాకెట్లు, అండర్‌లైన్ చేసినవి మాత్తమే, ఈ వ్యాసంలో నేను స్పష్టత కోసం చేసినవి.

I) మార్క్స్ వివరణ విధానం: మార్క్స్ ఏ విషయాన్నైనా వివరించేటప్పుడు (మనకు ఆ విషయంపై అప్పటి వరకు ఉన్న సంప్రదాయ వివరణ, వర్ణనలు వీటికి భిన్నంగా వుంటాయి)ఃముఖ్యంగా పెట్టుబడి గ్రంథంలో సరుకు, శ్రమశక్తి, విలువ, అదనపు విలువ, మొదలైన వాటి గురించిఃతాను అంతకుముందు చెప్పిన దానికి మరికొంత కలుపుతూ (మరింత వివరంగా / స్పష్టంగా చెప్పే ఉద్దేశ్యంతో), మళ్లీ మళ్లీ వివరించి, విశ్లేషించి చెప్పే విధానాన్ని ఎంచుకున్నాడు. దీనివల్ల, చాలా సందర్భాల్లో పునశ్చరణ జరుగుతోంది అని మనకు అన్పించినా, అలా జరిగింది చాలా తక్కువనీ, పునశ్చరణ జరిగిన దాంట్లోని ముఖ్యమైన విషయాన్ని మరల సరికొత్తగా చెప్పటం వలన, ఆ విషయాన్ని మనం జాగ్రత్తగా చదివి, స్పష్టంగా అర్థం చేసుకుంటామని ఆశించి, ఆ స్పష్టత కోసం తీవ్ర మానసిక, శారీరక సంఘర్షణ పడ్డాడు.

II) మార్పిడి విలువ, ఉపయోగపు విలువ: ప్రతి వస్తువుకీ 'మార్పిడి విలువ' అనేది ఆ వస్తువులో ఉండే 'విలువ పరిమాణాన్ని' తెలియ జేస్తుంది. అయితే, మార్క్స్ చెప్పినట్లు : 'ఉపయోగపు విలువలు (ఇక నుండి: ఉప. వి అందాం) వినియోగం ద్వారా, లేదా అనుభోగం ద్వారా వాస్తవంగా మారతాయి.' (పే 32, పెట్టుబడి-1, వి.ప.హౌస్). అంటే, ఉప. వి. అనేది మనకు భౌతికంగా ఒక వస్తువులో కనపడదు; ఒక వస్తువులోని ఉపయోగపు లక్షణాన్ని దాని సొంతదారుడు అనుభవించటాన్నే (ఆ ఉపయోగపు లక్షణాన్ని ఆచరణలోకి మార్చటాన్నే) ఆ వస్తువుకు గల ఉప. విలువ అంటామని అర్థం.

సరుకుల ఉప. వి.కీ, మార్పిడి విలువలకీ గల తేడాలు: 'సరుకులు ఉప. విలువలుగా విభిన్న గుణాలు గలవి. అయితే మార్పిడి విలువలుగా అవి కేవలం విభిన్న పరిమాణాలు మాత్రమే. ఫలితంగా, వాటిలో అణుమాత్రమయినా ఉప. విలువ ఉండదు' (పేజీ-33)

'ఒక ఉత్పాదితం సరుకుగా మారాలంటే, అది మార్పిడి ద్వారా మరొకరికి బదిలీ అయి (పరాధీనం చెయ్యబడి), ఉపయోగపు విలువగా పనికి రావాలి...' (పేజీ 36), మార్క్స్.'ప్రైవేటు వ్యక్తుల కోసం వేటికవే స్వతంత్రంగా విభిన్న రకాల శ్రమవల్ల ఉత్పత్తి అయిన ఉత్పాదితాల మధ్య మాత్రమే సరుకులకుండే సంబంధం ఉంటుంది.' (పేజీ-37)

'సరుకు విలువ అనే వాస్తవం 'యెక్కడ దొరుకుతుందో' మనకు తెలియదు... పదార్థానికి సంబంధించిన ఒక్క పరమాణువు సైతం దాని విలువలోకి ప్రవేశించదు. ఒక సరుకును ప్రత్యేకంగా పరిశీలించండి. అది 'విలువున్న వస్తువు'గా ఉన్న మేరకు, 'ఆ విలువ' ఏమిటో గ్రహించడం అసాధ్యం అనిపిస్తుంది. అయితే, 'సరుకు విలువ'కి ఉన్నది కేవలం 'సామాజిక అస్తిత్వం' అనీ; 'మానవశ్రమ' అనే 'సామాజిక పదార్థానికి' 'సాకార రూపంగా లేదా వ్యక్తీకరణగా' ఉన్నమేరకే, 'విలువ'కి ఈ అస్తిత్వం వస్తుందనీ మనం దృష్టిలో ఉంచుకుంటే, సరుకుకీ సరుకుకీ మధ్య ఉన్న సామాజిక సంబంధం ద్వారా మాత్రమే 'సరుకు విలువ' వ్యక్తమవుతుందని స్పష్టమవుతుంది.' (పేజీ-42)

ఇక్కడి నుండి మార్క్స్ మనకు విలువ సంబంధం, రూపాలు, నిర్దిష్ట శ్రమ, అనిర్దిష్ట శ్రమ, మొదలైన అంశాలను వివరిస్తాడు (పేజీ-43-57)

III) వివిధ 'విలువ రూపాలు', వాటి అభివృద్ధి:

1) విలువ ప్రాథమిక రూపం ('క' రూపం): 20 గజాల వస్త్రం వ 1 కోటు, 10 పౌనుల టీ మ టన్ను ఇనుము లాంటి సమీకరణాలే 'విలువ ప్రాథమిక రూపం'కి చెందుతాయి. 'ఈ సంబంధంలో, విలువ తెలుసుకోవలసిన సరుకు (వస్త్రం)-ఉపయోగపు విలువగానూ (అంటే, కోటు గానూ); ఆ విలువను వ్యక్తం చేసే సరుకు(కోటు) - కేవలం మార్పిడి విలువగానూ వ్యవహరిస్తాయి. కనుక, ఒక సరుకు విలువ ప్రాథమిక రూపం అంటే- ఆ సరుకులో ఉపయోగపు విలువకీ, విలువకీ మధ్య వైరుధ్యాన్ని స్పష్టంచేసే ప్రాథమిక రూపం అన్నమాట.'

మార్క్స్ తర్వాత ఇలా అంటాడు: 'ఒక ఉపయోగకర వస్తువుపై ఖర్చు చేసిన శ్రమ, ఆ వస్తువు వస్తుగత గుణాలలో ఒకటిగా, అంటే, దాని విలువగా, వ్యక్తమయ్యే యుగంలో దానిని బట్టి మాత్రమే, ఒక ఉత్పాదితం సరుకు అవుతుంది.' (సంక్షిప్తంగా). ఇంకా ఇలా అంటాడు: 'విలువ ప్రాథమిక రూపమే-చారిత్రకంగా 'ఒక శ్రమ ఉత్పాదితం' 'ఒక సరుకుగా దర్శనమిచ్చే' 'విలువ ఆదిమరూపం' అనీ; 'విలువ రూపం' అభివృద్ధి చెందుతున్న కొద్దీ, అదే వేగంతో 'శ్రమ ఉత్పాదితాలు' క్రమంగా 'సరుకులుగా' పరివర్తన చెందుతాయనీ స్పష్టమవుతుంది.' (పే 56) ఇలాంటి రూపాలు యాదృచ్ఛికంగా ఎప్పుడో ఒకసారి జరిగే మార్పిడుల ద్వారా శ్రమ ఉత్పాదితాలు సరుకులుగా మారే తొలిదశలో మాత్రమే తలెత్తుతాయని అంటాడు.

2) విలువ విస్తృత రూపం ('చ' రూపం): 1 కోటు వ 20 గజాల వస్త్రం లేదా క్వార్టర్ ధాన్యం లేదా 2 ఔన్సుల బంగారం

ఇలాంటి రూపం, ఒక సరుకుని దాని ఉప. విలువ నుండి పైని 'క' రూపం కంటే బాగా వేరుచేసి చూపుతుంది. ఉదా//కి, పశువులు, అలా వందల ఏళ్లు మార్పిడి సరుకులుగా వాడబడ్డాయని మార్క్స్ చెబుతాడు.

3) విలువ సాధారణ రూపం ('ట' రూపం): 1 కోటు లేదా 10 పౌనుల టీ లేదా క్వార్టర్ ధాన్యం వ 20 గజాల వస్త్రం ఇప్పుడు ప్రతి సరుకు విలువనూ వస్త్రంతో సమం చేయడం ద్వారా ఆ సరుకు విలువ దాని ఉప. విలువ నుండి మాత్రమే కాక, మిగిలిన ఇతర ఉప.విలువలన్నింటి నుండి వేరుచేయబడుతోంది. అందువల్లనే అది, అన్ని సరుకులకూ ఉమ్మడి అంశంలాగా వ్యక్తం అవుతోంది. ఈ రూపం వల్ల మొట్టమొదటిసారిగా, సరుకులు విలువలుగా ఒకదానితో ఒకటి సంబంధంలోకి వస్తాయ్యి లేదా మార్పిడి విలువలుగా దర్శనమిస్తాయి.'

4) బంగారం రూపం ('త' రూపం): 'ట' రూపంలో, '20 గజాల వస్త్రం'కి బదులు, '2 ఔన్సుల బంగారం' రాస్తే, వచ్చే రూపమే 'ట' రూపం. 'సామాజిక సంప్రదాయం చిట్టచివరికి 'బంగారాన్ని' వేరుగా, సార్వత్రికంగా మార్పిడిచేయ వీలైన పదార్థంగా, అంటే, 'సార్వత్రిక సమవిలువ రూపంగా' గుర్తించింది. (పేజీ 63) 'శ్రమ ఉత్పాదితాలు' విలువలుగా ఒకేలాంటి సామాజిక అంతస్తును 'మార్పిడిలో' మాత్రమే సాధిస్తాయి. ఒక వస్తువును ఉపయోగకర వస్తువుగానూ, విలువగానూ వేరుచేసి చూడాలంటే ఉపయోగకర వస్తువులు మార్పిడి కోసం తయారవుతూ, ఉత్పత్తికిముందే విలువలుగా వాటి స్వభావాన్ని పరిగణనలోకి తీసుకోవలసిన విస్తృతస్థాయికి మార్పిడి పెరగాలి.' (పేజీ 66)

IV) విలువల చిత్రలిపి: 'విలువ తనేమిటో తెలియజేసే చీటీని నుదిటిమీద అంటించుకుని తిరగదు... ఒక 'ఉపయోగకర వస్తువు'కి 'విలువ' అనే ముద్ర తగిలించడమనేది - 'భాష' లాగానే, సామాజిక ఉత్పాదితం.' (పేజీ 67) అయినా, మన ఈ ఆవిష్కరణ-'శ్రమ సామాజిక స్వభావం' 'ఉత్పాదితాల వస్తుగత స్వభావంలా' కన్పింపజేసే పొగమంచుని తొలగించదు.' (పేజీ 67)

'డబ్బు రూపం' 'విలువ'ను సరిగా వ్యక్తం చేయలేకపోయింది: విలువ పరిమాణాన్ని 'శ్రమకాలం' నిర్ణయిస్తుందన్నదిఃపైకి కన్పించే సరుకుల సాపేక్ష విలువల ఎగుడుదిగుళ్ల మాటున 'దాగిన రహస్యం'. ఉత్పాదితాల విలువ పరిమాణాలు 'యాదృచ్ఛికంగా' నిర్ణయింపబడుతున్నట్లు కన్పించడాన్ని పూర్తిగా తొలగించినప్పటికీ, యీ కొత్త ఆవిష్కరణ, 'ఆ నిర్ణయింపబడే తీరుని' మార్చలేదు. ... ఉత్పాదితాలను సరుకులుగా మార్చే గుణాల చారిత్రక స్వభావాన్ని పరిశీలించని మానవుల అసంపూర్ణ విశ్లేషణ ఫలితంగా, 'సరుకుల ధరల గురించిన విశ్లేషణే' 'విలువ పరిమాణ నిర్ధారణకి' దారితీసింది. సరుకులన్నింటినీ ఉమ్మడిగా 'డబ్బు రూపంలో' వ్యక్తం చేయడమే, విలువలుగా వాటి గుణాలను నిర్ధారించింది. అయితే, సరుకుల ప్రపంచపు అత్యున్నత దశ అయిన ఈ డబ్బు రూపం 'ప్రైవేట్ శ్రమ' లోని సామాజిక స్వభావాన్నీ, వ్యష్టి ఉత్పాదకుల మధ్యగల సామాజిక సంబంధాలనూ వెల్లడించడానికి బదులు, మరుగుపరుస్తుంది.' (పే 68).

V) సరుకు అసలు స్వభావం : 'పన్నెండో శతాబ్దంలో సరుకుల జాబితాలో బట్టలు, పాదరక్షలు, తోలువస్తువులు, వ్యవసాయ పరికరాలతో పాటు, వేశ్యల్ని కూడా చేర్చి రాశాడో ఫ్రెంచి కవి......'ఒక సరుకు దాని సొంతదారుని కంటే భిన్నం' అని చూపే ప్రధాన అంశమేమంటే, అది 'ప్రతి ఇతర సరుకునీ' 'తన సొంతవిలువ దృశ్యమాన రూపంగా' చూస్తుంది. జన్మత: దానికి ఉచ్ఛ, నీచాలు లేవు. ఏ నైతిక విలువలను విశ్వసించదు.....' (పేజీ-78)

VI) ఒక ఉపయోగకర ఉత్పాదితం, మార్పిడి స్థాయికి చేరటం, సరుకుగా, తర్వాత డబ్బుగా స్థిరపడటం దాకా, దాని చలన క్రమం:

మార్క్స్ దీనిని (సారాంశంలో) ఇలా చెబుతాడు (పేజీ-80-83): 'ఒక ఉత్పాదితం, వారి సొంతదారులకు / సమాజానికి ఉపయోగేతర వస్తువై, వాటిని తమకు బయట గల సమాజంలోని వారితో మార్పిడి చేసుకుంటారు. ఆ తర్వాత ఈ చర్య వారి సమాజం లోపలి వారితోనే జరిగి, అది ఒక 'సాధారణ సామాజిక చర్య'గా మారి, ఉత్పాదితాల్లో కొంత భాగాన్ని మార్పిడి చేసే ఉద్దేశ్యంతోనే ఉత్పత్తి చేస్తారు. అలా అవి 'సరుకుల' స్థాయికి వస్తాయి. అప్పుడు, ఉపయోగపు విలువకూ, మార్పిడి విలువకూ భేదం వున్నట్లు గుర్తించబడి వీటి వైవిధ్యం, సరుకుల సంఖ్యా పెరుగుతున్న కొద్దీ, 'విలువ రూపం' అవసరం వస్తుంది. అలా ఒక 'ప్రత్యేక సరుకు' అన్ని ఇతర సరుకులకూ 'సమవిలువ' కావడం జరిగి; క్రమంగా కొన్ని 'నిర్దిష్ట తరహా వస్తువులే' ఆ సమవిలువ రూపాన్ని పొందుతాయి (ఉదాహరణకి, పశువులు). ఆ తర్వాత ఇది 'ఖరీదైన లోహాలకు' క్రమంగా బదిలీ అయి, 'బంగారం, వెండి' లకు ఆ రూపం దక్కుతుంది. చివరికి, 'డబ్బు' బంగారం స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇప్పుడు, డబ్బు 'సార్వత్రిక సరుకు' కాగా, దానికి మిగిలినవన్నీ 'నిర్దిష్ట సరుకులు'గా వ్యవహరిస్తాయి.'

ఇలా, సరుకు, విలువ, దాని రూపాల అభివృద్ధి, మార్పిడి నియమాలు, మొదలైన వాటిని వివరించిన తర్వాత మార్క్స్, పెట్టుబడి సాధారణ సూత్రంలోని వైరుధ్యాలను వివరించి, చివరికి, కార్మికుని దృష్టితో ఉత్పత్తి ప్రక్రియను పరిశీలించి, విశ్లేషించి, 'శ్రమశక్తి' అనేది సరుకుగా ఎలా మారిందో చూపి, అప్పుడు అదనపు విలువను, అ.వి. సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి, 'శ్రమ, శ్రమవిలువ దోపిడీ'ని వివరిస్తాడు.

VII) పెట్టుబడి సాధారణ సూత్రంలోని వైరుధ్యాలు: 'డబ్బు పెట్టుబడి అయినప్పుడు (అంటే, డ-స-డ' రూపం లోని వాణిజ్య పెట్టుబడి, పారిశ్రామిక పెట్టుబడ్ని డ-డ' రూపానికి కుదించబడ్డ 'వడ్డీ పెట్టుబడి' లనేవి, వాస్తవానికి చలామణి రంగంలో ప్రత్యక్షంగా కన్పించే పెట్టుబడి సాధారణ సూత్రం అంటాడు మార్క్స్), చలామణి తీసుకునే రూపం (అంటే, వ్యాపారంలో ఇద్దరు కాక, ఉదాహరణకి, మూడో వ్యక్తి డబ్బుతో చలామణిలోకి ప్రవేశిస్తే, వ్యాపారంలో మార్పిడి చేసుకునే ఆ మొదటి ఇద్దరకీ, అమ్మడం, కొనడం అనే విరుద్ధ ప్రక్రియలు వ్యతిరేక క్రమంలో కాక, ఆ ఇద్దరి మధ్య లావాదేవీ ఒకేఒక చర్యగా కుదించబడుతుంది) మనం ఇంతవరకు పరిశీలించిన సరుకుల స్వభావం, విలువ, డబ్బు, చలామణి, వగైరాలకు వర్తించే నియమాలన్నింటికీ వ్యతిరేకంగా ఉంది.

1) కనుక ఈ అమ్మకం, కొనుగోలు అనే రెండు దశల క్రమాన్ని తిరగేసినప్పటికీ, అది సరుకుల సాదా చలామణి రంగం నుండి మనని బయటకు తీసుకుపోదు' అని నిర్ధారిస్తాడు మార్క్స్. (పేజీ 142-145)

2) కనుక, ఇప్పుడు, చలామణి క్రమం సరుకుల సాదా, సూటి మార్పిడిగా దర్శనమిచ్చే రూపాన్ని పరిశీలిద్దాం అంటాడు మార్క్స్. దీనిలో, 'కనుక ఉప. విలువకు సంబంధించిన మేరకు 'మార్పిడి' అనే లావాదేవీలో ఇరుపక్షాలూ ప్రయోజనం పొందుతాయి... మార్పిడి ద్వారా సంపాదించిన విలువతో సమానమైన విలువ, మార్పిడికి ముందే ప్రతి ఒక్కరి దగ్గరా వుంది. చలామణి సాధనంగా సరుకుల మధ్య డబ్బుని ప్రవేశపెట్టడం ద్వారా, క్రయ విక్రయాలను రెండు విభిన్న విడి చర్యలుగా చేయడం ద్వారా, ఫలితంలో మార్పేమీ ఉండదు. ఒక సరుకు చలామణి లోకి వెళ్లడానికి ముందే, దాని విలువ, దాని ధరలో వ్యక్తమవుతుంది. కనుక అది, చలామణికి ముందు షరతు తప్ప, దాని ఫలితం కాదు.' (పేజీ 144)

3) ఇక ఇప్పుడు, 'మార్పిడిని సామాన్య రూపంలో పరిశీలిస్తే (...వాటి ఉప.విలువల్ని మినహాయిస్తే), సరుకు రూపంలో మార్పు తప్ప, మరేమీ ఉండదు. అదే, మార్పిడి విలువ రూపంలో చూస్తే అది సరుకు విలువలో కలిగే మార్పు, దాని డబ్బురూపంలో మార్పుకి మాత్రమే పరిమితం. అది మొదట, 'సరుకు ధరగా', తర్వాత 'కొంత డబ్బుగా', చివరగా ఒక 'సమవిలువ గల సరుకు ధరగా' ఉంటుంది. ఉదాహరణకి: 5 పౌండ్ల నోట్‌ని నవరసుగా, అర్ధ నవరసుగా, షిల్లింగులుగా మారిస్తే, వాటి

విలువలో మార్పేమీ ఉండనట్లే; విడిగా తీసుకుంటే, రూపంలో వచ్చిన యీ మార్పు, 'విలువ పరిమాణంలో' ఏ మాత్రం మార్పుని సూచించదు. సరుకుల చలామణి వాటి విలువల రూపాన్ని మాత్రమే ప్రభావితం చేస్తుంది కనుక, అంతరాయం కల్గించే ప్రభావాలకు లోబడకుండా ఉంటుంది కనుక, ఆ మేరకు అది సమవిలువల మార్పిడి అయ్యుండాలి' అంటాడు మార్క్స్. (పే. 145)

4) తర్వాత, నాటు అర్థశాస్త్రం చెప్పే సరుకుల్ని వాటి విలువలకి భిన్నమైన ధరలకి అమ్మితే లాభం వస్తుంది లాంటి భిన్నత్వాలను సరుకుల మార్పిడి నియమాలకు ఉల్లంఘనలుగా మాత్రమే పరిగణించాలి......

5) ఇక, 'సరుకుల చలామణిని, 'అదనపు విలువకి జన్మస్థానంగా' చూపించే ప్రయత్నాలన్నింటి వెనుక ఉప.విలువనీ, మార్పిడి విలువనీ కలగాపులగం చేసే గందరగోళం తొంగి చూడటాన్ని మనం గమనిస్తాం' అంటూ, కాండిలాక్ అనే ఆర్థికవేత్తని ఉదహరిస్తూ, వాణిజ్యవేత్తలు నేటికీ, కాండిలాక్ చెప్పిన పిల్లకాయ వాదనను వాడుతున్నారంటాడు. కాబట్టి, ఈ పద్ధతిలో కూడా అదనపువిలువ పుట్టదు అంటాడు. (పే. 146)

6) 'దాని మామూలు రూపంలో సరుకుల చలామణి సమవిలువల మార్పిడి జరగాలంటుంది. అయితే, ఆచరణలో యీ ప్రక్రియ దాని మామూలు రూపాన్ని నిలబెట్టుకోదు. కనుక మనం, 'అసమ విలువల మార్పిడిని' ఊహిద్దాం' అంటాడు మార్క్స్. (పేజీ 147)

'సరుకుల అమ్మకందార్లు వాటిని వాటివిలువకు మించి అమ్మితే, వారు కొనేటప్పుడు వాటి విలువకు మించి కొనాల్సి ఉంటుందనీ; అలానే, తక్కువకు అమ్మితే, ఎక్కువకు కొనాల్సి ఉంటుందనీ' అంటూ, ఇలాంటి ఊహ వల్ల, అదనపు విలువ సృష్టిని, డబ్బు పెట్టుబడిగా మారడాన్నీ వివరించడం సాధ్యం కాదు' అంటాడు. (పే. 148)

'కనుక, కొనుగోలుదారులే అమ్మకందారులుగానూ, అమ్మకందారులే కొనుగోలుదారులుగానూ ఉండే మార్పిడి పరిమితుల్లోనే మనం ఉందాం.

ఉదాహరణకి: ఒక యూదుడు ఆన్ మహారాణి కాలపు ఫార్తింగ్ అనే చిల్లర నాణాన్ని, గినీ అనే బంగారు నాణానికి అమ్మినంత మాత్రం చేత 'దేశంలో ఉన్న విలువైన లోహాల పరిమాణంలో' ఎటువంటి మార్పు రానట్టే, 'పంపిణీలో' ఎటువంటి మార్పు వచ్చినప్పటికీ, 'చలామణిలో ఉన్న సరుకుల విలువ' ఏమాత్రం వృద్ధి చెందదు. పెట్టుబడిదారీ వర్గం 'మొత్తంగా' తనని తాను మోసపుచ్చుకోదు.' (పే. 149)

ఇలా అంటున్నప్పుడు, మార్క్స్ దృష్టి 'మొత్తం సామాజిక ఉత్పత్తి, దాని రాశి, ఆ విధానం' మీద ఉందని మనం 'విలువ' విశ్లేషణలో ఇక్కడ, ఇకముందు కూడా తప్పక గుర్తుంచుకోవాలి. చివరికి, ఈక్రింది సారంశానికి మార్క్స్ మనల్ని తెస్తాడు:'దీన్ని ఎంతగా, ఎటు తిప్పినా, వాస్తవం మారదు. 1) సమవిలువల మధ్య మార్పిడి జరిగితే, అదనపు విలువ పుట్టదు. 2) అసమ విలువల మధ్య మార్పిడి జరిగితే, అదనపు విలువ పుట్టదు. 3) అసమ విలువల మధ్య మార్పిడి జరిగినా, అదనపు విలువ రాదు. 4) సరుకుల చలామణి నుండి, మార్పిడి నుండి, విలువ పుట్టదు.' ఇక్కడ, మనం ఒక విషయం ఈ వ్యాసం ఆసాంతం గుర్తుంచుకోవాల్సింది ఏమిటంటే, 'ఆధునిక సమాజపు ఆర్థిక చట్రాన్ని నిర్ధారించే పెట్టుబడి ప్రామాణిక రూపాన్ని విశ్లేషించేటప్పుడు, దాని అత్యంత ప్రచలిత రూపాలూ, ఒక విధంగా చెప్పాలంటే, అనాదికాలపు రూపాలయిన వాణిజ్య పెట్టుబడి గురించీ, వడ్డీ వ్యాపారుల గురించీ, నేను ఏమాత్రం ప్రస్తావించకపోడానికి గల కారణమేమిటో ఇప్పుడు స్పష్టమైంది.' (పే. 150)

VIII) స్వయంగా విలువను వృద్ధి చెందించుకునే సరుకే 'శ్రమశక్తి': బ్రహ్మచారి వ్యాసంలో, బూట్లు తయారు చేయటంలో, తోలు విలువ స్వయంగా పెరగలేదు, అలా అది అదనపు విలువను కలుపుకోలేదు అనే దాన్ని రాశారు. అయితే, ఇక్కడ మార్క్స్ ఎందుకు ఈ విషయం రాశాడంటేఃఇప్పటివరకు జరిగిన విశ్లేషణను బట్టి, మనకు ఉత్పత్తి కార్యంలోనూ, చలామణిలోనూ 'అదనపు విలువ' సరుకులో కలవలేదని చూశాం కనుక్మ అది అలా వేరే ఏరకంగానైనా, ఉత్పత్తి ప్రక్రియలోని ఏ పదార్థంలోనైనా కలుస్తుందేమోనని చూచి , 'అలా తోలులో కలవలేదు' అని చెప్పటానికే. దీనిపై మళ్లీ చూద్దాం.

కనుక, 'సరుకుల మార్పిడిని పాలించే నియమాల ప్రాతిపదికపై, 'సమవిలువల మార్పిడి' ప్రారంభస్థానంగా ఉండేటట్లు, 'డబ్బు, పెట్టుబడిగా మారటాన్ని వివరించాల్సి వుంది' అంటాడు. (పేజీ152) 'సరుకుల సగటు ధరలు', అంటే-అంతిమంగా సరుకుల విలువే- ధరల్ని క్రమబద్ధం చేస్తుందని చెబుతూ ఇచ్చిన పాదసూచిక-1లో, విలువ పరిశోధనలో ఆటంకాలు లేకుండటానికే 'సరుకుల సాదా చలామణి, మార్పిడి నియమాల కనుగుణంగా తన విశ్లేషణను చేస్తున్నాననీ, ఇది ఒక శాస్త్రీయ పద్ధతి అనీ వివరిస్తాడు మార్క్స్. (పే. 152)

'శ్రమశక్తి' అనే 'స్వయం ప్రవర్ధమాన విలువ': ఇంతకుముందు పేరాలో 'స్వయం విస్తరణ' గుణం గల సరుకును అప్పటి విశ్లేషణ దశ వరకూ (పే. 153 లోని మొదటి పేరా, మొదటి లైనులో) కనుగొనలేక పోయామన్న మార్క్స్, 'శ్రమశక్తి క్రయ విక్రయాలు' అనే అధ్యాయంలో, అలాంటి లక్షణాలు గలది ఒక్క 'శ్రమశక్తి' అనే సరుకే అంటాడు. దాని గురించి చెప్పే ముందు, "తన ఉపయోగంలోనే విలువను స్రవించే' ప్రత్యేకత కల్గిన, ఈ 'శ్రమశక్తి' అనే సరుకు వల్లనే 'విలువలో మార్పు సాధ్యం" అనే దశకు మనం ఎలా తేబడతామో ఈ కింద వివరిస్తాడు.

IX) 'అదనపు విలువ సృష్టి ప్రదేశం' ఉత్పత్తి ప్రక్రియలోనే ఉంటుంది: బ్రహ్మచారి, తన వ్యాసంలో దీన్ని వివరించినా, స్పష్టత కోసం మరికొంత రాయాల్సి వస్తోంది. మార్క్స్ ఇక్కడ, డ-స-డ' క్రియలోని మొదటి, రెండవ చర్య అంటూ రాసి వివరించినా, విషయం స్పష్టం కావటం లేదు కనుక, మనం దీన్ని, డ-స, స-డ అనే రెండు చర్యలుగా విడదీసి, అప్పుడు మార్క్స్ ఈ పేరాలోనే చెప్పిన విధానాన్ని అర్థం చేసుకుందాం (డ-పెట్టుబడిదారుడు ఉత్పత్తిలో పెట్టిన పెట్టుబడి; స-అతను కొన్న సరుకు, ఇక్కడ అది, 'శ్రమశక్తి'; స- 'శ్రామికుడు' ఉత్పత్తి చేసిన సరుకు; డ-పెట్టుబడిదారుని చేతికి చివరికి వచ్చే డబ్బు), ఇలా 1) విలువ మార్పు 'స్వయంగా డబ్బులోనే తలెత్తదు'. 2) డ-స చర్యలో, పెట్టుబడిదారుడు శ్రమశక్తి అనే సరుకును శ్రామికుని నుండి సమవిలువకు కొంటాడు. స-డ చర్యలో కూడా అతడు, సమవిలువకే తన కొత్త (ఉత్పత్తిలో మారిన) సరుకును కొనుగోలుదారుడికి అమ్ముతాడు. అంటే, ఈ రెండు చర్యల్లోనూ, సరుకుల మార్పిడి విలువలకు అనుగుణంగానే మార్పిడి జరిగింది; కానీ, అదనపు విలువ వచ్చింది. 3) అంటే, ఈ మార్పు, 'సరుకు ఉప. విలువలోనే', అంటే-'దాని అనుభోగంలోనే' (స-స అనే క్రియ 'ఉత్పత్తి ప్రక్రియ' లోనే) వచ్చిందనే నిర్ధారణకి మనం చేరుకోక తప్పదు అంటాడు మార్క్స్. ఆ తర్వాత, 'ఒక సరుకు అనుభోగం నుండి, 'విలువ'ని రాబట్టటానికి వీలుగా మన మిత్రుడైన డబ్బు సంచి గారికి, చలామణి రంగంలోనే, మార్కెట్లోనే, 'విలువకి మూలంగా ఉండే' 'ప్రత్యేక స్వభావం గల ఉప. విలువ ఉన్న' సరుకు దొరికే అదృష్టం ఉండాలి.ఆ సరుకు 'వాస్తవ అనుభోగం' అనేదే,

'స్వయంగా శ్రమకి సాకార రూపం' , కనుక 'విలువసృష్టి'. డబ్బుగలవాడు మార్కెట్లో, 'శ్రమ చేయగల సామర్థ్యం లేదా శ్రమశక్తి' అనే ప్రత్యేక సరుకుని కనుగొంటాడు.' (పే. 153). ఈ రకంగా మనం, సరుకుల మార్పిడి సూత్రాలకు అనుగుణంగానే, పెట్టుబడిదారునికి అదనపు విలువ వస్తుందని నిర్ధారణకు రాగలిగాం.

ఇక చూడాల్సింది శ్రమశక్తి 'సరుకు'గా ఎలా మారిందనీ, అదనపు విలువ సిద్ధాంతాన్ని ఎలా అర్థం కోవాలనేదీ, అనేవి. ముందుగా, శ్రమ, శ్రమశక్తి గురించి చూద్దాం.

X) శ్రమ, శ్రమశక్తి గురించి: దీని గురించి, బ్రహ్మచారి వివరించారు. మరికొన్ని లక్షణాలను చూద్దాం. 'డబ్బు యజమానికి మార్కెట్లో శ్రమశక్తి 'ఒక సరుకుగా' దొరకాలంటే రెండు షరతులు నెరవేరాలి. 1) శ్రమశక్తి శ్రామికుని అధీనంలో ఉండాలి. అంటే–తనపై తనకు పూర్తి అధికారం ఉండాలి. శ్రామికునికీ, పెట్టుబడిదారునికీ మధ్య మార్పిడి సంబంధం కొనసాగాలంటే, శ్రమశక్తి యజమాని దాన్ని ఒక నిర్దిష్ట కాలానికి మాత్రమే అమ్మాలి. తన శ్రమశక్తిని అతడు ఎప్పుడూ తన సొంత ఆస్తిగా, తన సొంత సరుకుగా భావించాలి. దానిని అతడు కొనుగోలుదారుడి స్వాధీనం లో ఒక నిర్దిష్టకాలం పాటు, తాత్కాలికంగా మాత్రమే ఉంచటం ద్వారా అది సాధ్యమవుతుంది. ఈ రకంగా మాత్రమే అతడు దానిపై తనకున్న యాజమాన్యపు హక్కుల్ని వదులుకోకుండా ఉండగలుగుతాడు.. దీన్ని అమ్మడానికి అతనికి ఏ నిర్బంధాలూ లేని స్వేచ్ఛ ఉంది. 2) కార్మికునికి ఏ ఉత్పత్తి సాధనాలు గానీ, సరుకులు గానీ ఉండక, 'తనలోనే ఉండే తన సొంత శ్రమశక్తినే' అమ్ముకోవాల్సిన పరిస్థితిలో ఉండాలి. (పే. 153, 154)

శ్రమశక్తి సరుకు ఎలా అయ్యింది? 'ఒక వైపున, డబ్బు లేదా సరుకుల యజమానుల్నీ, మరోవైపున తమ సొంత శ్రమశక్తి తప్ప మరేమీ లేని మనుషుల్నీ ప్రకృతి సృష్టించదు... ఇది స్పష్టంగా గత చారిత్రకాభివృద్ధి ఫలితం... ఉత్పత్తి సాధనాల, జీవనాధారాల యజమాని మార్కెట్లో తన శ్రమశక్తిని అమ్ముకునే స్వతంత్ర కార్మికుణ్ణి కలుసుకున్నప్పుడే, దానికి (పెట్టుబడికి) ప్రాణం వస్తుంది. ఈ ఒక్క చారిత్రక పరిస్థితిలో ప్రపంచ చరిత్ర ఉంది... ప్రకటిస్తుంది.' ఇక్కడ పాదసూచిక–1 లో 'కార్మికుని దృష్టిలో 'శ్రమశక్తి', 'అతని ఆస్తి అయినట్టి' 'సరుకు రూపం' ధరిస్తుంది. తత్ఫలితంగా, అతని శ్రమ, 'వేతన శ్రమ' అవుతుంది. మరో వైపున, ఈ క్షణంనుండే, శ్రమ ఉత్పాదితం 'సార్వత్రిక సరుకు' అవుతుంది. ఇది పెట్టుబడిదారీ యుగపు స్వభావం' అన్న మార్క్స్ వివరణను బట్టి, 'శ్రమశక్తి' అనేది 'సరుకు'గా చారిత్రకంగా మారుతూ వస్తున్నది అనడం సరైనదే. ఈ దౌర్భాగ్యపు స్థితికి మానవ సమాజం చేరటం, వివిధ భౌగోళిక పరిస్థితులు, జాతుల, మతాల, వర్గాల, సంస్కృతుల, వలసల, వర్గపోరాటాల, ఉత్పత్తి పద్ధతుల మార్పు వంటి ఎన్నో కారణాల ఫలితం. 'పూర్తిగా తయారైన వస్తువులో దానికి ఆ ఉపయోగకర లక్షణాలను చేకూర్చిన శ్రమ కన్పించదు. దానిలో మాయమైపోయినట్టనిపిస్తుంది.'

'శ్రమశక్తి మానవాకారమైన కార్మికుడు.' 'శ్రమశక్తిని కొనడంద్వారా పెట్టుబడిదారుడు, 'పులియబెట్టే సజీవ పదార్థంగా' 'శ్రమ'ని ఉత్పాదితం నిర్జీవ భాగాలకు జోడిస్తాడు.' (పే. 167–169)

శ్రమశక్తి విలువ, జీతం: అసలుకి, 'శ్రమశక్తి విలువ' అంటే 'జీతం కాదు' అన్న భావన సరైనదే. ఎలాగంటే ప్రాచీనకాలం నుండి చూసుకున్నా, 'శ్రమశక్తి విలువ' అనేది, 'కార్మికునికీ, అతని కుటుంబానికీ, పునరుత్పత్తికీ అయ్యే ఖర్చులు కలిపే నిర్ణయింపబడుతోంది. అయితే, ఈ విలువ, ఏకాలం నాటిది చూసుకున్నా కూడా, జీతం/కూలీ అనే దానికంటే, చాలా ఎక్కువగానే ఉంటుంది. కానీ, శ్రామికునికి మాత్రం, అతనిచే పనిచేయించుకునే వారు, చాలా తక్కువ విలువ చెల్లిస్తూ వస్తున్నారు. శ్రామికునికి జరిగే మోసంలోని మొదటిమెట్టు కూడా ఇందులోనే ఉంది. అయితే, రివాజుగా ఉన్న 'జీతం' అన్న పదాన్ని వాడి, సమవిలువల మార్పిడి నియమాల ద్వారానే, 'అదనపు విలువ' అనేది , శ్రామికుని శ్రమశక్తిని దోపిడీ చేయడం ద్వారా పుడుతుందని చూపించి, ఆ తర్వాతే మనకు మార్క్స్, ఈ 'జీతం' అనే దానిలో వుండే మోసాన్నీ, దొల్లతనాన్నీ చెబుతాడు. దీనికి 'గోథా కార్యక్రమంపై విమర్శ'లో నుంచి ఉదహరిస్తాను. 'వేతన వ్యవస్థ రద్దు' అన్న లాసాల్ వ్యాఖ్య తప్పు. అలా అంటే, అది ప్రతీ ఒక్క సామాజిక వ్యవస్థనీ నియంత్రిస్తుంది. అందుకే మనం 'వేతన శ్రమ వ్యవస్థ రద్దు' అనాలి.'

ఇన్ని లక్షణాలు ఉన్న శ్రమశక్తి గురించి చివరగా, ఒక వ్యాఖ్య: 'ఈ రూప పరివర్తన, డబ్బు పెట్టుబడిగా మారడం, చలామణి రంగంలోనూ జరుగుతుంది, దాని బయటా జరుగుతుంది. 'చలామణి రంగం లోపల' అనడం ఎందుకంటే–శ్రమశక్తిని మార్కెట్లో కొనుగోలు చేయాల్సిన పరిస్థితి వల్ల. 'చలామణి రంగానికి బయట' అనడం ఎందుకంటే, పూర్తిగా ఉత్పత్తి రంగానికి పరిమితమై ఉండే అదనపు విలువ ఉత్పత్తి అనే ప్రక్రియకు, చలామణి రంగంలో జరిగేది, కేవలం ఒక మెట్టు మాత్రమే.' (పేజీ–178) కాబట్టి, అదనపు విలువ అనేది ఉత్పత్తి రంగానికే అత్యధికంగా చెంది వుంటుందని గుర్తుంచుకోవాలి.

XI) అదనపు విలువ: 'శ్రామికుని దృష్టితో' ఉత్పత్తి ప్రక్రియని పరిశీలిద్దాం. ఉదాహరణకు, అతని పనిలో రు.10,000 ముడిపదార్థాల విలువనూ, రు.10,000 ఉత్పత్తి సాధనాల విలువనూ, వాటి అరుగుదలనూ కలిపినది, కార్మికుని శ్రమశక్తి విలువ రు.200 అనుకుంటే, మొత్తం విలువ రు. 20,200 అవుతుంది. శ్రామికుడు తన 'శ్రమ శక్తి విలువ'కి సమానమైన విలువ గల వాటిని (ఇక్కడ, అది రు.200) అతను ఉత్పత్తిచేసే స్థాయి వరకు (ఉదాహరణకి, ఒక వస్త్రం గానీ, దానిలో సగభాగం గానీ అయ్యేవరకు, వాస్తవంలో ఈ హద్దు మనకు కనపడదు) గనుక, మనం ఉత్పత్తి క్రియలో పాల్గొనే పదార్థాల విలువ పరిమాణాన్ని మాత్రమే పరిగణిస్తే, ఇలా ఉంటుంది–

రు.10,000 + 10,000 = 200 = రు.20,200.

కానీ, విలువ పరిమాణాన్నీ, మార్పునూ కలిపి చూస్తే, ఫలితం – 10,000 + 10,000 + 200+ ఉప. లక్షణం గల సరుకు.

ఇక్కడ, రెండు విషయాలు గుర్తుంచుకోవాలి –

1. శ్రమశక్తి విలువను 'పునరుత్పత్తి చేసే దశ వరకు' ఉత్పత్తి వాస్తవంలో జరగదనీ, అంతకు రెట్టింపో, ఇంకా ఎక్కువైన దశవరకో జరుగుతుందనీ; 2. అదనపు విలువ ఇక్కడ, 100 శాతం అని ఉదాహరణకి మార్క్స్ చెప్పినా, అది విషయాన్ని తేలిగ్గా అర్థం చేసుకోడానికే. బానిస, మధ్యయుగాల్లో ఆ శాతం 500, 1000 వరకు కూడా ఉండేదని మనకి తెలుసు. మార్క్స్ మనకు దాదాపు ఈ రకమైన విశ్లేషణను పే.170–178 వరకు చెబుతాడు, ముఖ్యంగా, పే. 176లో.

ఇక ఇప్పుడు, మన శ్రామికుడు పెట్టుబడిదారునితో ఇలా అంటాడు: 'శ్రమశక్తి విలువకు నువ్వు చెల్లించిన దానికి సమానంగా నేను కూడా అంతే విలువ గల వాటిని తయారు చేశాను కాబట్టి, నాకు అప్పజెప్పిన పని అయిపోయింది. నేను పని నుండి విరమించు కుంటున్నాను'. అప్పుడు, మన పెట్టుబడిదారుడు గింజుకుంటూ చేసే అరుపులు, తర్కాలు

మార్క్స్ మాటల్లో పేజీ 175-177 వరకూ చూస్తాం. చివరికి, కార్మికుడు ఇలా అంటాడనుకుందాం: 'చూడూ, నేను నీకు ఉప. విలువ గల 'వస్త్రం' ఇచ్చాను'. దానికి బదులుగా మన పెట్టుబడిదారుడు, 'ఈ వస్త్రాన్ని నేనేం చేసుకోను, తిననా? నేను మరింత డబ్బు సంపాదించడానికే నీకు పనిచ్చాను' అంటూ రకరకాల జిమ్మిక్కులతో చిందులేస్తాడు. చివరికి, సాంప్రదాయంగా 'ఒకరోజు కూలీ విలువ'కు సరిపడా అనాదిగా సమాజంలోనూ, మార్కెట్లోనూ గల రివాజు ప్రకారం, శ్రామికున్ని 6 గంటల పనికి బదులు, 12 గంటల పనికి పురమాయిస్తాడు.

అందుకనే మార్క్స్, 'ఒక వైపున, రోజువారీ శ్రమశక్తి పోషణకి, అర రోజు శ్రమ మాత్రమే ఖర్చవుతుంది. మరోవైపున, అదే శ్రమశక్తి, మొత్తం రోజంతా పని చేయగలదు. కనుక, పెట్టుబడిదారుడు దాని ఉపయోగానికి చెల్లించే దానికంటే, ఒక రోజులో అది, రెట్టింపు విలువని సృష్టిస్తుంది. ఈ పరిస్థితి నిస్సందేహంగా, కొనుగోలుదారుని అదృష్టం, కానీ అమ్మేవానికి ఏ విధంగానూ హాని కలిగించదు. మన పెట్టుబడిదారుడు, ఈ పరిస్థితిని ముందే గమనించాడు. అదే అతని నవ్వుకి కారణం. కనుక, వర్క్‌షాపులో కార్మికుడు, 6 గంటలకు కాదు, 12 గంటలకు సరిపడా ఉత్పత్తి సాధనాలను చూస్తాడు' అంటాడు. మార్క్స్ మనకు ఈ విషయాన్ని, ముడి పదార్థాలూ, ఉత్పత్తి సాధనాలలో ఇమిడి ఉన్న గత శ్రమతోనూ, పరికరాల అరుగుదలకు కూడా విలువ నిచ్చి, శ్రమశక్తి విలువను కలిపి లెక్కించే క్రమంలో, దానిని మార్కెట్లో గల సమ విలువ అయిన 'బంగారం'తో సమం అని చూపిస్తూ, వివరిస్తాడు. అయితే ఇక్కడ, 'శ్రమశక్తి విలువ' అనేది 'శ్రమచేసే సామర్థ్యమే' కాబట్టి, అది అలా 'గత శ్రమ' అనీ, దానికంటే ఎక్కువైన విలువను 'సజీవ శ్రమశక్తి' కల్గిన 'పనిలో వున్న' శ్రామికునిలో ఉంటుందనీ చెప్పిన బ్రహ్మాచారి సరిగానే వివరించారు. అది మార్క్స్ చెప్పినదే. ఇంకా, మార్క్స్ ఇలా అంటాడు: 'మనం 'శ్రమ చేయగల శక్తి' గురించి మాట్లాడుతున్నప్పుడు, 'శ్రమ' గురించి మాట్లాడుతున్నట్టు కాదు. మనం 'జీర్ణశక్తి' గురించి మాట్లాడితే, 'జీర్ణక్రియ' గురించి మాట్లాడినట్టు కాదు. రెండోదానికి 'మంచి పొట్ట' వుంటే చాలదు. మనం, 'శ్రమ చేయగల సామర్థ్యం' గురించి మాట్లాడుతున్నప్పుడు, దానిని 'అవసరమైన జీవనాధార వస్తువుల సారంగా' గ్రహించడంలేదు. అందుకు భిన్నంగా, 'దాని విలువ ద్వారా' 'వాటి విలువ' వ్యక్తమవుతుంది...' (పే. 158)

'...కనుక, శ్రమశక్తి విలువా, శ్రమ ప్రక్రియలో ఆ శ్రమశక్తి సృష్టించే విలువా, రెండూ పూర్తిగా విభిన్న పరిమాణాలు. పెట్టుబడిదారుడు శ్రమశక్తి కొనుగోలు చేస్తున్నప్పుడు, అతని దృష్టిలో ఉన్నది సరిగా ఈ భిన్నత్వమే...' (పే. 176)

పెట్టుబడిదారుడు ఇక్కడ, కేవలం అదనపు విలువనే ఆశించడు. ఆ అదనపు విలువ గల సరుకు, ఎట్టి పరిస్థితుల్లోనూ 'గుణాత్మకమైనదిగా' (అంటే, ఉప. విలువ కలదిగా) ఉత్పత్తి అయి, తన చేతికి రావాలి. ఇక అప్పుడతడు, తన పెట్టుబడిని పునరుత్పత్తి చేసే పనిలోకి దిగుతాడు.

అయితే, ప్రధానమైన విషయం ఏమంటే: పెట్టుబడిదారుడు, 'తాను చేస్తున్నది' ఒకటి, 'మనకు వివరించేది లేదా అతను పొందే విలువ' మరొకటీ. ఇది చారిత్రకంగా సమాజంలో 'కప్పివేయబడిన' లేదా 'ముసుగేసిన' రూపంలో వుంది. మార్క్స్ ఆ ముసుగును తీసి, విషయాన్ని తేటతెల్లం పరిచాడు అంతే. దీనికి రుజువులు అనాదిగా బానిసకాలం నుండి పెట్టుబడిదారీ దశ వరకు కూడా, కార్మికుని జీవన పరిస్థితులు మారక పోవటం, పనిదినం నాటి 20 గంటల నుండి నేటి 8 గంటలకు మారుతూ వచ్చిన కాలంలో జరిగిన వర్గ పోరాటాలూ, కార్మికుల పోరాటాలూ; అతి కొద్దిమంది కార్మికులకు మెరుగైనటువంటి సౌకర్యాలూ, చాలా ఎక్కువమందికి 'పూట గడవని' నేటి స్థితీ. ఇవి చాలు. అయితే, ఈ సామాజిక దౌర్భాగ్య స్థితులు వర్ణిస్తే, పెట్టుబడిదారీ విధానంలోని డొల్లతనం శ్రామికులకు తెలీదు, సరిపోదు. అందుకే, మార్క్స్: 'శ్రమ' గురించి మథించి, 'శ్రామికునిలోనే గల' 'శ్రమశక్తి' అనే విశిష్ట ధాతువును గుర్తించాడు. 'ఈ విశిష్ట సరుకు ద్వారానే పెట్టుబడిదారుడు శ్రామికుని చేత అదనపు శ్రమ చేయించి, అదనపు విలువ రాబడుతున్నాడు' అని నిరూపించాడు.

పెట్టుబడిదారుడు 'జీతం' ఇచ్చి, కార్మికుని నుండి అదనపు విలువను పొందితే, అప్పుడది కూడా 'అసమ విలువల మార్పిడి' అవుతుంది. అలా పొందింది 'ఉత్పత్తి ప్రక్రియ బయట' అని మనకి పెట్టుబడిదారుడే చెప్పినట్లవుతుంది. ఇది సాధరణ విలువ నియమాలకు విరుద్ధం. వారు అలా చెప్పలేదు, చెప్పలేరు కూడా.

ఇక, మరో రకమైన అవకాశంలో, అంటే:'మార్పిడి నియమాల ప్రకారం, శ్రమల మారకాలు లేని పెట్టుబడిదారుడు, శ్రామికుని మధ్యన గల సంబంధాన్ని, 'అమ్మే-కొనే సంబంధంగా చెప్పవచ్చునా?' అనేది.

'పెట్టుబడిదారుడు శ్రమ చెయ్యడు కాబట్టి, అతడు, పనిచేసే శ్రామికునితో 'ఉత్పత్తి ప్రక్రియ కోసం' మార్పిడి సంబంధంలోకి రావడమంటేనే అది 'దోపిడీ సంబంధం అవుతుంది' కాబట్టి, వీరిద్దరి మధ్య అసలుకి 'శ్రమల మారకం' అన్న ప్రశ్నే తలెత్తదు' లాంటి భావనల్ని కూడా మార్క్స్ మనకు ముందే చెప్పడు. అలా, 'అసమ విలువల మధ్య' మారకాన్ని, 'సమ విలువల మధ్య మారకపు విలువలతో' నిరూపించడం చాలా గందరగోళంతో నిండి ఉంటుందనీ; విషయ విశ్లేషణ కోసం చేసే 'శాస్త్రీయ పద్ధతి' అది కాదనీ, 'సరుకు ధర' 'అంతిమంగా' 'ఉత్పాదితం విలువల్ని' ప్రభావితం చేస్తాయని చెప్పే పాదసూచిక లోనూ (పే. 152), 'అసమ విలువల మార్పిడి' ద్వారా 'అదనపు విలువ పుట్టదు' అని చెప్పే ఉదహరింపుల్లోనూ చెబుతాడు.

ఆ తర్వాతే, 'పెట్టుబడిదారుడు ఏ శ్రమా చేయకుండా, శ్రమచేసే శ్రామికుని నుండి అదనపు విలువ ఎలా, ఏ రేటులో, స్థిరపడిన సామాజిక సంబంధాల బలంతో, అభివృద్ధి చెందుతూ వస్తున్న ఉత్పత్తి ప్రక్రియలో శ్రామికుణ్ణి అరగదీసి, తన సంపద ఎలా పెంచుకుంటాడో వివరిస్తాడు. ఏ శాస్త్రాన్ని తీసుకున్నా, దానిలో అందరూ అవలంబించే పద్ధతే ఇది. దీన్నే మార్క్స్ అనుసరించాడు. ఆ రకంగా, మార్క్స్ – ఒక 'ఆర్థిక శాస్త్రవేత్త కూడా'. అంతేగానీ, 'కేవలం చరిత్రకారుడు, సామాజిక వేత్త, తత్వవేత్త, ఆలోచనా శీలి, సాహితీవేత్త మాత్రమేనో, లేదా వాటి కలగూరగంపో కాదు. అతడు – 'సామాజిక విప్లవకారుడు'.

తాను చూసిన సమాజంలోని దోపిడీనీ, అసమానతలనూ పోగొట్టడానికి జీవితమంతా ఉద్యమ, విప్లవ బాటలో నడిచి, 'సమ సమాజం' అనేది మానవ విముక్తికి బాట వేసే 'అదనపు విలువ సిద్ధాంతం', 'వర్గ పోరాటం', 'శ్రమ సంస్కృతి':వీటి ప్రచారం, ఆచరణల ద్వారా జరగాలని అహరహం ఆశించిన మార్క్స్ బాటలో మనం నడుద్దాం. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని మరింత పరిపుష్టం చేసే చర్యలు, విశ్లేషణలు, స్పష్టీకరణలు చేసుకుందాం.

*(రచయిత ప్రభుత్వ ఉద్యోగి)* వీ

### ఎనగందుల బొబ్బిలి మృతి

చరిత్ర పరిశోధకులు, కాకతీయ విశ్వవిద్యాలయం చరిత్ర విభాగం విశ్రాంతాచార్యులు ఎనగందుల బొబ్బిలి నవంబర్ 27న మరణించారు. వర్ధన్నపేట మండలం, రాయపర్తికి చెందిన బొబ్బిలి ఎల్‌బి కళాశాలలో డిగ్రీ, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పిజి, కాకతీయ విశ్వవిద్యాలయంలో పిహెచ్‌డి పూర్తిచేశారు. కెయు చరిత్ర విభాగంలో ముప్పై ఏళ్లకుపైగా చరిత్ర ఆచార్యుడిగా పనిచేసి 2011లో పదవీ విరమణ చేశారు. కాకతీయ విశ్వవిద్యాలయం చరిత్ర విభాగం హెడ్‌గా పనిచేశారు. తెలంగాణలో వ్యవసాయం రైతాంగ స్థితిగతులు అనే అంశంపై పరిశోధన చేశారు. కేవలం ప్రొఫెసర్‌గానే పరిమితం కాకుండా బిసి కులాల హక్కుల సాధన కోసం విశేష కృషి చేసారు.

### ప్రొ. శివరామకృష్ణా రావు మృతి

అధ్యాపకుడు, పరిశోధకుడు, వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయ రిటైర్డ్ ప్రొఫెసర్ ఆచార్య శివరామకృష్ణారావు డిసెంబర్ 4న మృతిచెందారు. ఆయన నెల్లూరు జిల్లాలో 1944, జులై 4న పుట్టారు. అతి చిన్నవయసులో అంటే 19 సంవత్సరంలోనే ఆర్థికశాస్త్రంలో ఎంఎ పూర్తిచేసి, 20 ఏళ్ల వయసులో ఎంఎస్‌సి స్టాటిస్టిక్స్ పూర్తిచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలో ఉన్న అప్పటి వరంగల్ ఆర్ట్స్ కాలేజీలో లెక్చరర్‌గా ఉన్నారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో 1967-68 నుంచి దాదాపు చివరి శ్వాస దాకా ఎంతో అంకితభావంతో తన సేవలను అందించారు.

### కల్తీ మద్యం వల్ల ఐదుగురు మృతి

హైదరాబాద్ నుండి విజయవాడ వెళ్లే జాతీయ రహదారి పక్క కృష్ణలంక కరకట్టపై ఉన్న స్వర్ణ బార్ అండ్ రెస్టారెంట్‌లో డిసెంబర్ 7న ఉదయం కల్తీ మద్యం తాగి ఐదుగురు మృతి చెందారు. ఉన్నచోటే నురుగులు కక్కుకుంటూ కుప్పకూలిపోయారు. అలాగే 29 మంది తీవ్ర అస్వస్థతకు గురయ్యారు. వారంతా అస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. కాగా ఈ బార్ అండ్ రెస్టారెంట్ మాజీ కాంగ్రెస్ ఎంఎల్‌ఎ మల్లాది విష్ణు బంధువులకు చెందినది.

### బాక్సైట్ తవ్వకాలను వ్యతిరేకిస్తూ సభ

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఏజెన్సీ ప్రాంతంలో బాక్సైట్ తవ్వకాలను వ్యతిరేకిస్తూ చింతపల్లిలో డిసెంబర్ 9న బహిరంగ సభను ఏర్పాటు చేసింది. ఈ సందర్భంగా ఆ పార్టీ నాయకుడు జగన్‌మోహన్ రెడ్డి విశాఖ మన్యంలో ఆదివాలుల మనోభావాలకు వ్యతిరేకంగా బాక్సైట్ తవ్వకాలు ఎవరూ ప్రారంభించినా తప్పేనని అన్నారు. ప్రభుత్వం బాక్సైట్ తవ్వకాలకు అనుమతిస్తే అడ్డుకుంటామని ప్రకటించారు. ఈ సభలో పాడేరు ఎంఎల్‌ఎ గిడ్డి ఈశ్వరీ మాట్లాడుతూ బాక్సైట్ జోలికొస్తే గిరిజన సంప్రదాయ ఆయుధాలతో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడిని ఎదుర్కొంటాం అన్నారు.

### నిర్బంధాల మధ్యే బీఫ్ ఫెస్టివల్

మానవ హక్కుల పరిరక్షణ దినోత్సవం డిసెంబర్ 10 సందర్భంగా ఉస్మానియా యూనివర్సిటీలో బీఫ్ ఫెస్టివల్‌ను నిర్వహిస్తామని ప్రజాస్వామ్య సాంస్కృతిక వేదిక ప్రకటించింది. దీంతో అదే రోజు గోపూజ నిర్వహిస్తామని చలో ఉస్మానియా పేరుతో ఎంఎల్‌ఎ రాజాసింగ్ ప్రకటించారు. దీంతో వర్సిటీలో ఎలాంటి పండుగలు నిర్వహించకూడదని సిటి కోర్టు ఉత్తర్వులు జారీచేసింది. బీఫ్ ఫెస్టివల్ నిర్వాహకులను డిసెంబర్ 9న రాత్రి నుంచే అరెస్టులు చేశారు. బీఫ్ ఫెస్టివల్‌ను అడ్డుకుంటామని చెప్పిన బిజెపి, విహెచ్‌పి, భజరంగ్‌దళ్, శివసేన, హిందూసేన, గోరక్ష పరిరక్షణ సమితి నేతలను పోలీసులు అరెస్ట్ చేశారు. ఎన్ఆర్ఎస్‌ఎచ్, సి హాస్టల్స్‌తో పాటు, తెలంగాణ విద్యార్థులు ఢిల్లీలో కూడా బీఫ్ ఫెస్టివల్‌ను నిర్వహించారు. ఈ దృశ్యాలను సోషల్ మీడియా ద్వారా ప్రచారం చేశారు.

### పౌరహక్కుల సంఘం రాష్ట్ర మహాసభలు

గుంటూరులోని ఎన్‌జిఒ కళ్యాణ మండపంలో డిసెంబర్ 12,13 తేదీల్లో పౌరహక్కుల సంఘం 17వ రాష్ట్ర మహాసభలు జరిగాయి. ఈ సభలకు వక్తలుగా ఖరగ్‌పూర్ యూనివర్సిటీ ప్రొ. ఆనంద్‌తెల్ తుంబ్డే, కాకతీయ యూనివర్సిటీ ప్రొ. కాత్యాయనీ విద్మహే, పౌరహక్కుల సంఘం అధ్యక్షుడు ప్రొ. శేషయ్య మాట్లాడారు. బిజెపి పాలనలో కళాకారులకు, రచయితలకు, ప్రజాస్వామిక వాదులకు రక్షణ లేకుండా పోయిందన్నారు. నరేంద్ర మోడీ పాలనలో అన్ని వర్గాల ప్రజల హక్కులు కాలరాయబడుతున్నాయని, దీనికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం ఉందన్నారు.

### అంగన్‌వాడీల ఆందోళన

పెంచిన వేతనాలను అమలు చేయాలని డిమాండ్ చేస్తూ అంగన్‌వాడీ కార్యకర్తలు డిసెంబర్ 17న విజయవాడలోని సిఎం కార్యాలయాన్ని ముట్టడించడానికి ప్రయత్నించారు. వీరిని అడ్డగించడానికి పోలీసులు ప్రయత్నించారు. ఇరు వర్గాల మధ్య ఘర్షణలు జరిగాయి. ఈ ఆందోళనలో పాల్గొన్న 89 మందిని విజయవాడ పోలీసులు అరెస్ట్ చేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాల నుంచి అంగన్‌వాడీ వర్కర్లు, హెల్పర్లు వేలాదిగా చలో విజయవాడ కార్యక్రమానికి తరలివచ్చారు.

### విఆర్‌ఎల దీక్షలు భగ్నం

తమ సమస్యల పరిష్కారం కోసం విఆర్‌ఎలు చేసిన దీక్షలను పోలీసులు భగ్నం చేశారు. విజయవాడ లెనిన్ సెంటర్‌లో నాలుగు రోజుల పాటు ఆందోళన సాగించిన విఆర్‌ఎలను డిసెంబర్ 19న పోలీసులు బలవంతంగా అరెస్టు చేసి అంబులెన్స్‌లో ఆస్పత్రికి తరలించి దీక్ష భగ్నం చేశారు.

### నిజాం దక్కన్ షుగర్స్‌కు లేఆఫ్

ఆసియా ఖండంలోనే అరుదైన గుర్తింపును పొందిన నిజాం దక్కన్ షుగర్ లిమిటెడ్ (ఎన్‌డిఎస్‌ఎల్)కు యాజమాన్యం లేఆఫ్ డిసెంబర్ 23న ప్రకటించారు. ఎన్‌డిఎస్‌ఎల్ యాజమాన్యం నిజామాబాద్ జిల్లా బోధన్, మెదక్ జిల్లా ముంబోజుపల్లి, కరీంనగర్ జిల్లా ముత్యంపేట చక్కెర పరిశ్రమలను 2015-16 క్రషింగ్ సీజన్‌కు గాను లేఆఫ్‌ను ప్రకటించింది. ఈ నిర్ణయాన్ని డిసెంబర్ 18న జరిగిన ఎన్‌డిఎస్‌ఎల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్‌లో 'లే ఆఫ్' నిర్ణయం తీసుకున్నట్లు యాజమాన్యం ప్రకటించడంతో కార్మికులు, ఉద్యోగులు ఆందోళన బాట పట్టారు.

### సామాన్యులను స్వాహా చేస్తున్న కాల్ మనీ

ఆంధ్రప్రదేశ్‌లోని విజయవాడలో కాల్‌మనీ పేరుతో వడ్డీ వ్యాపారులు చిన్ని చిన్న వ్యాపారం చేసుకునే వారికి అప్పు ఇచ్చి అధిక మొత్తాలను అదే రోజు వడ్డీ రూపంలో వసూలు చేస్తున్నారు. కాల్‌మనీ పేరుతో వడ్డీవ్యాపారం నిర్వహిస్తున్న వ్యక్తులపై డిసెంబర్ 18 నాటికి పోలీసులు 227 కేసులు నమోదు చేశారు. ఇందులో అధిక కేసులు వడ్డీతో పాటు లైంగిక వేదింపుల పిర్యాదులున్నాయన్నారు. అరెస్టయిన వారిలో ఎక్కువగా వైసిపి, టిడిపి పార్టీలకు చెందిన వారు కాగా, కాంగ్రెస్, సిపిఐ, సిపిఎం, బిజెపి, లోక్‌సత్తా పార్టీకి చెందిన వాళ్లు కూడా ఉన్నారు. కాగా 78 మంది ఇతరులు ఉన్నారని తెలిపారు.

### అయుత చండీ మహాయాగం

తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్ రావు డిసెంబర్ 23 నుంచి 27 వరకు మెదక్‌జిల్లాలోని ఎర్రవల్లి గ్రామంలో తన వ్యవసాయ క్షేత్రంలో అయుత చండీమహాయాగం నిర్వహించారు. ఈ యాగానికి తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ఇఎస్‌ఎల్ నరసింహన్, తమిళనాడు గవర్నర్ కె. రోశయ్య, మహారాష్ట్ర గవర్నర్ సిహెచ్. విద్యాసాగర్ రావు, కేంద్ర మంత్రి ఎం. వెంకయ్యానాయుడు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబు నాయుడు, సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎన్. రమణ, మంత్రులు, ఎంఎల్‌ఎలు, అధికారులు, హాజరయ్యారు. వీ

## చెన్నైలో వరద బీభత్సం

**చె**న్నై నగరాన్ని వర్షాలు, వరదలు ముంచెత్తాయి. నవంబర్ ఆఖరు వారంలో పడిన వర్షాల వల్ల చెల్లాచెదురైన చెన్నై నగరం డిసెంబర్ 1, 2 తేదీలలో కురిసిన భారీ వర్షాలతో అతలాకుతలమైపోయింది. గత శతాబ్దంలో ఎన్నడూ లేనంతగా భారీ వర్షం వల్ల చెన్నై జీవనం స్తంభించిపోయింది. ఇతర ప్రాంతాల నుంచి సంబంధాలు తెగిపోయాయి. రోడ్లు, వంతెనలు, తెగిపోయాయి. రైలు పట్టాలపై నీరు చేరడంతో రైళ్లరాకపోకలకు వారం రోజుల పాటు రైలు సౌకర్యం లేకుండా పోయింది. విమానాశ్రయంలో, రన్‌వేపై, కారిడార్‌లో భారీగా నీరు చేరుకోవడంతో విమాన సర్వీసులను కూడా రద్దు చేశారు. లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. ఆహారం, మంచినీటి కోసం తీవ్రంగా అవస్థలకు గురయ్యారు. దాదాపు రెండు వందల యాభై మందికి పైగా మరణించారు.

## జమ్ము కశ్మీర్‌లో ముగ్గురు మిలిటెంట్ల కాల్చివేత

**జ**మ్ము కశ్మీర్‌లోని పూంచ్ జిల్లాలో నియంత్రణ రేఖ వద్ద మిలిటెంట్ల చొరబాటు ప్రయత్నాలను సైనికులు డిసెంబర్ 3న అడ్డుకున్నారు. సాయుధులైన మిలిటెంట్లు భారత భూభాగంలోకి ప్రవేశిస్తున్నారనే సమాచారంతో సైన్యాన్ని అప్రమత్తం చేశామని జమ్ము ప్రజా సంబంధాల అధికారి (పిఆర్‌ఓ) లెఫ్టినెంట్ కల్నల్ మనీష్ మెహతా తెలిపారు. సైన్యం చుట్టుముట్టడంతో మిలిటెంట్లు కాల్పులకు దిగారని తెలిపారు. ఎదురు కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు మృతి చెందారన్నారు.

## బి.డి. శర్మ మృతి

**ఆ**దివాసుల హక్కుల కోసం జీవితకాలం పోరాడిన డా. బ్రహ్మదేవ్ శర్మ (85) మృతి చెందారు. అనారోగ్యంతో బాధపడుతూ గ్వాలియర్‌లోని తన ఇంట్లో డిసెంబర్ 6న కన్నుమూశారు. 1956లో కలెక్టర్‌గా బాధ్యతలు చేపట్టగానే ఛత్తీస్‌గడ్‌లోని బస్తర్‌లో ఆదివాసులను అణిచివేస్తున్న పెత్తందారీ వ్యవస్థ ఆగడాలను సాగనివ్వకుండా చర్యలు తీసుకున్నారు. 1981 వరకు ఆయన సర్వీసులో కొనసాగారు. 1986లో మేఘాలయ ప్రభుత్వం ఆయన్ను ఎస్‌సి, ఎస్‌టి కమిషనర్‌గా నియమించింది. 1991లో పదవి విరమణ చేసిన శర్మ, బస్తర్‌లోని ఆదివాసులకు మద్దతుగా పోరాటం చేశారు. 'హమారా గావ్‌మే హమారా రాజ్' అనే నినాదంతో గ్రామ స్వరాజ్యం కోసం ప్రజల్ని చైతన్యం చేశారు. బస్తర్‌లో ఉక్కు కర్మాగారాన్ని స్థాపించాలనే ప్రభుత్వ ప్రతిపాదనకు వ్యతిరేకంగా ఆయన ఆందోళన చేశారు. ఆదివాసులతో కలిసి చేసిన పోరాటం ఫలితంగా కంపెనీ నెలకొల్పాలనే ప్రతిపాదనను ప్రభుత్వం విరమించుకుంది. ప్రజాక్షేమం కోసం 'భారత్ జన్ ఆందోళన్' స్థాపనలో కీలక పాత్ర పోషించారు.

## జిఎటిఎస్ నుంచి విద్యను ఉపసంహరించాలి

**డి**సెంబర్ 15 నుండి 18 వరకు కెన్యాదేశంలోని నైరోబిలో జరుగుతున్న డబ్ల్యుటిఒ సమావేశాల్లో ఉన్నత విద్యను జిఎటిఎస్ పరిధిలోకి తేవడాన్ని నిరసిస్తూ, అఖిల భారత విద్యాహక్కు వేదిక ఆధ్వర్యంలో డిసెంబర్ 7 నుండి 14 వరకు ఢిల్లీలోని జంతర్‌మంతర్ వద్ద ధర్నా శిబిరం జరిగింది. ఈ ఉద్యమంలో అంబేద్కరైట్‌లు, గాంధేయవాదులు, విద్యార్థి, యువజన, ఉపాధ్యాయ సంఘాలు, మేధావులు పాల్గొన్నారు. ఈ శిబిరంలో దేశవ్యాప్తంగా ఉన్న సంస్థలు, అట్లాగే ఢిల్లీలో ఉన్న 68 ఎఐఎఫ్‌టిఇ భాగస్వామ్య సంఘాలు పాల్గొన్నాయి. ఉన్నత విద్యను డబ్ల్యుటిఓ అధీనంలోకి తేవడాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. కెజి నుండి పిజి వరకు ఉచిత నాణ్యమైన విద్యను అందించాలని డిమాండ్ చేశారు. ఇందులో ప్రొ. అనిల్ సద్గోపాల్, ప్రొ. హరగోపాల్, డా. ఆనంద్‌తేల్‌తుంబ్డే, జస్టిస్ రాజెందర్ సచార్, ప్రొ. ప్రభాత్ పట్నాయక్, ప్రొ. మధుప్రసాద్‌లు పాల్గొన్నారు.

## ఛత్తీస్‌గడ్‌లో ఎన్‌కౌంటర్

**ఛ**త్తీస్‌గడ్‌లోని సుక్మా జిల్లాలో మావోయిస్టుల అణచివేత చర్యల్లో భాగంగా పోలీసుల బృందం గాలింపు చర్యలకు వెళ్లగా డిసెంబర్ 8న స్పెషల్ టాస్క్‌ఫోర్స్, జిల్లా రిజర్వు గ్రూపు దళాలకు, మావోయిస్టులకు మధ్య ఎదురుకాల్పులు జరిగాయని నక్సల్స్ వ్యతిరేక ఆపరేషన్స్ ఐజి దీపాంశు కాబ్రా మీడియాకు తెలిపారు. తెట్టెమడుగు గ్రామ సమీపంలో నక్సలైట్లు సమావేశం జరుపుకుంటున్నారనే సమాచారంతో 250 మంది పోలీసులు అక్కడికి చేరుకొని వారిని చుట్టుముట్టగా నక్సల్స్ కాల్పులు జరిపారని అన్నారు. ఈ కాల్పుల్లో ఇద్దరు ఎస్‌టిఎఫ్ జవాన్లు, ముగ్గురు డిఆర్‌జి జవాన్లు గాయపడ్డారని ఐజి తెలిపారు. ఈ ఘటనలో 15 మంది నక్సల్స్ కూడా మృతిచెందారని పోలీసులు అంటున్నారు. వారి మృత దేహాలు తమకు లభ్యం కాలేదన్నారు.

## సాయిబాబాకు బెయిల్ నిరాకరణ

**ఢి**ల్లీ విశ్వవిద్యాలయం ప్రొ. జి.ఎన్. సాయిబాబాకు ఆరోగ్య కారణాల రీత్యా పూర్తిస్థాయి బెయిల్ మంజూరు చేయాలని పెట్టుకున్న దరఖాస్తును బొంబాయి హైకోర్టుకు చెందిన నాగ్‌పూర్ ధర్మాసనం డిసెంబర్ 23న తిరస్కరించింది. సాయిబాబా 48 గంటల్లో లొంగిపోవాలనీ, అలా చేయని పక్షంలో పోలీసులే అరెస్టు చేయాలని ఆదేశించింది. సాయిబాబా గురించి రాసిన వ్యాసంలో న్యాయవ్యవస్థపై రాసినందుకు అరుంధతీ రాయ్‌కి కోర్టు ధిక్కారం కింద ధర్మాసనం క్రిమినల్ నోటీసు పంపింది. తీవ్ర అనారోగ్యం, 90 శాతం వైకల్యం ఉన్న సాయిబాబాకు బెయిల్ మంజూరు చేయకపోవడం పట్ల ఆయన విడుదల కోసం పోరాటం చేస్తున్న కమిటీ తరపున ఎం.టి. హనీబాబు ఆందోళన వ్యక్తంచేశారు. ప్రత్యేక వైద్యుల పర్యవేక్షణలో ఢిల్లీలో ఆయనకు చికిత్స కొనసాగించాల్సి ఉందనీ, అందువల్ల ఆయన్ను మళ్లీ అరెస్టు చేసి నాగ్‌పూర్ జైలుకు తరలించడం తగదని పేర్కొన్నారు. ఎలాంటి సదుపాయాలు లేనిచోట ఆయన్ని ఖైదు చేయడం వల్లనే ఆరోగ్యం క్షీణించిందని తెలిపారు.

## 'ఓల్గా'కు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు

**ప్ర**ముఖ తెలుగు స్త్రీవాద రచయిత్రి ఓల్గా (పోపూరి లలితకుమారి)కి ప్రతిష్ఠాత్మక కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న ఆంక్షలు, అవమానాలు, హింసల ఇతివృత్తంగా ఆమె రచించిన 'విముక్తి' కథల సంపుటికి 2015 సంవత్సరానికి ఈ పురస్కారానికి ఎంపికైనట్టు డిసెంబర్ 17న అకాడమీ కార్యదర్శి శ్రీనివాస్ తెలిపారు. ఆమె తెలుగు సాహిత్యంలో ఎంఎ చేశారు. మహిళా సమస్యలపై కలంతో గళమెత్తిన స్త్రీవాద రచయిత్రిగా తెలుగునాట సుప్రసిద్ధులైనారు.

## 'నిర్భయ' బాల నేరస్తుడి విడుదల

**దే**శ రాజధాని ఢిల్లీలో 2012లో నడుస్తున్న బస్సులో జ్యోతిసింగ్ అనే మెడికల్ స్టూడెంట్‌ని ఆరుగురు సామూహిక అత్యాచారం చేసిన కేసులో అరెస్టై శిక్ష అనుభవిస్తున్న వారిలో బాల నేరస్తుడిని ప్రభుత్వం డిసెంబర్ 19న జైలు నుంచి విడుదల చేసింది. నేరం జరిగినప్పుడు అతని వయసు 18 సంవత్సరాలకు కొన్ని నెలలు తక్కువ. మిగతా ఐదుగురికి కోర్టు మరణ శిక్ష విధించింది. వీ

### యువాన్‌కు అంతర్జాతీయ హోదా

చైనా కరెన్సీ యువాన్‌ను అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) ఎలైట్ గ్లోబల్ కరెన్సీ జాబితాలో చేర్చింది. ప్రపంచ మార్కెట్‌లో చైనా కరెన్సీ యువాన్ చలామణీకి హోదా లభించింది. అంతర్జాతీయంగా జరిగే వర్తక వాణిజ్యంలో చెల్లింపులు ఎక్కువగా అమెరికా డాలర్లలో జరుగుతుంటాయి. ఇక నుంచి యువాన్ కరెన్సీలో కూడా చెల్లింపులకు ఈ హోదా అనుమతిస్తుంది. ఐఎంఎఫ్ ఏర్పాటు చేసిన ఎలైట్ గ్లోబల్ కరెన్సీ జాబితాలో ఇప్పటికే అమెరికా డాలర్, యూరో, బ్రిటన్ పౌండ్, జపాన్ యెన్ ఉన్నాయి.

### సౌదీ అరేబియా చట్టసభల్లో మహిళలు

సౌదీ అరేబియా చరిత్రలో తొలిసారిగా చట్టసభలకు మహిళా ప్రతినిధులు ఎన్నికయ్యారు. డిసెంబర్ 5న జరిగిన స్థానిక ఎన్నికల్లో సౌదీ ఓటర్లు తమ ప్రతినిధులుగా ఇరవై మంది మహిళలను ఎన్నుకున్నారు. మొత్తం ఎన్నికలు జరిగిన 2100 మునిసిపల్ స్థానాలలో ఇరవై మంది మహిళలు కేవలం ఒక్క శాతం మాత్రమే అయినప్పటికీ ఇది తొలి అడుగు.

### చైనా - ఆఫ్రికా సహకార వేదిక సదస్సు

చైనా – ఆఫ్రికా దేశాల మధ్య డిసెంబర్ 4, 5 తేదీల్లో జోహన్నెస్‌బర్గ్‌లో సహకార వేదిక సదస్సు జరిగింది. ఈ సదస్సులో చైనా – ఆఫ్రికా సంబంధాలను సమగ్రమైన వ్యూహాత్మక సహకార భాగస్వామ్య స్థాయికి తీసుకెళ్లే అంశంపై నేతలు ఏకాభిప్రాయానికి వచ్చారని చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ తెలిపారు. చైనా – ఆఫ్రికా సహకార వేదిక (ఎఫ్ఒసిఎసి) సదస్సుకు యాభైకి పైగా ఆఫ్రికా దేశాల నుండి దేశాధినేతలు, ప్రభుత్వాధినేతలు హాజరయ్యారు. ఈ సదస్సు ముగింపులో రాబోయే కాలంలో సహకారానికి కార్యాచరణ ప్రణాళికను, డిక్లరేషన్‌ను ఆమోదించారు.

### యెమెన్ గవర్నర్ హత్య

యెమెన్‌లోని ఎడెన్ ప్రావిన్స్‌లో గవర్నర్ కాన్వాయిపై ఆత్మాహుతి బాంబుదాడి జరగడంతో ఎడెన్ గవర్నర్ జాఫర్ మహ్మద్ సాద్ మరణించారు. డిసెంబర్ 6న జరిగిన ఈ సంఘటనలో గవర్నర్‌తో పాటు ఆరుగురు మరణించారు. కార్యాలయానికి వెళుతుండగా ఆయన కాన్వాయ్‌పై కారుతో ఆత్మాహుతికి పాల్పడ్డారు.

### కాందహార్ విమానాశ్రయంపై దాడి

అఫ్ఘనిస్తాన్‌లోని కాందహార్‌లో గల విమానాశ్రయంపై తాలిబన్ తిరుగుబాటుదారులు డిసెంబర్ 8న దాడి చేశారు. స్థానికంగా ఉన్న ఓ పాఠశాలలో చేరిన కొందరు తిరుగుబాటుదారులు విమానాశ్రయం బలగాలపై కాల్పులు జరిపారు. భద్రతా బలగాలు ఎదురు కాల్పులు జరిపారు. దాదాపు 27 గంటల పాటు జరిగిన ఈ దాడిలో యాభై మంది చనిపోయారు. వీరిలో ఎక్కువగా మహిళలు, పిల్లలు ఉన్నారు. మరో ముప్పై మంది వరకు గాయపడ్డారు. మృతుల్లో తొమ్మిది మంది తిరుగుబాటుదారులు, పది మంది సైనికులు ఉన్నారు.

### బురుండీలో తిరుగుబాటు భగ్నం

బురుండీలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటును సైనిక దళాలు అణచివేశాయి. డిసెంబర్ 11న సైనిక బ్యారక్స్‌పై తిరుగుబాటుదారులు దాడులకు ప్రయత్నించడంతో సైనికులు ఎదురు దాడి చేశారు. ఈ దాడుల్లో ఇరవై మంది తిరుగుబాటుదారులు మరణించారు. భద్రతా దళాల నుండి ఆయుధాలను కొల్లగొట్టడంతో పాటు ఖైదీలను విడిపించడమే లక్ష్యంగా గెరిల్లాలు ఈ దాడులకు పాల్పడ్డాయని సైనిక అధికారి తెలిపారు. అధ్యక్షుడు ఎన్‌కురుంజిజా మూడోసారి అధికార పగ్గాలు చేపట్టడాన్ని నిరసిస్తూ గత కొద్ది నెలలుగా కొనసాగుతున్నాయి. ఈ ఆందోళనల్లో ఇప్పటివరకు కనీసం రెండు వందల మందికిపైగా మరణించారు.

### సిరియాలో బాంబు పేలుళ్లు

సిరియాలో జరిగిన మూడు వేర్వేరు కారుబాంబు పేలుళ్లలో యాభై మంది దాకా ప్రాణాలు కోల్పోయారు. మరో అరవై మందికి పైగా గాయపడ్డారు. డిసెంబర్ 11న సిరియా హోమ్స్ నగరానికి సమీపంలో ఉన్న కుర్దిష్ బలగాల క్యాంపు, ఆసుపత్రి, మార్కెట్‌లలో కారు బాంబు పేలుళ్లు సంభవించాయి.

### రష్యాపై ఆర్థిక ఆంక్షల పొడిగింపు

రష్యాపై మరో ఆరు నెలలపాటు ఆర్థిక ఆంక్షలను పొడిగించాలని యురోపియన్ యూనియన్ (ఇయు) నిర్ణయించింది. వచ్చే ఏడాది జులై 31 వరకు రష్యాపై ఆర్థిక ఆంక్షలను విస్తరిస్తూ డిసెంబర్ 21న ఇయు నిర్ణయించింది. తూర్పు ఉక్రెయిన్‌లో రష్యా చర్యలకు ప్రతిస్పందనగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు ఇయు తెలిపింది. చమురు, ఆర్థిక సేవలతోపాటు రష్యా ఆర్థిక వ్యవస్థలోని అన్ని రంగాలపై ఆంక్షలు విధించింది. ఈ పొడిగింపుపై రష్యా ప్రభుత్వం తీవ్ర నిరసన తెలిపింది.

### ఐఎంఎఫ్‌లో చైనా నం. 3

అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) ఇటీవల వెల్లడించిన సంస్కరణ ఒప్పందంలో చైనాకు కొత్త హోదా కల్పించింది. ఈ ఒప్పందం అయిదేళ్లపాటు అమలులో ఉంటుంది. ఈ ఒప్పందం ప్రకారం ఐఎంఎఫ్‌లో చైనా ఓటింగ్ పవర్ షేర్ ప్రస్తుతం ఉన్న 3.996 శాతం నుంచి 6.394 శాతానికి పెరుగుతుంది. దీంతో 188 దేశాల సభ్యత్వం కలిగిన ఐఎంఎఫ్‌లో చైనా మూడో ర్యాంక్ సంపాదించింది. ఐఎంఎఫ్ సంస్కరణల్లో పలు అంశాలపై చైనా పట్టు పట్టింది. అందులో ముఖ్యంగా ఐఎంఎఫ్‌లో వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఐఎంఎఫ్ ఓటింగ్ పవర్ షేర్ పెంచుతూ కోటా సంస్కరణలు తీసుకురావాలని. దీనికి ఇప్పుడు ఆమోదం లభించింది. రెండవది, ఐఎంఎఫ్ వ్యవస్థలో ప్రపంచ క్రమం ఆధారంగా, న్యాయమైన సంస్కరణలు ప్రోత్సహించాలని.

### పోలెండ్‌లో నిరసనలు

పోలెండ్‌లో దేశ అత్యున్నత కోర్టు అధికారాలను నియంత్రించే బిల్లుపై అక్కడి సెనెట్ డిసెంబర్ 24న ఆమోదించింది. ఈ బిల్లు చట్టంగా మారాలంటే పోలెండ్ అధ్యక్షుడు ఆండ్రెజ్ డూడా సంతకం చేయాలి. దీంతో దేశంలో పెద్ద ఎత్తున నిరసనలు మొదలయ్యాయి. రాజ్యాంగ కోర్టు స్వాతంత్ర్య విషయంలో జోక్యం చేసుకునే ప్రయత్నంగా ఉందంటూ ప్రతిపక్ష పార్టీలు నిరసన తెలిపాయి. కోర్టును పూర్తిగా తన అదుపులోకి, నియంత్రణలోకి తీసుకునేందుకు, ప్రభుత్వ అధికారాలపై గల ముఖ్యమైన నియంత్రణలు తొలగించేందుకు అధికార పార్టీ ప్రయత్నిస్తుందంటూ ఆరోపించాయి. ఈ బిల్లుకు లా అండ్ జస్టిస్ పార్టీ (పిఐఎస్)కి చెందిన 58 సెనెటర్లు అనుకూలంగా ఓటు వేయగా, 28 మంది వ్యతిరేకించారు. రాజ్యాంగం నిర్దేశించిన గడువు 21 రోజుల్లోగా అధ్యక్షుడు డూడా నిర్ణయం తీసుకోవాల్సి ఉంది.

### నైజీరియాలో అగ్నిప్రమాదం

నైజీరియా అనంబ్రా రాష్ట్రంలోని నేవీ ప్రాంతంలో డిసెంబర్ 25న జరిగిన భారీ అగ్నిప్రమాదంలో వంద మందికి పైగా మరణించారు. గ్యాస్ ట్యాంకర్ నుంచి ఖాళీ సిలిండర్లలోకి వంటగ్యాస్‌ను నింపుతుండగా ప్రమాదవశాత్తు గ్యాస్ ట్యాంకర్‌లో మంటలు చెలరేగి ఒక్కసారిగా ట్యాంకర్ పేలడంతో ఈ దుర్ఘటన జరిగింది. మృతుల సంఖ్య ఇంకా పెరిగే అవకాశం ఉందని అధికారులు వెల్లడించారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(నవంబర్ 1 నుండి నవంబర్ 30, 2015 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (929), ఆంధ్రప్రదేశ్‌లోని 8 జిల్లాలలో (527) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య1456)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 3 | – | 32 | 34 | 6 | 8 | 3 | 4 | 4 | 3 | 1 | 1 | 1 | 33 | 34 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 4 | 8 | – | – | – | – | 1 | 2 | 6 | – | 1 | 11 | 16 | – | – | – | 3 | – |
| కరీంనగర్ | – | 6 | – | 7 | 3 | 1 | 2 | 1 | – | 1 | 1 | – | – | 6 | 15 | 10 | – | – | – | – | – |
| ఖమ్మం | – | – | – | 3 | 17 | 4 | 3 | – | – | 3 | 1 | 1 | – | 7 | 18 | 16 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 19 | – | 11 | 21 | 1 | 2 | – | – | – | 4 | 5 | 17 | 6 | 42 | 5 | – | – | – | – | – |
| మెదక్ | 5 | 6 | 9 | 14 | 19 | 9 | 14 | 1 | 15 | 14 | 19 | 15 | 19 | 9 | 4 | 1 | – | – | – | 4 | 4 |
| నల్గొండ | – | 16 | – | 6 | 9 | 1 | 13 | – | – | 2 | – | 1 | – | 6 | 36 | 14 | – | – | – | – | 1 |
| నిజామాబాద్ | – | – | – | 3 | 13 | – | – | – | – | – | 1 | 3 | 6 | 3 | 14 | 5 | – | – | – | – | – |
| వరంగల్ | – | 11 | – | 8 | 6 | – | 7 | 1 | – | – | 3 | 1 | – | – | 14 | 11 | – | – | – | – | 2 |
| రంగారెడ్డి | – | 5 | – | 2 | 4 | – | 2 | 1 | – | 1 | 1 | 2 | – | 2 | 17 | 13 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **5** | **66** | **9** | **90** | **134** | **22** | **51** | **7** | **19** | **26** | **35** | **43** | **41** | **204** | **125** | **-** | **-** | **-** | **-** | **10** | **7** |
| అనంతపురం | – | 10 | 1 | 7 | 13 | 1 | 1 | 1 | – | 1 | 2 | 4 | 8 | 8 | 24 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 4 | 6 | 16 | 18 | – | – | – | 5 | 9 | 11 | – | 15 | – | – | – | – | – | 15 |
| కడప | – | 3 | – | 4 | 3 | – | – | 2 | – | 2 | 2 | 3 | 1 | 2 | 10 | 7 | – | – | – | – | – |
| గుంటూరు | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| కృష్ణా | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| కర్నూలు | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | – | – | – | 3 | 2 | – | 5 | – | – | 4 | – | 1 | 1 | 2 | 15 | 17 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 3 | – | 4 | 2 | 3 | 1 | – | – | – | 1 | 3 | 2 | 7 | 13 | 9 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 1 | 7 | 1 | 9 | 2 | 1 | 5 | – | 2 | 6 | 2 | 21 | 12 | – | – | – | – | – |
| పశ్చిమ గోదావరి | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| నెల్లూరు | – | – | – | 3 | 5 | 12 | 14 | – | 4 | 3 | – | – | – | 6 | 16 | 18 | – | – | – | – | 12 |
| విజయనగరం | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | – | – | – | 2 | 3 | – | – | – | – | 5 | – | 1 | 2 | – | 20 | 8 | – | – | – | 8 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **16** | **1** | **28** | **41** | **32** | **48** | **5** | **5** | **20** | **10** | **23** | **31** | **27** | **134** | **71** | **-** | **-** | **-** | **8** | **27** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 174 - January 2016 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/12/2015 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

## ‘వీక్షణం’ను ఆదుకుందాం
## ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పదమూడు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పదమూడు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

సరిగ్గా ఒక సంవత్సరం కింద వెలువడిన ఈ విజ్ఞప్తికి విస్తృతమైన ప్రతిస్పందన వచ్చింది. ఆర్థిక, హార్దిక సహాయం అందించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు. అయినా వీక్షణం ఆర్థిక పరిస్థితి ఇంకా సుస్థిరంగా మారలేదు. అందువల్ల ఈ విజ్ఞప్తికి ఇంకా అవసరం ఉంది. ఈ విజ్ఞప్తిపై సంతకం చేసి, జులై 2015లో మరణించిన చలసాని ప్రసాద్ గారిని సగౌరవంగా స్మరించుకుంటున్నాం.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao